

గురుచరిత్ర

అను

# శ్రీ సాయినాథ చరిత్ర




గ్రంథకర్త

వేమూరి వెంకటేశ్వరరావు, B. A., B. L.

రేపల్లె



ఫోన్ నెం. 64 టెలిగ్రామ్ : బాబా

పబ్లిషర్సు

**ఆంధ్రరత్న బుక్‌డిపో తెనాలి.**

ప్రొప్రయిటరు:- గ్రంధి లక్ష్మయ్యగుప్త

స్టేషన్ రోడ్, తెనాలి





1957

వెల రు 2-8-0

# పరిచయము

శ్రీ సాయి సద్గురు చరిత్రకు బరిచయ వ్యాకములు వ్రాయ మని గ్రంథకర్తనన్గోరినంతనే యుత్సహించితినేగాని సాహసమేమో యని భావించెదను.

ఇయ్యది కేవలము ఒక యవతారపురుషుని దైనందిన జీవిత చర్యాచిత్రణము మాత్రమేకాదు. రచయిత భావోద్రేక, భక్త్యాత్మాహతన్మయతఁజిక్కి పరమేశ్వర సాక్షాత్కార సమయమున భక్తుడు సమర్పించు ఆత్మోపహారమువంటి రసమయకావ్యము.

పలికెడిది భాగవతమట
పలికించెడివాడు రామ భద్రుండట

అను పూజ్యపోతనామాత్యుని పోకడ లిందు నిస్సంశయముగ గోచరింపుచున్నవి.

రెండు దశాబ్దములుగ సాయిభక్తి" ఆంధ్రదేశములో వ్యాపించి దినదినాభివృద్ధి జెందుచున్నది. ఆంధ్రజాతి ముఖ్యలక్షణము దైవభక్తి పుణ్యపురుషారాధన. సాయిభక్తి పలువురు విద్యావంతులను, జనసామాన్యమును ఆకర్షించి వ్యాప్తిగాంచుచున్నది. ఇందులకు గారణము శ్రీ బాబా ప్రవచనములే—అందుననూ, నా భక్తులనెల్లప్పుడునూ కాపాడుచుందును—నేనుండ భయమేల? నా భక్తునియింటలేమిలేదు" అను నిత్యాది అభయసూక్తులై, భక్తునిహృదయమున విశ్వాసమును, తృప్తిని ఆత్మానందమును, జనింప, జేయుచున్నవి.

'యోగక్షేమం వహామ్యహమ్' అను శ్రీ కృష్ణుని యభయ వాక్యములను, బాబా పునర్వచించుటేగాక ఆపదలందు భక్తుని రక్షింప జేయూత నొసగుట తథ్యమని బాబా భక్తుల విశ్వాసము. ప్రత్యక్ష ప్రమాణములనుగోరు ఆధునికయుగములో – సంభవామియుగేయుగే"

యను మహావాక్యములను సంస్మరించి, పీడిత జన్మతరించు పర్యంతమూ, పురశ్చరణ చేసినంత మాత్రమున, దైహికావసరములూ యీతి బాధలూ, దుఃఖములు, ఆపదలూ తొలగి, మానవసమస్యలు పరిష్కృతములు కానేరవుకదా !

ఆర్తుని ఆర్తి బాపుటకు హృదయకుహరావిర్భూతమగు ఆర్త స్వరము నాలకించి తత్ క్షణమే భగవంతుడు మనకన్నులయెదుట నిలచుటకిది కేవలమూ కలికాలము. అందుచే యసంభవము !

ధర్మాధర్మ సంఘర్షణ మిన్నుముట్టి, అధర్మము, అక్రమము, అసత్యము, అవినీతి, పరహింస, సంఘటపడి విలయతాండవ మొనరించు నీ శతాబ్దమధ్యమున, తరణోపాయమేకాదు—సుఖ, సంతృప్త జీవనోపాయముకూడ అత్యంతావశ్యకములే.

అక్కరకు వచ్చే చుట్టము
మ్రొక్కిన వరమిచ్చే వేలుపు

ఇదియే బాబా ధర్మవ్యాప్తికి మూలము కారణమును.

ఈ గ్రంథరచనా విధానములఁగూర్చి:—రచయిత నాకు చిరకాల మిత్రుఁడు. బాబా భక్తులలో తెలుగునాటఁబ్రబలురలో నొకరు "సప్రమాణికమైన సాయినాథ చరిత్ర" దినదిన వర్ధమానమగు బాబా భక్త బృందమున కెంతయూ నావశ్యకము. ఈ కొఱతను దీర్చుటకె వెంకటేశ్వర్లుగారీ గ్రంథమును రచించినారు. కేవలము చరిత్ర కారుని దృష్టితోగాక, బాబా దివ్యజ్యోత్స్నామయమూర్తిని మనోఫలకమున జిత్రించుకొని, అమ్మహామహుని లీలావిలాసముల యందలి పరమార్థమును తాముగ్రహించి తాను సంతృప్తి, జెందుటేగాక చదువరులకును భక్త్యుత్సాహోత్తేజముల జనింపఁజేయఁ గలిగిరి.

ఇందలి శైలి పౌరాణికమును స్ఫురింపఁ జేయుచున్నది—ప్రతి యధ్యాయాంతమునను "ఫలశ్రుతి" సూచింపబడుట యొక రచనా

విశేషము—భాష—భావగంభీరతకుఁ దగినట్లున్నది. ఉద్వేగవంతమగు రచనా ప్రవాహ గమనమున నచ్చటచ్చట 'స్వాగతము'లఁబోలిన ఆత్మ నివేదనా పరమగు పరమేశ్వర సంబోధనలు కలవు. అయ్యవి, ఇలాటి రచన యందెంతయు నొప్పియున్నవి.

ఆధునిక, కృత్రిమ సాంఘిక, రాజకీయ వాతావరణమునఁబడి ప్రుగ్గి దరిగానక తపించు, శాంతికాముల కీగ్రంథమెంతో సంతృప్తినీ, హృదయానందమును సమకూర్చి బాబా యనుగ్రహ ప్రాప్తికి దారి చూపఁగలదు. ఇమ్మహదాశయము నెరవేరునట్లు బాబా అనుగ్రహించుఁగాక.

రేపల్లె
27-1-57

ఇట్లు
పోలవరం రామబ్రహ్మం



ప్రభూ! పరమాత్మ స్వరూపా!

బహు యోనుల జన్మించి, పాపమతినై, సంయోగ వియోగముల సుఖదుఃఖముల, సుడివడి సంసారమున మునిగి తేలుచూ, తృప్తి లేక తృష్ణావృతుడనై, తడబడు నన్ను దరిచేర్ప సమర్థుడవు నీవే. నీకన్న నాకు వేరుదిక్కెవ్వ రున్నారు తండ్రీ!

అనేకజన్మ సంపాదిత పాపపంకిలము నన్నాశ్రయించి అజ్ఞానాంధకారమున, అణచిపెట్టి అనవరతము నన్నంటిపెట్టుకుని అనుక్షణము అవరోధమై, నిర్మలమగు నీపదసేవకు నిరోధకమై నిలుచుచున్నదయ్యా! నీ అనుగ్రహము వినా ఇతరమేమియూ, నాకు నిలకడనీయ లేవు.

బాబా! కరుణాసాగరా! పతితుడగు నాపాలిదైవమవై, పాలింపుమన్న నామొర పెడచెవిని పెట్టకు. నిర్గుణ పరబ్రహ్మస్వరూపమగు నీ అవతారచర్య, అందలి ప్రత్యేకత, నియమబద్ధముగ తెలుప సామర్థ్యమొసగి సంరక్షింపుము తండ్రీ! కాకయున్న అవ్వి వర్ణించుటకు నేను అశక్తుడను.

వే॥ వెం॥

# శ్రీసాయినాథచరిత్ర

## విషయసూచిక



## 6 వ అ ధ్యా య ము

బాబా పరమాత్మస్వరూపము-యోగక్షేమం వహామ్యహం— నానా కుమార్తె మీనతాయిని బాబా రక్షించుట—అందుకు బాబా, టాంగావాడై, గుర్రములై, తోలువాడై, బంట్రోతై, సాయపడిన అసామాన్య లీలాప్రదర్శనము.

## 7 వ అ ధ్యా య ము

భక్తభారభృతుడు శ్రీసాయిసర్వజ్ఞుడు - కపర్దే కుమారుని ప్లేగు బాబా తనపైకి తీసికొనుట—షిర్డీకి 300 మైళ్ల దూరమున అగ్నిపడిన బాలుని, బాబా షిర్డీనుండియే రక్షింపుట.

## 8 వ అ ధ్యా య ము

శ్రీ సాయి పంచభూతముల ఆజ్ఞాపించుట, షిర్డీయందలి గాలి వాన—ధునియందలి అగ్నిజ్వాలలు—సంకల్పమాత్రమున అరికట్టుట.

## 9 వ అ ధ్యా య ము

సకలసాధువుల స్వరూపము-శ్రీ సాయి. మూలేశాస్త్రికి, గురు ఘోలప్ గో రూపమున బాబా దర్శనమిచ్చుట-దివ్యగాథ.

## 10 వ అ ధ్యా య ము

సకలదేవతల స్వరూపము—శ్రీ సాయి. బాబా ముస్లిమను భ్రమతో, షిర్డీచేరిన డాక్టరుకు శ్రీరామచంద్రుడై, దర్శనమిచ్చుట.

## 11 వ అ ధ్యా య ము

సకల చరాచర స్వరూపము—శ్రీ సాయి. సృష్టియందలి సర్వ జీవులు తానేనని శ్రీ సాయి, తాత్యాపతికి రుజువుచూపుట-పశురూపమున-కీటక రూపమున, బాబా భుజించుట-గేదెనుకొట్టిన దెబ్బ, బాబా ఒంటిపై ఉండుట-పరమాత్ముని దివ్యలీల.

12 వ అ ధ్యా య ము

సర్వాంతర్యామి—శ్రీ సాయి. కారణ జన్ముడు. గోవానుండి వచ్చిన భక్తులకథ - షిర్డీయందున్న శ్రీ సాయి, గోవాయందు భక్తునకు దర్శనమిచ్చుట - ఆ భక్తుని పయనమునకు వివిధ రూపముల తోడ్పడుట.

13 వ అ ధ్యా య ము

బాబా వివిధరూపముల భక్తులచేరుట - రావ్ వ్రతము—త్రిమూర్తుల రూపమగు శ్రీ సాయి. ముగ్గురు సాధువులుగ, ఆ భక్తునిఇంట విందారగించుట.

14 వ అ ధ్యా య ము

బాబా హేమాద్పంతుఇంట విందారగించుట—బాబాచిత్రపటము విచిత్రమగు లీలలు.

15 వ అ ధ్యా య ము

బాబా సకలశాస్త్ర వేది—నిగమాగమ స్వరూపము—నానాభంగ పాటు—గీతావిమర్శ, బాబా జ్ఞానబోధ—బల్లిపలుకుల కథ.

16 వ అ ధ్యా య ము

బాబా పరమాత్మ స్వరూపము. సర్వజ్ఞుడు, గతజన్మల వృత్తాంతము తెల్పుట— కప్ప, పాము-బసప్ప-వీరభద్రప్పల వైరగాథ.

17 వ అ ధ్యా య ము

శ్రీ సాయి-సకలయోగ స్వరూపము. నాలుగు అంగుళముల వెలుపైపై బాబా పవళించుట—విచిత్రధౌతియోగము. ఖండయోగ ప్రదర్శన—బాబాశరీరము త్యజించి, నాల్గవనాడు అందుచేరుట- ఋతంబర ప్రజ్ఞ అమరలీల.

## 18 వ అధ్యాయము

బాబా భగవదవతారము. సాధువులందరు తానేనని, రుజువు పరచుట—తానే అక్కల్‌కోట మహారాజునని, హరిశ్చంద్ర పితలేలునకు చూపుట—హరికార్నికరు, నరశింగమహారాజు రూపమున దర్శన మిచ్చుట—జ్ఞానోదయము.

## 19 వ అధ్యాయము

బాబా సచ్చిదానందమూర్తి. భగవత్ స్వరూపము. అర్యసమాజికుడు—తార్ఖడునింట బాబా పూజలందుట, ప్రత్యక్షముగ ప్రసాద మందుకొనుట, అద్భుతలీల.

## 20 వ అధ్యాయము

బాబా వరప్రదాయి—శ్రీ రుస్తుంజీ వాడియాకు పుత్రుల నొసంగుట—దివ్యగాథ.

## 21 వ అధ్యాయము

బాబా అవతారమందలి ప్రత్యేకత- పరీక్షింపబోయిన వారిని కూడ ఆదరించి అనుగ్రహించుట-హరికనోబాకథ. భక్తుల ఇహసుఖముల కూడనిచ్చి కాపాడుట-శ్రీ శివదేవకథ—సపత్నీకరుకథ.

## 22 వ అధ్యాయము

శ్రీ సాయి జ్ఞానస్వరూపము—శాస్త్రపాండితిగాని, ఆశ్రమస్వీకారముగాని, జ్ఞానము నీయవు—శ్రీ సోమదేవస్వామికథ—సాధుస్వరూపుల ఏకత్వము-కర్తయు, భోక్తయు—శ్రీ సాయియే. శ్రీ వాసుదేవానంద సరస్వతి—పుండరీకరావు అనుభవములు. సాధుల సత్ స్వభావము, జ్ఞానబోధ.

## 23 వ అ ధ్యా య ము

శ్రీ సాయీ జ్ఞానబోధ. దామూఅన్నా సంశయము—బాబాను ఆశ్రయించెడి వారందరికి లాభింపుచున్నదా – అందుకు బాబాసమాధానము–బ్రహ్మజ్ఞానమునకని శేట్ వచ్చుట—బాబా జ్ఞానబోధ—పాత్రోచితమగురీతినే, ఫలము లభింపగలదు.

## 24 వ అ ధ్యా య ము

శ్రీ సాయి పరమాత్మ స్వరూపము—సగుణారాధన. శ్రీమతి లక్ష్మిబాయికి జ్ఞానబోధ–శునక రూపమున, బాబా భక్ష్యముల భుజించుట. డాక్టరు పండిట్—శ్రీ సాయిని సగుణమూర్తిగ 1909 నుండి ఆరాధించుట. అమృతమొలుకు వేపచెట్టు, శ్రీ సాయి ఆసీనుడైనవైపు ఆకులు తీపినిచ్చుట–సతేవాడ.

## 25 వ అ ధ్యా య ము

శ్రీ సాయి కరుణాస్వరూపము–శ్రీ కృష్ణజీకథ—బాబా అక్కల్‌కోట మహారాజుగా దర్శనమిచ్చుట—పవిత్ర పాదుకల ప్రతిష్ఠ.

## 26 వ అ ధ్యా య ము

శ్రీ సాయి వసించిన మశీదు. ద్వారకామాయి—అందలికథ నాడు, నేడు.

## 27 వ అ ధ్యా య ము

భక్తపరాధీనుడు బాబా! కాకాసాహెబ్ దీక్షిత్ -దీక్షిత్ వాడ- బూటీ మందిరము–సమాధిమందిరము నిర్మాణము.

## 28 వ అ ధ్యా య ము

శ్రీ సాయీరాముని ఉత్సవములు. షిర్డీయందలి ఉరుసు–చందన ఉత్సవములు రామనవమి ఉత్సవములుగా మారుట—ఉత్సవములు, నాడు– నేడు

## 29 వ అధ్యాయము

శ్రీ సాయి—నిర్యాణము. మహాసమాధి. 1918 వ సంవత్సరమున బాబా తనువు చాలించుట—బాబా మురళీధరుడై, బూటీ మందిరము చేరుట—బాబాసమాధి. సమాధినుండి సమాధాన మిచ్చుచున్న శ్రీ సాయి సజీవుడే.

## 30 వ అధ్యాయము

శ్రీ సాయి సమర్థసద్గురుడు. కాశీనాథ ఉపాసనీ, బాబాఅనుగ్రహమున సత్పురుషస్థితినంది, సకోరి చేరుట. ఏకత్వసిద్ధి—శ్రీ గోదావరి మాత—శాంతి.



# ఇందలి చిత్రములు

1. కృతిభర్త శ్రీ సమర్థ సద్గురు శ్రీ సాయినాథ్.
2. శ్రీరామ, కృష్ణ, శివ, మారుతీ దత్తరూపముల దర్శన మిచ్చిన శ్రీ సాయి
3. అఖిల భారత సాయీ సమాజ స్థాపకులు, పూజ్య శ్రీ B. V. నరసింహస్వామిగారు
4. పవిత్ర ద్వారకామాయి యందలి సాయి.
5. శ్రీ దాస్ గణు మహారాజ్.
6. శ్రీ మహల్సాపతి.
7. శ్రీ కపర్దే.
8. శ్రీ దీక్షిత్,
9. శ్రీ నానా ఛందోర్కర్.
10. ఉపాసనీ బాబా.
11. బాబా ఊరేగింపు.
12. కృతికర్త.
13. హేమాద్పంత్.
14. సర్వమానవ సౌభ్రాతృత్వము – సర్వమత సామరస్యము:– శ్రీ సాయినాథుడు.



# తొలిపలుకు

శ్రీ సాయిని సేవించి, భజించెడి భక్తులయందుకూడ బాబా ఎవ్వరు? జన్మస్థానమెయ్యది! తల్లిదండ్రులెక్కడ, మతమేమి? ఋషియా, సాధువా, మహాయోగియా, శక్తిసంపన్నుడగు తపస్వియా, అన్ని సంశయములు తీరనివారు అనేకులు కలరు. వాస్తవమునకు ఈ వివరము లెరుంగ యత్నించుట, వ్యర్థమే కాగలదు. అందలి ప్రయోజనముకూడ ఉండజాలదు. ఐననూ బాబా భగవంతునిగ ఆరాధించి, ఆ తండ్రి అనుగ్రహమునకు పాత్రులమగుచున్న మనము వాస్తవమెట్టిదియన్నది, గ్రహించుటకూడ యుక్తమే యగునేమో?

పత్రి గ్రామమందు, శ్రీ సాయి, బ్రాహ్మణ దంపతులకు జన్మించెనని, పసితనముననే ఫకీరునకీయబడి కొన్ని వత్సరము లాయనచే పోషింపబడి, ఆ తరువాత గోపాల్రావ్ దేశ్ ముఖ్–శ్రీ వెంకూసా, అని పేరందిన మహాజ్ఞాని, శ్రీ తిరుపతి వెంకటేశ్వర భక్తుడునగు, వారి ఆధీనమై వారికి ప్రియశిష్యుడై వారి అనుగ్రహమున సంపూర్ణశక్తియుతుడై వర్ధిల్లెనని, ఒకకథ వ్యాప్తి చెందినది. దీనికితోడు శ్రీ సాయి కబీరని, శ్రీ వెంకూసా, కబీరు గురువగు రామానందుడనికూడ కథ కలుపబడినది.

శ్రీ సాయి షిర్డీ చేరిన తరువాత ఖండోబా దేవాలయమందలి పూజారి మహాల్సాపతి. బాబా ముస్లీమన్న హేతువుచే ఖండోబా ఆలయము నందుండుటకు అవకాశము లేదని ఆక్షేపించెను. తరువాత ఈ మహాల్సాపతియే, బాబా భగవదవతారమని, సగుణముగ పూజించినాడు. బాబాముస్లీమా, హిందువా అన్న మీమాంస ఎంతద్వేగినదో చూడుడు. మశీదునందున్న బాబాను, హిందువులు, గంధాక్షతలతో

అర్చించుట సహింపక, ముస్లీములు ఒకప్పుడు హిందువులు మశీదును చేరరాదని శాసించుటయేగాక, తుదముట్టింప యత్నించిరి. ఈ వాదములలో తమ ఊహాగానములతో, బాబాహిందువని కొందరు కాదు ముస్లీమని మరికొందరు నిరూపింప ప్రయత్నించిరనుట నిస్సందేహము. తమ తమ వాదములకు ఆధారములు ఏమిగా వీరలు తెలిపిరో చూతము: బాబా వేషమునఫకీరు. నివసించునది మశీదు. సర్మించునది అల్లామాలిక్ పై పెచ్చు బాబాకు ముస్లిముపద్ధతిన 'సున్తీ' చేయబడెనన్న విశ్వాసము. ఇవ్వి బాబాముస్లిమను వారలకు ఆధారములు. ఇక రెండవవారు బాబా చెవితమ్మెల చిల్లులున్నవని, అవి చవలోపనయన సూచకములని, ముస్లిమునకు అట్లుండవని మశీదునందున్ననూ, బాబా దానికి ద్వారక అని పేరిడెనని, అది హిందుసాంప్రదాయమని, ఇదిగాక బాబా ఆ మశీదునందు తులసీమాతను ప్రతిష్టించెనని, మరియూబాబా 'ధుని' నిత్యాగ్నిహోత్రము వేల్చుచుండెనని, పైగా శ్రీ సాయి తానే రాముడనని, కృష్ణుడనని పలుమారులు పలికెననీ, గీతాపారాయణ, భాగవతపఠనము బాబా ప్రోత్సహించెననీ, మరియూ ఆరాధన, అర్చనలయందు బాబా హిందూసాంప్రదాయముల ఆమోదించెననీ, ఆ కారణములచే, బాబా హిందువేగాని, ముస్లిముకాదని వాదింపుచున్నారు.

ఈ వాదముల ఆధారముతోడనే వీరు, శ్రీ సాయి జన్మమున హిందువే అయిననూ, ముస్లిము ఫకీరుపెంచిన కారణమున, రెండింటి సాంప్రదాయములు శ్రీ సాయి యందున్నవని సమర్థింపుచున్నారు. ఎంతనేర్పుతో యత్నించిననూ, ఈ రెండునూకూడ, బుద్ధిబలముతో ఊహించిన ఊహలు మాత్రమే కాగలవు, అంతియేగాని ఎట్టినిర్ణయమునకు త్రోవతీయవు.

వాస్తవములో, బాబా బాల్యదశ నెరింగినవారు, ఎవ్వరునూ లేరు. బాల్యదశనుగురించి తెలుపు ఇతర ఆధారములునూ లేవు, మొట్ట

మొదట బాబా దర్శనమైనది 1854 సంవత్సరములోనే, అదికూడ షిర్డీకి ఊరుబయట, వేపచెట్టుక్రింద. ఆనాడు చూచినవారు, బాబా 16 సంవత్సరముల ప్రాయమువానివలె నుండెనని చెప్పిరి. నాటికి ఈ బాబాకు ఎట్టిపేరునూ లేదు. ఆ చెట్టుక్రిందకూర్చుండి, ఇతరులతో పని లేక, వచ్చిపోయెడువారికి, ఆకులు, పసరులునిచ్చి, వ్యాధులకుదిర్చెడి వాడు, దానితో ఎవ్వరోబాల ఫకీరు, వ్యాధులమాన్పు చుండెనని, సొమ్మేమియూ అడుగుటలేదని వ్యాప్తిసాగినది, ప్రజలట్లు, బాబాను చేరినప్పుడు, అందెవ్వరునూ, బాబా మతమిదియనిగాని, ఊరుపేరుల విషయముగాని తమకు తెలిసినట్లు ప్రకటింపలేదు. ఉన్నట్లుండి, బాబా ఆప్రదేశమువదలి ఎచ్చటకోపోయెను. ఆయన ఎందులకట్లు వెడలినది ఎందులకుపోయినది, ఎవ్వరికినీ తెలియదు. ఆతర్వాత తిరుగ 1858 వ సంవత్సరములో బాబా, (శ్రీ) ఛాందీయా పటేల్ పెళ్లి పరివారముతో, షిర్డీచేరినాడు, ఖండోబా దేవాలయముదగ్గర, అందరితోబాటు తాను గూడ బండినుండిదిగెను. మహల్సాపతి అదిచూడగనే 'ఆయ్యోసాయీ' అని బాబాను ఆహ్వానించెను. నాటినుండియే, బాలుడగు బాబా, సాయీనామముతో పిలువబడుచూ, సాయీబాబా, అయ్యెను. ఇది అందరకూ తెలిసిన విషయము, ఆధారములూ యున్నవి. అటుపై జరిగిన విశేషములు, వివిధప్రకరణములయందు ఈ పొత్తమున వివరింపబడినది. అందునుగురించి విస్తరించి ఇచ్చట తెలుపుట అనవసరము. 1856 నుండి (శ్రీ) సాయి 1918 లో మహాసమాధి అగువరకు షిర్డీయందుండెనేగాని ఎచ్చటకునూ పోలేదు, ఎందరెందరో ఉన్నతోద్యోగులు, విద్యాధికులు, ధనవంతులు, సామాన్యులు, బాబాకుశిష్యులు భక్తులునై షిర్డీయందు బాబాను సేవింపుచూ యుండిరి. ఆనాడా పెండ్లి అయిన, పెండ్లికూతురు మొన్న మొన్నటిదాక జీవించియుండెను. మహల్సాపతికూడ మొన్న మొన్నటిదాకా జీవించియుండెను, బాబాకు కూర్చుభక్తుడు, బాబాలీలల హరికథారూపమున రచించి సంకీర్తన

మొనర్చి ఊరూర బాబామహిమల చాటిన మహాభక్తుడు, శ్రీ దాసగుణ మహారాజు ఈనాటికినీ సజీవుడే. బాబాను భక్తితో సేవించిన శ్రీ అబ్దుల్లాబాబా నిరుటి సంవత్సరమే తనువు చాలించెను. బాబా అనుగ్రహములకు పాత్రుడైన అదృష్టశాలి శ్రీ శివరామకృష్ణ, మారుతీ రూపములతో ఏకకాలమున బాబా దర్శనమిచ్చిన భాగ్యశాలి, ఉన్నతోద్యోగి శ్రీ నానా మొన్న మొన్నటిదాక సజీవుడే. ఆయన సంతతి ఈనాటికినీ యున్నది, నానా తాను బాబా చెంతనుండి బాబా లీలల అనుభవింపుచూ తన అనుభవములను వ్రాసియుంచెను. మరియూ ఖండాంతరముల విద్యనభ్యసించి, పేరుగన్న బ్యారిష్టరు, శ్రీ కాకా సాహెబ్ దీక్షిత్, షిర్డీయందు ఒక్క వాడనే నిర్మించుకుని అందుండి ఏరోజుగా రోజుజరుగు విషయములన్నియూ డైరీ వ్రాసియుంచెను. అమరావతియందు ప్రముఖన్యాయవాది శ్రీ దాదా సాహెబ్ కపర్డే షిర్డీయందుండి, బాబాదర్బారునందు జరిగిన ప్రతి హాంశమునూ, ప్రత్యేకించి, డైరీవ్రాసి యుంచెను. అన్నిటికినీ మించి శ్రీ అన్నాసాహెబ్ ధభోల్కర్ బాబాఅనుగ్రహముతో, బాబా అనుమతిపై శ్రీ సాయీ సచ్చరిత్రను బాబాసమక్షమున మహారాష్ట్ర భాషయందు రచియించెను. ఈయనకు శ్రీసాయియే హేమాద్పంతు అనుబిరుదును ప్రసాదించెను. ఈయన రచించిన సచ్చరిత్రయందుకూడ బాబామతవిషయముగాని, తల్లిదండ్రుల విషయము గాని ఏమియు గానరాదు. ఇంకొక్క విషయము. ధూలియా మెజిస్ట్రేటు కోర్టునందు బాబాను సాక్షిగా కమీషనుపై విచారించి, వాఙ్మూలమును తీసికొనిరి. అప్పుడు శ్రీసాయి నాతండ్రి పేరుకూడ సాయి అనెను. మతము కబీరు మతమనియెను. కులము దేవుని కులమనియెను. బాబా నిర్యాణమైననూ 1918 లోనే గదా! ఇట్లిందరు బాబాను సేవించినవారు ఉన్ననూ, శ్రీసాయిమతము విషయము

గాని, జననగాధగాని, బాల్యదశయందలి ఇతర వివరములుగాని, తమ కెవ్వరికినీ, ఏమియూ తెలియదనియే, స్పష్టముగా ఒప్పుకొనిరి. ఎన్నియో విధముల ఆవివరము లెరుంగుటకు తాము పలుమారులు, ప్రయత్నించిననూ శ్రీసాయి సమాధానము చెప్పుటకుమారు చిరునగవుతో తప్పుకొను చుండెననియు తెలిపిరి. శ్రీసాయి సంభాషణల యందు తనతండ్రిపేరుకూడ శ్రీసాయిబాబాయని చెప్పినట్లు వారు తెలుపుచున్నారు. అంతియేకాదు బాబా తానే కబీరునని, ఝాన్సీ లక్ష్మిబాయి కొలువులో తాను శిపాయినని, తాను బట్టల నేసెదనని ఇంకెన్నియో విధముల పలికియుండెను. అంతమాత్రమున ఆమాటలకు అర్థమేమియో గ్రహింపక మనమున శ్రీసాయి కబీరనిగాని, శిఫాయి అనిగాని అనగలమా ? అట్లయిన బాబా పలుమారులు తానే అనసూయాదేవినని రాముడనని, కృష్ణుడనని, మహాలక్ష్మినని తెలిపెను గదా, దీని కేమందము. ఆమాటలయందు లక్ష్యముంచి శ్రీ సాయి భగవదవతారమని గమనింపరేల ? బాబా భాషణములనుబట్టి మనము గ్రహింప వలసినది, బాబా సర్వాంతర్యామి అన్నదొక్కటే.

బాబాకు తనజన్మ వృత్తాంతముగాని, మతము, కులముల విషయముగాని తెలియదనగలమా! లేక తెలిసియూ, ఇతరులకు తెలుపక, రహస్యముగనే ఉంచెదనందమా! అట్టి అవకాశముగాని, అవుసరముగాని ఏమున్నది? శ్రీ రామునకు, శ్రీ కృష్ణునకు, జననీ జనకులు, జన్మగాధలేదా ? ఆ విషయము తెలిసినంత మాత్రమున, అందువల్ల కలుగునుప్యూనత ఏమున్నది. ఇక మతము, కులము విషయమేలదాచి యుంచవలెను. షిర్డీ చేరునప్పటికే, బాబా మహిమలుగల మహానీయుడని, అన్నిమతములవారునూ ఆరాధింపుచుండిరిగదా, బాబా మత మిది యని ఎరింగిగాని, కులమిదియని గుర్తించిగాని, ఆ భక్తులు చేర లేదే? వారికా విచారణ అవుసరమనికూడ తలంపలేదే? ఇక ఎందుల

కింత రహస్యము? పోనిండు, వత్సరములు గడచినకొలది, బాబా లీలలచూచి, శ్రీసాయి భగవంతుని స్వరూపమని, అందరకూ విశ్వాసము కుదిరెనుగదా, ఆతరువాతనైన, బాబా ఆ వృత్తాంతముల విషయమై, వెల్లడింపలేదు. తన జన్మస్థానమును గురించికూడ చెప్పలేదే, ఇతర విషయములటుండనిండు, పుట్టిన ఊరుఇదియని తెలుపుటలో ప్రమాదము ఏమిఏర్పడగలదు ? ఎందరెందరికో డచిన జన్మల విశేషములు తెల్పిన శ్రీసాయికి, తన విషయములు తెలుసుకొనుట, అసాధ్యమా? తల్లిదండ్రులేయుండి, జననగాథ నిక్కముగయున్నచో, ఎవ్వరునూ ఆ విషయములు మరుగుపరుపయత్నింపరు. దీనిని బట్టి మనము తెలియవలసినది ఒక్కటియే, బాబా కారణజన్ముడు, స్వయం సంభవుడు లేదా–ఆ విషయములు తెలుపకపోవుటకు మహత్తర కార్ణమేదైన నుండవలెను. ఇది దురూహ్యము. మహనీయులచర్యలు, చరిత్ర, ఊహలకతీతము, కారణ సిద్ధాంతముల, ఋజువుకందనిది. అంత మాత్రమున మనము అందుకుకార్ణముల కల్పింపయత్నించుట సాధ్యమే కాగలదు. వలదని శ్రీ సాయియే వదలివేసిన హంశములగూర్చి మనము ఊహలచేయుట అనుచితము, అనవసరము–అపచారము కూడ యగునేమో ?

బాబా పత్రి గ్రామమందు పుట్టెనా? పైనవ్రాసిన విషయముల బట్టి బాబాజన్మస్థలమిదియని తెలియదన్న హంశము స్పష్టపడుచున్నది. అయిననూ, బాబా పత్రిగ్రామమందు పుట్టెనన్నకథ వ్యాప్తిచెందినది. ఈ కథకుకూడ ఎట్టి ఆధారమునూ లేదు, పత్రీగ్రామము, నైజాము రాష్ట్రమందున్నది, షిర్డీకిషుమారు 100 మైళ్లు దూరము 1858 నుండి 1918 వరకు, బాబా షిర్డీయందుండెనుగదా! ఎన్నడైన బాబా తన గ్రామము పత్రియని పలికెనా? అదిఅట్లుండనిండు, బాబా కీర్తివిస్తరించిన తరువాతనైననూ, పత్రీగ్రామమునుండి ఎవ్వరైననూ, బాబాను

తామెరుగుదుమనిగాని, బాబా జన్మించినది, పత్రి, యందనిగాని బాబాకు నాయను వారచ్చట కలరనిగాని, తెల్పియుండిరా? బాబా మహిమలు, నైజాము రాష్ట్రమునందు తెలియదనగలమా! పత్రిగ్రామ ప్రాంతములనుండి వచ్చినవారెవ్వరూ, బాబానుచేరి, సేవించియుండ రనుటకు అర్థముండగలదా! బాబాతో సమవయస్కులుగాని, సమ కాలికులుగాని, అంతకన్న పిన్నలు, పెద్దలు, ఎందరుండరు? అందులో ఒక్కరైన, బాబా శరీరధారణమునందున్న 60 సంవత్సరములలో, వచ్చుటగాని, అందునుగురించి తెలుపుటగాని జరుగలేదే, దీనికి కారణమేమన గలము? అట్లు తెలిపిన తప్పేమియుండగలదు? షిర్డీక్షేత్రము కన్న, పత్రీగ్రామమే పవిత్రవంతముగ పరిగణించి యుందురే? పత్రీగ్రామమే నిజమునకు బాబా జన్మించిన స్థలమైనచో, బాబా కీర్తి మూలమూలల ప్రాకినదే, బాబా నిర్యాణానంతరమైన, పత్రిగ్రామ ప్రజలు, బాబా పేరట, ఆ గ్రామమున ఏమియూ ఏల ప్రతిష్ఠింపలేదు? దీనికేమనగలము. అట్లానర్పిన భక్తులు తండోపతండములుగ అచ్చటికి యాత్రసాగించియుందురే? ఇందరు భక్తులున్ననూ, బాబా నిర్యాణమునకు పూర్వముగాని, తరువాతగాని, ఒక్కరైననూ పత్రీగ్రామమునకు వెళ్లినట్లు వినికిడికూడలేదే? ఎందుచేత?

అఖిలభారత సాయీ సమాజ అధ్యక్షులు పూజ్య శ్రీ నృశింహస్వామిగారే, ఈ కథకు కారకులు. వారు తెలుపు ఆధారము ఇట్లున్నది. మహాల్సాపతి ఈ విషయము ఒక కాగితముపై పెన్సలుతో వ్రాసియుంచెనట. అది ఆధారముగాగాని ఈకథ కల్పింపబడినది. మొదటి విషయము మహాల్సాపతి విద్యావంతుడుకాడు, వ్రాయను చదువను వచ్చెనన్న విషయముకూడ అనుమానమే, ఈ విషయము శ్రీ నృశింహస్వామిజీరచించిన (Ankita Children of Baba) రచనవల్లనే తెలియుచున్నది. మహాల్సాపతి ఒకకాగితముపై ఈ విషయము వ్రాసియుంచు

కేల? బాబానుగురించి మహల్సాపతి ఇతర విషయములేమియూ వ్రాసి యుంచి నట్లగపడదు. ప్రత్యేకించి ఆ కాగితముఏల అంతభద్రముగ నుంచ బడినది. కాదు అదినిజమే అనుకుందము. అట్లయిన ఈవిషయము ఇతర భక్తులకు బాబా ఏల వెల్లడింపలేదు? తెలియరాని విషయముకాదే? పోనిండు మహల్సాపతియైన ఈ విషయము సోదరభక్తులగు, నానాకు గాని, దీక్షిత్ కుగాని కడకు కోటీశ్వరుడగు బూటీకుగాని ఏల తెలుపలేదు? ఇతరుల కీవిషయము తెలుపరానిదని ఆ కాగితముపై వ్రాయబడి యున్నట్లు తెలుపబడలేదు. అట్టి పరమ రహస్యమేయైనచో ఆ చీటిపై వ్రాయుటేల? ప్రత్యేకించి ఒక్క విషయము గమనింపవలసి యున్నది. శ్రీ దాస్ గణు, బాబాచరిత్ర కీర్తనారూపమున రచించి తానే సంకీర్తన మొనర్చెను. బాబా ఆనతిచొప్పున, శ్రీ సాయి ఆశీర్వాదముతో ఆతడట్టు లొనరించెను. ఈ సంకీర్తన సాయి సశరీరుడై యుండగనే జరిగినది. ఎన్నిమారులు మహల్సాపతి ఈ సంకీర్తనమాలించి యుండునో చెప్పలేము. వాస్తవమునకు బాబా తాను పత్రిగ్రామమున జన్మించినట్లు తెలుపుట నిజమేఅయినచో, ఆ విషయము శ్రీ దాస్ గణునకు తెలుపక దాచుట సంభవమా? అట్టి అవుసర మేమున్నది? మహల్సాపతి కెరుక పరచిన విషయము ఇతరులకడ దాపనేల? మహల్సాపతియైన ఏల దాస్ గణునకు తెలుపలేదు?

తరువాత శ్రీ సాయి సచ్చరిత్ర వ్రాయవలసినదిగా బాబా అనుగ్రహించి, హేమాద్పంతుకు అనుజ్ఞనిచ్చెనే! ఆరంభించినదికూడ బాబా నిర్యాణమునకు పూర్వమేగదా! హేమాద్పంతు వ్రాయలేదేల? హేమాద్పంతు సచ్చరిత్ర రచించుటతోడిభక్తులకు తెలిసినవిషయమే, మహల్సాపతి ఈ విషయము తానెరిగియున్న, హేమాద్పంతున కేల తెలుపలేదు? కావున బాబా పత్రిగ్రామమందు జననమందెననుట ఆధారములేని కథా కలాపము,

ఇక శ్రీ సాయిబాబా ఎవ్వరన్నది చూతము. ఋషియా, మహిమలుగల మహాత్ముడా! సాధువా, సత్పురుషుడా! కాక భక్తుడా! భగవదవతారమా!

భక్తిగలవారలకు, బాబా భగవదవతారము. ఇందుకు సందియములేదు. ఇది అనుభవసిద్ధము. సృష్టియందలి ప్రతి వస్తువునూ భగవంతుని స్వరూపమని ఆరాధించు మనకు, ఈ ప్రశ్నతో పనిలేదు.

శ్రీ సాయి పరిపూర్ణమగు భగవదవతారము. ఈ విషయము నిర్ణయించుటకు ముందు శ్రీ కృష్ణపరమాత్మ, తన్నెరింగిన భక్తుడు తానుగా గుర్తింపమని, ఆ భక్తునకునూ తనకునూ భేదమేలేదని తానే అట్టి భక్తుడని, అట్టి భక్తుడే తానని, గీతయందు తెలిపియుండెనే, ఆ కారణమున శ్రీ సాయి అట్టిభక్తుడే యనుకున్ననూ భగవంతుడే కాగలడు.

బాబా సాధువు. సత్పురుషుడు అనుటకు సందియము లేదు. కాని సాధువు, సత్పురుషుడు మాత్రమేకాక, భగవదవతారమనియే మనము తెలియ వలసినది. అట్లులే శ్రీ సాయి ఋషియూ, మహిమలగల మహాత్మునికూడ. అంతియేగాదు. మహిమలు లీలారూపమున ప్రదర్శించిన భగవదవతారము. సాధుత్వము, మహిమలు, సద్వర్తన, అన్నియు భగవదంశములే. కాని బాబా అట్టి హంశమూర్తి మాత్రమేగాదు. పరిపూర్ణమగు భగవదవతారము. బాబాయందలి భక్తిచేతనే నిట్లనుటలేదు. బాబాజీవితమున బాబా లీలలయందే బాబా పరిపూర్ణమగు భగవదవతారమని తెలియుటకు తగిన నిదర్శనము లున్నవి. బాబా పరమాత్మ స్వరూపము ప్రత్యేకించి విష్ణుహంశగాని రుద్రహంశగాని కాదు. తానే మహాలక్ష్మియని తానే అనసూయాదేవియని తానే దత్తమూర్తియని, తానే మహాకాళియని, తానే రాముడని, కృష్ణుడని, తానే పరమేశ్వరి పరమేశ్వరుడునని

తానే సకలసాధువుల స్వరూపమని తానే సకల దేవతా స్వరూపమునూ యని బాబా తెలియ చెప్పుటయేగాక నిదర్శనాపూర్వకముగ భక్తులకు చూపినాడు. శ్రీ సాయినాధచరిత్ర అను గురుచరిత్ర యందలి ప్రథమభాగమగు ఈపొత్తమున ఆ హాంశమునే పదే పదే మనకు తెలుపబడినది. నాతండ్రి అనుగ్రహించినచో రెండవభాగమున బాబా ప్రత్యేకత అవతారచర్య సమాధి అనంతరము శ్రీ సాయిలీలలు వీటిని వివరింప ప్రయత్నింతును.

తనశక్తినే ప్రదర్శించి ప్రసాదించి సృష్టి స్థితి లయకారకులుగా వర్ణింపబడిన బ్రహ్మా, విష్ణు, మహేశ్వరులను ముగ్గురు మూర్తుల కాధారమైన పరాశక్తియే శ్రీసాయి. ఆకారణముచేతనే బాబా తానే రాముడనని, కృష్ణుడనని, మహాలక్ష్మియని, మహాకాళియని, అనసూయాదేవియని తెలిపినాడు. శ్రీకృష్ణపరమాత్మ పసితనమందే తల్లియశోదకు విశ్వరూప దరిశనమిచ్చెను. తిరుగ యుద్ధసమయమున సత్యమిదియని నిరూపించుటకు సత్యాన్వేషణ తత్పరులగు జిజ్ఞాసులకు మార్గమెరింగించుటకు కృష్ణపరమాత్మ పార్థునకన్న మిషతో, గీతా బోధగావించి, ధనుంజయునకు విశ్వరూపదరిశనము ప్రసాదించెను. ఇట్టి శ్రీకృష్ణ పరమాత్మ సామాన్య గోపబాలునివలె సంచరించెను. అట్లే శ్రీసాయి సాధురూపమున సామాన్య సాధువువలె సంచరించి సామాన్య ప్రజల సముద్ధరింప అవతరించిన పరమాత్మ స్వరూపము. శ్రీసాయినామ సంస్మరణ సర్వపాపహరము సకలసంపత్కరము. అట్టి శ్రీసాయికి ప్రణమిల్లుదము.



# విజ్ఞప్తి

మహాశయులారా!

సాయీ భక్తులు, చీరాలలో సమావేశమై, శ్రీ సాయీ భక్త, కేశవయ్యగారి అధ్వర్యమున, సాయీలీల అను పేరుతో, మాసపత్రికను సాగింప తీర్మానించిరి. అందుకు సోదరుడు శ్రీ రావుల దేవేంద్రనాథంగారి, సానుభూతియే కారణము. కార్యదర్శిగా కార్య భారము వహించి, పత్రికను సమర్ధతతో నడిపిరి. కాని కారణాంతరముల వలన, పత్రిక ఆగిపోయినది. ఆ కమిటీవారికి నా పైగలవాత్సల్యమున, నన్ను సంపాదకునిగా ఎన్నుకొనిరి. ఆ పత్రిక నడచునప్పుడే, నేనీ సాయీనాథచరిత్ర వ్రాయ మొదలిడితిని, పరమాత్మ స్వరూపమగు శ్రీ సాయినాథుని చరిత్ర, వ్రాయ ప్రయత్నించుట నా బోంట్లకు సాహసమని తెలియకపోలేదు, పరమదయాళువగు శ్రీ సాయి, చేతగాని నావ్రాతనుకూడ అంగీకరింపగలడన్న, విశ్వాసము, శ్రీ కేశవయ్యగారు మొదలుగాగల మహాభక్తుల, ఆశీర్వాదమున్నదన్న ధైర్యము, తోడిభక్తుల ప్రోత్సాహము, బాబా దయ నాకు అండగా, నేను అందుకు పూనుకుంటిని. బాబా చరిత్ర కొన్ని ప్రకరణలు, సాయిలీల పత్రికయందు ప్రచురింపబడెను, కాని పత్రిక ఆగిపోయినకారణమున, పూర్తిగ ప్రచురణ జరుగలేదు. ఎందరెందరో భక్తులు పత్రిక ఆగిపోయినందులకు, ఆశాభంగము వెలిబుచ్చుచూ, శ్రీ సాయినాథ చరిత్రను అచ్చొత్తించ వలసినదిగా కోరిరి. బహు కుటుంబీకుడనగు నాకు, ఎంత ఆతురతయున్ననూ, ఆపని అసాధ్యమైనది, ఆపనికూడ శ్రీ సాయియే సరిచేసినాడు, బాబా, అనుగ్రహమునకు పాత్రుడైన, శ్రీ చిరంజీవి

ప్రభలతిలక్, B. Com, అందుకు పూనుకొనెను, అంతయూ ఆ తండ్రి సంకల్పము, తలవని తలంపుగా, శ్రీ గ్రంధి లక్ష్మయ్యగు ప్తగారు, ఆంధ్రరత్న పవర్ ప్రెస్, అధిపతులు, వారి పరిచయము కలిగినది. వారుకూడా బాబా భక్తులైన కారణమున, ఈ పొత్తమును తాను స్వంతపనిగా, చూచుకొని, అనతికాలమున ముద్రణము పూర్తిచేయుటకు పూనుకొనెను. నా కోరిక ననుసరించి, ఈ బాబా చరిత్ర అందరికీ అందుబాటులో యుండునట్లు, వెల 2–8–0 లు మాత్రమే నిర్ణయింపబడినది.

శ్రీ గుణాజీ రచించిన (ఇంగ్లీషు) సాయిచరిత్ర, పూజ్య శ్రీ నృశింహస్వామిగారు రచించిన, (ఇంగ్లీషు) సర్కోరిమహర్షి, భక్తుల అనుభవములు, అనుపొత్తములనూ, బొంబాయినుండి వెలువడు, సాయిలీల, పత్రికయూ, ఆధారముగా తీసుకుని, శ్రీసాయి పద ధ్యానముతో స్వతంత్ర రచనగా, ఈచరిత్ర వ్రాయబడినది. ఇది దేనికి అనుకరణగాని, అనువాదముకాని కాదు. ఒక్కొక్కప్పుడు, చరిత్ర వ్రాయుటకని ప్రారంభించి నప్పుడు, కలము కదిలెడిదికాదు, అంతయూ అంధకారముగ నుండెడిది. వెంటనే శ్రీసాయికి సాష్టాంగపడి ప్రార్ధనానంతరము, రచన సాగించితిని. ఆతండ్రి అనుగ్రహముతో, ఆయన దయచేసినంత దనుక, ఈచరిత్ర వ్రాయబడినది. మొదట ఆ ప్రార్ధనల ఇందుచేర్చుటెందులకు అని వెనుకాడితిని, కాని చేర్చుటయే అవుసరమని, కొన్నింటిని ఇందుచేర్చితిని. అంతయు ఆతండ్రి పాదసేవతో కొనసాగించుచున్న ధైర్యమే, ఈచరిత్ర అచ్చువేయించుటకు కారణము, ఇందు వ్యాకరణ దోషములు, ఇతర పొరబాట్లు ఉండునని, నేనెరుగుదును. భక్తియే ప్రధానముగ, భక్తబాంధవుని చరిత్రకావున, కించిదజ్ఞుడనగు, నాలోపములను మన్నించి సజ్జనులు, సుహృద్భావముతో దీనిని ఆదరింప గలరని, ఆశింపుచున్నాను. ముకుళిత హస్తుడనై

స్వర్గీయులగు నామాతాపితలకు నమస్కరించి, భక్తియే ప్రధానముగ నాచే ఈరచన నడపించిన, బాబా అందరియందు భక్త్యుత్సాహముల రేకెత్తించి ఆదరించి, అనుగ్రహించుగాక, అని ప్రార్థింపుచున్నాను. బాబానిర్యాణానంతరము, ఎట్లు ప్రత్యక్షమై తనలీలల చూపుచున్నది, భక్తులకు అనటయై పాలింపుచున్నది, ఈ అవతారమందలి బాబా చేసిన ప్రత్యేక బోధ, మున్నగువిషయముల, ఆతండ్రి అనుగ్రహించినచో, రెండవభాగముగా రచింపగలను. వాస్తవమునకు నిర్యాణానంతరమే, బాబా తనలీలల ఎక్కువగచూపి, అనుగ్రహింపుచున్నాడు. సాయీభక్త కేశవయ్య శ్రీ నృశింహస్వామి గారలు ఇందుకు ప్రత్యక్ష నిదర్శనము. ఇంతియేగాదు, నాడుసామాన్యగృహస్థు, ఆయుర్వేదభిషక్, శ్రీకాశీనాధుని శ్రీ ఉపాసనీ మహారాజుగ, సత్పురుష స్థితి ప్రసాదించినట్లు నేడు శ్రీసాయి, గోదావరీ తీరమున రామచంద్రాపురముననున్న బాబాప్రసన్న, నాసోదరి శ్రీమతి కృష్ణాబాయిని అనుగ్రహించి, అట్టి ఉన్నత స్థితిని ప్రసాదించి, తానె ఆమెయని వేవిధముల చూపుచూ, తనలీలల విచిత్రమగు తీరున ప్రదర్శింపుచున్నాడు. తల్లి కృష్ణమాయి, చరిత్ర ఒక పెద్దగ్రంథముగా గలదు. ఈ వివరము లన్నియూ, భక్తులు ఆదరించి, ప్రోత్సహించినచో, అనతికాలములో, తమకు అందచేయగలను.

ఈ పొత్తమును అచ్చొత్తించుటలో, ప్రోత్సహించుటయేగాక సాయమొనరించి తోడుపడిన చిరంజీవి, ప్రభల తిలక్ B. Com. కు బాబా అన్నివిధముల అనుగ్రహించి, ఆయురారోగ్యముల ప్రసాదించుగాకయని ప్రార్థింపుచున్నాను. తమకుగల ఇతర ఇబ్బందుల సాకు గొనక, తాముగూడ సాయీభక్తులైన గారణమున, శ్రద్ధతో, ఈ చరిత్ర అచ్చొత్తించిన, ఆంధ్రరత్న పవర్ ప్రెస్ ప్రొప్రైటరు శ్రీ గ్రంధి లక్ష్మయ్య గుప్తగార్కి నా అభివందనాలు, ఒక్కవిషయము

శ్రీ బాపట్ల హనుమంతరావుగారు రచించిన కొన్ని పద్యములు ఈ చరిత్రయందలి కథాసరళికి అనుకూలముగా యున్నందున, వారిఅనుమతితో ఇందు చేర్చబడినవి. కోరినంతమాత్రమున, వలయు బ్లాకుల, కాదనకఇచ్చి సాయపడిన శ్రీ అఖిలభారత సాయీసమాజము వార్కి నాకృతజ్ఞత. కారణాంతరముల వలన ఆలస్యమైనను, బాబాయందలి భక్తితో, అన్నివిధముల, అందముగా వెలువడుటకు సాయపడిన ఆంధ్రరత్న పవర్ ప్రెస్, వర్కర్లకు నా అభివందనములు.

20–1–57 }
రేపల్లె }

భక్త పాదరేణువు
వేమూరి వెంకటేశ్వర్లు



శ్రీ సాయినాథాయ నమః

శ్రీ సమర్థ సద్గురు

# సాయినాథ చరిత్ర

శ్రీకరము నీదు నామము
ప్రాకటముగ భక్తితోడ పలికిన నెపుడున్
శ్రీకరము నీదు చరితము
శ్రీకరమే నీదుభక్తి శ్రీసాయీశా.

## ప్రణతి

బాబా !

పరమాత్మ స్వరూపా! నీపాదపద్మములకు వినమ్రుడను. నీచరిత్ర వ్రాయుటకు నేనెంత, నే నేమెరుంగుదును? నీఅనుగ్రహమున, నీపద ధ్యాన నిమగ్నుడనై, నీదయ సేయునంతదనుక, వ్రాయసాహసించితిని. భారమంతయు నీది. ఇందలి తప్పొప్పులతో నాకుపని లేదు. లీలామానుష విగ్రహుడవగు నీలీలా విశేషముల, నీచరణ కమలముల మనసు నిలిపి, నుతియించుటయే నాపని. నేను నీభక్తపాద రేణువును మాత్రమే. ఎట్లు సమర్థించెదవో ?

జయ, జయ శ్రీసాయీ—జయ గోసాయి రూపధారీ!
జయ మన్మానసస్థాయి—సాయీ—జయ జయ శ్రీ సాయీ!!
ఎవరని, ఏమని, ఎటులని నుతియింతురా—బాబా—
నిన్నెవరని, ఏమని, ఎటులని నుతియింతురా!
భవుడవో, కమలాసంభవుడవో, రమాధవుడవో—నిన్నెవరని, ఏమని, ఎటులని నుతియింతురా ॥బాబా॥
వదలను నీ పదభక్తిని—సదమలాత్మ సాయీశా॥
కదలక నాహృదిని నిలచి, కదలనిమ్ము కలము సాయీ॥ — వదలను
భారము నీదేరా—బాబా—ఆధారము నీవేగా — కారణ కారణ, దయసేయుమురా॥
నీదయలేకున్నను, నా తరమా ప్రభు — నీ లీలలెన్నవశమా! నీ మహిమ తెలియగలనా! భారమునీదేరా — బాబా॥
బ్రహ్మసతీ — పార్వతీ — కమలాలయ కామాక్షీ కదలిరండు దయ మీరలు, కరుణజిలుక నా పైనా—
చేతగాని నాదువ్రాత — చేతో మోదము గొలుపా — చేతులొగ్గి మిము వేడద — నయమున నెమ్మదిగూర్పా॥
పరాకేలరా ప్రభూ!—నిరాదరణ సేయకురా వరాలొసగు వేల్పువుగా— కనికరాన గాంచుమురా — మందమతినిగా—బాబా—ఆనందము గూర్పుమురా డెందమందునిన్నే నిలిపి—అందుకొందునింకకలమూ॥
పరాకేలరా॥

శ్రీసాయి, సశరీరుడై, భక్తుల రక్షింపుతరి, బాబా పాదసేవ అబ్బిన అదృష్టవంతులు, మనప్రాంతములఅరుదు. లేరని చెప్పినసూ, చెప్పవచ్చును. బొంబాయి రాష్ట్రిమున భక్తరక్షణ పరతంత్రుడగు బాబా 'షిర్డీ' యను చిన్నపల్లెయందు వేంచేసెను. బాబా మహిమలు ఈప్రాంతముల మనకందచేసినది పూజ్యులగు శ్రీ నృశింహ్వాస్వామిగారు. ఉత్తర హిందూస్థానమున, మరాఠీభాషయందు, 'సాయీలీల' అను పేరుతో పత్రిక నడచుచుండెడిది. అందు బాబాచరిత్ర

వ్రాయుచుండిరి. కాని దానివల్ల మరాఠీభాషరాని మనకు ప్రయోజనములేదు. అఖిలభారత సాయీసమాజ అధ్యక్షులు, శ్రీ నృసింహ్వాస్వామివారు, ఆంగ్లమున రచించిన పుస్తకములే మన కాధారములైనవి. శ్రీ సాయీకరుణా విశేషమున, సాయీభక్తులు అన్ని ప్రాంతముల ఉన్నతరువాత, అన్ని భాషలలోను, బాబాగాథలు, సంకీర్తనలు సాగుచునేయున్నవి. గాని, 'బాబా' చరిత్రను మొదట (మరాఠీ భాషలో) వ్రాసినది, అన్నాసాహెబ్ దభోల్కార్, అను మహాభక్తుడు. ఈయనకు 'హేమాద్పంతు'అను బిరుదును శ్రీ సాయియే ప్రసాదించెను. హేమాద్పంతు రచించిన సచ్చరిత్ర, శ్రీ సాయి అనుగ్రహముతో, సాయి అనుమతితో, వ్రాయబడినది. ఆయన జరిగిన విషయముల వ్రాసిపెట్టుకుని, అనుభవములవర్చి,కూర్చి, సచ్చరితనురచించెను. దానిని ఆధారము చేసుకుని, 'శ్రీ గుణాజీ' అనుభక్తుడు, ఆంగ్లమున శ్రీ సాయీ సచ్చరిత్రను వ్రాసెను. ఇది 1947 లో ప్రథమతః ముద్రింపబడినది.

దీనికితోడు, శ్రీ నృశింహ్వాస్వామిగారు ఆంగ్లమున రచించిన, భక్తుల అనుభవములు, సక్కోరి మహర్షి: అనుపుస్తకములే మనకు ఆధారములైనవి. వానినాధారము చేసుకొని, నేనీ బాబా చరిత్రను, బాబా అనుగ్రహముతో వ్రాయబూనితిని. ఈ నా రచన, అనుకరణ గాని, అనువాదముగాని కాదు, స్వతంత్రరచన అని మనవి.

మున్ముందు ఒక్కవిషయము తెలుపవలసియున్నది. ఏలూరు నుండి 'సాయీసుధ' అను పత్రిక, తెలుగున వెలువడుచూ వచ్చెను. అందుప్రకరణములుగ కొంతదనుక, శ్రీసాయీసచ్చరిత్ర వ్రాయబడెను. కాని కారణాంతరములవలన, ఆపత్రిక ఆగిపోయినది. పత్రికను సమర్థతతో నడపిన, శ్రీ కలగర నాగభూషణం చౌదరి. B. A. B. L., గారికి, సచ్చరిత్ర తెనుగున, తమవద్దయున్నచో పంపమని కోరితిని. ఏకారణము చేతనో అందుకెట్టి సమాధానమునూ వచ్చియుండలేదు. బహుశ వారివద్దలేదేమోనని నాయూహ. ఏది ఎటులున్ననూ, అసంపూర్తిగ విడువబడిన, సాయీచరిత్ర, అట్లేయుంచుటకన్న, తిరుగవ్రాయుట మేలని సోదరభక్తులుకోరిరి. అందుకు తగిన అర్హతనాకులేదని,

సేవేయంగుదును. భగవత్ సేవకావున, భక్తితో బాబాకు ప్రణమిల్లి ఇందుకు పూనుకుంటిని. మహాసమాధి అనంతరముకూడ, బాబా ఎల్లుపిలచిన పలుకుచూ, స్మృతిమాత్రప్రసన్నుడై, భక్తరక్షణ మొన రింపు చున్నదికూడ ఇందువ్రాయదలంచితిని, దయాసముద్రుడగు శ్రీసాయియే, ఇందుకు సాయపడుగాక అనిప్రార్థింపుచూ, శ్రీ సాయినాథ చరిత్ర దెల్పుచున్నాడ.

## షిర్డీ నిలయుడు

బాబా తనభక్తులకు భగవదవతారము:-త్రిమూర్త్యాత్మకమగు శ్రీ దత్తాత్రేయుని, అవతారమని చెప్పబడినది. వీరికి పూర్వము శ్రీ శ్రీపాదవల్లభస్వామి, (2) శ్రీ నృశింహ్వా సరస్వతీవారు, శ్రీ దత్తాత్రేయుని అవతారములు. ఈ అవతారమూర్తుల లీలలను, మరాఠీభాషలో, మహాభక్తుడు శ్రీ సరస్వతీ గంగాధరుడు, గురుచరిత్ర, అను గ్రంథమున రచించెను. అట్లే దత్తాత్రేయ అవతారమగు మన బాబాచరిత్రను. హేమద్పంతు, అనుభక్తుడు శ్రీ సాయి సచ్చరిత్రయందు తెలిపెను.

బాబా లీలలయందే, శ్రీ సాయి, దత్తాత్రేయుని అవతారమనుటకు ఆధారము లేకపోలేదు. 1911 సంవత్సరమున శ్రీ దత్తజయంతి మార్గశిరశుద్ధ చతుర్దశినాడు. సాయంసమయమున అయిదుగంటల వేళ, బలవంతఖోజాకరు, మున్నగుభక్తులు బాబానుదర్శింప ద్వారకమాయి చేరిరి. అందాసీనుడై యున్న శ్రీ సాయి, అచ్చటనున్న వారినందరనూ కసరికొట్టుచూ 'నాకు ప్రసవ వేదనగాయున్నది. బాధ భరింపలేకున్నాను, పొండుపొండు' అని కేకలిడెను. కొంత తడవైనపిదప, బాబా, తనంత తాను. భక్తులను. రండు, రండని పిలచెను. బలవంతఖోజాకరు ముందు లోనికేగెను. కాని ఆశ్చర్యము-అచ్చట బాబా లేడు. ఆసనముపై మూడుతలలతో ముద్దులొలుకు పసిపాపడు, తేజోమూర్తి-శ్రీ దత్తమూర్తియే ప్రత్యక్షమయ్యెను. ఖోజాకరు అదృష్టవంతుడు, భక్తితో ప్రణమిల్లెను. తిరుగచూచుసరికి ఎడీ! ఆ పశిండిచాయపాపడు-అదృశ్యమై బాబాయే ప్రత్యక్షమయ్యెను. బాబా-పరిపూర్ణమగు,

భగవదవతారము, సృష్టి, స్థితి, లయకారకులగు, త్రిమూర్త్యాత్మక, శ్రీ దత్తమూర్తియే బాబా. బాబా ఎట్లు భగవదవతారమనునది ముందు మరియొక అధ్యాయమున విపులముగ తెలుపగలను.

బాబా, బాల్యదశను గురించి తెలిసినవారుగాని, ఇదమిద్ధమని నిర్ణయించుటకు తగిన ఆధారములుగాని, ఏమియూలేవు. బాబా మతమువిషయముగాని, కులమిదియనిగాని, తల్లిదండ్రుల పేర్లుగాని, వారల చరిత్రగాని, పుట్టినఊరుగాని. ఎవ్వరికినీ తెలియదు. ఎన్నివిధ ముల తనభక్తులు ప్రశ్నించిననూ, బాబా, నవ్వుచూ తనది కబీరుమత మని, తనవయస్సు కొన్నియుగములని, తనతండ్రిపేరు, 'సాయిబాబా' అనిచెప్పినట్లు, చరిత్రవల్ల తెలియుచున్నది. పరమాత్మ స్వరూపుడగు, శ్రీ సాయియే చెప్పక విడచిన విషయముల గురించి మనము తర్కింప పనిలేదు. మనమూఘత్వమేగాని, భగవదవతారమునకు మతముతో గాని, కులముతోగాని ఏమిపని ?

బాబా మొట్టమొదట 1854 సంవత్సరములో, 'షిర్డీ' గ్రామ మునకు బయట, ఒకవేపచెట్టుక్రింద పద్మాసనాసీనుడై దర్శనమిచ్చెను. చూచుటకు 16 సంవత్సరముల ప్రాయముకలవానివలె యుండెను. స్ఫురద్రూపి, తేజోవంతుడు. నాటికే బ్రహ్మజ్ఞాని. బయట ప్రపంచ ముతో పనిలేక, ఆ వేపచెట్టుక్రింద ధ్యానముద్ర యందుండెడివాడు. ఆనాడు 'బాబా' నుచూచిన వృద్ధురాలు ఇట్లు తెల్పినది.

"వేపచెట్టుక్రింద పద్మాసనాసీనుడైన, ఈ 16 సంవత్సరముల బాలుడు తపోనిష్టయందుండెను. పగటివేళ ఇతరులతో పలుకడు. రాత్రి చీకటియన్న భయములేదు. ప్రజలు ఎవ్వరీ తపస్వి ఎక్కడ నుండివచ్చెనని ఆశ్చర్యము నొందెడివారు. ఆ వేపచెట్టుమొదలు వదలి ఎక్కడికినీ వెళ్ళెడివాడుకాదు. అన్నాహారములతో పనిలేదు. బాలునివలెనున్న ఈతడు మహత్తరయోగి. చూచెడివారికి భక్తి పొడమెడిది, ఎవ్వరునూ పలుకరింప సాహసింపరైరి. ఇట్లుండ ఒక నాడు మాగ్రామదేవత "ఖండోబా", ఒకభక్తునకు పూనికవచ్చెను. వెంటనే గుమిగూడిన ప్రజలు – "దేవా! ఊరుబయటనున్న ఆ బాల

యోగి ఎవ్వరు, ఎక్కడనుండివచ్చెనో చెప్పుమని వేడికొనిరి. ఆగణము
పూనిన ఆతడు, వారిని గడ్డపలుగు తెమ్మని, ఒక ప్రదేశముచూపి
త్రవ్వుడని ఆజ్ఞాపించెను. వారట్లే త్రవ్విరి. అచ్చట ఇటుకలకట్టడ
మున్నూ, అందుక్రింద విశాలమగు బండపరుపబడి యుండుటయు జూచిరి.
ఆ బండను తొలగింపగా, క్రిందగదివలె యుండెను. అందు నలుదిక్కుల
ప్రమిదలయందు దీపములుకాంతితో వెలుగుచుండెను. అటనుండి
ప్రక్కకు 'గుహ' వలెయున్నది. ఆ గుహాయందు పూజాద్రవ్యములు,
ముక్తాహారములు చూచితిమి. అంతట ఆ గణాచారి ఇట్లుచెప్పెను.
"ఈ బాలుడు, ఈప్రదేశమున 12 సంవత్సరములు తపముచేసినాడు.
అంతట ఊరిలోని జనము, అనవసరమగు ప్రశ్నలతో ఈతని బాధిం
చిరి. ఆ కారణమున ఈతడు, అచ్చోట తనగురువు తపమాచరించెనని,
అందువల్ల తానచ్చట చేరెనని, చెప్పి తానువచ్చువరకు ఆప్రదేశమును
భద్రముగా చూచుచుండుడని బ్రతిమాలిచెప్పి వెడలిపోయెను. ఆ తరు
వాత ఊరిప్రజలీబండనువైచి మూసివేసిరి." గాథ ఎంతవిచిత్రము !
పదునారేండ్ల 'బాబా' ఏడ ! 12 సంవత్సరముల తపమాచరించుటేడ !
అందలి ఆ దీపములట్లే వెలుగుచుండుటేడ, ఇది ఈ జన్మమున సంభ
వించినదేనా ! అట్లయిన మన 'బాబా' కు ఏవిధముననూ 4 సంవత్స
రములకన్న వయస్సుండదే, అప్పటికే తపస్సా, – ఆహా, ఈ 16 సం
వత్సరముల 'బాబా' నిజమైన వయస్సెంత ? భగవంతుని కథలిట్లే
చిత్ర విచిత్రములుకదా !

పైన తెల్పిన విధమున, బాబా, షిర్డీయందు నిలిచి వృక్ష
మూలమున రమారమి 3 సంవత్సరము లట్లేయుండెను. తరువాత
ఎచ్చటకో పోయెను. అది ఎవ్వరునూ ఎరుగరు. షిర్డీ ఎంత పవిత్ర
భూమి, షిర్డీ ప్రజలెంత అదృష్టవంతులు. తిరిగి బాబా 1858 లో 'షిర్డీ'
చేరెను. అంతటనుండి 1918 లో మహాసమాధి అగువరకు ఆ గ్రామము
వదలి ఎచ్చటకునూ పోలేదు. కదాచిత్, అచ్చటికి 4 మైళ్ళ దూర
ములోయున్న రహాతాకును, ఎప్పుడైన కోపర్గాముకును మాత్రము
వెళ్ళెడివాడు. అవతారమూర్తియగు 'బాబా' అందుండుటచే 'షిర్డీ'
పుణ్యక్షేత్రమున్నూ, యాత్రాస్థలమున్నూ అయినది.

## బాబా 2వ సారి షిర్డీ చేరుట

ఏ అవతారమందైనను, భగవంతుడు భక్తి పెంపొందింపను, విశ్వాసము కుదరగలందులకును, చమత్కారములు చేయుట మన మెరుగుదుము. 3 సంవత్సరములు 'షిర్డీ' యందుండియూ, భగవత్ స్వరూపుడగు బాబా, ఎవ్వరితోడనూ మాటాడి ఎరుగడు. 1858 లో ఒక చిత్రము జరిగినది. నైజాము రాజ్యమందలి ఔరంగాబాదుజిల్లాకు చెందిన 'ధూప్' అను గ్రామమున 'ఛాంద్ భాయీపటేల్' అను లక్షాధికారి ఒకడుండెను. పనిపడి అతడు తన గుర్రముపై ఔరంగాబాదుకు పయనము సాగించెను. అచ్చట ఆ గుర్రము తప్పించుకు పోయినది. అగుపడలేదు. పాప మాతడా గుర్రమును, తన ప్రాణముతో సమానముగ ప్రేమించెడివాడు. రెండు నెలలు విసువులేక ఆ గుర్రమునకై వెతకెను. కాని గుర్రముజాడ దొరుకలేదు. నిస్పృహచెంది, వేరు చేయునదిలేక దిగులున సగమై, నిరాశతో ఇంటికి వచ్చుచుండెను. గుర్రముపోయిననూ, జ్ఞాపకార్థము జీనైన ఉండునని బరువని వెనుదీయక, జీనును వీపునపెట్టి తెచ్చుచుండెను. మార్గమధ్యమున దట్టముగా పెరిగిన అడవిలో, ఒక మామిడిగున్నక్రింద ఒక వింతపకీరాతని కెదురుపడెను. ఆ పకీరునకు నెత్తినటోపీ, ఒంటికిబారు అంగరఖా క్రుఫ్నీ మాత్రముండెను. చేతిలో దండ మొకటున్నది. ఫకీరు-ఈఛాంద్ భాయీపటేలునుచూచి ప్రేమపూర్వకముగా-సోదరా! ఈనీడ సేదదీర్చుకొనుము, డస్సినట్లున్నావు; అని పిలచెను. ఫకీరు చేతినందు 'చిలుము' ఉన్నది. చాంద్ భాయీపటేల్ ఆగినంతలో-భాయీ! ఆ జీనేమిటి? ఇట్లు మోయుచుంటివేల? అని మందహాసముతో ప్రశ్నించెను. పటేల్ తనగుర్రము పోయినవిధము తెలిపెను. అందుకు పకీరు నవ్వుచూ నీ గుర్రము పోయినదా? నీవు నిజముగ వెతకితివా? అగపడలేదా? -అయిననూ ఆప్రక్కన చూడుమని పంపెను. ఆ ప్రదేశమంతయూ తానది వరకు వెతకినదే, అప్పుడు పటేల్‌కు గుర్రముజాడ దొరుకలేదు. ఈ ఫకీరు మాటలవెంట ఆవైపుపోగా. ఆశ్చర్యము? ఒక చెట్టునీడను గుర్రము సకిలింపుచుండెను. ఆత్రముతో గుర్రమెక్కి ఫకీరువైపు చేరెను. ఫకీరు చిలుముగొట్టము సరిచేసి వెలిగింపు ప్రయత్నములో నున్నాడు-

అంతయూ సిద్ధమైనది-తడుపుటకు నీరునూ, వెలిగించుటకు నిప్పునూ మాత్రము లేవు. పటేల్ చూచుచుండగనే ఫకీరు తనచేతిలోని దండముతో నేలపై కొట్టెను. నిప్పు కణములు వచ్చినవి. గాని తడుపుటకు నీరో? నిప్పు వచ్చినచోటనే ఫకీరు తనదండముతో నేలపై తాకెను. నిప్పుపోయి బుడబుడమని నీరువచ్చినది. చిలుము వెలిగినది. ఫకీరు పొగపీల్చెను, పటేలున కందించెను. పటేలుకూడ పొగత్రాగినాడు. కాని ఆతని కేమియూ అర్థము గాలేదు—సంకల్ప మాత్రమున నిప్పు, తిరుగ అచ్చట నేనీరు, మాటమాత్రమున పోయిన గుర్రము దొరకుట – అంతయూ వింతగాదోచెను. ఈ ఫకీరు సామాన్యుడు గాడు – పంచభూతముల ఆజ్ఞాపింప సమర్థుడు – భూతభవిష్యత్ వర్తమానముల నెరిగిన మహనీయుడు – నా అదృష్టమున నాకీమహనీయుని దర్శనమబ్బినది. అని పటేల్, ఫకీరునకు ప్రణమిల్లి – స్వామీ! నన్ననుగ్రహించి, నాతోడ నా ఇంటికిరండు, నా ఆతిథ్యమంగీకరింపుడని వేడుకొనెను. వల్లెయని ఫకీరు, పటేల్ వెంట వెళ్ళెను. అటకొన్నాళ్ళుండి. చాంద్ భాయీ మేనల్లునకు వివాహమునిశ్చయింప బడెను. పెండ్లి కూతురువారిది 'షిర్డీ' సపరివారముగ, బంధువులతో పటేల్ పెండ్లికి పయనమయ్యెను. పెండ్లివారితో, పటేల్ కోరికపై ఫకీరుకూడ 'షిర్డీ' చేరినాడు. పెండ్లివారిబండ్లు, ఖండోబా దేవాలయమునకు ప్రక్కన చేలలో ఆగినవి. బండ్లనుండి ఒక్కొక్కరు బయటకు దిగసాగిరి. ఫకీరుకూడ బండినుండి దిగుచుండెను., ఫకీరునుచూడగనే, ఖండోబా దేవాలయమందలి పూజారి, – 'ఆ య్యే సా యీ' అనిఫకీరు నాహ్వానించెను. మిగిలినవారునూ – సాయీ – సాయీ అని పిలచిరి. నాటినుండి మనఫకీరు – సాయీనామమునందెను – పెండ్లి సలక్షణముగ జరిగినది. పయనమైనారు ధూప్ గ్రామమునకు తరలి పోయిరి. శ్రీ సాయీబాబా మాత్రము – తిరిగిపోక అందేయుండెను. భక్తరక్షణాపరతంత్రుడగు 'శ్రీ సాయి – నాటినుండి షిర్డీ నిలయుడు.

శ్రీ సాయీ నామస్మరణ, సర్వపాపహరము, సకలార్థసాధకము– సాయికిప్రణమిల్లుదము –

"ఓంనమో శ్రీసాయి"

# 2 వ అధ్యాయము

భగవంతునిలీల లతిచిత్రములు. ఇది సంభవమా? ఇదెట్లు కాగలదు? అదెట్లు జరిగినది? అను ప్రశ్నలకు అర్థముండదు. అనుమానములతో అన్నిటికినీ కారణసిద్ధాంతమున ఋజువు చూపుమని, ఆందోళన చెందువారిని, ఋజుమార్గమున దెచ్చుటకే దయాసముద్రుడగు దైవము వారల అహంభావమునుకూడ మన్నించి, తనలీలల ప్రదర్శించును. తన భక్తులకు తగినతీరున దారిచూపి, భగవాను డనుగ్రహించును. కొందరు దేవాలయముల కట్టించియూ, ప్రతిష్టల చేయించియూ, ధర్మసత్రముల నిర్మించియూ తరింపుచున్నారు–మరికొందరు, తీర్థయాత్రల జేసియూ, పుణ్యక్షేత్రముల దర్శించియూ, భక్తి కలిగియున్నారు–ఇంకనూ కొందరు భగవత్కథా కాలక్షేపములతో, గాన నృత్యాదులతో, సేవింపుచున్నారు. ఇతరులు కొందరు భగవత్కథల రచించి, ధన్యత నొందుచున్నారు. ఎందరో భగవంతుని కథలవిని, తనివిదీర నామసంకీర్తన మొనరించి తృప్తినొందుచున్నారు. ఎంద రెన్ని విధముల తన్ను సేవించిననూ, సర్వసముడగు ఆ పరమాత్మ, అందరనూ, అన్ని విధముల పాలింపుచునే యున్నాడు. అట్టి భగవంతుని లీలా విశేషముల రచించిననూ, పఠించిననూ, కీర్తించిననూ, విన్ననూకూడ తరింపగలము. అన్నియూ ఆ పరమాత్ముని అనుగ్రహమున అబ్బగలవేగాని, ఇందెవ్వరి ప్రజ్ఞయూ ఏమియు లేదు.

ఫకీరు – బాబాగా, సాయి బాబాగా, షిర్డీనిలయుడుగా, షిర్డీయందుచేరినట్లు, వెనుకటి అధ్యాయమున తెలిపియుంటిని. ఈ షిర్డీ ఒకచిన్నపల్లె. ఇది బొంబాయి రాష్ట్రమున, అహమ్మద్‌నగర్ జిల్లాయందలి కోపర్గామ్ తాలూకాలోనిది. 'దోండ్' నుండి, మన్మాడ్ పోవు రైలుమార్గములో, కోపర్గామ్, స్టేషను ఉన్నది. ఆస్టేషన్ నుండి 9 మైళ్ళు టాంగాలో పయనముసాగించినచో, కోపర్గాముపట్టణము చేరగలము. కోపర్గామునకు, తూర్పున పవిత్రగోదావరినది ప్రవహింపుచున్నది. ఆనదిఒడ్డునే శ్రీ దత్తాత్రేయులవారి ఆలయమున్నది. యాత్రికులు సామాన్యముగ, గోదావరియందు స్నానముచేసి, దత్తాత్రేయుల

వారిని దర్శించి, షిర్డీకిపోవుట అలవాటు. కోపర్గామునుండి షిర్డీకిరోడ్డు కలదు. 'షిర్డీ', అహమ్మద్ నగరమునుండి, మన్మాడ్‌కుపోవు మార్గములో రోడ్డుకు ప్రక్కనయున్నది. మన్మాడ్ నుండియూ, నగర్ నుండియూ, మోటారుబస్సులుకూడా కలవు. కోపర్గాముపట్టణము వదలిన వెంటనే, గోదావరినదిని దాటవలసియున్నది. ఆతరువాత9మైళ్లుపోయినపిదప, నీమ్‌గాన్, అనుపట్టణముచేరుదుము. అక్కడనుండియే, 'షిర్డీ'- శ్రీసాయీశుని జండా మనము చూడగలము. తరువాత3 మైళ్ళలోపున, 'షిర్డీ' యున్నది. మొన్నమొన్ననే 'షిర్డీ' సంస్థానమువారు, కోపర్గాము స్టేషనునుండి, నేరుగా షిర్డీకికూడా, యాత్రికుల సౌకర్యము నిమిత్తం బస్సులను ఏర్పాటుచేసియున్నారు. ఆంధ్రప్రదేశమునుండి పోవు యాత్రికులు, గుంతకల్లుచేరి, అచ్చటనుండి బొంబాయిమార్గమునగాని, లేదా శికింద్రాబాదుచేరి అటనుండి మన్మాడుమార్గమున గాని 'షిర్డీ' చేరవచ్చును. గుంతకల్లుమార్గమున పోవునెడల, మధ్యలో కురుద్వాడి స్టేషనునందు దిగి, పండరీపురముపోయి, పండరీనాథునిగూడా సేవించుకొనుటకు అవకాశము ఉన్నది.

'బాబా'కు 'సాయీ' అని నామమిడిన మహాల్సాపతి మహాభక్తుడు, జ్ఞానియుకూడ. తొలి దర్శనముతోడనే, బాబా, భగవదవతారమని గుర్తించెను. భక్తిమీర బాబాను సేవించెను. తనతోపాటు 'బాబా'ను, ఖండోబా దేవాలయమునకు గొంపోయి, అచ్చట ఆనందముతో ఉభయులూ గంటలతరబడి అల్లే కూర్చుండెడివారు. బాబా, వేషమున ఫకీరువలె నుండెను. దీనికితోడు ఎల్లప్పుడూ 'అల్లా మాలిక్' అనుచుండెడివాడు, ఆ కారణమున షిర్డీయందలి హిందువులు బాబా, మహమ్మదీయుడని భ్రమపడిరి. బాబా, ఖండోబా దేవాలయము నందుండుట వారికి ఇష్టము లేకపోయినది. ఆ కారణమున, మహాల్సాపతి వేసుచేయునదిలేక, చెరువలో పడిపోయి శిథిలావస్థయందున్న మశీదునందు ఉండుమని బాబాను, బ్రతిమాలెను. బాబా కూడ అందులకు అంగీకరించి ఆ మశీదునందే మకాముపెట్టెను. ఆపాడుబడిన మశీదే, నేటి ద్వారకమాయి. బాబా, ప్రతిరోజు గృహస్థుల

ఇండ్లకడ మాధూకరభిక్షము తెచ్చుకొనువాడు. ఆ మాధూకరభిక్షమైననూ, అయిదు ఇండ్లవద్ద మాత్రమే. చేతనొక రేకుడబ్బా, భుజమున నొక జోలె, చిన్న దండము, చిలుముగొట్టము. ఇదియే సాయికిగల ఆస్తి. ఉదారస్వభావులగు గృహిణులు, పెట్టుఅన్నము, కూర, పులుసు, అన్ని పదార్థములు, విచక్షణలేక సమిష్టిగా కలిపి తెచ్చి, ఖండోబా దేవాలయ సమీపమున నొక మట్టిపాత్రయందుంచి, బాబా భుజించెడివాడు. అప్పుడు అచ్చటిచేరు కుక్కలు, కాకులు, ఇతర జంతువులుకూడ అందుండి స్వేచ్ఛగా తోచినంత పుచ్చుకొనెడివి. బాబా కాదని కొట్టెడివాడుకాడు. ఆ ఆహారమున్న పాత్రకు మూతయుండెడిదికాదు. కుక్కలు ముట్టెలతో కెలికి తినెడివి. బాబా, అసహ్యపడుటగాని, వానిని అదలించుటగాని, ఎన్నడూ జరుగలేదు. బాబాకు, రుచి భేదములేదు. జిహ్వాచాపలము లేదు—సహ్యాసహ్యాములు లేవు. ఇది కొందరకు ఏవగింపు కలిగించినది. మరికొందరకు జ్ఞానోదయ మొనరించినది. ఆహారముదొరకనిచో, విచారములేదు— ఆ ఆలోచనయే ఉండెడిదిగాదు. సర్వరక్షకుడగు—శ్రీ సాయికి – భేదాభేదములు లేవు. సాయికి సృష్టిఅంతయూ సమానమే.

బాబా ఆమశీదునందల్లేయుండెను. మహల్సాపతి మాత్రము ప్రతిరోజు, బాబాను దర్శించితీరెడివాడు. బాబానుచూడకయుండుట ఆయనకు అసాధ్యము. బాబాను సందర్శించని నాడు అతనికంతయూ చీకటియే. మొదట మొదట, బాబా, వ్యాధిపీడితులకు, ఆకులుపసరులూ, యిచ్చి వారలబాధలు తొలగింపుచుండెను. ఆ కారణమున పేదప్రజ లనేకులు, బాబానుదర్శించి, తమవ్యాధుల నివృత్తిచేసుకొనుచుండిరి. 'బాబా' గొప్పహకీమని ప్రచారముసాగెను. జన్మ జన్మాంతరముల నుండి కల్గిన దుర్గతులను తొలగింపగల, ఈ హకీమునకిదియొక లెక్కయా ?

ఆ శిథిలమైన మశీదునందే. బాబా ప్రతిరోజును తైలము తెచ్చి దీపముల వెలిగించెడివాడు. 'షిర్డీ' యందలివర్తకులు ఒకరోజున బాబాకు తైలమునీయరైరి. బాబా, వారలపై కోపింపలేదు. చిరునగవుతో తిరిగివచ్చి మశీదుచేరెను. సూర్యాస్తమయమైనది. చీకటి తొంగి

చూచినది. ఈ పిచ్చిఫకీరు ఏమిచేయునో చూతమని, అజ్ఞానులగు ఆ వర్తకులు, పొంచి చూచుచుండిరి. బాబా, నిశ్చింతతో ప్రమిదలలో నీరుపోసి, దీపములవెలిగించెను. పూర్వముకన్న రెట్టింపుకాంతితో దివ్వెలు కళకళలాడు చుండెను. ఆవర్తకుల అజ్ఞానమును చీకటిని పోద్రోల, ఆదివ్యజ్యోతి తనకాంతిని వారలపై ప్రసరింపజేసినది. అంధకారము తొలగిపోవ, ఆ వర్తకులకు భక్తిఅబ్బినది. 'ఫకీరు' - పిచ్చివాడుకాడు, మహాశక్తిసంపన్నుడని గోచరించినది. ముస్లిమను అనుమానమునడలిపోయినది. వెంటనే, క్షమింపుమని 'బాబా' పాదములపైబడిరి. నాటినుండివారు, బాబాభక్తులు. ఈవార్త ఊరంతయూ ప్రాకినది. ప్రక్కగ్రామములకు తెలిసినది. ప్రజలు 'బాబా'ను దర్శించుటకు రామొదలిడిరి.

'బాబా'-ఆ మసీదునందే, హోమగుండము నొకటి సాగించెను. దానిని 'ధుని' అందురు. అందలి అగ్ని అహోరాత్రములు జ్వాలింపవలసినదే. ఆ 'ధుని' నేటికిని అట్లే వెలుగుచున్నది. అందలి భస్మమే సర్వార్థ సాధకమగు 'ఊధి'. బాబా ఆనతిచే, తులసీమాత ప్రతిష్ఠింప బడినది. ఉన్నది మశీదు - దుస్తులా ఫకీరువలె-వైదికవిధి, నిరంతరాగ్ని - హోమము - ఎదుట తులసీమాత - ఇదియే 'బాబా' యందలి ప్రత్యేకత. సర్వమత సామరస్యము-విశ్వమానవప్రేమ-ఈ రెండును ముఖ్యసూత్రములు. హిందువులు బాబాను, తమ మతాచారములకు ఉచితమగురీతిని, భగవంతుడని సేవింపుచుండిరి. ముస్లిములు-ఆ మసీదునందే, తమ మతాచారముల ప్రకారము-బాబాను, 'పీరు' - అని ఆరాధింపుచుండిరి. ఇదియే పరమార్థము. హిందువుల కొక దేవుడు, మహమ్మదీయుల కింకొకడు ఉండునా? ఏకమేవ, అద్వితీయం-బ్రహ్మ-అన్నిమతముల తెల్పు పరమసత్యమిదియే. అయినను, మాత్సర్యమున మతకలహాదులు తప్పుట లేదు. ఆ కారణమున నే-బాబా రూపమున భగవంతు డవతరించెనేమో ?

హిందూమత సాంప్రదాయములతో 'బాబా'ను అర్చించుట, ముస్లిములు చూడలేకుండిరి. ఒకనాడు వారందరూ సమావేశమై

హిందువులను, మసీదుగడప ఎక్కనీయమని ప్రతినపూనిరి. సాయుధులై సంసిద్ధులై, మశీదుకడ చేరిరి. సర్వజ్ఞుడగు 'బాబా'కు తెలియని దేమున్నది? మహాల్సాపతి, మామూలువలె బాబాను పూజించుటకు మశీదుకు వచ్చెను. ముస్లిములు, ఒక్కుమ్మడి మహాల్సాపతిపై బడిరి- భక్తివిశేషమే ఇది-హింసకు వెనుతీయునా? భగవంతుని సేవించు భాగ్యము కలిగిన భక్తున కిది ఏమిలెక్క? మహాల్సాపతి వెనుకాడలేదు. చిరునగవుతో 'బాబా' చూచుచుండెను. మహాల్సాపతిని కర్రతో బలముగా కొట్టిరి. కాని మహాల్సాపతికి ఎట్టిబాధయూ కలుగలేదు-బాబా మాత్రము-అబ్బాయని కేకపెట్టెను. తిరిగి కర్రలాడుచున్నవి. మూఢులగు ముస్లిముల కేమి తెలియును? బాబా, ఇక ఆగలేదు. ఉవ్వెత్తున లేచి, కన్నులెర్రచేసి-ఆ-అని అరచెను. ఆ కర్రలక్కే ఆగిపోయెను. బాబాను వారెవ్వరు తేరిచూడలేకుండిరి. మహాల్సాపతి ఒక్కపరుగున, బాబాపాదముల వ్రాలెను. బాబా ముస్లిములను తనవద్దకు పిలచెను. బాబా వీపుపై బలమగుగాయము, శరీరముపగిలి రక్తము కారుచుండెను. 'కఫ్నీ' తొలగించి, వారికి గాయము చూపెను. సోదరులారా! ఏమి మీవెర్రి? నే నెవ్వరు? మీ రెవ్వరు? మహాల్సాపతి ఎవ్వరు? మీరు కొట్టినదెవ్వరిని? మహాల్సాపతి ఒంటిపై దెబ్బలేదే? నేను మీ పీరునను నమ్మకమేనా మీ పిచ్చికి కారణము? నన్ను కొట్టుటయేనా మీభక్తి- ఇదియేనా నాపై మీ ప్రేమ? అందరమూ ఒక్కటికాదా? మనమందరము సోదరులము-భేదభావమేల? ఎన్నడూ ఇట్లు చేయకుడు. ఎవ్వరికి తోచినవిధమున వారు వారికినచ్చిన పేరుతో భగవంతుని ఆరాధించుకొనుడు. మీరు చేయుపూజలు, మీరు పిలుచు పేరులూ - మాకు నచ్చుటలేదు - మేము చేయువిధముననే మీరునూ చేయుడను నిర్బంధమేల? అట్లనతగదు. మీ రెన్ని పేర్లు మార్చిననూ, భగవంతు డొక్కడే. మీ రేరీతి పూజించినూ అందుకొనునది-ఆ దయామయుడే-మీకీ వివాదము ఏల? మనకందరకును ప్రాణాధారమగు 'నీరు' మీరు పేరుమార్చి చెప్పినమాత్రమున మారుచున్నదా? ముస్లిములు 'పానీ', అన్నదా నీరునుకాదా? హిందువులు నీరు అన్నమాత్రమున ముస్లిములు కాదని పోరాడవలసిన దేనా? మీరీ అహంకారమును

వదలి, అన్నదమ్ములవలె మెలగవలసినది, అని తండ్రివలె బుజ్జగించి బోధించెను.

మరియొకప్పుడు, ముస్లిముభక్తుడొకడు, తన మతానుసారము అయిదు వేళల, బాబా ఎదుట ఎలుగెత్తి ప్రార్థన చేయుచుండెను. హిందువులు కొందరది అల్లరిగా యున్నదని భావించిరి. ఓపికతో కొన్నిరోజులు సహించిరి. కాని, ఉడుకురక్తముగల యువకులు కొందరు, బాబా వినుచుండగనే, ఆ ముస్లిమునుద్దేసించి-ఆపుము నీజాతర, ఇచ్చట ప్రార్థన చేయవలయునుగాని అల్లరి చేయరాదు అనిగద్దించి పైకి పోయిరి. బాబా వెంటనే లేచి, ఆగుడు-భగవంతుని ప్రార్ధన మీకు అల్లరిగానున్నదా? నాకెట్టిఅభ్యంతరము లేని తరి మీ ఆగడమేమి, అనిగద్దించెను. అంతట యువకులు, క్షమింపుమని బాబా పాదములంటిరి. తలలెత్తి చూచుసరికి, బాబా లేడు, ఆసనము శూన్యమైయుండెను. వారికేమియు దిక్కుతోచలేదు,-భయభ్రాంతులై ఎలుగెత్తి, బాబాను కీర్తించిరి,

ఆవో - బాబా - ఆవో -ఆవో,
దరిశన దేవో - బాబా - ఆవో - ఆవో -
తన దరిశన దేవో -బాబా -ఆవో-బాబాఆవో సాయీ-
గోసాయి రూపధారీ, - ఆవో - ఆవో - ఆవో -

అని వేడుకొనిరి. భక్తపరాధీనుడగు భగవదవతారము కావున యథారీతి, బాబా - ఆసనముం దగపడెను. భక్తి, సంభ్రమము లుట్టిపడ, హిందువులు, ముస్లిములు, బాబాబిడ్డలై, అన్నదమ్ములై, ఆనందమున బాబాపదసేవజేసిరి. బాబాభక్త పరాధీనుడు, తలచిన దర్శనమిచ్చు దయాస్వరూపుడు-అట్టి శ్రీ సాయికి ప్రణమిల్లుదము-

"ఓం నమో శ్రీ సాయి"

# 3 వ అధ్యాయము

ధర్మము వెనుకబడి, అధర్మము హెచ్చుపెరిగి, భక్తిభావము పెడత్రోవబట్టి, మత్సరము రేకెత్తినపుడు, భగవంతుడు, తనంతతాను అవుసరమగు అవతారము దాల్చగలడు. అట్టి అవతారమే సమర్థ సద్గురుడగు శ్రీ సాయినాథుడు. ఎప్పు డెట్టి రూప మవుసరమో, ఏ విషయమున తన లీలలు ప్రదర్శింపవలెనో, ఆ పరమాత్మునకే ఎరుక. ఆ కారణముచేతనే లీలామానుష విగ్రహుడై తనలీలలుచూపుట, అవి మనకు చిత్రముగా నుండును. విశ్వసించుటకు కూడ వీలు లేనంత చిత్రములు, కాకయున్నవో, పసితనమున శ్రీకృష్ణపరమాత్మ మన్ను తినెనన్న నెపముతో యశోద దండింపబోనేల, ఆబుడుతడు నోరు తెరచి పదునాల్గు భువనములు, ఆ చిరునోట చూపనేల! తానుభగవత్స్వరూపమని నిరూపించుటకు, భక్తిభావము వృద్ధిపొందుటకు కాదా!

షోడశ కళాప్రపూర్ణమగు అవతారములయందు శ్రీరామ, శ్రీకృష్ణఅవతారములు ముఖ్యములు. శ్రీరాముని భగవంతుడని భక్తులు గ్రహించి సేవించిరేకాని— తానుభగవంతుడని— రామచంద్రమూర్తి తన అవతారకాలమున, శంఖుచక్రములతో దర్శనమిచ్చినది విసము. కాని కృష్ణపరమాత్మ అట్లుకాదు. పుట్టుక యేచతుర్భుజములతో— శంఖుచక్ర గదా లాంఛనములతో - పిదప పసిపాపడై నోటచతుర్భువనములను చూపెను. ఎన్నోమార్లు తానే భగవంతుడనని చెప్పుటయే గాక, విశ్వరూప సందర్శనమిచ్చెను. ఇందుకు కారణములు మన మూహింప పనిలేదు. అది ఆ అవతారధారికే ఎరుక. కాని ఒక్కవిషయము మాత్రము విస్పష్టము.

## కలియుగమునకు గడపముందు కృష్ణావతారము

అన్నివిధముల తానే భగవంతుడనని, కృష్ణపరమాత్మ హెచ్చరించి బోధించిననూ, విశ్వరూప సందర్శనమిచ్చిననూ, రానున్న కలి జాడలు,నీడలు, నాటికే తలలెత్తినవి. అహంకార స్వరూపులు, అహంభావ సమన్వితులగు దుర్యోధనాదులకు, అట్టికృష్ణపరమాత్మ ,మాయా

విగా మాంత్రికునుగా– గారడీడుగా– కనపడునేగాని, పరమాత్మస్వరూపమును నమ్మకము వారికి కుదరలేదు. అనుమానమే వెంటాడెను. స్వయంశక్తిచే, సర్వము నిర్వహించెదమను మాత్సర్యమేవారలవంచించినది. ఆనాడే అట్లుండ, పరిపూర్ణముగా కలియుగాధిపతియై, విలాసముగ శ్వేతాశ్వముపై విహరించు ఈనాడు, మనలో అవిశ్వాసము అహంకారము ఆవరించియుండుటలో విపరీతమేమున్నది? శ్రీకృష్ణావతారముననే, భగవానుడు తాను దాల్చిన వెనుకటి రామావతారరూపమున, భక్తులకు దర్శన మిచ్చినట్లగపడుచున్నది. పరమభక్తశిఖామణియగు, శ్రీఆంజనేయుని కోర్కెమన్నింప, శ్రీరామమూర్తియై – సీతామహాలక్ష్మితో కొలువుదీర్చి, దర్శన మిచ్చినట్లునూ, కృష్ణకర్ణామృతముతమున, యశోదాదేవి జోలపాడుసమయమున రామావతారదర్శనము ప్రసాదించినట్లునూ, తెలియగలము. ఇక ఏ అవతారమునందునూ, ఇట్టిగాధలవినము.

సాధురూపమునవున్ననూ, శ్రీసాయి సర్వ సర్వంసహా చక్రవర్తి సంపూర్ణమగు భగవదవతారము. నాడు "ఖోజాకరు" నకు, దత్తజయంతిరోజున, త్రిమూర్త్యాత్మకమగు దత్తమూర్తియై, దర్శనమిచ్చినట్లు చూచితిమి. అంతేగాదు, బాబా–తాను రామ కృష్ణ, శివ,మరుత్యాది రూపములతో–'నానా'కు దర్శనమిచ్చెను.

నానా–సర్కారు ఉద్యోగి, తహసీల్‌దారు పదవియందుండెను. ప్రత్యేకించి బాబా– నానా– చూడవలెనని, నానాకు,అప్పాకులకర్ణిద్వారా కబురంపెను. కాని నానా రాలేదు. పదే పదే కబురు తెచ్చినందులకు, కులకర్ణిపై కోపపడెను. ఏమైననేమి, బాబా భక్తులరక్షించుటయే పనిగా అవతరించిన కారణమున– నానా బాబాదర్శనమునకు రాకతప్పినదిగాదు. నాడు, నానా వేసినప్రశ్నలు, పడ్డ అవస్థ కొంత గమనింతము. నానా–ఉన్నతోద్యోగి– ఈసాయీ పిచ్చిగోసాయి, ఏవో చమత్కారముల చేసినగారడీడు – తాను ఉన్నత వంశజుడు – సాయిముస్లిముఫకీరు– తానువిద్యావంతుడు–సాయిసామాన్యగోసాయి ఈసాయివద్దకు తానేలపోవలెను? మాయాశక్తులుగల ఈగారడీసాయి తన్నేమైనచేయునేమో? తన గౌరవమున కెంతలోటు! చూచినవా



శ్రీ రామకృష్ణ శివ మారుతి దత్తస్వరూప సాయి.

లేమనుకొందురో! నవ్వుదురేమో! ఆ గోసాయివద్దకు చేతులు కట్టుకొని పోవుటయా—తన కేమిపని;—రానని ఖండితముగాచెప్పెను. మనమందరము సామాన్యముగాపడుఅవస్థనందే నానా కూడపడెను. కానిపూర్వజన్మసుకృతము — భగవదనుగ్రహము — పూర్ణముగా నుండుటచే బాబా దర్శన మతని కబ్బినది.

నానా—బాబానుచూడగనే— స్వామీ! నన్నేల పిలిపించితిరి? అన్నదేమొదటిప్రశ్న. ప్రశాంతముగా—బాబా—నానాను— ఉచితాసనమునగూర్చుండనియమించి, చిరునగవుతో—నానా ఏల ఈ తత్తరపాటు, ప్రపంచమున ఎందరులేరు— ప్రత్యేకించి నీకై కబురంపితినే— ఇతరుల పిలిపించితినా—కారణములేకయే కబురంపితి ననియా — ఆయాస పడకుము. నానా— నీవెరుగకపోవచ్చును, గత మూడుజన్మలనుండి, మనకిరువురకును సంబంధమున్నది. అర్థమగుటలేదా! నిన్ను చూడక నే నెట్లుండగలను— నేను కోరిన రాక నీవెట్లు తప్పించుకొనగలవు? — ఇంకనూ సందేహమా? చూడుము అని—బాబా—భక్త రక్షణ పరతంత్ర మగు, తనహస్తములతో, నానా నేత్రములతాకెను. అప్పుడనుభవించిన ఆ పరమానందము నానాకే ఎరుక. గతమూడుజన్మముల గాథ కళ్ళకుకట్టినట్లుండెను. నానాకు ఏమియు తోచలేదు.

"ఇదినిజమా— మాయయా — గారడీయా" అను సందియమాతని బాధింపుచుండెను. సర్వాంతర్యామియగు శ్రీసాయికి తెలియనిదేమున్నది. వెంటనే శ్రీసాయి "నానా — ఇంకనూ సంశయము తీరనే లేదా—నేనెవ్వరు—ఇటుచూడుము" అని తన వామహస్తము నెత్తెను. జన్మజన్మాంతరములు తపమాచరించిననూ లభ్యముగాని దివ్యమూర్తుల దర్శనము, ఏకకాలమున లభించినది. నానా ఎంతటిధన్యుడు — బాబా ఎంతదయామయుడు. నానాపైచూపిన కరుణయందు, సహస్రాంశమైననూ, మనకు 'బాబా'ప్రసాదించుగాక యనిప్రార్థింతము.

నానా చూచినదేమి - దివ్య తేజోమూర్తియగు శ్రీసాయి—శ్రీరామ— శ్రీకృష్ణ— శివ— మారుతి రూపములతో, ప్రసన్నుడై దర్శనమిచ్చెను. నానా తనకన్నులను తాను నమ్మలేకుండెను. అపారమగు ఆనందము— తన్మయత— తానెక్కడ నున్నది తనకు తెలియుటలేదు.

కన్నులవెంట సంతతధారగా నీరు కారుచుండెను. ఒడలంతయూ పులకరించినది-తన్మయత్వముతో-బాబా బాబా బాబా-అనిగానము చేసెను-బాబా పాదముల పై వ్రాలెను. బాబా సాదరముగ నానాను కౌగలించుకొనెను -సుఖాసీనునిచేసెను, ఆహా! భక్తులయెడ భగవంతుని కెంతటి ప్రేమ! పులకితగాత్రుడైన నానా అమరసుఖ మనుభవించుచుండెను, నానాకుఅహంభావ మంతరించినది. అధికారగర్వ మడుగంటినది. విద్యావంతుడను, విజ్ఞానవంతుడను, అను అజ్ఞానము తొలగిపోయినది, భగవంతుని సన్నిధిన, భక్తుడై జ్ఞానోదయమైనది. నాటినుండి, నానా బాబాకు మేటిభక్తుడు, బాబా— నానాకు దైవము.

బాబాసమక్షమున నానా, మహదానందము నొందుసమయమున, ముస్లీము దంపతులు — బాబాను దర్శింపవచ్చిరి. ఆ ముస్లీము యువతి యవ్వనవతి, బంగారువన్నె శరీరము. చీనిచీనాంబరములధరించి, తొణికిసలాడు అందమును, మరుగుపరచు మేలిముసుగుతో 'బాబా' పాదములకు నమస్కరించెను. గాలికి మేలిముసుగుజారెను. మెరపువలె మేనికాంతి మెరసినది.

నానాకు వెంటనే మతిచలించినది. దైవస్వరూపుడగు, 'బాబా' సన్నిధినగూడ, బాబాకు అంతకూర్చు భక్తునికి, అందమగు ఆ స్త్రీ ముఖసందర్శన మాత్రమున, చాపల్యమేర్పడినది. దృష్టినిగిడ్చి అస్త్రీ నానాచూచుచుండెను. 'బాబా' వెంటనే గ్రహించి, నానాను వీపుపై తట్టెను. నానాకు తనతప్పు తెలిసినది. సిగ్గుపడెను. ఇంతలో ముస్లీము దంపతులు మశీదువదలి వెళ్ళిరి. నానా పసివానివలె కంటనీరుకార్చుచు బాబా పాదములపైబడెను. తండ్రీ! నీసన్నిధినగూడ ఇట్టి అజ్ఞానమా— ఇట్టిచాపల్యమా— కరుణింపుము'' అని బ్రతిమాలెను. ''బిడ్డా-భయము లేదు— భగవంతుడిచ్చినకన్నులు— వాటివిధినవి నిర్వర్తింపవలసిన దే— చూచుటతప్పుకాదు. కానిబుద్ధిపెడత్రోవపట్టరాదు. అందమగుగులాబీ పుష్పమును— అందరమును చూచుచున్నాము, ఆనందిపుచున్నాము. అట్టిఆనందమునిచ్చు ఆగులాబీపూవు తోడిమసముండున్నవి. అందమని మనమనుభవింపచూచు ప్రతివస్తువునకూ ఇంతే— మనమానందింపవలసినది, భగవంతునిసృష్టియందలి అందమునుచూచి. అంతేగాని ఇతర

భ్రమలకు తాళియున్నాడు. ఆ యవనయువతిని, సోదరిగ భావించి, ఆనందింపవలసియున్నది. అంతయూ ఆ భగవంతునిరూపమని, మనసుకుదిరిన నాడు మరియొక దురాలోచన మనతలదూరదు. మతిచలించుట కష్టజనకానేముండునా? స్వేచ్ఛగా మరల ఆ యువతిని చూడుము. నీకెట్టి బుద్ధిచాపల్యమైన కలుగునేమో చూతము" అని ఆ యవన దంపతుల పిలిపించి తనసమక్షమున కూర్చుండ నియమించెను. బాబా, తన చేతితో నానా కన్నుల తాకెను. నానా ఆ యవనయువతిని చూడనే లేదు. ఆ యువతికి బదులు బాబా అట ఆసీనులై యుండెను. ఏవైపు చూచిననూ 'బాబా' అంతయూ 'బాబా' మయము. ఉన్మత్తునివలె, నానాఎలుగెత్తి,

"అక్కడబాబా-ఇక్కడ బాబా - ఎక్కడ చూచిన బాబా బాబా మయమీజగతి! జయ సాయీమయమే జగమూ" అనినృత్యము సేయ మొదలిడెను.

నిస్సంశయముగా, బాబా అవతారధారియే. భగవంతుడగు బాబాకు ప్రణమిల్లుదము.

"ఓం నమో శ్రీసాయి"

## ప్రభూ సాయీశా!

బాబా! గోసాయి రూపధారి! నీలీల లెవ్వారి కెరుక తండ్రీ. సర్వదా నీనామమే నాకుశరణ్యము, జాగ్రదవస్థయందేగాదు. నిద్రావస్థయందుకూడ నీనామము మరువకుండ అనుగ్రహింపుమయ్యా.

ప్రభూ; సాయీశా! నీముద్దు బిడ్డలలో ఒకడనుగాకపోవుట; అది నాదురదృష్టము. కర్మానుబద్ధమైన నేను నిన్నేల నిష్ఠురములాడవలె. పదే పదే నిన్నారాధించి, నీదయకు పాత్రుడ నగుటకేగా నాఆర్తత. అందుకుకూడ, నేను అశక్తుడనే. పూర్వజన్మ పుణ్యావశమున క్రమ మార్గమునుండి, నిన్నెరుంగువారికి, నీసాయముతో ఏమిపని, వారిని పెడమార్గమున పడకుండ, గమనించుటయేగా నీ బాధ్యత. కాని అట్టి అదృష్టము లేక, నీవునాదరినున్ననూ, నిన్నుగుర్తింప అసమర్థ

కేనై, సత్యవస్తువగు నిన్ను తెలియక, నిరంతరము, ఉదరపోషణకై నియమముల వదలి నిస్సారమగు సంసారముకొరకు, అసహజముగ గూడ ప్రవర్తించుటకు వెనుదీయని, నావంటి అజ్ఞానుల, ఆదరించి కాదనక కరుణించి, కాపాడుటకు కాదా సీయీ అవతారము.

ఇంతవల తండ్రీ, నిన్ను ఉచితరీతి ప్రార్థించు, విధానముగూడ ఎరుగని పరమమూఢుడను. పవిత్రమగు నీపద సేవాభాగ్యము లభ్యమగునట్లు దయసేయుమనియే, నామొర. అంధకారముచే అవరింపబడి అలమటించునన్ను, భ్రమపెట్టక, దయచూపి, దారి చూపుమనియే నా ప్రార్థన. వెలుగుచూపి, కాపాడుకరుణామూర్తివి. ఎట్లుగాపాడెదవో!

"ఓంనమో శ్రీసాయి"

# 4వ అధ్యాయము

వ్యాధి పీడితులెందరో బాబాను దర్శించి, నివృత్తి పొంది పోవుచుండిరి. బాబా తాకినంతనే కుష్టుపోయినది. కన్నులు తుడిచి నంతమాత్రమున గ్రుడ్డివారలకు దృష్టికల్గినది. అంగవైకల్యముగల వారికి ఆకారతతీరి సౌష్టవ మేర్పడినది. శ్రీసాయి ఆ వచ్చెడివార నందరను అతి ప్రేమతో ఆదరించెడివాడు. దీనికి తోడు ఉన్నతోద్యోగి, విద్యాధికుడు అగు 'నానా' బాబా భక్తుడైనంతనే, అతని మిత్రులనేకులు బాబాను దర్శించిరి. ఎవ్వరెట్టి ఆపదయందున్ననూ సర్వసమర్థుడగు సాయిని సేవింపుమనియే 'నానా' సలహా. రోజులు గడచినకొలది, షిర్డీనాధుని సేవింపబోవు భక్తుల సంఖ్య పెరుగు చుండెను. బాబా మహత్మ్యము, భక్తవత్సలత దూరప్రదేశములకు కూడ ప్రాకినది. దాసగణు అను పండరీనాధుని భక్తుడు, సాయీశుని మహిమల విని, శ్రీసాయిని దర్శింప 'షిర్డీ' చేరెను. ఈ 'దాసగణు' ఇప్పటికినీ షిర్డీకి సమీపమున ఆశ్రమము నిర్మించుకొని, బాబా పద ధ్యానముతో మహాజ్ఞానియైయున్నాడు. షిర్డీయందు జరుగు శ్రీరామ నవమి ఉత్సవములు నేటికిని ఈ మహాభక్తుని ఆధ్వర్యమున నే జరుగు చున్నవి.

బాబాయందొక ప్రత్యేకత యున్నది. తన భక్తుల తానే ఎన్నుకొందున నెను. అట్లే ఎంతదూరమందున్నను ఏదో ఒక మిషపైన తన భక్తుల తనవంక కీడ్చెడివాడు. ఇప్పటికినీ అట్లే ఆకర్షించు చున్నాడు. ఇది భక్తులకు అనుభవసిద్ధము. దాసగణు సామాన్య పోలీసు ఉద్యోగి. ఈతడు బాబాను దర్శించినప్పుడు, సాయి ఈతని నుద్దేంచి, 'దాసగణా — నీకీ పోలీసు నౌకరి ఏల, ఇచ్చటనే ఏల ఉండ రాదు'అని కోరెను. కాని దాసగణు మాత్రము, తాను సబ్ ఇన్స్పెక్టరు అయిన తరువాత చేరెదనని తెలిపెను. బాబా అనుగ్రహమున, ఆతని కా ఉద్యోగము కొలదిరోజులలో లభించినది. కాని బాబాకు తానిచ్చినమాట మరచి దాసగణు, ఉద్యోగమందలి వ్యామోహమున అట్లే అంటిపెట్టుకొని యుండెను. తరువాత దాసగణు బాబా దర్శన మునకై షిర్డీ చేరినాడు. బాబా, సాదరముగ గణూ, ఇన్స్పెక్టరయిన తరువాత, ఉద్యోగమునుండి విరమించెదనంటివే? అని హెచ్చరించెను. ఆతనికి మాత్రము ఆ ఉద్యోగమందలి అపేక్ష వదలలేదు. అది గమనించి బాబా ఇట్లనెను."గణూ నీవు బుద్ధిపూర్వకముగా ఈ ఉద్యోగము వదలలేకుంటివి. సరి నీవెట్లు దీని నంటిపెట్టుకుందువో చూచెదముతే" దాసగణు ఆవుద్యోగముతో అంతరింపవలసిన వాడుకాడు. దయాసముద్రుడగు శ్రీసాయి అతనికి, శాశ్వత ఆనందపదవి సమకూర్ప సంకల్పించెను. బాబానుకాదని ఆతడా ఉద్యోగమున ఎట్లుండగలడు? దాసగణుతన ఉద్యోగధర్మమును అతినిపుణతతో నెరవేర్చుచుండెను. ఉద్యోగధర్మమున గ్రామాంతరముపోయెను. చోరీనేరమందలి విలువగల వస్తువులుకొన్ని. 'స్టేషను' యందగపడలేదు. అంతట దాసగణుపై నేర మారోపింపబడి విచారణ ప్రారంభమైనది. ఈ ఇన్స్పెక్టరుగారికి శిక్షతప్పనట్లు ధృవపడినది. తాను నిర్దోషినని ఎన్నివిధముల మొరపెట్టుకొనినను వినువారు లేరైరి. వేరుచేయునదిలేక దాసగణు ఉద్యోగమునకు రాజీనామానిచ్చి షిర్డీ చేరినాడు. నాటినుండి ఈ దాసగణుకు బాబాపాదసేవ, బాబానామసంకీర్తనతప్ప ఇతర ఉద్యోగమేమియూ లేదు. ఉద్యోగముపై వాంఛకూడా అంతరించినది. గురుకృపకు పాత్రుడైన ఈపూజ్యుని, మనము నేటికిని దర్శింపవచ్చును. 70 వత్సర

ములు పైబడినను, శ్రమయనక, ఈతడిప్పటికినీ షిర్డీకివచ్చి ఉత్స వములయందు పాల్గొనుచున్నాడు. బాబాను చూచుభాగ్యము మనకు కలుగలేదు. బాబాకరుణకు పాత్రుడై, బాబాను, భగవంతునిగ, సగుణునిగ, నిర్గుణునిగ, ఆరాధించి భగవద్దర్శనముఅబ్బిన, ఈమహాభక్తుని దర్శనమైననూ లభించుట మనభాగ్యమే.

శ్రీదాసగణు మహారాజు, బాబాకుకూర్చు భక్తులలో ఒకడు. ఈతడు శ్రీసాయినాధుని స్తుతింపుచూ, కీర్తనల రచించి, హరికథారూపమున తానే గ్రామములవెంట సంచారము చేయుచూ, స్వయముగా హరికథలచెప్పుచూ వచ్చెను. శ్రావ్యమగుకంఠము, బాబా అనుగ్రహము పూర్ణముగా యున్నందున – చక్కనికవిత్వము అబ్బినందున, అందరి నాకర్షించెడివాడు. నానాటికి, బొంబాయిరాష్ట్రమున మాత్రమేగాక, ఇతర రాష్ట్రములకు కూడా, బాబా మహిమలు తెలిసినవి. ఆర్తులెందరో బాబానుచేరి సఫలమనోరథు లగుచుండిరి.

దాసగణు మొదటి నుండియూ, పండరినాధుని సేవించెడివాడు. తరచు తను, విఠలుని చూడవలెనని, పండరిపోవుటకు అనుజ్ఞనిమ్మని, బాబాను ప్రతిమాలెడివాడు. ఒకనాడు ఉదయమున బాబాను చేరి ఈభక్తుడు, ప్రభూ పండరిపోవలసియున్నది. నాకేమియూ తోచుట లేదు. అదేలనో, నీసన్నిధి వదలి పోలేకుంటిని, సెలవిండని బాధింప జొచ్చెను. అంతట బాబా నవ్వుచూ 'గణూ! వి ఠ లు ని సేవించుటకు పండరి పోవలెనా? ఆవిఠలుడు పండరిపురమునతప్ప మరెచ్చటనూ లేడా? విఠల్–ఇచ్చట ఈ ద్వారకమాయి యందున్నాడు. బాధపడెదవేల ? నామసప్తాహ మొనరింపుము' నీవు నీ విఠలుని, ఇక్కడనే చూడగలవు. అని ఆనతిచ్చెను. అంతటదాసగణు, బాబా, మీరన్నది నిజమే, గాని నావిఠలుని నాకిచ్చటనే చూపెదనని తాము వాగ్దాన మియ్యవలసినది. అట్లయిన నేను నామసప్తాహము సంతోషముగా చేసెదనని బ్రతిమాలెను. భక్తరక్షణపర తంత్రమగు తనహస్తముతో, బాబా, అతనిని తాకి, 'బిడ్డా! భయపడకుము, నీవిఠలుడునీకు ఇక్కడనే దర్శనమీయ గలడు, వేరుగ పండరికిపోనేల, ఇదిగోపండరి. నిశ్చలముగ నామసప్తాహ మొనరింపుమని ఆశీర్వదించెను. దాసగణు తదేకదీక్షతో నామ

సప్తాహ మొనరించి, బాబాను దర్శింప ద్వారకామాయి చేరి, బాబా! నా పం డ రి నా థు ని నాకుచూపుము. తాము తెల్పినట్లు నాసప్తాహ మొనరించితిని. సాయీశా! నీవు సత్యవాదివి, మోసము సేయకుము. నాపండరినాథుని నాకుచూపుమని పాదములపై బడెను. తలఎత్తి చూచుసరికి, ఆసనముపై బాబా లేడు – పండరీనాథుడగు విఠలుడు రుక్మా సమేతముగ దర్శనమిచ్చెను. దాసగణు ధన్యుడు – కన్నుల పండువుగ పండరినాథుని దర్శించెను – అచేతన విగ్రహముగాదు – చైతన్యమూర్తి – తనివిదీర పాదములొత్తెను, పులకితగాత్రుడై రుద్ధ కంఠముతో – బాబా –

పండరీనాథా – బాబా – జయ
షిర్డీనిలయా – శ్రీరంగా –
బాబా విఠలుడు – విఠలుడె బాబా –
జయజయవిఠల్ – సాయివిఠల్ –
జయజయవిఠల్ – సాయీవిఠల్ –

అని భక్తిమీర కీర్తించెను. తిరుగ చూచుసరికి కఫ్నీధారియగు బాబాదర్శనమైనది, అంతట బాబా! బిడ్డా! విఠలుడు వేరెక్కడనో యుండెననియా? నీ విఠలుడు నీకగపడెనా! నీవు చూచి సేవించితివా! విఠలుడు ఎక్కడనుండి వచ్చునని నీయూహ? బాబా అయిన ఈ 5 అడుగుల ఫకీరు, ఈ కఫ్నీ ధరించిన ఈ 5 అడుగుల శరీరమేనని భ్రమ పడకుము—— విఠలుడను నేనే—— కృష్ణుడను నేనే—— ప్రపంచ మందలి సర్వప్రాణికోటియూ నేనుగా ఎరుంగుము. భక్తిమీర నీవెప్పుడుకోరిన అప్పుడు ఆ విధమున దర్శనమీయగలను, భయపడకు మని అభయమిచ్చెను.

మరొకప్పుడు, దాసగణు, తాను ప్రయాగకుపోయి, అచట పవిత్ర యమునా, గంగల స్నానమాడవలయునని తహతహతో బాబాను సమీపించెను. దాసగణు తనకోర్కెను తెలుపకమునుపే శ్రీసాయి ప్రక్కనున్న భక్తులతో ఇట్లు పలికెను. గంగాస్నానము అవశ్యము చేయవలసినదే కాని గంగకై ప్రయాగ పోవలెనా? ద్వారకమాయియే ప్రయాగ, —— ఇదియే ద్వారక,

ఇదియేపండరి — ఇన్నిదినములిక్కడ నుండియూ, ఈసాయి, మీరు చూచు, ఈశరీరమేనన్న భ్రమయే మీకుపోలేదు — గంగాస్నానమునకు ప్రయాగపోనేల ? యమునాగంగలు, ఈ ద్వారకమాయియందున్నవి—భక్తికలిగి విశ్వాసముతో కోరిన, గంగాస్రవంతి ఇక్కడనేకలదు. విశ్వాసము లేనివాడు, ప్రయాగయందునూ లేదు — అనినంతలో దాసగణు చకితుడై, సిగ్గుపడి, 'నాడునాతండ్రి, పండరీనాధుడై నన్ననుగ్రహించిననూ, నాకీమహాత్మ్యముపోలేదు— నేనెట్టి అంధుడను, అని పరితపించి, 'బాబా! అనుగ్రహింపు మని; బాబాపాదముల వ్రాలెను. ఇతరుల కిదేమియునూ అర్థముకాలేదు. కాని అందరూ చూచుచుండగనే దాసగణు శిరము, బాబాపాదములు తాకినంతనే బాబాపాదముల నుండి. గంగాయమునా తీర్థములు ప్రవహించినవి.

'బిడ్డలారా ! ఇవిగో యమునా గంగలు, తనివితీర, తీర్థముగొని తరింపుడు—మహాత్మ్యము వదలి ఈసాయియే సర్వమని గ్రహింపుడు. ఈసాయియే రాముడు — ఈసాయియే కృష్ణుడు, విఠలుడు, దత్తమూర్తి. ఈ ప్రపంచమందలి సాధులందరూ నేనే— నేనే మహాలక్ష్మిని— నేనే అనసూయాదేవిని—ఈ పరమార్థమును తెలియుడు, భ్రమపడకుడు— నన్నాశ్రయించినవారికి భయములేదు — యీ ద్వారకమాయియందడుగిడిన ప్రతిజీవియూ తరింపవలసినదే — ఇది నాయాజ్ఞ' అని సాదరముగ తెలిపెను.

బాబా సర్వాంతర్యామి, బాబా ప్రత్యేకించి ఎవ్వరికినీఏమియునూ ఉపదేశించుటగాని, ఉపన్యసించుటగాని చేయలేదు. అంతర్యామి అయిన కారణమున శ్రీసాయి, భక్తులు అడుగకయే, ఇతర సంభాషణలలో వారలసంశయములకు తగుసమాధాన మిచ్చెడివాడు. అట్టిబాబానుదర్శించి, సేవించి, భాషించిననారు ఎంతధన్యులు. బాబాకన్న వేరుదైవము లేడు. ఇన్నివిధముల నిదర్శనపూర్వకముగ, భగవంతుడనుగ్రహించిననూ, బాబా, భగవదవతారమా, అని శంకించు బుద్ధిమంతుల ఆదయాసముద్రుడే అనుగ్రహించుగాక. ఇందునుగురించి వాదోపవాదములు, వ్యర్థములు. ఇప్పటికినీ మనఅదృష్టమున శ్రీదాసగణుసజీవుడే. ఇదినిజమా, కథమా, అని అనుమానించు మహనీయులు, శ్రీదాసగణు

మహారాజును దర్శించి, తమ శంకల తీర్చుకొనవచ్చును. శ్రీ సాయి నాడుకాదు నేడుకూడ భక్తు డే రూపమునకోరి ధ్యానించిన ఆ రూప మున దర్శన మీయగలడు. ఇందుకు సందియము లేదు. అట్టి శ్రీ సాయికి ప్రణమిల్లుదము.

"ఓం నమో శ్రీ సాయి"

శ్రీ సాయీ!

ప్రభూ! పరమాత్మస్వరూపా! నీ పాదపద్మములకు వినమ్రుడను. భక్తపాలనకై నీ వీతీరున నరుడవై జన్మించితివి. నమ్మికమీర నిన్ను సేవించువారు ధన్యులు. అవ్వారికి ఇష్టకామ్యార్థసిద్ధి చేకూరుచున్నది. మాయామానుష విగ్రహుడవునూ, మాయాతీతుడవును అగు నీ లీల లద్భుతములు. అదెట్లు కాగలదు—ఇదెట్లు జరిగినది; అని తర్కముల దిగువారికి దరీ ద్రోవలేక దిక్కుతోచదు. ప్రపంచమంతయూ నీవ. శుష్కకాష్టము మొదలు సృష్టిఅంతయూ నీ స్వరూపమే— అన్నిటి యందు నీవు నిండియున్ననూ, నిన్ను కనలేరీప్రజ—నీవు లేనిదెయ్యెడ? నీవే స్థావరజంగమాది వికారంబులుగా ఏర్పడి సర్వవ్యాపివై యుంటివి. ప్రమిదెలు, భాండములు, మూకుడులు, ముంతలు మొదలగు రూపము లెన్ని దాల్చినను అన్నిటి కాధారమెట్లు మృత్తికయో, అట్లే అన్నిటికి గారణవస్తువు నీవయై, రూపభేదమున వర్తింపుచుంటివి. కాని ఇట్టివస్తు వులలో కొన్నిటియందు మమత, మరికొన్నిటియందు అసహ్యత, ప్రేరే పించుచుంటివే! నగ లెన్నిరూపము లొందిననూ, బంగారము కాకుం డునా? బాబా! అన్నిటి కాధారము నీవె యయ్యూ ఆకాశమువలె దేనికి అంటక, చరింపుచుంటివి.

భక్తిపాశములగాని నీవు కట్టుబడవు. సర్వము నీ ప్రేరితమని, అన్నింటి కాధారము నీవేయని, నమ్మి సేవించువారికి, వేవిధముల తోడ్పడుచూ, అడుగడుగునా అగుపడుచుందువు. అట్టి విశ్వాస మబ్బుటకు, భక్తి అలవరచుకొనుటకు అనంతములగు అభ్యంతరముల కల్పించితివే! నీ వనుగ్రహింపకయున్న, వానిని తరించి, నిపాదముల యందు నిశ్చల ధ్యానమునూ, అచంచలభక్తియూ కలిగియుండుట మూఢమానవులమగు — మా కది సాధ్యమా తండ్రీ

నీవు త్రిమూర్త్యాత్మకుడవు, గురుచరిత్ర కథనమునూ శ్రవణమునూ, సర్వార్థసాధనములు. గురుచరణములు, ప్రపంచమందలి పుణ్యతీర్థములపట్టు – గురుసందర్శనము, త్రిమూర్తుల దర్శనము – గురుసంస్తుతి, భగవన్నుతి – గురునామస్మరణ, తారకనామ జపము – గురుకరుణవలన సర్వమూ సులభసాధ్యము. నీవు సద్గురుడవు – అందునూ సమర్థ సద్గురుడవు. నీ నామస్మరణకన్న మాకు వేరు మార్గమున్నదా బాబా! నీవు దయాస్వరూపుడవే, ప్రేమావతారమవే, స్వార్థమనునది లేని త్యాగమూర్తివే, యోగివిధమున చరించితివే సాయీశా! నీవు స్థూలదేహమున చరింపుచూ, నీభక్తుల నీ వాదరింపుతరి నిన్ను జూచు భాగ్యమునకు నోచనైతిని. నీ ఖ్యాతి పలుభంగుల లోకులకు వ్యక్తమగుట, ఖ్యాతి విశ్రుతులగు ఆతురులు నిన్న నేకభంగుల ఆవరించి, సంతసించెదరని, కలికల్మష మెరిగిన నీవు అంతర్థానమగుటయే మంచిదని భక్తకోటిని బుజ్జగించి తనువు చాలించితివి.

ప్రభూ! అజ్ఞానమున నీ వగపడవని, నే భ్రమియుట తప్పు. కారణజన్ముడవు, ఇచ్ఛామాత్ర శరీరుడవు – అనంతుడవు – నీ కంతమేమిటి పరాత్పరా! ఆదిగురువునూ, జగద్గురువునూ, అగు సమర్థ సద్గురుడవు – నీవే నా గురుడవు – నీవే నా దైవము – నీవే నా సర్వస్వము – నీ నామాక్షరములే నాకు మంత్రము, నీ దర్శనముకొరకే నా తపన – నీ పాదార్చనమే నా పని – నీ దయాదృక్కులే నాకమృతము – దీనాతిదీనుడను – జపతపము లెరుగని జడుడను. సాయీరామ్ – సాయీరామ్ – అను నీ నామస్మరణమే నాకు శరణ్యము – నీవు సత్యవాదివి – స్మృతిమాత్ర ప్రసన్నుడవు – నన్ను పేక్షింపుచుంటివా ప్రభూ! ఇది నీ బిరుదమునకు కళంకము.

అల్పజ్ఞుండనగు నాకు, నిర్గుణబ్రహ్మంబు, ధ్యానగమ్యంబుగాని కారణమున, నీ ప్రతిమార్చన మొనరింపు చుంటిని. నీవుదత్తాత్రేయ స్వరూపమని నీ చరిత్ర చెప్పుచున్నది. విషయరజ్జువులు నన్నిటు నటు త్రోయకుండ, నీ పదధ్యానమున, నాదు మనము లగ్నమై, నిలకడ నొంద, నన్ననుగ్రహింపుము తండ్రీ బాబా! నీ వెన్ని వెతల బెట్టిననూ, నిన్ను విడువను, నీవ నాగతి, నీవ నాత్రోవ—"ఓం నమో శ్రీ సాయి"

# 5 వ అధ్యాయము

"కలవెన్నేనియు ఆర్తభక్త జనరక్షాదక్ష దీక్షాత్తమం
గలమే (శ్రీ) పరమేశరూపములు లక్షల్, గాని నాయట్టి పా
పులు వానిని దరిజేర, జంకుదురు, నీవోసర్వ సౌలభ్యమం
గళరూపుండవటం చెరింతిని, రంగా! సాయినాథ ప్రభో"

బాబా! సర్వాంతర్యామి షిర్డీయందున్నట్లు, సామాన్యులగు మన కగపడునేగాని, తనభక్తు లెక్కడనున్న బాబా అక్కడనే యుండును. ఎంత దూరమందున్ననూ, ఏమిచేయుచున్ననూ, బాబాకు తెలియనిది లేదు. భక్తుల వెంటనంటి, కంటికి రెప్పవలె కాపాడు చుండును. భక్తరక్షణయే పనిగా, బాబా రూపమున, భగవంతుడవత రించినాడు. నానా, సర్కారు ఉద్యోగియని, మన మెరుగుదుము. వేసవి కాలమున నానా గ్రామాంతరముల మకాము వెళ్ళెను. హరిశ్చంద్ర గుట్ట యను ప్రదేశమున పర్యటన మొనరింపు చుండెను. అచ్చట ఆ ప్రదేశమంతయూ, కొండలు, గుట్టలతో నిండియుండెను. అంతయూ రాళ్ళమయము. పైకిపోవు సరికి, మధ్యాహ్నమయ్యెను. మండు వేసవి, వేడిగాడ్పులు - చెట్ల నీడన బండలుకూడ వెచ్చగా కాగిపోయినవి - 'నానా', తిరిగి తిరిగి, డస్సిపోయెను. వెంటనౌకరు మాత్రము ఉండెను. విపరీతముగ దాహమైనది. త్రాగుటకు గుక్కెడు నీరు లేదు - ఆ ప్రదేశమంతయూ వెతకిననూ, ఎచ్చటనూ నీటిజాడ అగపడలేదు - విశ్రాంతి తీసుకొనుటకు ఆచ్ఛాదన లేదు - నానాకు గాళ్ళు లాగుచుండెను. అడుగు తీసి అడుగు బెట్టుటకు కూడ శక్తినశిం చినది. అంతటి బలగముండియూ, ఉద్యోగముండియూ, ఊడిగము సేయు సేవకులుండియూ, ఇంటిపట్టున పరుపులపై పవ్వళించి సుఖమనుభ వించు, ఈ భాగ్యశాలి - దిక్కుమాలి, అప్పుడా అర్ధాన్నపు టడవిలో, హరిశ్చంద్రగుట్టపై, అసువులు పోవునట్లుండెను. అంతవరకు 'నానా'కు బాబా విషయమే జ్ఞప్తికిరాలేదు. ధైర్యము సడలినది - బల ముడిగినది - భయమావహించినది - లావుడిగిన గజేంద్రునివలె, బాబా, బాబా, అని కేకలిడెను. బాబా! నీవున్న నాకీఅవస్థలేదుకదా.

నా తండ్రీ! నాడు నాకు రామకృష్ణ, మరుత్యాది రూపములతో దర్శన మిచ్చితివే. నే నెచ్చట నున్ననూ, నా యోగక్షేమముల విచారించెద నంటివే, గతమూడు జన్మలనుండి నేనునీవాడనంటివే! ప్రభూ! ఏల నాకీదురవస్థ – నీవే భగవంతుడవని నమ్మితినే, బాబా! నేనిట్లు, గుక్కెడు నీరులేక, దాహమున తపించి, దహించి, చావవలసిన దేనా! ఇదేనా నీ యందలి భక్తికి ఫలితము? తండ్రీ నీవుగాక నా కింక దిక్కెవ్వరు? నా మొర వినబడుట లేదా, ఎందున్నావు తండ్రీ, నా బాబా, బాబా, బాబా—

సాయపడి కాపాడవలసిన సమయమిదేరా ॥బాబా॥
నీవేసాయపడి కాపాడవలసిన సమయమిదేగా,
ఆధారమునీవేగా – బాబా – కాపాడవలసిన సామిని నీవేగా ॥బాబా॥

వ్యవధిలేదురా! బాబా – వేగిరపడి రారా!
ప్రభూ! భారమునీదేరా – ప్రభూ! పాదసేవకుడగా
దాహముతోనిటు తపియించుచునే దహించుకు పోనేలా॥
వ్యవధిలేదురా – సాయీ – వేగిరపడిరారా
సాయపడి కాపాడవలసిన స్వామివి నీవేగా ॥బాబా॥

నా తండ్రీ! సాయీశా! నా అపచారములను మన్నింపుము – నీ ఇచ్చవచ్చినట్లొనరింపుము. సాయీ – దాహము–దాహము – దా హా ము – అని ప్రక్క కొరిగెను.

అదేసమయమున షిర్డీయందు తాత్యా, మహల్సాపతి, దీక్షితు మొదలగు భక్తులు బాబాను సేవింపుచుండిరి. ఉన్నట్లుండి దాహము–దాహము – దా–హా–ము ప్రాణములు పోవునట్లున్నవి అనుచూ బాబా లేచినాడు. కన్నులవెంట నీరుకార్చుచూ, మశీదునుండి బయటకు పరువెత్తెను. ప్రక్కనున్న మహల్సాపతి లోటాలో నీరుగొని వెంటనంపెను. కాని బాబా, ఆ నీటిని తాకనైన తాకలేదు. నానా–నానా–అని వెర్రికేకపెట్టి, ఒక్కక్షణమట్లుండి తిరుగవచ్చి ఆసనమున కూర్చుండెను. ప్రక్కనున్నవారికి ఇదేమియూ అర్థముకాలేదు.

నానా, ప్రక్కకొదిగి కన్నులు మూసినంతనే, నడివయస్సున యున్న భిల్లుడొక్కడు ప్రత్యక్షమయ్యెను. భిల్లుడు-బాబూ - బాబూ- అని నానాను పిలచెను. నానా కళ్ళు తెరచి చూచినాడు. 'అలసినట్లున్నారు, మీరు కూర్చున్న బండక్రిందనే మంచినీరున్నది. తనివితీర దాహము తీర్చుకొనుడు. ఎన్నడూ ఇట్టి ప్రమాదకరమగు ప్రయాణముల సేయకుడు." అన్నంతలో నానా ఆత్రముతో బండప్రక్కన చూచెను. బుడ బుడమని నీరు ప్రవహింపుచుండెను. నానా రెండు చేతుల నీరెత్తి త్రాగినాడు. తానదివరకా ప్రదేశమంతయూ వెతకినదే అప్పుడు నీరులేదు? ఇప్పుడీ నీరెక్కడనుండి వచ్చినది. బాబాయే తన మొరవిని, భిల్లుని రూపమున దర్శనమిచ్చి తన్నాదరించెనని, నానా గ్రహించెను. వెనుతిరిగి చూచినాడు. కాని ఆ భిల్లుడేడీ! - అదృశ్యుడయ్యెను. నానా, పిచ్చివానివలె బాబా-బాబా, అని కేకలిడుచూ, మార్గమున ముండ్లు రాళ్లుగూడ గమనింపక పరువిడుచుండెను. నౌకరు వెంటపరుగెత్త మొదలిడెను. నౌకరుపెట్టు కేకలు, నానాకు వినబడుట లేదు. గాని ఏడీ ఆ భిల్లుడు, ఎంతవెతకినను జాడదొరుకలేదు. 'బాబా! నేనెంతటి అజ్ఞానిని, నీకై నీవు నన్ను కాపాడ వచ్చినప్పుడుకూడ, నిన్నెరుంగలేకపోతిని. ప్రభూ! నీ వెంతటి దయామయుడవు. నాకై భిల్ల రూపము ధరించితిరా! తండ్రీ నీ భక్తులపై నీకెంతటిప్రేమ అని నానా కన్నులతడియొత్తెను. ఎప్పుడు నాతండ్రిని దర్శింతునా అన్న ఆత్రముతో నానా ఇల్లు చేరెను. మూడవరోజు ఉదయము 'షిర్డీ' చేరినాడు. అప్పటి కప్పుడే దీక్షిత్, మహల్సాపతి, ఇతరభక్తులు, మశీదునందు, దర్బారులో బాబాను సేవింపుచుండిరి.

పరుగుపరుగున, నానా మశీదు చేరెను. నానా ఇంకనూ పెదవులు తెరచి మాటాడలేదు. దీక్షితుతో, బాబా యిట్లనెను. 'ఈ నానా, విద్యావంతుడు, మండుటెండలో, హరిశ్చంద్ర గుట్టపై మకామా! నేను పోకున్నచో, ఈ సరికి ఏమైయుండెడివాడో! ఈ మాటలు నానా గ్రహించినాడు, బాబా పదములపై వాలెను - పసివానివలె, వెక్కి వెక్కి ఏడ్చెను. బాబా పదములనుండి నానా తల ఎత్తలేదు - పదే పదే తనచేతులతో, బాబాను ఆ పాదమస్తకము

నిముసు చుండెను. బిడ్డా భయములేదు," నాభక్తులను నేనుగాక వేరె వ్వారు రక్షింతురు. మీరెక్కడనున్ననూ, నేను మీ వెంటనే యుందును. పిలచిన పలికెదను, తలచిన దరిశనమిత్తును. భక్తుల రక్షించుటయే నాపని, నిశ్చింతగా ఉండు"డని, బాబాఅభయ మిచ్చెను భక్త పరాధీనుడు, బాబా - భక్తసులభుడు శ్రీ సాయి - శ్రీ సాయికి ప్రణమిల్లుదము.

"ఓం నమో శ్రీ సాయి"

# 6 వ అధ్యాయము

" 'యోగము' 'యోగమంచని' ధనోన్నతిచే నది యోగమా నె దు
ర్యోగముగాక; నీదు పదయుగ్మమునం దనయంబు భక్తి సం
యోగముపొంది, చిత్తము మహోన్నతశాంతిని గాంచుటొక్కటే
యోగము; 'రాజయోగ' మననొప్పు జగంబుల సాయిసద్గురూ"

బాబా భక్తపరాధీనుడు, బాబా అనుగ్రహమునకు పాత్రుల మైతిమా మనకిక భయములేదు. యోగక్షేమంవహామ్యహం, అని అభయమిచ్చు తండ్రి అండనుండ మనకు కొదువ ఏమున్నది. భక్తి వలనగాని బాబా అనుగ్రహమును పొందజాలము. అందుకు సాధన ఎల్లప్పుడూ, ఏమిచేయుచున్ననూ సాయిరామ్ - సాయిరామ్ అని బాబా నామము మననము చేయుటయే.

1904 – 1905 సంవత్సరములో నానా కాందేషి జిల్లాలోని జామ్నరు నందు మమల్తదారుగా యుండెను. ఈ పట్టణము షిర్డీకి 100 మైళ్ళకు పైగా దూరమున్నది. నానా కుమార్తె మీనాబాయి. ఈమెకు నవమాసములు నిండి ప్రసవించు రోజులు వచ్చెను. అదియే మొదటి కానుపు. నొప్పులగపడెను. మూడురోజు లట్లే గడచినవి.

ప్రమాదమని భావింపబడినది. ఘనవైద్యు లెందరో ఉండియూ ఏమియూ చేయజాలకుండిరి. అధికారమందున్న నానాకు వైద్య సహాయమున కేమికొదువ. జిల్లా సర్జనుకూడ అచ్చట నేయుండెను. పాపము మీనా బాధ భరింపలేకుండెను. ప్రాణములు పోయిననూ బాగుకదా అని ఏడ్చుచుండెను. ఎందరుండిమాత్రము ఏమిచేయగలరు. చికిత్స లెన్నిచేసినను వీసమైననూ ఉపకరింపలేదు. అప్పుడు నానా ఇతర చికిత్సలేమియు తన కుమార్తెను కాపాడజాలవని గ్రహించెను. బాబా జ్ఞప్తికి వచ్చెను. బాబా ! నీవుగాక నా కుమార్తెను రక్షింప సమర్థులెవరు? నేనెంత పొరబడితిని. నాడు దాహము తీర్చి, ప్రాణ దానము చేసిన నిన్నుమరచి, ఈ వైద్య సహాయ మపేక్షించితిని. తండ్రీ! నా అపచారమును మన్నింపుము — ప్రభూ నా బాధ నీవు గమనించుటలేదా — బిడ్డ పొరబాటొనరించిన తండ్రి దానిని పాటింప నగునా, బాబా – బాబా – నీవే నాశరణ్యము — ఎట్లు కాపాడెదవో అని యెలుగెత్తి ఏడ్చినాడు.

భక్తికలవారికి, బాధలెక్కువ అనుటవాడుక అయినది. చూచుటకు కూడ అట్లెఅగపడును. – ఇదినిజమా ? కాదు ఎన్నటికినీ కాదు – ఇదిఒట్టి భ్రమ. వాస్తవమునకు, కష్టములులేని సుఖజీవి ఈ ప్రపంచమునలేడు, బాబా అన్నివిధముల అను గ్రహించిననూ, నానా, బాబాను తలచినదెప్పుడు ? ఇతర విధములతనకు ఉపయోగము లేదని, భయ మొదవినప్పుడేగా ? – అంతయూ సక్రమముగ సాగిపోవు చున్నంత వరకు – బాబాను తలచెనా, పిలచెనా ? – అంత వరకు మన స్వయంకృషి – మనసమర్థతయూ – అంతటా చెడి, మనము అస మర్థుల మైనప్పుడేగా, భగవంతుని పిలచుట. భగవానుడు, పరమ దయాళువు అయిన గారణముననే, మన ఈ అపచారముల మన్నించి సాయపడుట. కష్ట కాలమున గాని, కాపాడుమని కేకలిడము – ఈ కారణముచేత నే– కష్టములే కనబడి – భక్తులకు కష్టము ఎక్కువ అనుట లోకోక్తి అయినది. ఆ భక్తుల సుఖాను భూతికి కారణమెవ్వరు ? అది గమనింపమేల ! భక్తులమైన కారణముననే, కడకు కష్టకాలమున

భక్తితో బాబాను పిలచిన, బాబా పరుగెత్తివచ్చి కాపాడు చున్నాడు. భక్తి లేనివాడు, బాధలే మిగులును. బయటపడు టెక్కడది. భక్తికలవాడు బాధలందు మాత్రమే భగవంతుని ప్రార్థించునని భ్రమియకుడు. సర్వదా సుఖమొందు సమయమునగూడ అంతయూ ఆయన దయ అనుభావముతోనే ఉండును. కాని ఇతరులకు ఇది గమనింప అవకాశము ఉండదు. ఆ కారణమున బాధలమాత్రమే గుర్తించి, బాధల విషయము మాత్రమే తెలిసికొని భక్తులకు బాధ లెక్కువ అని భ్రమపడుచుందురు. నిజమగు భక్తికలవారు కష్టసుఖ ములతో పనిలేక సమదృష్టితో సర్వమూ భగవత్ప్రసాదితమని వార లనుభవింతురు. ఆ ఆనందము భక్తులకే ఎరుక. ఇతరుల కిది అర్థము గాజాలదు.

మీనా ప్రమాదావస్థయం దుండుటచూచితిమి. నానా, బాబా పటమున కెదుట సాష్టాంగపడి, సాయీ స్మరణ చేయుచుండెను. షిర్డీలో - బాబా దర్బారునం దుండెను. నాడు శుక్రవారము - కాందేష్‌నుండి వచ్చిన భక్తుడు - రాంగిర్ భావు, అను నతడు స్వగ్రామమునకు పోవ సంకల్పించెను. బాపుగిర్‌ను భావూ · అని బాబా ఈతని పిలిచెడివాడు. ఈ భక్తుని పిలచి బాబా భావూ! నీవు జామ్‌నరుకు పో - అచ్చట కొంత తడవుండి నేనిచ్చు 'ఉధీ'ని ఈ చీటీపై వ్రాయబడిన హారతియూ నానాకిచ్చి మరీ పోవలసినది అని చెప్పెను. భావువద్ద సొమ్ము 2-0-0 రెండు రూపాయలు మాత్ర మున్నది. ఆ సొమ్ము జలగామ్ స్టేషనువరకుమాత్రమే సరిపోవును. అక్కడనుండి జాంనర్ ఇంక 30 మైళ్ళదూరమున్నది. టాంగాపై ప్రయాణము. వెంటనే భావు— బాబా! తమ ఆనతి తలదాల్చి అట్లే చేయగలను - గాని నావద్ద సొమ్ము చాలినంతలేదే - అన్నంతలో - బాబా చిరునగవుతో అంతయూ నేనెరుంగుదును - నాఆనతిచొప్పున గదా నీవుపోవుట నీకే భయమేల నీ కెట్టి బాధయూ

కలుగజాలదు- అన్ని ఏర్పాట్లునూ జరుగగలవు—ఆలసింపకుము-బయలు దేరుమని ప్రయాణముచేసి, -ఉధి- పొట్లమునిచ్చి, శ్యామా అను భక్త నిచే కీర్తన చీటిపై వ్రాయించి, ఈ రెంటినీ భావునకిచ్చి పంపెను. బాబా యందు భక్తి విశ్వాసములు కలవాడుగావున, భావు వెనుకాడ లేదు. వెంటనే పయనమై బయలుదేరెను. జలగామ్, స్టేషనులో దిగుసరికి, రాత్రి రెండుగంటలైనది. అప్పటికి భావువద్ద 0-2-0 రెండు అణాలుమాత్రము మిగిలియున్నది. రాత్రిసమయము, సొమ్ములేదు. దిగినప్రయాణీకులు, అప్పటికప్పుడే, గడబిడగా, బాడుగకుబండ్లుకుదుర్చు కుని, సాగిపోవుచుండిరి. బాబా! ఏమిచేయనెంచితివి—నాగతిఏమి—ఈ నిశాసమయమున, ఈ 30 మైళ్లు నడువవలయునా, ఇందులకా నన్నిట్లా జ్ఞాపించి పంపితిరి—అని చతికిలపడెను. ఇంతలో-ఆజానుబాహుడు, తల కొక పాగా—నడుమున పటకా—కాళ్ళకు బూడ్సులు—డవాలుతో, బిళ్ళ బంట్రోతు—ఓఎవరండీ-షిర్డీనుండివచ్చిన బాపుగిరిభావు—ఎవ్వరు? వారె క్కడ, అని కేకలుపెట్టుచూ, భావు-సమీపమునకు వచ్చెను. భావు-సంతోషముతో, బాబాను స్మరించి-ఆ! నేనే, ఎందుకయ్యా, అని ప్రశ్నించెను. వెంటనే ఆనౌకరు, అయ్యా, మమల్తదారు నానాగారు పంపగా వచ్చితిని, దయసేయుడు, ఆలస్యమైనది, క్షమింపుడనుచూ, ప్రక్కనున్న సామానునెత్తుకుని, చక్కనిటాంగాలో నుంచెను. ఉభ యులూ టాంగా నెక్కిరి. టాంగావాడు, బండి పోనిచ్చెను. కుదుపులేక, ఒడలు కదలక, టాంగా వేగముగా పోసాగినది. ముందు బయలుదేరిన బండీలన్నింటినీ, తప్పుకుని, హాయిగా రోడ్డువెంట పోవుచుండిరి. ఉద యముకాక మునుపే, జామ్నర్ సమీపమున కాలువగట్టు చేరిరి. బండి వాడు గుర్రములవిప్పి నీరుత్రావింప బోయెను. రామ్‌గిరి నుద్దేశించి, నౌకరు; స్వామీ రాత్రి తాముఏమియు భుజంచినట్లులేదు శ్రీవారు తమకని ఈఫలహారముల పంపిరి, చెప్పమరచితిని-కాలువయందు మంచి నీరున్నది-భుజింపుడని బ్రతిమాలెను. నౌకరుదుస్తులను పెరిగినగడ్డము, మీసములనుచూచి భావు, అతెడు ముస్లీమనుతలంపుతో వెనుకాడు చుండెను. వెంటనే నౌకరుగ్రహించి అయ్యా నేను హిందువుడనే గారీ వాలా క్షత్రియుడను, సంశయింపకుడు కానిండని మెడనున్న జన్నిదము

తీసిచూపెను. ఇరువురునూ భుజించిరి. తిరుగ ప్రయాణము సాగించిరి. సూర్యోదయమగుసరికి బండి, జామనరు, పట్టణము బయటకు చేరినది. అప్పుడప్పుడే చీకటివదలినది తూర్పుదిశ తెల్లనయ్యెను. భావు లఘుశంక కని, బండిదిగి ప్రక్కకుపోయెను. శంకతీర్చుకుని రోడ్డుపైచూచుసరికి బండిలేదు–బండి కదలిపోయిన చప్పుడైననూలేదు–బండి ముందుకుసాగిపోయినజాడలుగాని చారలుగాని లేవు– వెనుతిరిగిపోయినట్లునూ గుర్తులు లేవు–కనుచూపుమేర, ఎటూబండి కనబడుటలేదు. బండి ఏమైనది? భావున కాశ్చర్యమైనది–ఏమైననేమి, ఊరుచేరినాడు ప్రక్కనేయున్న గ్రామచావిడివద్ద మమల్తదారు–నానాగారియిల్లు జాడ తెలిసికొనినాడు–వారియింటికి చేరినాడు.

అచ్చట రాత్రినిదురలేక, అందరు జాగరణ చేసిరి. పాపము మీనా, బాధకుడస్సిపోయి, దీనముగ మూల్గుచున్నది. ఎవ్వారి మొగము చూచిననూ, బాధనే తెలుపుచున్నది––నానా, విషాదముతో–బాధతో, భయముతో, కన్నులెర్రనై, మొగముజేగురు బారియుండెను, భావు వెంటనే, నానానుదరిశించి, బాబా ఆనతిని ఉధిని, తెచ్చితిని, అని ఉధిపొట్లము నానా కందించెను. పాటవ్రాసిన చీటికూడ నిచ్చెను, నానాకు పోయినప్రాణములు తిరిగివచ్చినవి–– భయముపోయి, భక్తి–ఉత్సాహము తాండవించినది, అందరికినీ, ఆందోళన, అంతరించి ఆనందమే స్ఫురించినది. ఉధిని, మీనా నొసట నుంచి, బాబా నామస్మరణతో, నీటియందుకలిపి త్రావించిరి, నానా, బాబా మందిరమున ఉన్మత్తునివలె, ఎలుగెత్తి పాటపాడ నారంభించెను, రెండునిముసములైనదో లేదో–మీనా ప్రసవించినది–శ్రీసాయీ కరుణాసంజనితుడు–మొగబిడ్డ, కేవు కేవున ఏడ్చినాడు–విషాదముగాక, ఆనందాశ్రువులు రాలినవి, ఒక్కుమ్మడి అందరూ బాబాను, ఏక కంఠముతో కీర్తించిరి.

అంతవరకు, భావువిషయమేమియూ నానా ప్రశ్నింపనేలేదు. అప్పుడు, నానాభావును సమీపించి–భావూ, నాతండ్రినిన్ను పంపెనా? ప్రయాణము సుఖముగ సాగినదా? అనెను. అందుకు భావు, "నానా, తాము బంట్రోతును, బండిని, పంపకయున్నచో, సకాలములో

చేరుట చాలకష్టమయ్యెడిది-బండి ఊరుబయట ఆగినంతలో, లఘుశంక కనిదిగితిని-తిరిగివచ్చుసరికి అక్కడ బండిలేదు-నేను తమ ఇల్లుచేరితిని" అనినంతలో, నానా, ఆశ్చర్యముతో, నేనా, నౌకరిని, బండినీ పంపితినా,- నేనుపంపలేదే- ఓహో బాబా-నాతండ్రీ - నాకొరకై నీవీ చిత్రముచేసితివా! జవానువై ప్రవర్తించితివా, బాబా, బాబా, నాబాబా, అని భోరున ఏడ్చెను. భావుపాదములపై బడెను. అయ్యా నీవెంత అదృష్టశాలివి, బాబా నిన్ను వెంటనంటి వచ్చినాడు, నీకు స్వయముగ ఫలహారములనిచ్చినాడు, బాబా, నాఇంటికేల రావైతివయ్యా - ఊరుబయటనే మాయమైతివే, అవును, ఇన్ని విధముల, నన్ననుగ్రహించు నాదైవమును మరచి, ఇతరచికిత్సల నాశించిన మూఢుడను, ప్రభూ, భక్తబాంధవా, రక్షింపుమని వాపోయెను. ఇది అంతయూ చూచుచుండిన, జిల్లా సర్జన్, ఇతరులునూ, వెనుకాడక, నానాతో బాటు మందిరమున భజనలొనరించి, బాబాకు ప్రణమిల్లిరి.

ఈ బండి ఎక్కడిది? బండివాడెవ్వడు? బిళ్ళబంట్రోతెవ్వరు, బండిలాగుగుఱ్ఱము లెట్లువచ్చినవి? సందేహమేల, బాబాయే అన్నిరూపములు తానైయై భావును జామనరు చేర్చినాడు, భక్తవత్సలుడగు బాబా, యోగక్షేమం వహామ్యహం, అన్న బిరుదును, నేటికిని పాలించుచున్నాడు — సందేహమేల, బాబా భగవంతుడుగాదా, తన్ను నమ్మి సేవించు భక్తులఇంట ఏదో ఒకరూపమున, నేటికిని ప్రసన్నుడుకాగలడ అట్టి బాబాకు ప్రణమిల్లుదము.

కరుణామయా—బాబా
కాపాడగరావా—బాబా
నిన్ను వినాఎవరున్నారు,
నన్నుగనా, కన్నయ్యాబాబా,
అన్నిటికిని నీవేఉన్నావని,
నేనున్నానురా—బాబా॥

"ఓం శ్రీ సాయినాథాయ నమః"

# 7 వ అధ్యాయము

అమ్మక చెల్లి! నీవగు దయారసమేమని చెప్పవచ్చు జి
త్తమ్మున నిన్ దలంచెడి శ్రితప్రకరంబున కెప్పుడెట్లు సా
యమ్మొనరింపగానగునొ యవ్విధిజేతు విచిత్రరీతి ని
న్నమ్మిన వారలెన్నటికి నాశ మెరుంగరు సాయిసద్గురూ!

భక్తులపాలి మందారమై, బాబా తనభక్తులనెట్లు కాపాడు చున్నది చూచితిమి. "నన్నునమ్మి నాపై దృష్టినిలిపి సేవించువారిని నే నెప్పుడునూ మరువను. వారిని రక్షింపు బాధ్యతనాది". అని బాబా అభయ మిచ్చెను. బాబాను స్మరించి భక్తితో ప్రణమిల్లిన మనకిక భయములేదు. మనము ఎంతదూరమున ఉన్ననూ మనల వెన్నంటి కాపాడుచునే యుండును.

దాదాసాహెబ్ కపర్డే, అమరావతి యందుండెడివాడు. పిల్లలాది కుటుంబ మంతయూ బాబా భక్తులు. బాబా భజనలతోనిద్ర, బాబా సంకీర్తనలతో మేల్కొనుట. కపర్డే భార్య తనచిన్న కుమారునితో బాబాను సేవించుటకు షిర్డీ చేరెను. కొన్నినాళ్ళచ్చట బాబాసేవతో ఆనందముగ గడపెను. ఉన్నట్లుండి ఆ పసివానికి ఒడలు తెలియకుండ జ్వరము తగిలినది. పసివాడు పలవరింపు చుండెను. ఒడలు తెలియని ఆ స్థితియందు పలవరింపునప్పుడుకూడ సాయీ స్మరణయే చేయు చుండెను. వానికి జ్వరతీవ్రత హెచ్చినది. దీనికితోడు ఒంటిపై బొబ్బ లగుపడెను. ఆ ప్రాంతమున ప్లేగు హెచ్చుగానుండెను తల్లి తన కుమా రునకు ప్లేగువ్యాధియే నని భయపడినది. బాబా ఆనతిలేనిది 'షిర్డీ, వదలి వెళ్ళుటకు ధైర్యములేదు. అమరావతికి పోవలయునని ఆందోళన హెచ్చయినది. కడకు ధైర్యముచేసి ఆమె ఒకనాటి సాయంసమయ మున 'బాబా' భక్తులతో పచారు చేయునప్పుడు బాబాను సమీా పించెను. బాబా! నాబాధ నీవు గమనించుటలేదా—నీవు భగవంతుడ వని నమ్మి నీసేవకై గదా వచ్చితిని. ఇక్కడ నీవుగాక నాకు నాయను వారెవ్వరున్నారు—తండ్రీ నాబిడ్డడు ప్లేగుతో బాధపడుచున్నాడు. పలవ

రింపుటలోనూ నిన్నే తలంపుచున్నాడు. తాము అనుగ్రహించిన పసివానిని వాని తండ్రికడకు తీసుకపోనెంచితిని. అమరావతికిపోవుటకు అనుమతి నిండ”ని వేడికొనెను. ప్రక్కన తాత్యాకోటే, భాగోజీ, మహాల్సాపతి మొదలుగాగల భక్తులుకూడ యుండిరి. పాపమా తల్లిప్రేమ అట్లనిపించినదేగాని అమరావతి పోయిమాత్ర మామె చేయగలదేమున్నది మొరపెట్టు కోవలస్నిది బాబాకేగా!

బాబా, ఎంతటి దయామయుడు, వెంటనే “అమ్మా! భయమెందులకు, నేనుంటిసిగా అమరావతికి పోనేల? ప్లేగు నీబిడ్డకెక్కడిది- నా భక్తుల భారము మాత్రమేగాదు – బాధలుకూడా నావే నమ్మా, నన్ను నమ్మి సేవించువారి బాధలు నేననుభవింతును, గాకున్న వారిని కాపాడునదెవ్వరు? చూడు తల్లీ” అని కఫ్నీ పైకితీసెను. పొట్టపై కోడిగ్రుడ్లంత బొబ్బలు నాలుగున్నవి. మహాల్సాపతి, ఏమిది బాబా, అని శరీరము తాకెను – బాబా శరీరము జ్వరముతో కాలిపోవుచుండెను. ఆ తల్లి బాబా పాదములపైబడి, నాతండ్రీ! నాకొరకై, ఇట్లు నీవు బాధను అనుభవింపుచుంటివా? నేనెంతటి చపలచిత్తను – ప్రత్యక్షదైవమగు నిన్ను విడచి, అమరావతి చేరనెంచితిని. నా అజ్ఞానమును మన్నించి అనుగ్రహింపుమని వేడుకొనెను. తిరిగి ఆమె మకాము చేరినది – పసివానికి బాధలేదు, పలవరింతలు లేవు. జ్వరము లేదు, హాయిగ నిద్రపోవుచుండెను. మరునాడుదయము బిడ్డతో బాబా దరిశనమునకు మశీదు చేరినది. బిడ్డను బాబా పదములపై నుంచెను. బాబా చిరునగవుతో బిడ్డనుతాకి నొసట ఉధినుంచి ఆశీర్వదించెను.

అది 1910 వ సంవత్సరము. నాడు దీపావళి. బాబా దర్బారునందు భక్తులందరు చేరిరి. సేవకుడు మాధవ్, భక్తుడగు మాధవరావు దేశపాండే, తాత్యా, మొదలగు వారందరూ నుండిరి. బాబా ధునియందలి కట్టెలను లోపలికి నెట్టుచుండెను. ఉన్నట్లుండి బాబా, కట్టెలను సవరించుటకుబదులు గణగణమండెడి ఆ ధునియందు తన చేతినే జొప్పించెను. సామాన్యమానవునకువలెనే బాబా చెయ్యికూడ కమిలినది. ప్రక్కనున్న మాధవరావు, బాబా, ఏమిచేసితివి – ఏమి ఈ వెర్రి-

అగ్నిహోత్రమున కాహుతిగానెంచితిరా; అని బలవంతముగ బాబాను ఈవలకు లాగెను. బాబాకు మాత్రము ఎట్టిబాధయూ అగుపడలేదు – కాని మందహాసముచేయుచూ, 'ఎంతప్రమాదము – బాలుడు బ్రతికినాడు. నే చూడకున్నచో ఈసరికి పాపము, కొలిమియందు కుమిలిపోయెడివాడు'– అనుచు ఆనందమునే చూపెను. అంతియేగాని తనకు చేయి కాలినదన్న తలంపే బాబాకులేదు.

సేవకుడు మాధవ్ – బాబాచేయినిమురుచూ ఏడువనారంభించెను. మాధవరావున కేమియూ అర్థముగాలేదు. బాబా! నీచేయి కాలగా – నీకీఆనందమేల? అని ప్రశ్నించెను. అంతట బాబా, "బిడ్డలారా! నాకుచేయిగాలినదని మీకీబెంగఏల? నాభక్తుడు కమ్మరివాడొకడున్నాడు. అతడు నిరుపేద, అయినమాత్రమేమి, కలకొంచెమే నా ప్రసాదముగనెంచి, తృప్తితో జీవింపుచున్నాడేగాని, ఆశకొలది చేయరాని కార్యములచేయడు, ఇతరుల ఈవిచూచి ఈసుపడడు. అతడుండునది ఇచ్చటకు 300 మైళ్ల దూరమున ఒకచిన్నపల్లె. అతనిభార్య పరమపతివ్రత, సుగుణసంపన్న, ఆమెకుభర్తయేదైవము, భర్తతోడిదే లోకము, భర్తకు సుస్తీగాయున్న కారణమున ఆమెయే కొలిమివద్ద గూర్చుండి తిత్తివేయుచున్నది. పాలుత్రావుచూ పసిబిడ్డ ఆమె ఒడిలో యుండెను. భర్తఆమెను పిలచినాడు–ఆతురతతో ఆమెభర్త పిలుపువిని నంతనే బిడ్డవిషయము మరచి అట్లేలేచినది. ఆపసివాడు నాపరప్రసాది– నాకు కూర్పుభక్తుడు. వాడుకొలిమియందు పడెను – వాడు ఏడ్చుటకు బదులు – బాబాయని నన్ను పిలచినాడు, నాభక్తుని ప్రమాదము చూచుచూ ఊరకుండగలనా ? బిడ్డ అగ్గినిపడకుండ చేయినెట్టిపట్టు కొంటిని – ఆనందముగాదా – బిడ్డ ఎట్టిఅపాయమునూ లేక ఆడుకొనుచున్నాడు" అన్నంతలో, అందరూ, బాబా నీభక్తులయందు నీకెంతటి ప్రేమ, ఎంత మమకారము – ఎంతటి శ్రద్ధ ప్రభూ! వేయికన్నులగాపాడెడు వేల్పువు, నీవులేకున్న మాగతి ఏమికాగలదు. అని బాబా నామ సంకీర్తన మొనరించిరి.

కన్నతల్లికైననూమరవు, ప్రమాదముకలిగినదిగాని, సదాభక్త సంరక్షకుడగు సాయికి, ఎట్టమరపుగాని, ప్రమాదముగానిలేదు. బాబా

సర్వజ్ఞుడు, సర్వాంతర్యామి, తనభక్తుల భారమంతయూ తాను వహించి రక్షించు పరమదయాళువు. ఎక్కడషిర్డీ, ఎక్కడ పల్లెటూరు, 300 మైళ్ల దూరమందున్ననూ, భక్తునిపిలుపు బాబా కందినది. అంతి యేగాదు, భక్తవరదుడగు శ్రీసాయి, షిర్డీనుండియే తనచేయి చాచి, ఆబిడ్డను రక్షించినాడు. నేటికిని ఆర్తితో భక్తితో పిలచి నచో, బాబా పరువిడిరాగలడు, అట్టి శ్రీసాయిని సేవించు భాగ్యము అబ్బుట మన అదృష్టము. భీతివదలి, బాబా సేవయందు మనసునిల్పి తరించెదముగాక.

"ఓం శ్రీ సాయినాధాయ నమః"

# 8 వ అధ్యాయము.

అరయగ నామరూప నిలయంబులు లేక ప్రసాదకాంక్ష స
చ్చరణ సరోజసేవలనుసల్పు శ్రితప్రకరంబునోమ నా
దరమున నామరూపములుదాల్చి స్వలీలజాటుమేటియా
పరమదయాంబురాశి భగవానుడు సాయిప్రసన్నుడయ్యెడున్

సర్వశక్తి యుతుడగు శ్రీసాయి నాడు చాంద్ పటేల్ చూచు చుండగ, సంకల్పమాత్రమున నీరునూ నిప్పును తెచ్చుటచూచితిమి సాధురూపమున భక్తసంరక్షణముజేయ అవతరించిన భగవత్ స్వరూపు నకు అసాధ్యమేమున్నది. బాబా! పంచభూతముల ఆజ్ఞాపించి, భక్తుల కాపాడిన కరుణామయుడు.

షిర్డీ, పల్లెగ్రామమని తెలిసికొంటిమి, అందు ధనవంతులుతక్కువ భక్తి ధనముతో ప్రాకులాడుచూ జీవింపువారే ఎక్కువ. పవలంతయూ పొలములలో పాటుపడి, సాయంత్రమింటికిచేరి సేదతీర్చుకొని సాయీ సందరిశనమొనర్చి సాయీ పదసేవతో కాలముగడుపుచుందురు. అది వర్షకాలము. తమతమవృత్తులకు అనువగుతీరున పాటుబడి ప్రజలింటికి చేరిరి. పయనమొనర్చి డస్సిపోయి భానుడుపశ్చిమాద్రి చేరుచుండెను.

తిరిగివచ్చు తమ తల్లులరాకగని లేగలు అంభాఅని అరచుచుండెను. నీడలు నిడుపలయ్యెను పిట్టలు బారులుతీరి తమతమ నెలవుల చేరుచుండెను. తనతల్లిని చేరబో తరణునిపోజూచి నిడుదలై నీడలు వెంటాడి వెక్కిరించిన కారణమున గాబోలు తిరిగి రేపు నాపసచూపెదనులే, అని కోపగించెనా అన్నట్లు బింబము ఎర్రనయ్యెను. బాబాసేవకుపోవ అతురతతో, పుణ్యాంగనలు పూజాద్రవ్యములతో సిద్ధమైరి. సంధ్యాదీపముల వెలిగించి సాధ్వులు భక్తితో ప్రణమిల్లిరి.

అంతలో గాలిపటములవలె మబ్బులు ఆకాశమునతోచెను. విచిత్రమగు ఆకారములతో మేఘములు పయనము సాగించెను. అనుకొనుచుండగనే అంతయూ అంధకారమయ్యెను. కారుమబ్బులు కమ్మి ఫెళ ఫెళమని ఉరుములు సాగినవి—ప్రళయముగ గాలి తోడై నది బయట ఆడుగు పెట్టుటకు అస్కారములేదు బాబా! నేటికిక నీదర్శన భాగ్యము లేదు—ఇక నేటికి మాకు అంధకారమేనా! అనిభక్తులు వాపోయిరి. ప్రతి ఇంటను బాబా భజనలు సాగినవి—భయమేల వెలుగు చూప నేను ఉంటినిగా అని బాబా అభయమిచ్చెనా అన్నట్లు ఆ అంధకారమును పటాపంచలు చేయుచూ తళ తళ మని మెరపులు మెరసినవి. నిజమగు బాబా వెలుగును చూడలేకగాబోలు ఆమెరపులకు కన్నులు మూసికొనిరి చిటపటమని చినుకులు సాగినవి. చూచుచుండగనే ఏనుగుతొండమువలె కుంభవర్షము—ప్రళయముగ గాలి బొబ్బలిడుచు ఉరుములు షిర్డీ ప్రజలకు దిక్కుతోచలేదు. అంతయూ జలమయమయ్యెను. ఆ పేదప్రజల ఇంటికప్పులు జారునట్లుండె—గోడలు నిలుచునట్లులేదు. ఆపద మ్రొక్కుల దేవులనందరినీ తలచిరి. మశీదు చేరు మార్గము లేదు గాక చేయునదియూలేదు. ఆ అంధకారమున అందరు ఏయింట కాయింట బాబా అండచేరు అతురతతో బయలుదేరి బాబా స్మరణతో మశీదుచేరిరి గ్రామమందలి ప్రజలందరూ ఆబాల గోపాలము మశీదునందె యుండిరి. జనులే అననేల పక్షి సంతానము కూడ బాబా నాశ్రయించినవి. బాబా! నీవు మాకు అండగనుండ ఈ ప్రళయమా! బాబా! నీవుగాక మమ్ముకాపాడువారు ఎవ్వరని ఎలుగెత్తి ప్రార్థించిరి.

బాబా శతకాచేతబట్టి, మశీదు పంచచివరకు వచ్చెను. శతకా నెత్తి ఆకాశమువైపు విసరుచూ, బిగ్గరగా, 'ఆపు నీ తీవ్రత — అపు — ఆపు నీ తీవ్రత, అని ముమ్మారు ఆజ్ఞాపించెను. ఆ మేఘము లేమైనవి— ఆగర్జన లెక్కడ — ఆ మెరపుల కేమిపెరపు? కుంభవర్ష విజృంభణమేదీ— మినుకు మినుకుమని నక్షత్రములు పొడచూపినవి. కొన్నిక్షణములలో చంద్రుడు తొంగిచూచెను. సంక్షోభము లేదు, సంభ్రమమే కల్గినది. మశీదు బాబా నామసంకీర్తనతో మారుమ్రోగినది. పరమాత్మస్వరూపుడగు బాబాచుట్టునూ దివ్యకాంతి ఆవరించినది. ఆ ప్రజల అదృష్టము— అద్భుతమగు ఆలీలలను అనుభవించి కన్నులార దివ్య తేజమునుచూచి ధన్యులైరి. అట్టి అదృష్టము మనకు అబ్బలేదు. నాటి ఆ దృశ్యమును ఊహించియైన తరించెదముగాక.

మరొకప్పుడు, మధ్యాహ్న సమయమున బాబా ధునియందు అగ్ని వ్రేల్చుచుండెను. మంటలు పెరిగి పెరిగి కప్పు నంటుచుండెను. జ్వాలలాగుట లేదు. మశీదునందు అనేకులు భక్తులుండియూ, బాబాకు ఆ విషయము తెలుపుటకు సాహసింపలేదు, నాడు మశీదునందు ప్రమాదము తప్పదన్న భయము, అందర నావరించెను. ఏమిచేయుట కును తోచక మూకీభావమున నుండిరి. బాబా ఇది గమనించెను. శతకాచేకబట్టి, ప్రక్కనున్న స్తంభముపై తట్టుచూ, శాంతింపుము — శాంతింపుము — శాంతింపుము, అని ముమ్మారనెను. జ్వాలలు తగ్గి వచ్చినవి. ధునియందలి కట్టెలేమియూ తరుగలేదు. తిరుగ వేయుచునే యుండిరి. కాని అగ్నిమాత్రము జ్వాలలు పైకిలేచుటలేదు. బాబా ఆజ్ఞకుబద్ధుడై, అగ్నిదేవుడుకూడ అణగిమణగి అట్లేయుండెను. పంచ భూతముల నాజ్ఞాపించి, అరికట్టగల శ్రీసాయి, పరమాత్మస్వరూపి. కారణజన్ముడై మనల కరుణింప, ఈ కలియుగమున మనుజమాత్రుడై మనల పాలింపుచున్నాడు. అట్టి శ్రీ సాయికి ప్రణమిల్లుదము.

"ఓం శ్రీ సాయినాథాయ నమః"

# 9 వ అధ్యాయము

బాబా మహిమలవిని, విద్యాధికులు, ఐశ్వర్యవంతులు, అనేకులు బాబానుసేవింప మొదలిడిరి. బాబా మహిమలయందు నమ్మకములేని వారునూ రామొదలిడిరి. బాబా, భగవంతుడని నమ్మిన భక్తులు తండోప తండములుగ చేరుచుండిరి. పూర్వాచారపరాయణులుగూడ ఎందరో బాబాను దర్శించిన తరువాత, బాబా భగవదవతారమని గుర్తించి, కీర్తించి, సేవించి, తరించి తరలిపోయెడివారు. సంతానము కోరువారు – సౌఖ్యములిమ్మనువారు, వ్యవహారముల తీర్పుమనువారు, ఇతర వ్యధలతీర్పుమనువారు, ఎందరో, పేదప్రజలు, విద్యాగంధమెరుగని విజ్ఞానులు, అనేకులు బాబానుదర్శించి ధన్యతనొందుచుండిరి. ఆవచ్చెడివారలందు, కొందరకు సందియములు లేకపోలేదు – బాబా ఏదోచమత్కారములుచేయు గారడీడను అభిప్రాయము వదలలేదు – బాబా ముస్లిమను భ్రమవిడువలేదు. అట్టివారుకూడ పరమాత్మ స్వరూపమగు, బాబాను దర్శించిన తరువాత మాత్రము, బాబా భగవదవతారము అనునమ్మకముతోనే వెడలెడివారు.

నాసిక్ నివాసి, అగ్నిహోత్ర బ్రాహ్మణుడు – మూలే శాస్త్రి ఈతడు నాలుగు వేదములు సాంగోపాంగముగ అభ్యసించెను. షట్ శాస్త్రముల పాండిత్యముగడించెను. శాస్త్రోక్తముగ, సకలకర్మల నాచరించిన, మహాకర్మిష్టి. సదాచార సంపన్నుడని, మహాపండితుడని గణనకెక్కెను. గురుఘోలప్ నకు ఈతడు ప్రియశిష్యుడు, ఇరువది వత్సరములు, గురువువద్ద శ్రద్ధతో శుశ్రూషచేసి గురుకృపకు పాత్రుడైన అదృష్టశాలి. ఈతని గురువు తనువుచాలించి పదిసంవత్సరములు గడచెను.

బాపూసాహెబ్ బూటే, కోటీశ్వరుడు నాగపూరు వాస్తవ్యుడు. ఈతడు బాబాకుగూర్చు భక్తుడు. తరచు బాబాను సేవింపుచూ, షిర్డీయందుండెడివాడు. ప్రత్యేకించి బాబా ఆనతిననుసరించి మందిర నిర్మాణము చేసెను. ఆచోటిమందిరమే నేటి సమాధిమందిరము. అందునుగురించి విపులముగ మరియొక అధ్యాయమున తెలుపబడును.

ఈ మూలేశాస్త్రి కోటీశ్వరుడగు బూటీ ఆశ్రితుడు. బూటీతో పనికల్గి శాస్త్రి షిర్డీ చేరినాడు. బూటీకు, బాబాను సేవింపుచూ ద్వారకామాయియందుండుటయే ముఖ్యము. బాబా, ముస్లీము ఫకీరని ఈ శాస్త్రి నమ్మకము. ఆ మశీదు ప్రవేశించుటకుగాని, బాబాను దర్శించుటగాని, బాబాకు ప్రణమిల్లుటగాని, శాస్త్రికి మనస్కరించలేదు. తాను స్వచ్ఛమగు అగ్నిహోత్రబ్రాహ్మణుడు. మశీదునందున్న ఈఫకీరునకు ఎట్లు నమస్కరించుట అని బాధపడుచుండెను. కాని బూటీను కలియక తప్పదు. ఆయన ఆమశీదు వదలివచ్చుటలేదు అట్లు రెండురోజులు గడచినవి. బాబా అనుగ్రహించిన కారణమున ఈ శాస్త్రి పుణ్యము పండినది.

ఉదయమున బాబా, లిండితోటకుపోయి తిరిగివచ్చి, ద్వారకమాయియందు దర్బారులోయుండెను. ఆరతియైన తరువాత ఉన్నట్లుండి బాబా, బూటీను ద్దేశించి, బూటీ ఆ నాసిక్ నుండివచ్చిన బ్రాహ్మణుని దక్షిణతోరమ్మని పిలిపింపుము, అనెను. బూటీవెంటనే శాస్త్రివద్దకువెళ్లినాడు. అప్పుడే ఆశాస్త్రి, పీతాంబరముధరించి అర్చనసాగింపుచుండెను. శాస్త్రిని, కోటీశ్వరుడగు బూటీ స్వయముగా పిలచినందున, శాస్త్రి ఆయనమాట కాదనలేక బయలుదేర తప్పినదిగాదు. ఆఘాందసుడట్లే ఆ పీతాంబరముతో, చేతపంచ పాత్రనీరుకొని, గొణుగుకొనుచూ మశీదు చేరినాడు. మశీదుయందడుగిడిన తననిష్టకు భంగమని, మైలపడిపోవుదునన్న భయముతో శాస్త్రి మశీదు మెట్లనైనముట్టక, మొగమటుత్రిప్పక, వేరుచేయునది లేక, బైటనుండియే పుష్పాంజలినిచ్చెను. బాబా చిరునవ్వుతో శాస్త్రిని పలుకరించెను. ముస్లిముతో మాటాడుటకూడ అచారమునకు భంగకరమని, తన అనుష్టానమునకు అభ్యంతరమని, తాను మైలపడిపోవుదునని, పలుకలేదు.

ఆవో బేటా! (రాబిడ్డా) అని బాబా పిలచెను. ఆస్వరము విన్నంతనే, శాస్త్రికి ఒడలు పులకరించినవి, అంతదనుక, మశీదువైపుచూడక పెడమొగముగాయున్న, శాస్త్రి, చటుకున తలఎత్తిచూచెను. ఆసనముపై ముస్లిము వేషధారియగు బాబా లేడు. కుఫ్నీధారిగాడు, గడ్డము, మీసలులేవు. ఊర్ధ్వపుండ్రములతో, శాలువ

వల్లెవాటుతో, రత్నమణిహారములతో, దండకడియములతో, బ్రహ్మ తేజస్సుతో గురుఘోలప్, అచ్చట సుఖాసీనుడై యుండెను. డరోమత్ (భయపడకు-) ఆశీర్వాద్ – (ఆశీర్వాదము) అని గురుదేవుడు సంబోధించెను. ఆకంఠధ్వనియే సందియము లేదు. తాను 20 సంవత్సరములు సేవించిన గురుదేవుడు, ప్రసన్నవదనముతో తన్ను చేరి ఆశీర్వదింపు చుండెను. కాదనియెట్లనగలడు, భ్రమయనుటకు కారణము లేదు – భ్రాంతికాజాలదు. ప్రత్యక్షముగ తనగురుదేవుడే, తన్ను పిలుచు చుండెను. ప్రక్కనున్నవారి రూపములు మారలేదు, దాపునయున్న వస్తువులట్లేయున్నవి, భేదములేదు. దృష్టిలోపము గాజాలదు. బూటి గాని, ఇతరభక్తులుగాని ఏవిధముననూ తత్తరపడుటగాని, ఆశ్చర్య మొందుటగాని లేదు. వారలచ్చట బాబానే చూచుచుండిరి. మిట్ట మధ్యాహ్న సమయము – శాస్త్రికి స్పృహచక్కగనే యున్నది – బుద్ధిమాంద్యముగాదు, శరీరజాడ్యములేదు. పదే పదే పరికించిచూచి నాడు. సందేహము లేదు. తనగురుదేవుడే, పరిపూర్ణముగ కటాక్షించి, తనను పిలుచుచుండెను. శాస్త్రి వెనుకాడలేదు. మశీదన్న మతిపోయినది. ఒక్క పరుగున ఆసనము చేరినాడు, గురుదేవుల చరణముల వ్రాలెను, తనివిదీర సేవించెను. తలనెత్తి చూచుసరికి, ఆసనమున తన గురుదేవుడుగాడు, కఫ్నీధారి శ్రీ సాయినాథుడే సాక్షాత్కరించెను. మందహాసముతో శాస్త్రిని ఆశీర్వదించెను. బాబా సకలసాధువుల స్వరూపమని తెల్లమైనది, శాస్త్రికి సాయీ కరుణవలన జ్ఞానమబ్బినది. శాస్త్రి వెనుకాడలేదు. బాబా భగవంతుని అవతారమని గ్రహించెను. బాబా పాదములపడి తన అజ్ఞానమును మన్నింపమని ప్రార్థించెను. నాటినుండి శాస్త్రికి సాయియే దైవము. సర్వదా శాస్త్రికి శ్రీసాయి ప్రసన్నుడు. పరమాత్మ స్వరూపమగు శ్రీసాయికి ప్రణమిల్లుదము.

"ఓం శ్రీ సాయినాథాయ నమః"

# 10వ అధ్యాయము

ఒక్కడె దేవుండయినను
అక్కజముగ పేరుమార్చి ఆదేవునినే
ఒక్కడురాముండన నిం
కొక్కడు అల్లాయనియెను యోచనసేయన్

భక్తపాలనకై గోసాయిరూపమున అవతరించిన పరమాత్మ స్వరూపి శ్రీసాయి. శ్రీరామకృష్ణ శివమరుత్యాది రూపములతో దరిశనమిచ్చినది చూచితిమి. దత్తమూర్తియై ఆసనమున అగపడుటయూ గమనించితిమి. మూలేశాస్త్రికి, 10 సంవత్సరముల పై కాలమున గతించిన గురుఘోలప్ రూపమున అభయమిచ్చుట తెలిసికొంటిమి. బాబా, సకల సాధువుల స్వరూపము–మనమెన్ని పేరుల పిలచిననూ, బేధములేక ఒక్కటై వెలుగు పరబ్రహ్మము. సకల చరాచరములకు ఆధారమగు పరమాత్మ. నిర్గుణబ్రహ్మమగు శ్రీసాయి, భక్తుల నుద్ధరింప సగుణుడుగా మనకు దరిశనమిచ్చినాడు. ఆర్తితీర అభయమిచ్చుటయే బాబా యందలి ప్రత్యేకత.

మమల్తదారుగానున్న భక్తుడొకడుండెను. ఒకడాక్టరు ఈతనికి ప్రియమిత్రుడు. ఈ డాక్టరు రామభక్తుడు. మమల్తదారు, బాబాను దరిశింప షిర్డీకి పయనమగుచూ, డాక్టరునుకూడ తనవెంటరమ్మనెను. ఈ డాక్టరు బాబాను గురించి విన్నవాడయ్యునూ మమల్తదారువద్ద తనకుగల చనువుకారణముగ ఇట్టులనియెను. "నేను రామభక్తుడనని నీవెరుగవా? ఎరిగిఎరిగినన్ను ముస్లీముఫకీరుకడకు రమ్మనుట న్యాయమా, నేనాఫకీరును దరిశింపను, ఆముస్లీమునకు ప్రణమిల్లుట అసంభవము ఏల నన్ను బాధపెట్టెదవు. నేను షిర్డీకివచ్చుట అసంభవము," అనిఖచ్చితముగాచెప్పెను. అంతట ఆ మమల్తదారు అదేలనో తనపట్టువిడువలేదు. ఎమయ్యా నిన్నెవరునూ, బాబామశీదునకురమ్మని బ్రతిమాలుటలేదే- బాబాకు ప్రణమిల్లియే తీరవలయునని నిన్ను నిర్భదించునదెవ్వరు నీ రామునికాదని, బాబాను సేవింపుమని నేనేమి పట్టుబట్టితినా? ఇదిఏటి మాట, నీఇచ్చవచ్చినచో మశీదుకురమ్ము కాకయున్న బసయందే ఉండ

గలవు. అదెందులకో నీవురాక నేనుఒంటరిగా వెళ్ళుటకు మనస్కరించుట లేదు, అసాధ్యమనిపించుచున్నది. సోదరా, ఈరాత్రియే ప్రయాణముఅని బలవంతపెట్టెను. ఆడాకరు అదృష్టము పండినది. బాబా అతని ఉద్ధరింప అనుగ్రహించినాడు.

ఉభయులూ పయనమై షిర్డీ, చేరిరి. స్నానసంధ్యాదులైన పిదప మమల్తదారు మశీదునకు పోయెను. డాక్టరుకూడ తనంతతాను, అడుగకయే అతనిని వెంబడించెను. అప్పటికప్పుడే బాబా, దర్బారు నందుండెను. భక్తులందరు బాబాను సేవింపుచుండిరి. మమల్తదారు, మశీదునందడుగిడెనో లేదో బాబా, అతనిచూడగనే 'రామునియందు భక్తిగలవానికి రాముడేల అగపడడు? దీనికి నీమిత్రునితో రాద్ధాంతమేల?' అనెను. వెంటనున్నడాక్టరు చకితుడై చూచెను. అదేలనో ఆ డాక్టరు పరుగుపరుగున ప్రక్కవారిని గమనింపకయే, బాబాపాదములపై వ్రాలెను–కన్నులు చెమ్మగిల్లినవి–బాబా పాదముల విడుచుట లేదు–పదే పదే బాబాముఖము చూచుచుండెను. తన్మయత్వముతో శ్రీరామ నామ సంకీర్తన మొనరింపుచుండెను. చిరునగవుతో బాబా, డాక్టరును లేవనెత్తెను. అప్రయత్నముగా ఆతడు–బాబా, నారామా–నీవాతండ్రీ ముస్లింఫకీరనుచుండిరే—ఇన్నినాళ్ళుగ నిన్నారాధింపు చుంటినే–నేటికి దయగల్గినదా రామా! ఆ రత్నఖచిత సింహాసన మెవ్వరయ్యా, ఈ మశీదునకు చేర్చిరి అని అపూర్వ ఆనందముతో ఒడలు తెలియక పరవశుడై పడిపోయెను. శ్రీసాయి స్వయముగ ఆతనినుదుట ఉధినుంచి, బిడ్డా లెమ్మని, ప్రేమపూర్వకముగ పిలిచెను. డాక్టరుకు తిరుగ తెలివి వచ్చినది. గోసాయిరూపముననున్న బాబాను చూచినాడు. ఆతని సందియము తీరినది–బాబా ముస్లిమని వెనుకాడలేదు–ఆ విషయమే మనస్సుకు తట్టలేదు–నాతండ్రీ శ్రీరామా–శ్రీసాయీరామా–ఎంత పొరబడితిని—నీవెంతటి దయాసముద్రుడవయ్యా! అనుమానముతో ఆవరింపబడిననన్ను సైరించి అనుగ్రహించితివే? అజ్ఞానుడను–అంధుడను–బాబా–ఎన్నటికీనన్ను వదలకుము–నీపాదములే నాకాశ్రయము–అని బాబా సంకీర్తన మొనరించెను.

దిట్టమై గట్టిపట్టుదలతో, బాబాను దరిశింపను, ప్రణమిల్లను, అని పగ్గెలుపల్కిన ఈతడిట్లేల పరువిడి బాబా పదముల వ్రాలెను. ఆతడు చూచిన దేమి? ఆ ఆనందమున కేమికారణము? బాబా యన్న మనమనుకొను ముస్లిము ఫకీరేనా? కుక్షినిభరించిన ఈ అయిదడుగుల శరీరమేనా? ఇట్టి సందియముల పోద్రోలి, మన అజ్ఞానము నశించి, భక్తిభావము పెంపొందించుటకే బాబా ఇట్టి లీలలు చేయుట అనుగ్రహించుట కాకయున్న నా యనువారు లేక, ఇల్లువాకిలి లేక, ఇతర ప్రసక్తితో పనిలేక మశీదునందున్న, ఆజగజ్జనకునకు ఈలీలతో ఏమిపని. శతవత్సరములు జప మొనరించిననూ, సర్వమూత్యజించి తప మొనర్చిననూ విఘ్నములతో వికలమనస్కులగుచు, పరమాత్మదర్శన మబ్బుట, దుర్ఘటమని తపించుచుండ దయాసముద్రుడగు సాయి, భక్తసులభుడై, తన్ను సేవించువారికి, వివిధరూపముల దర్శనమిచ్చి, అనుగ్రహించినాడు. అట్టి ఆ పరమదయాళువు, పదధ్యాన మబ్బుటకు మనఅదృష్టము.

ముస్లిమను భావమున, మశీదు చేరిన, డాక్టరు వినుచుండగనే, సర్వాంతర్యామియగు శ్రీసాయి, అతని అనుమానముల గ్రహించి, మమల్తదారును ప్రశ్నించెను. రామభక్తుడు, శ్రీరామచంద్రుని చూడగలడన్నది. ఎట్లు అసత్యముగా గలదు? తలఎత్తు సరికి, సర్వభూషణ భూషితుడు, నీలమేఘశ్యాముడు, శ్రీరాముడే, అతనికి దర్శనమిచ్చెను. అంతతో దివ్యతేజస్సు గోచరించినది. అజ్ఞానము అంతరించినది – సర్వము రామమయముగా తోచినది – దివ్యజ్ఞానము అంకురించినది. అతడు అదృష్టవంతుడు, పురాకృత పుణ్యఫలమున, బాబా కరుణకు పాత్రుడై, డాక్టరు, అమరసుఖ మనుభవించినాడు– బ్రహ్మానందము చవిచూచినాడు – ఆతని ఆనందము, ఆతనికే ఎరుక– అది నేనెట్లు వర్ణింపగలను – అట్టి ప్రయత్నము చేయుటకుగూడ నాకు అర్హతలేదు, దయానిధియగు శ్రీసాయి నన్ను అనుగ్రహింపలేదు – అందు సహస్రాంశమైన ఆనందము నాకు అబ్బలేదు – బాబా పదధ్యానముకొరకే నా ఈ జీవితము – ఆదయాళువు ఎన్నటికైన, అనుగ్రహించునో లేదో, అది ఆపరమాత్మునికే ఎరుక – లీలామాత్రముగ

నైన పరిశీలనమొసగి, దయచూడవా బాబా – మే మెరుంగని ఈ నీ చరిత్ర, కథలుకావని నీ వొసర్చిన బాస నిలుపుకొనుట నీయందున్నది- తండ్రీ! 'నిన్ను వినా ఎవరున్నారు ? నన్నుగన, అని నీ పాదపంకజముల శరణము నొందువాడనే – అందర అన్నివిధముల ఆదరించిన తండ్రి – మనలమాత్ర మేలకాదనును ? అల్పబుద్ధులమగు మనల అనుగ్రహించుటకేగా, ఈ సాధురూపము. జీవితరంగమున కలుగు చిన్నిచిన్ని బాధలు బాబా నీ పదభక్తినుండి నా మనమటునటు తొట్రుపడకుండ నిశ్చలముగ నీపదములయంద నిలకడ నొందునట్లు నీవే అనుగ్రహింపవలెను తండ్రీ. పరమదయాళువగు బాబా భక్తుల బాధలు ఉపేక్షింపడు. సర్వసర్వంసహా చక్రవర్తియగు శ్రీసాయి, మనల పాలించియే తీరును. అట్టి శ్రీ సాయికి ప్రణమిల్లుదము-

"ఓం శ్రీ సాయినాధాయ నమః"

# 11వ అధ్యాయము

"ప్రతిజీవంబున జేరి చాటుపడి సర్వవ్యాపియై ఈశుడై
యతులప్రాణి చయాంతరాత్మయయి కర్మాధ్యక్షుడై లోకసం
స్థితభూతాది నివాసుడై హృదయసాక్షీభూతుడై నిర్గుణాం
చితుడై కేవలుడైన దేవుడొకడే శ్రీసాయి వర్ధిల్లెడున్"

పుణ్యక్షేత్రమగు షిర్డీయందు వేంచేసియున్న శ్రీ సాయి ద్వారకామాయియందాశీనుడై, భక్తపాలానచేయు సర్వాంతర్యామి, సకలసాధుస్వరూపుడు, కారణజన్ముడు, సృష్టిస్థితిలయకారకులగు త్రిమూర్త్యాత్మక స్వరూపమగు శ్రీదత్తమూర్తి, కఠిన నియమములతోగాని, పరమనిష్ఠతోగాని పనిలేక స్మృతిమాత్రప్రసన్నుడు, స్మరణమాత్ర సంతుష్టుడు, తన్ను నమ్మి సేవించువారిని వెంటాడి, కంటికిరెప్పవలె కాపాడు పరమదయాళువు.

బాబాను సేవించు భాగ్యమబ్బిన, తాత్యాపటేలు దంపతులు, తరచు షిర్డీ యందే, కాపురముండెడివారు. సంవత్సరములు అట్లే ఆ పుణ్యదంపతులు బాబాసేవతో గడపిరి. రేపల్లెయందలి గొల్లపిల్లలకు వలె వీరలకు ఈ సాయీకృష్ణునికడ చనువుఎక్కువ. ఒకనాడు తాత్యా సతి, 'బాబా! నీవు నాయింటికివచ్చి విందారగింపవలయును సుమా! ప్రతిరోజును నేను నీవద్దకు ఫలాహారములు తెచ్చియిచ్చుటలేదా? మా మకాము దూరమైననుకాదే - ఏల ఈ పదిఅడుగులు రాకూడదయ్యా, కాదన్న నేనెత్తుకొందునులే, ఈ సాయంత్రము నేను పోళీలు చేసెదను సరిగ 5 గంటలకు నీవు వచ్చి, ఆరగింపవలయునుసుమా!' అని ప్రతి మాలినది.—'అమ్మా! బిడ్డకు పండగయన్న సంతోషమేగా, పోళీలు పెట్టెదనన్న పోగొట్టుకుందునా, తప్పక వచ్చెదను - కాని కసరకూడదు సుమా, తెలిసినదా! అయిదుగంటలకు అంతియేనా'' అని బాబా! మరల మరల అడిగి పంపెను. ఆ తల్లి ఆనందమునకు మేర లేదు. పరుగు పరుగున ఇల్లు చేరినది. బాబా నామసంకీర్తనచేయుచూ, అవసరమగు భాండారముల చేర్చినది. దొంతర, దొంతరులుగ పోళీలుచేసి పేర్చి నది. సాయంత్రము అయిదుగంటలగుచుండెను. స్థలము శుభ్రపరచి, రంగురంగుల ముగ్గులలంకరించి, ఆసనమమర్చి, వెండిపళ్లెరమునుంచి, పన్నీరుచిలికి, ఘుమఘుమలనీను అగరువత్తుల వెలిగించి, బాబా పట మలంకరించి, పూజాద్రవ్యముల సిద్ధపరచి, జ్యోతులు వెలిగించి,

"భాగ్యముపండెనుగా - బాబా - నాభాగ్యముపండెనుగా -
భక్తపాలనా, ప్రభో - పరువిడిరావయ్యా -
బాబా, నీవే - ప్రత్యక్షముగా, భక్ష్యముతినగా,
భాగ్యముపండెనుగా - బాబా - నా భాగ్యముపండెనుగా,
ఆవో ప్రభో, ఆవో సాయీ, ఆవో - ఆవో, ఆవో -
నీపదసేవా భాగ్యముపండెనుగా -
బాబా నా, భాగ్యముపండెనుగా—॥

అని ఆపరమిత ఆనందముతో, బాబా రాగలడని తొంగి చూచుచూ కీర్తింపుచుండెను.

ఒక నల్లనికుక్క చెవులూరగపెట్టి ఆ సంకీర్తన కానందింపుచూ, చరచర పూజామందిరముకడకు చేరినది. తాత్యాసతి చూచుసరికి, ఆ శునకము, ప్రక్కనున్న భక్ష్యముల దరినున్నది – ఆత్రముతో వాటి నందుకొనుటకు నోరు తెరచినది. వెంటనే ఆ సతీమతల్లి "ఛీ – ఛీ, నీ వెక్కడనుండి వచ్చితివి? బాబాకని చేర్చిన భక్ష్యములనే తిన చూచుచుంటివా పాడుదానా!" అని ఇనుపకడ్డీ నొకదానిని పైకి విసరెను. ఆ కుక్క పరువిడుటకుమారు ప్రక్కకుతప్పుకొని, కంట నీరుకార్చుచూ, దీనముగ ఆమెవంకచూచి, కుంయ్ అని మూల్గుచూ, వెనుతిరిగి పోయెను. 6 గంటలయినది. తాత్యాసతికి విసువుకలిగినది. గంటలు గడచెనేగాని, బాబా రాలేదు – రాత్రి హారతి వేళకూడ అయినది. అంతట ఆమె పట్టలేని కోపముతో, పోళీల పళ్లెరము చేతగొని, మందిరము చేరెను. బాబా ఆమెను చూడగనే చిరునగవుతో, ప్రక్కనున్న మహల్సాపతి నుద్దేశించి, "చూచితివా! తల్లికి బిడ్డపై ఇంతకోపమా, ఆ అమ్మ కన్ను లెఱ్ఱజేసి, నన్ను దండింప వచ్చుచున్నది – అమ్మా! నీకు కోపము తగ్గలేదా, నేను వచ్చినప్పుడు ఇనుపకమ్మి పైకి విసరితివి. ఎట్లో తప్పించుకుంటిని, ఇంటికి రమ్మని పిలచి, తల్లీ! దండింప చూచితివే – రుచికరములగు ఆ పోళీల ముట్టనైన ముట్టనీయకపోతివి కదమ్మా! అమ్మా కూర్చుండుము". అన్నంతలో, ఆమెకేమియూ అర్థముకాలేదు. దిగ్భ్రమచెంది చూచుచుండెను. నిజమునకు బాబా, అచ్చటనే ఆసీనులై యుండెను. భక్తులు చుట్టుముట్టి యుండిరి. అయిదుగంటలవేళ, దర్బారులో, భక్తులతో ముచ్చటింపుచుండెను. మహల్సాపతి అప్పటినుండియూ, బాబా వెంటనే యుండెను. మహల్సాపతికికూడ ఏమియూ పాలుపోలేదు. నవ్వుచూ, శ్రీసాయి, బిడ్డలారా! సాయియన్న, ఈ శరీరము, మాత్రమనియేనా మీ నమ్మకము. ఎంత పొరబడుచున్నారు. సృష్టియందలి ప్రతిజీవియూ నేనుగా ఎరుంగుడు, అమ్మా! ఆ నల్లని కుక్క ఎంత సంతోషముగ నిన్ను చేరినది. తిరుగ ఎంత దీనముగ నీవైపుచూచి కన్నీరు కార్చినది. ఆ కుక్క ఎక్కడిదితల్లీ! నేనుగానా? వచ్చిన నన్ను గుర్తింపక, కొట్టవచ్చినదిగాక, నేను రాలేదని కోపమా, ఇది ఒక నెపమా," అన్నంతలో ఆమె జరిగినదంతయూ తెలిపెను.

ఆ తల్లి తన తెలివిహీనతకు చింతిల్లెను – బాబా పాదముల వ్రాలెను – బాబా, పొరబడితిని. ఇన్నినాళ్లు నీకడనుండి, నిన్ను సేవింపుచున్ననూ, నిన్నెరుంగలేక పోయితిని. అట్టి జ్ఞానము నేల ప్రసాదింపవైతివి తండ్రీ! అని కన్నీరు గార్చెను. 'బాబా – అయినదేమో అయినది. రేపటి సాయంత్రము తాము తప్పక దయసేయుడు. అంతవనుక నేను ప్రాశన చేయనుసుమా" అని బ్రతిమాలినది. అందులకు బాబా "అమ్మా ఇంత పట్టుదల ఏల, నేను నిజమునకు ఎప్పుడునూ మీ ఇంటనే యుంటి నమ్మా, ఇది నమ్ముము. ఇంతగ బ్రతిమాల వలయునా? తప్పక రా గలను." అని వాగ్దాన మొనర్చెను.

మరునాడు సాయంత్రము తిరుగ, శుచియై, ఆమె పూజామందిర మున, బాబా పటమును అలంకరించి, మాక్ పూరీలనుచేసి, పానకమున ముంచినది. ఆ పిండివంట వాసన, నోరూరజేయుచు వీధివెంట పోవు వారినికూడ ఆకర్షింపుచుండెను. బాబా రాగలడన్న పరమానంద ముతో, ఉవ్విళ్ళూరుచూ, ఆమె నామసంకీర్తన చేయుచుండెను. అయిదుగంట లయినది. ప్రక్క ఇంటివారి గమిడిగేదె, అంబా అని అరచుచూ, మెట్లెక్కి, ముందుకాళ్ళు రెండునూ లోపలపెట్టి, తొంగి చూచినది. మలినముగనున్న ఆ పశువు, స్థలమును మురికి చేయునన్న భయముతో, ఆమె ప్రక్కనున్న కర్రనెత్తి, బలముగా ఆ గేదెను వీపుపై కొట్టినది. వెంటనే చర్మముచిట్లి, రక్తము కారినది. ఆ గేదె అట్లే కొంతతడవుండెను. కాని ఆమె తిరుగ కర్ర నెత్తినంతలో దిగి పోయినది. ఆమెకు క్రిందటి దినమున, కుక్కరూపమున తానే వచ్చితినని బాబా తెల్పిననూ, సమయమునకు పిలచినట్లు చూడవచ్చిన ఆ గేదె విషయమై, ఆమెకు ఆలోచన పోలేదు. ప్రతిదినమును చూచెడి ఆగేదె బాబారూపమని ఆమె ఎట్లు తలంపగలదు.

అట్లే బాబాకై నిరీక్షింపుచూ, ఆమె గంటకుపైగా కాలము గడపినది. బాబా రాలేదు. పరుగుపరుగున ఆమె మశీదు చేరెను. 'షామా,' అను భక్తుడు, బాబాతో ప్రసంగింపుచుండెను. నానా, మహల్సాపతి మొదలుగాగల భక్తులు, బాబావద్ద ఆసీనులై తనివితీర

ఆ మూర్తిని దర్శింపుచూ, ఆనంద మనుభవించుచుండిరి. ఆమె విసురుగా వచ్చుట బాబా చూచినాడు. సర్వజ్ఞుడగు శ్రీ సాయికి తెలియనిదేమున్నది. ఆమె సమీపించుసరికి, బాబా, 'మామా, అమ్మ తిరుగకొట్టునేమో, ఇటుచూడు భక్ష్యము లిచ్చెదను రమ్మని పిలిచి, నేను వెళ్ళినంతలో కర్రతో బలముగా కొట్టినది – అమ్మా, చూడు, ఎంత దెబ్బతగిలినదో, ఇట్లు దండించుటకు నేనేమి జేసితినమ్మా! తల్లివి పిలిచితివిగదా, అని మొరవగా లోన ప్రవేశింపుచుంటిని, ప్రక్కనున్న కర్రతో బలముగా కొట్టితివే?" అని కఫ్నీ పైకి తీసెను. బాబా వీపుపై బలముగా దెబ్బతగిలిన వాత తేలియున్నది – చర్మముచిట్లి రక్తము కారుచుండెను. పాపమామెకు నోటమాట రాలేదు. కుప్పయై కూలిపోయినది – వెక్కి వెక్కి ఏడ్చినది. "బాబా, నేనెంతటి పాపిష్టురాలను, నీ కిట్టి గాయము గలిగించితినా, ప్రభూ! అపచారము. భగవంతుని సన్నిధిన ఇన్నినాళ్ళున్ననూ, జ్ఞానము కలుగని అంధురాలను. నీ వెంతటి దయామయుడవయ్యా, ఇట్టి అపచారమొనరించిన, నన్నింకనూ మన్నించి, ప్రేమింపుచున్నావా?" అని భోరున ఏడ్చినది. నానా మొదలగు భక్తులందరు, ఏమిదియని ప్రశ్నించిరి. అంత కన్నీటితో ఆమె జరిగిన విషయమంతయూ, విపులముగా చెప్పినది. గమిడిగేదె రూపమున బాబా అచ్చటికి చేరెనని తెలిసికొనిరి. ఆమె కొట్టినది, ఆ గేదెనుకాదు, సర్వాంతర్యామియగు బాబాకే ఆ దెబ్బ తగిలినది. బాబాయన్న తాముచూచు ఆ కఫ్నీధారి కాదని, ఆ అయిదడుగుల శరీరము మాత్రమేకాదని, సర్వాంతర్యామియని, ప్రపంచమందలి ప్రతి జీవియందునూ భగవంతుడున్నాడని, అనుమానమునకు ఎట్టితావును లేకుండ, దృఢముగ నమ్మిక కలుగునట్లు, బాబా నిదర్శనాపూర్వకముగ నిరూపించి చూపినాడు. బాబాయందలి ప్రత్యేకతయేఇది. ఉపదేశములుగాని, ఉపన్యాసములుగాని, జప తపములుగాని, క్రతునియములుగాని లేకయే, పరమాత్మతత్వమును, ఇట్టే మరపురాని విధమున, సులభమగుతీరున, మర్మరహితముగ, బోధించెడివాడు. సాదరముగ, సాయి ఆమె చేతియందలి పళ్ళెము అందుకొని, అందలి భక్ష్యముల అందరకూ పంచియిచ్చెను.

పాపమాతల్లి మనస్సు కుదుటపడలేదు. బాబా వీపుపై దెబ్బ, ఆమెకన్నులఎదుట పదే పదే అగపడుచుండెను. ఆమెకు పాపము ఆరాత్రి నిదురపట్టలేదు–గుక్కెడు నీరైననూ త్రాగలేదు, పదే పదే బాబాను స్మరింపుచుండెను, తెల్లవారినది. ఆత్రముతో పనులసవరించుకుని, బాబా దర్బారు చేరినది. అప్పటికింకనూ భక్తులెవ్వరూ, బాబావద్దకు చేరలేదు. ఒంటరిగా బాబాచిలుము పీల్చుచుండెను. నాతండ్రీ!, నన్ను కరుణింపవా, అని ఎలుగెత్తిఏడ్చుచూ, బాబా పదములబడినది. "అమ్మా, భయపడకుము ఇందు నీ తప్పుమాత్రమే మున్నది, తల్లి బిడ్డలను దండించుట సహజమేగా, నేను నీ బిడ్డను కానా? లెమ్మని, బాబా ఉద్ధినిచ్చెను. బాబా! అజ్ఞానమున చేసిన దానిని మన్నించి, ఈ సాయంత్రమైననూ, తప్పక నీవువచ్చి నాఆతిధ్య మంగీకరింపుమని ఆమె బ్రతిమాలినది. అట్లే అగుగాక, తల్లీ దీనికింత వెరపేల, తప్పక వచ్చెదనని, బాబా, ఆమెకు అభయమిచ్చి పంపెను.

ఆమెయూ పేణీలనుచేసి, బాబా రాగలడన్న నమ్మకముతో, బాబా ధ్యానముతో, వాకిలి గాచుకొని యుండెను. ఆనాడు, ఏజంతువైననూ, వచ్చెనా, బాబాయే నని సేవింతునన్న పట్టుదలతో చూచుచుండెను. కాని అట్టిదేమియూ జరుగలేదు. లోపలకేగుసరికి, ఆపేణీలు ఉంచిన ఆకునందంతటనూ, గండుచీమలు ప్రాకుచుండెను. ఆమె విసువుతో ఆ చీమలను దులిపి, పేణీలను పాత్రయందు భద్రపరచి, మశీదు చేరెను. ఆమెను చూడగనే, బాబా ఆహా నీవుచేసి ఇచ్చిన పేణీ ఎంత, రుచిగాయున్నదమ్మా, బిడ్డయందు, తల్లిప్రేమ అట్టిది. కడుపునిండినది. అమ్మా ప్రతిరోజునూ ఇట్టిరుచికరములగు పిండివంటల పెట్టకుము, ఆరోగ్యముకూడ చెడిపోగలదు, అనుచూ మందహాసముచేసెను. అందుకు ఆమె, 'బాబా! నేనేమి పసిదాననను కుంటివా! నీవెప్పుడు వచ్చితివి, నేనెప్పుడు నీకు పేణీపెట్టితిని? నీవు ఆరగించితివా, నీవు ఏజంతువు రూపముననైన వత్తువేమో, మరల మతిలేక, హింసింతునేమో నన్న భయముతో వాకిలిగాచుకుని యుంటిని, నీవురాలేదు, సరికదా, ఆపేణీలనిండ గండుచీమలెక్కినవి. వాటినిదులిపి పాత్రయందుంచితిని? బాబానిన్ను కొట్టితినన్నకోపమా,

నీ వేళిట్లు నన్ను మోసగించిన, ఇకనాకు దిక్కెవ్వరు. బయలుదేరి నా వెంట రావలసినదని ఆమె పట్టుబట్టెను. అంతట బాబా, 'అమ్మా! నామాటయందు నమ్మకము లేదా! నేను అబద్ధము ఆడుచుంటిననియా, నీ అనుమానము, అబద్ధమాడవలసిన అవుసరము నాకేమికలిగినది తల్లీ! నీకింకనూ అనుమానము తీరలేదు. ఇటుచూడుము', అని బాబా, తనగుప్పిలి విప్పిచేయిచాచెను. ఆచేతియందు రెండు గండు చీమలు ప్రాకుచుండెను. వాటిముక్కున పేణీముక్కలున్నవి, ఇంకనూ చూడదలచినచో, ఇటు చూడుమని బాబా తన కుఫ్నీపైకి తీసెను. బాబా బొడ్డుచుట్టునూ గండుచీమలు, ఆచీమలముక్కుల పేణీముక్కలున్నవి.

బిడ్డలారా! ఇన్నితీరుల మీకు తెలియజెప్పిననూ, మీ అజ్ఞానము మిమ్ము వదలుటలేదు. పిపీలికాది బ్రహ్మపర్యంతము, ఈ సృష్టి అంతయూ, ఈ సాయియే అని గ్రహింపుడు. నన్ను కనుమరగించి మీరు ఏమియూ చేయజాలరు. నేను మీయందున్నాను. మీరు నాయందున్నారు. ఇది తెలియక, నేను – నేను, అను భేదబుద్ధితో విర్రవీగుట నా భక్తులను కాపాడుటయే నాకు ఆనందము. మీరు ఎక్కడనున్ననూ, మీవెంట ఎల్లప్పుడూ నేనునూ ఉందును. నమ్మకముతో నాదిక్కుచూచిన, నన్ను స్మరించిన, ఎప్పుడైననూ, ఏవేళనైననూ, ఎక్కడనైననూ, నన్ను మీరు చూడగలరు. ఈ రహస్యమును గ్రహింపుడు" అని ఉధినిచ్చి, బాబా అందర నాశీర్వదించెను.

శ్రీసాయి తన భక్తుల అజ్ఞానమును, ఎట్లు తొలగించునో చూచితిమి. భగవంతుని సేవింపుచూ, భగవన్నామము చేయుచూ, సద్బుద్ధితో ప్రవర్తించెడి, భక్తుని, ఎన్నడూ శ్రీసాయి మరువడు, వెంటాడి తిరుగుచునే యుండును. నేను భక్తుడను, అన్న అహముగాని, ఎంత మొత్తుకున్ననూ, ఆలకింపని ఈ దైవమేల? అని నిస్పృహగాని చెందరాదు. భక్తుడైనందులకు, అంతయూ భగవంతుని స్వరూపమే. అను నమ్మకము, ఇతర జీవులయెడ దయ, ప్రేమ, కలుగవలసియున్నది. కరుణామయుడగు సాయి, మనకు తోడునీడయై చరింపుచున్ననూ

గుర్తించుటకు తగిన అర్హత మనకు అబ్బినప్పుడే, మనమది గ్రహింపగలము. అట్టి జ్ఞానము అబ్బినవాడు అదృష్టవంతుడు. పురాకృత సుకృతము, శ్రీసాయీశుని దయయూ మాత్రమే మనకు అట్టి జ్ఞానము నీయగలవు. అట్టి జ్ఞానమును ప్రసాదింపుమని శ్రీసాయిని ప్రార్థింతము.

"ఓం శ్రీ సాయినాథాయ నమః"

# 12 వ అధ్యాయము

"కననీ శిరిడి భాగ్యమేమొ, నరలోకంబందహో! లోకపా
వను కామాన్యులుచేరి, యందుపనిషత్ప్రామాణ్య గుప్తాంచితా
రథిని రూఢిన్ జిదచిద్విశిష్టత, పరబ్రహ్మంబు, 'సాయీ' యభి
ఖ్యనరాకారమున్, వెలుంగగని, నిత్యానందమున్ బొందెడున్"

శ్రీసాయీశుని లీలలు, అత్యద్భుతములు. అవి మనకెట్లు అర్థముగాగలవు. బాబా, సర్వాంతర్యామి, త్రికాలజ్ఞుడు. తన భక్తుడు ఎంతదూరమందున్ననూ, ఎట్టిస్థితియందున్ననూ, ఏమరక వెంటాడి, గాపాడు పరమ దయాళువు.

షామా, నానా, మహల్సాపతి, మాధవీ, మున్నగు భక్తులతో, బాబా దర్బారునందుండి, ప్రసంగింపుచుండెను. మధ్యాహ్నము, హారతివేళ అయినది. సమయమునకు, గోవా, నుండి ఇరువురు భక్తులరుదెంచిరి. ప్రయాణపు బడలికచేవారు డస్సియుండిరి. ఆబడలికను పాటింపక వారిరువురు, పరుగుపరుగున బాబా దర్శనమునకని మందిరమునకు పరువిడిరి. అప్పటికప్పుడే, హారతి ఆయినది. తీర్థప్రసాదముల భక్తులు భక్తితో అందుకొను చుండిరి. గోవానుండి వచ్చిన ఇరువురిలో మొదటివాడు, బాబాకు ప్రణమిల్లెను. బాబా ఆతని నాశీర్వదించి లేవనెత్తెను. వెంటనే అతని నుద్దేశించి, 'బిడ్డా పదునైదురూకలు దక్షిణనిమ్మని "బాబా, ఆజ్ఞాపించెను. ఆతడునూ, వినయ పూర్వకముగ పదునైదు రూకల బాబా పాదములనుంచి

ప్రణమిల్లెను. ఇదిచూచి, బాబా తనను ఎట్టిదక్షిణయూ అడుగక పోయిననూ, గోవానుండివచ్చిన రెండవవ్యక్తి తనఅంగర్ ఖానానుండి, ముప్పదిఅయిదు రూకలనెత్తి బాబా పాదములపైనిడి, బాబా ఈ దక్షిణ స్వీకరింపుడని వేడికొనెను. బాబా ఆరెండవ యాతడిచ్చిన రూకలనందు కొనలేదు సరికదా, తీవ్రముగ ఆతని వైచూచి, నీవేటికి దక్షిణ నిచ్చెదవు, నిన్ను నేను అడిగితినా, తీయుమూ రొక్కము" అని గద్దించెను. పాపమాతడు ఖిన్నుడై ఆమొత్తము నెత్తికొనెను. ప్రక్కనున్న షామా, అదిచూచి, 'బాబా! మొదటివానిని అడిగి దక్షిణ గైకొంటిరిగదా, ఈతడు, తాము అడుగకయే హృదయపూర్వకముగ భక్తితో అర్పించిన ఆ దక్షిణను స్వీకరింపక, తీక్షణ దృక్కులతో తృణీకరించి, చిన్నబుచ్చితిరే, ఇది ఏటి న్యాయము ?" "అన్నంతలో, బాబా చిరునగవుతో" షామా, నీకేమియూ తెలియదు. వ్యర్థునివలె మాటాడుచున్నావు. ఇతరుల ధనము నాకేల, ధన కాంక్షా పరుడనై దక్షిణల అంగీకరింతుననియేనా, నీయూహ—ధనముతో నాకేమిపని, నన్ను పట్టిపీడించు బంధువులుగాని, సతీసుతులు గాని, నాకెవ్వరునూ లేరే-నాఅనునది లేక, కబళముల అడిగి తెచ్చి భుజింపుచూ జీవించెడి, నాకీధన మేల? ఈ మశీదుమాయి, తనకు రావలసిన రుణమునుమాత్రము నిఖచ్చిచేసి పుచ్చుకొనును, అంతే. ఇచ్చువాడు తన రుణమును చెల్లించి విముక్తుడగుచున్నాడు. ఇది నీకు అర్థమగుట లేదు. "ఈతని విషయము నీవెరుగవు, చేతగాసుపీసము లేక, దేశ ద్రిమ్మరిఅయి, ఎచ్చటనైనపనికుదిరి, సుఖజీవన మబ్బినచో, తనుఆర్జించు మొదటి నెల జీతమంతటినీ నాకిత్తునని నిశ్చలబుద్ధితో నన్నుతలచి బాస చేసినాడు. నేను కనికరించి ఆతనికి ఉద్యోగమిచ్చితిని. మొదటి నెలకు వచ్చిన జీతము పదునైదు రూకలే, ఆమొత్తము నాకీయకున్న, నేనెట్లు ఊరకుందును. ఈతనికి నాటినుండి వృద్ధికలిగి, ముప్పది, అరువది, నూరు, రెండువందలు, వేతనము లభించినది, నేడు ఏడువందలజీతము ఆర్జింపు చున్నాడు. అంతమాత్రమున, ఆత్రముతో, ఆతడా ఏడువందలు ఇచ్చిన మాత్రము నేను అంగీకరింతునా? ఆతని ఆర్జనతో నాకేమిపని, ఆతడన్న మాట మరచినాడు, ఆ కారణమున అడిగి పుచ్చుకుంటిని."

ఇక రెండవవాని విషయమందువా? ఈతనిసొమ్ము నాకేల; ఈతడు నాకు ఎన్నడూ బాకీలేదు. నేనెట్లు పుచ్చుకొనగలను. మరి ఈతడేల వచ్చెనందువా, చెప్పెదను వినుము. ఒకప్పుడు నేను సముద్రతీరమున చల్లగాలికి పచారు సేయుచుంటిని. ప్రక్కన ఒక అందమగు భవనము అగపడినది. ఆ పంచటరుగుపై చతికిలపడితిని. ఆ భవనము యజమాని, నన్ను సాదరముగ లోనికిగొనిపోయి, ఆతిథ్యమిచ్చి, లోనగదియందు తన సామగ్రినిదాచిన బీరువాప్రక్కన, పరుండుటకు నియమించెను. అట్లే నిద్రించితిని. కాని నేను నిద్రించునప్పుడు, అగదికి కన్నముచెచ్చి, రాతినొకదానిని తొలగించి, మెల్లగ లోనప్రవేశించి, నాకొంగున వ్రేలాడు ముప్పదివేల రూప్యముల కత్తిరించి అపహరించినాడు. నేనెంతయో కష్టమునకుఓర్చి, ఆర్జించి సేకరించిన రొఖ్కమది. ఆ మొత్తమంతయూ నోట్లుగామార్చి ఉంచితిని. నాణెములు బరువని, నోట్లు సుళువని ఆశపడితిని. ఆతడు అతిసులభముగ వానిని అపహరించినాడు. నాకిక దిక్కుతోచలేదు. ద్రవ్యముపోయెనన్న దిగులుతో అన్నహితవు తప్పినది. ఏమిచేయుటకునూ తోచక, వెర్రివానివలె తిరుగనారంభించితిని. నాకు మతికూడపోయి నాలోనేనే, ముప్పదివేలు, ముప్పదివేలు, అని గొణుగుకొనుచుంటిని. ఒకఫకీరు నాదుస్థితిగని, నన్నుచూచి పిలిచినాడు. ఏలఇట్లు పిచ్చివానివలె తిరుగుచుంటివని ప్రశ్నించినాడు. కన్నీటితో ఆకథ వానికి తెలిపితిని. ఆ ఫకీరు నాపైదయతో, బిడ్డా! భయములేదు. నేను చెప్పినట్లు చేయుము. నీసొమ్ము నీకుచేరగలదు. నేను నీకొక ఫకీరును చూపెదను. ఆతని ఉనికికూడ తెలిపెదను. నీవాతని నాశ్రయింపుము. అంతదనుక, నీకుఎక్కువ ఇష్టమైన ఆహారవస్తువును ముట్టనని ప్రతిజ్ఞచేసి, ఆవస్తువును భుజించుటమానుము. వారముదినములలో నీసొమ్ము నీవద్దకు ఆ దొంగయే తెచ్చి ఇవ్వగలడని చెప్పినాడు. అట్లే యొనర్చెదనని వాగ్దానము-చేసి, అదేవిధమున చేసితిని. నాసొమ్ము నాకట్లేచేరినది. తరువాత నేనా వాడనువిడచి, సంద్రతీరముచేరి, ఆఫకీరును దర్శించుటకై పయనమై, ఓడనెక్క ప్రయత్నించితిని, గాని ఆఓడ సరంగు ఖాళీలేదని నెట్టివైచినాడు. సమయమునకు దయాస్వభావుడగు, గుమస్తాసర్ది చెప్పి స్థలమునిచ్చి ఎక్కించినాడు. ఒదిగి

కోపర్గాంకి టాంగాలో వచ్చిచేరితిని. అచ్చటనుండి రైలులో పయనము సాగించితిని. ఇప్పుడే మశీదు చేరితిని!—కాని శామా, ఇప్పుడిట్టి మనము కాలవిలంబనము చేయరాదు. ముందు ఈ ఇరువురను, రాధమాయినొద్దకు గొనిపోయి, వారలభోజనవసతి చూడుము. "పాపము చాలాదూరమునుండి వచ్చినాడు" అని వారల పంపెను.

బాబా ఆనతి చొప్పున, శామావారి వారిద్దరిని వెంటగొని రాధామాయిమకాముచేరినాడు. స్నానానంతరము వారు సుఖాసీనులై భుజింప మొదలిడిరి. భోజనసమయమున, వారలిద్దరి నుద్దేశించి, శ్యామా ప్రశ్నించెను. 'సోదరులారా! బాబా చెప్పినకథ చిత్రముగా నున్నది. నేను ఎల్లప్పుడూ బాబాను వెంటనంటి సేవింపు చుందును. ఎన్నడూ ముప్పదివేల రూకలు బాబావద్దలేవే—అంతియేగాదు బాబా ఎన్నడూ సముద్రతీరము చూడనైనలేదే—షిర్డీనివదలి బాబా ఎచ్చటకు పోయి యెరుగడు. ప్రతిదినము అహోరాత్రములు నేనిచ్చటనే యుండి బాబాను సేవింపుచున్నాను—బాబా యొద్దనున్న డబ్బుపోవుట గాని, దొరకుటగాని ఎన్నడునూ జరుగలేదు. ఇందేదియో అర్థమున్నది. మీకేమైన అర్థమైనదా, తెలియజెప్పుడని ప్రశ్నించెను.

మహాభాగా! ఏలప్రశ్నింతువు—బాబా చెప్పినది మాకథయే, షిర్డీయుందుండెడి మీరు ఎంతటి అదృష్టవంతులు, శ్రీసాయి సర్వజ్ఞుడు, సర్వాంతర్యామి. సాక్షాత్ పరబ్రహ్మ స్వరూపము. అట్టి భగవదవతారమును సేవింపుచూ, ప్రత్యక్షముగ దరిశింపుచూ, ఆచిన్మయరూపునితో భాషింపుచూ, తోషింపుచూ, ఆనంద మనుభవింపుచున్నారు. శ్రీ సాయి దయాస్వరూపుడు. ఎచ్చటనోయున్న, మమ్ముల ననుగ్రహించి, తనతావునకు చేర్చినాడు. అని అందు మొదటివాడు తనకథ ఇట్లు చెప్పమొదలిడెను. వృత్తిఅనునది లేక, జీవనాధారము లేక, కలకొంచెము విద్యకై వెచ్చించి, ఉద్యోగమనునదిలేక దిగులుతో తిరుగుచుంటిని. అట్టిదురవస్థ యందు, వేరుదిక్కు లేక, చేతులుమోడ్చి నాఇష్టదైవమగు శ్రీదత్తమూర్తికి నమస్కరించి 'స్వామీ! ఏలనాకీకష్టములు కల్పించుట, దీనబంధూ, నీవేకాదన్న

నాకింక దిక్కెవ్వరు ? జీవనాధారము కల్గింపవా, ఎన్నినాళ్ళిట్లు ఆహారముకూడ లేక అభిమానమున ఇతరుల యాచింపలేక, యాతన పడగలను. ప్రభూ! నీవెట్టిదైననూసరి, ఉద్యోగము ప్రసాదించితివా, మొదటినెల నాకిచ్చు జీతముమొత్తము, నీకైంకర్యమునకు వెచ్చించెదనని మొరలిడితిని. ఆతండ్రి అనుగ్రహము కల్గినది. వారముదినములలో ఉద్యోగము లభించినది. మొదటినెలకు, పదునైదు రూపాయలు మాత్రము జీతమియ్యబడినది. ఆతరువాత దైవానుగ్రహమున వృద్ధికి వచ్చితిని. ఇప్పుడు నెలకు ఏడువందలు జీతముపైనున్నాను. బాబా ఆనతిచ్చినది, అక్షరములా నిజము కాని మందమతినగు నేను ఆవిషయమే మరచితిని, బాబా శ్రీదత్తాత్రేయుని అవతారము. అందుకు సందియములేదు. ఆకారణముచేతనే, నాకుతిరుగ బుద్ధిగరపి, జ్ఞప్తికితెచ్చి ఆపదునైదు రూకలనే, దక్షిణగస్వీకరించినాడు. అంతియే గాని, ఇది వాస్తవముగ దక్షిణకాదు, బాబా సర్వజ్ఞుడు, సర్వాంతర్యామి, ఎన్నడోజరిగి నేను విస్మరించిన విషయములు విశదముగ వినరించినాడు.

ఇక రెండవవాడు తనకధను చెప్పతొడగెను. సోదరులారా! నేను మొదట నిరుపేదను, పెక్కుకష్టములకు ఓర్చి ఆర్జించి ధనము చేర్చితిని. అదృష్టవశమున అనుకూల పరిస్థితులు ఏర్పడి, నాకు ఆదాయము వృద్ధిఅయ్యెను. ముప్పదిఅయిదు సంవత్సరములనుండి నాయొద్ద ఒక వంటవాడుండెను. నాయందు ఆదరాభిమానములు కలిగి, నమ్మికమీర నౌకరి చేయుచుండెను. మాఇంట ఆతనికి ఎరుకలేక ఏవస్తువునూ లేదు. వాస్తవమువకు ఖజానా తాళముచెవికూడా ఆతనివద్దనే ఉంచెడివాడను. కాని అతడెన్నడూ అందుండి కాని యైననూ, అపహరించి ఎరుగడు. దౌర్భాగ్యవశమున ఆతనికి దురభ్యాసము లబ్బినవి. అంతతో నాదురదృష్టమున కౌబోలు ఆతనికి మతిమారినది. ఆవేళ ముప్పదివేల రూపాయిలు, నోట్లకట్టను, పదిలముగ బీరువాయందుంచితిని. ఈ విషయమంతయూ నా నౌకరికి తెలియకపోలేదు. ఎప్పటివలె, ఆరాత్రికూడ ఆతడు, నాగదికి ప్రక్కన పంచలో పరుండెను. నేను ఒడలుమరచి హాయిగ నిదురింపుచుంటిని. అట్టిసమయ

మున అతడు మెల్లగా, కన్నుమువైచి, రాతినితొలగించి లోన ప్రవేశించి, నోట్లకట్టను, అట్లే అపహరించినాడు. ఉదయమగుసరికి ఆతని జాడలేదు. నాకు కలదంతయూ ఆముప్పదివేలే. నాకు మతిపోయినది-వెర్రివానివలె ఏడ్చుచూ, ఆబీరువాను చూచుచూ పంచలో పడియుంటిని. వారముదినములట్లే గడచినది. నాకు ఆకలి దప్పులనిపించుట గాని, కన్నుమూసి నిద్రించుటగాని కలుగలేదు.

అది సంధ్యాసమయము - ఆ పంచలో ముప్పదివేలు - ముప్పదివేలు, అని గొణిగి కొనుచూ, ఏడ్చుచుంటిని,అ ప్పుడొక ఫకీరునన్ను పలుకరించెను. నేను ఉలికిపడి, ముప్పదివేలు, ముప్పదివేలు, అని కేకలిడి, బిగ్గరగా ఏడ్చితిని. నన్నుఊరడించి నాకధఅంతయూవిని, ఆదయామయుడు భయమునదలుము నేచెప్పినట్లు చేయుము, నీవు కోల్పోయిన ధనమును, ఆతీసినవాడే తిరుగ తెచ్చి నీకియ్యగలడు. కోపర్గాము తాలూకా యందలి, షిర్డీ అను గ్రామమున శ్రీ సాయిబాబా అను మహాపురుషుడున్నాడు. ఆయనను స్మరించి, ప్రభూ, నాసొమ్ము నాకు చేరునట్లు అనుగ్రహింపుము, నీదరిశనముచేయువరకు, నాకు ప్రీతికరమగు ఆహారము వర్జింపుచున్నాను. నీదరిశన మయిన తరువాతనే ఆ పదార్థము ముట్టెదను, అని ప్రార్థించి, నీకు ప్రియతమమగు వస్తువును భుజింపుట మానివేయుము అట్లొనర్చితివా నీ మొత్తము వారము దినములలో నీకు చేరగలదని తెల్పినాడు. నేనునూ వెంటనే, సాయిని స్మరించి వరిఅన్నము (వరిబియ్యముతో వండినది) బాబా దరిశనము చేయువరకు, భుజింపను అని, నాసొమ్ము నాకుచేరునట్లు అనుగ్రహింపుమని ప్రార్థించితిని. నాటినుండియు, వరిఅన్నమును తినుట మానితిని. వారము దినములైనది. నా వంటవాడు, ఆ మరుసటి ఉదయము ముప్పదివేలనోట్లు కట్టనుతెచ్చి నాకడనుంచి, అయ్యా మన్నింపుడు. ఇన్నినాళ్ళు నిన్ను సేవించి బ్రతుకుచుంటిని. అదేమి కారణమో చెప్పలేను. ఆ నాటిరాత్రి నాబుద్ధి పెడత్రోవ పట్టినది. తండ్రివలె పోషించి ఆదరించు, నీకు ద్రోహముతలపెట్టి అపచార మొనర్చితిని. నేను మహాపాపిని నాతప్పు తెలిసికొని నీసొమ్ము నీకిచ్చి క్షమింపుమని వేడికొనుటకై వచ్చితిని. మీరేవిధమున శిక్షించిననూ సంతోష

ముతో అనుభవింతును. మీసొమ్మునుమాత్రము మీరు పుచ్చుకొనుడు ఇదుగో ముప్పదివేలు. అందొక్క కానియైననూ నేను తాకలేదు పశ్చాత్తాపముతో దహింపబడు నన్ను తిరుగ తమవద్దయుండునట్లనుగ్రహింపుడు. అని కాళ్ళపై బడెను. నాకుబడలు పులకరించినది. ముప్పది వేలు అని వెర్రిగా కేకపెట్టితిని. ఆ నోట్లకట్టను రెండు చేతులా ఎత్తి కన్నుల కద్దికొంటిని. సంభ్రమమున లోనికేగి పదిలపరచితిని. పాపమా తనిని పలుకరింపనైన పలుకరింపలేదు. అతడట్లేపంచలో పడియుండెను. మరునాడు ఉదయము యథాప్రకారము ఇంటిలో పనిచేయ మొదలిడెను. నేనుగాదని అదలించుటగాని, వలదనినారించుటగాని, చేయలేదు. ఆతడిప్పటికి నావద్దనే నౌకరీయందున్నాడు. నాడునాకుహితవు చెప్పినది, ఫకీరుకాదు, బాబాయేనని ధృవపడుచున్నది. ఆ తరువాత కొన్నినాళ్ళకు బాబాను దరిశింతమని బయలుదేరి రేవుచేరితిని. ఓడ బయలుదేరు వేళ కూడ సమీపించెను. లోనప్రవేశించుటకు ప్రయత్నించినంతలో సరంగు ఖాళీలేదని దిగివెళ్ళమని పట్టుబట్టినాడు, కాని అదేసమయమున అందలి గుమస్తా ఒకడు బ్రతిమాలి ఆ సరంగును ఒప్పించినందున పయనము సాగించితిని, ఇచ్చటకు చేరితిని. నావిషయమున అంతగ బ్రతిమాలి తావు చూపినది మాత్రము వేరెవ్వరు కాగలరు. శ్రీ సాయియే దయచూపినాడు, సందియములేదు. వందలాదిగ మైళ్ళదూరమందున్న, నన్ను అనుగ్రహించి ఆదరించి తనభక్తకోటియందు చేర్చుకొనుటయే గాక, నన్ను వెన్నంటి కాపాడినాడు. నేనెంతటి వ్యర్థుడను ఈషన్మాత్రమైన ప్రతిఫలమపేక్షింపక నన్ను రక్షించిన ఆ భక్త బాంధవునకు ముప్పదిఅయిదు రూప్యముల దక్షిణ నిచ్చెదనంటిని. నిర్హేతుక జాయమాన కరుణాసాగరుడగు శ్రీ సాయికి నాదక్షిణతో ఏమిపని. ముప్పది వేల రూప్యముల నాకిచ్చిన తండ్రి, నావల్ల ముప్పదిఅయిదు రూప్యముల ఏల ఆమోదించును. నేనెంత పొరబడితిని. బాబా సర్వాంతర్యామి సర్వజ్ఞుడు. అంతయూ తాను చూచినట్లు అక్షరమైన పొరబడకుండ జరిగినది జరిగినట్లు చెప్పినాడు. నా తెలివిహీనతను నాకు చూపినాడు. తన బిడ్డల పోషింపుటయే ఆ జగజ్జనకునకు ఆనందము. నిరంతరము అట్టి

దేవుని ఆరాధింపుచూ, సేవింపుచూ, ఆనందము అనుభవించు, మీ భాగ్యమే భాగ్యమని బాబాను స్మరించి ప్రణమిల్లెను.

బాబా, తన్నుచూడవచ్చెడి వారిని, దక్షిణలనిమ్మని, బాధించెడి వాడని, పెద్దమొత్తముల పుచ్చుకొనెడి వాడని, కొందరు దురభిప్రాయపడుటయేగాక, నిజమగు బాబాచరిత్ర, తెలియక పొరబడి ప్రచారముగూడ చేయుచుండిరి. అట్టివారల అజ్ఞానము తొలగించుటకే బాబా, తానేల దక్షిణల గొనుచుండెనో, ఆదియునూ ఎప్పుడెవ్వారివల్ల తాను అడిగితీసుకొనునో, తెలియజెప్పెను. మరొకప్పుడు బాబా, తాను ఒక్కరూపాయిని భక్తునివల్ల పుచ్చుకొన్నచో, పదిరెట్లాతనికిచ్చు భారము తనపై నుండునని తెలిపెను. ఆకథ మరియొక అధ్యాయమున చదువగలరు. ఎవ్వరినిక్కోరి బాబా దక్షిణలను అందుకొనునో ఆతడదృష్టవంతుడు. నాటితో వాని గతకర్మలు నశించుటయేగాక, ముందు భారమంతయూ, బాబాతనపై తీసికొనినట్లే. ఈ సూక్ష్మమును [illegible]పక, ధనపిపాసాపరులు, అట్టి పరమాత్మ దయకు పాత్రులగుట[illegible]ములు అంధులై అహంకారమున, అవకతవకగ మాటలాడెదరు. వారలగూడ, ఆదరించి, ఆ పరమాత్మయే రక్షించుగాక. బాబాకు దక్షిణతో ఏమిపని. భక్తులవద్దనుండి వచ్చిన సొమ్మంతయూ, సాయంత్రమగుసరికి, బీదసాదలకు పంచిఇచ్చెడివాడు. భక్తితో ప్రాకులాడు సాధకునకు, ఈ ధనము అవరోధమనియే బాబా అనుచుండెడివాడు. బాబా సాధ్యమగు నంతవరకు, ఈ కలిమి మూలమున, తన భక్తులు పెడమార్గమున పడకుండ, చూచెడివాడు. ఒకప్పుడు, బొంబాయి పట్టణమునుండి వచ్చిన శేట్ ఒకడు, కోటీశ్వరుడు, బాబాకు కూర్చుభక్తుడగు మహల్సాపతికి అధికముగ ధనము నిచ్చెను. బాబా అదిచూచినాడు. వెంటనే మహల్సాపతిని మందలించి, ధనమంతయూ తిరుగ శేట్‌నకు ఇచ్చివైచెను. నిజమగు బాబా భక్తులకు, ఈ ధనముకై పేరాసగాని, అనన్యమగు ప్రేమగాని, ఆసక్తిగాని, ఉండదు. అంతమాత్రమున బాబా భక్తులు దరిద్రులనిగాని, నిరుపేదలనిగాని భ్రమియకుడు. నా భక్తునిఇంట లేమిడి ఉండదన్న బాబా వాక్కుల మరువకుడు,

'యోగక్షేమం వహామ్యహం' అని బాబా అభయమిచ్చినాడు. భక్తుల పాలి మందారము, పెన్నిధి, కల్పతరువు, బాబా, మన అండనుండ, వేరువిధముల ప్రాకులాడి, మనము భయమొందనేల. పాత్రోచితమగు రీతిని, తనభక్తులకు అనువగుతీరున, బాబాయే పోషించి రక్షింపగలడు. కొరతయనునది లేక, సాగిపోవునట్లు శ్రీసాయియే సమర్థించును. మనకు వలయునది, మనమెరుంగక పోవచ్చును. సదా భక్త సంరక్షకుడగు శ్రీ సాయికిమాత్రము సర్వమూ విదితమే. మనము అడుగకయే, మనము ఎరుంగకయే, ఆతండ్రి అంతయూ సమకూర్చును. అట్టి బాబా పదాశ్రితులకు సమకూరని దేమున్నది. భక్తితో బాబాను సేవింపవలయునేగాని ఆభక్తునకు కొరతలేదు. ఐహికసౌఖ్యములుకూడ ఆతండ్రియే అనుగ్రహించును. బాబా దయకు పాత్రులమగుదుముగాక,

"ఓం శ్రీ సాయినాధాయ నమః"

## 13 వ అధ్యాయము

"తనయు ఔన్నత్యంబు తనమదికోరెడి
తండ్రివిధంబునన్ తనరువాడ
ఎట్టితప్పులనైన, ఇట్టేమన్నించెడి
మాతృదేవికిమించి మలయువాడ,
గతి తప్పకుండ సద్గతిచూపిబ్రోచెడి గురు
దేవునకుమించి పరగువాడ
అతిక్లిష్ట దశనేని ఆరనిప్రేముడి
చెలికానిమించుచు చెలగువాడ,

విశ్వ, విశ్వేశ, విశ్వాత్మ విమలరూప
నిత్య సత్యదయాశాంతి నిర్మలుండవు
ఇనుకపల్లిపురీశ, ఈశ,
సాయిదేవేశ మముబ్రోవ వేడువాడ."

పరమాత్మ స్వరూపియగు బాబా, భక్తపాలనకై షిర్డీయందు వేంచేసినాడు. తానే భగవంతుడనని ఇన్నివిధముల, భక్తులకు విశ్వాసము కుదురగలందులకు, తెలియ చెప్పినాడు. అనుమానము లంతరింప, నిదర్శనాపూర్వకముగ తన నిజతత్వమును బోధపరచినాడు. ఇతరయుగములయందు, భగవదవతారమూర్తులను, భగవదంశ సంభూతులను, భక్తులు గుర్తించి సేవించేడివారు. కాని ఈ కలియుగమున అట్లుకాదు. కారణసిద్ధాంతములే ముఖ్యము. ఎల్లప్పుడూ అనుమానములే వెంటాడుచుండును. ఎప్పటికప్పుడు ఇది నిజమా, అన్న సంశయమే తలఎత్తును. అందులకే కరుణామయుడగు పరమాత్మ అనేకవిధముల, ప్రజల విజ్ఞానము వృద్ధిచెంద, తనఅంశతో మహాపురుషుల పంపినాడు. ఎందరెందరు మహాత్ములు జన్మించి ప్రబోధించిననూ, మనకు దృఢవిశ్వాసము కుదురుట లేదు. మనలను ఉద్ధరించుటకొరకే మహాపురుషులు లీలలను ప్రదర్శించుట, బాబా కేవలము షోడశ కళాప్రపూర్ణమగు భగవదవతారము. బాబా తాను భగవంతుడనని మనకు జ్ఞానోదయమగుటకు తన లీలలచూపినాడు గాకయున్న వానివలన బాబాకు ప్రయోజనమేమున్నది. మనము ఎన్నివిధముల పెడమార్గము పట్టుచున్ననూ, మనల క్రమమార్గమునకు త్రిప్పుటకే దయాసముద్రుడగు సాయి సాయపడుట, ఇట్టిదైవమును సేవించుభాగ్యమబ్బుట మన అదృష్టము.

ఠాణాజిల్లాయందలి, దాహమ్, అను గ్రామమున, మమల్తదారు, దేవ్. ఈతడు బాబా భక్తుడు. తరచు షిర్డీకి పోయి బాబాను సేవించెడివాడు. దేవ్ తల్లి, ఒకనోము ఉద్యాపన తలపెట్టినది. ఆ వ్రత విధానము ననుసరించి, రెండువందలకు తక్కువగాని బ్రాహ్మణులకు భోజనమిడవలసి యున్నది. ఆ వ్రతమునకు విరివిగా ఖర్చుపడి, వైభవముతో ఉద్యాపన ముగింపవలయునని, దేవ్, సంకల్పించెను, అందుకవుసరమగు సన్నాహములన్నియూ పూర్తిఅయినవి. నిర్ణీతమగు పుణ్యదివసము కూడ సమీపించుచుండెను. అంత వైభవముగ జరుగు, ఆ సమయమున, తన భగవంతుడగు బాబా, తన్ను అనుగ్రహించి, తన ఇంట విందారగింప వలయునని తనకోర్కె. షిర్డీచేరి బాబాను ప్రార్థించి

నాడు. భక్తితో కోరిన ఆ కోర్కెను, భగవంతుడగు బాబా, కాదనగలడా! దేవూ! నేను తప్పక వచ్చెదను, ఒంటరిగ మాత్రముకాదు, మరిఇద్దరిని వెంటగొని వచ్చెదను అని చెప్పెను. దేవు పరమానందముతో ఇల్లుచేరినాడు. తనతల్లికి నమస్కరించినాడు. అమ్మా! మనతండ్రి బాబా, తాను స్వయముగ, నీనోము ఉద్యాపనకువచ్చి విందారగించెదనని వరమిచ్చినాడు. తానొక్కడేగాదు, మరిఇద్దరను వెంటగొని వచ్చునట, భగవంతుడే, ప్రత్యక్షముగ మనఇంట విందారగింపగలడు. నీనోము ఫలము పండినది. నీవు ధన్యురాలవు, నా జన్మ తరించినది. నాతండ్రి అనుగ్రహించినాడు. నాఇంట వేంచేసి, విందారగింప గలడు, అని సంభ్రమముతో ముచ్చటించినాడు.

బాబా, ఎన్నడునూ, షిర్డీ, వదలి ఇతర గ్రామములకు పయనము చేయుటలేదని, దేవ్‌కు తెలియకపోలేదు. కాని సర్వవ్యాపియగు శ్రీసాయి, ఏదోరూపమున తనఇంట తప్పక విందారగింపగలడన్న విశ్వాసముతో తగుసన్నాహములన్నియూ చేయుచుండెను. నోము ఉద్యాపనకు ముహూర్తము నిశ్చయింపబడినది. ఇంకనూ మాసమురోజులే వ్యవధియున్నది. గోసంరక్షణకు, చందాల వసూలుకని, ఒకనాటి ఉదయము, ఒక సన్యాసి, దాహామ్, స్టేషనుకువచ్చెను. ఆతని వేషభాషలు, బెంగాలీయని, స్ఫురించుచుండెను, స్టేషన్ మాష్టరుతో ముచ్చటించెను. ఆమాష్టరు గ్రామమందలి మమల్తదారుతో మాటాడినపని జరుగగలదని తెలిపెను. సమయమునకే, మమల్తదారు, మన దేవ్, కూడ స్టేషనుకువచ్చెను. ఈ సన్యాసి చందాల విషయము హెచ్చరించెను. ఆపట్టణవాస్తవ్యుడు, రావుసాహెబ్ నరోత్తమ దేవ్, అప్పుడే మరొక ధర్మకార్యమునకని చందాలు వసూలు చేయుచున్నందున, తిరుగ ఈ గోసంరక్షణకని అప్పుడు చందాలు అడుగుట ఉచితముకాదని, ఒకమాసము రోజులైననూ తడవిచ్చి వచ్చిననచో అనుకూలముగా యుండునని, దేవ్, ఆ సన్యాసికి చెప్పెను. సరియని సన్యాసి వెడలిపోయెను.

మాసమురోజులు గడచినది. నాడు గోసంరక్షణ చందాలకని వచ్చిన, సన్యాసి, సరాసరి, దేవ్ ఇంటిముంగిట, టాంగానుండిదిగెను.

లోనికేగుసరికి దేవ్, నోము ఉద్యాపన సన్నాహములో, హడావిడిగ తీరికలేక యుండెను. అదిచూచి, ఆ సన్యాసి, దేవ్ నుద్దేశించి, 'అయ్యా, నేను చందాలకనిరాలేదు, భోజనమునకు వచ్చితిని. నాతో బాటు మరిఇద్దరు మిత్రులున్నారు, ముగ్గురమూ రాగలము', అన్నంతలో 'తప్పక దయచేయుడు, అభ్యంతరమేమున్నది. నేడు మాతల్లి గారి నోము ఉద్యాపన, కొంచెము ఆలస్యముకాగలదు. ఇంకనూ రెండుగంటలకు పైనవ్యవధి యున్నది. తమమకాము, ఎక్కడనో తెల్పినచో, తిరుగవేళకు కబురంపుదును, అని దేవ్ చెప్పెను, వెంటనే ఆ సన్యాసి, బాబూ, మీకు శ్రమఏల, మీరు కబురంప నవుసము లేదు, కార్యార్థివి, వేయిపనులు, కావలెనని భోజమునకై వచ్చిన మాకు మరల మీకబురేల? సరిగసమయమునకు మేమేరాగలము. నేనుగాక మరి ఇద్దరున్నారు సుమా! అన్నంతలో, అయ్యా, ధన్యుడను, ముగ్గురుమూర్తులు నా ఆతిథ్యమంగీకరించుట నా అదృష్టము, మీ కొరకై ఎదురుచూచుచుందును. ఆలస్యము చేయకుడు సరిగ మధ్యాహ్నము పండ్రెండు గంటలగుసర్కి వడ్డన జరుగగలదు, పండ్రెండు గంటలగుసరికి దయసేయుడు, పని తొందరలోనున్నందున, తమతో ముచ్చటించుటకు వ్యవధిలేకున్నది, క్షమింపుడని, దేవ్ సెలవు తీసికొనెను. ఈ సన్యాసియూ చిరునగవుతో ఈవలకు వచ్చెను.

మధ్యాహ్నము పండ్రెండు గంటలైనది బ్రాహ్మణులు పంక్తులు తీర్చి కూరుచుండిరి. వేదపారాయణములతో, విధ్యుక్త మంత్రములతో క్రతువు సాగుచున్నది. మనసన్యాసి మరి ఇద్దరితో హాజరయ్యెను. సాదరముగ, దేవ్, వారిని గొంపోయి ఉచితాసనముల ఆసీనులచేసెను. ఆ క్రతువు బ్రహ్మాండముగ, ఎట్టిలోపమునూ లేక, బ్రహ్మానందముగ సాగిపోయినది. భూరిదక్షిణలతో, దేవ్, బ్రాహ్మణుల సత్కరించి పంపెను. దేవ్ కూడ భుజించినాడు. బాబా, రాలేదుగదా అని బాధపడెను. వెంటనే షిర్డీయందున్న జోగ్ అను సోదరభక్తునకు, జాబు వ్రాసినాడు. మనతండ్రి నన్నేలమోసగించెనో తెలియదు, తనతో బాటు ఇద్దర తెచ్చెదనని అనుగ్రహించిన ప్రభువు, నన్నేల కనికరింపలేదు – నావలన ఏమి దోసగు పొసగినది. లోపములున్న సరిదిద్ది

రక్షింపవలసిన క్షిప్రప్రదుడు, ఏలనన్ను నిరాకరించెను. ఎట్లయిననేమి, బాబా పద ధ్యానముతో క్రతువు సాగించితిమి, సక్రమముగా సాగిపోయినది. నమస్కారపురస్కారముగా ఈ విషయములు బాబాకు విన్నవింపుమని అందు తెలిపెను.

ఆ ఉత్తరమును అట్టేపట్టుకుని జోగు బాబాను సమీపించెను. ఇంక నూకవరును తెరువలేదు. బాబా చిరునగవుతో, నేను తన ఇంట ఉద్యాపనకు వచ్చెదనని నమ్మించి, వెళ్ళలేదని నన్ను నిందింపుచూ నేను మోసముచేసితినని, దేవ్ వ్రాసినాడు అంతియే, జోగూ, వెంటనే జవాబువ్రాయవలసినది. ఈసాయిమోసగాడు ఎన్నటికినీగాదు. చెప్పిన తీరున ముగ్గురమూ వెళ్ళితిమి ఆతడు మమ్ము గుర్తింపలేదు. రమ్మని ఆహ్వానించినవాడు వచ్చినవారిని విచారించి గుర్తింపవలదా. అట్టిదానికి ఆహ్వానమంపనేల – నేను అతనికి గుర్తుపరచితిని, తెలియచెప్పితిని, బెంగాలి సన్యాసి తాను చందాలకు రాలేదని, డబ్బుకుగాదని భోజనమునకు మాత్రమే వచ్చితినని ఒక్కడనేగానని మరిఇద్దరుకూడ వత్తురని మా కొరకై తిరుగ కబురు అనవుసరమని సమయమునకు సరిగా రాగలమని ఇన్నివిధముల తెలిపి ముువ్వురము భుజించితిమి. ఇప్పటికైన గుర్తు తెచ్చుకొమ్మని, వ్రాయవలసినది. ఆతడెరింగిననూ ఎరుంగకున్నను నేను నమ్మిసేవించు భక్తునిఇంట ఉండియే తీరుదును. నా పదధ్యానముతో, నన్ను స్మరింపుచూ, మీరుచేయు పనులకు, ఎన్నటికీ ఎట్టి విఘ్నములునూ ఉండజాలవు. ఇన్నినాళ్ళు ఇచ్చట నుండియూ ఇదిమీరు గమనించుటలేదు. ఈగోసాయి రూపమున్ననేగాని, సాయిగాదని భ్రమపడకుడు. నాభక్తులు ఎప్పుడు భక్తిపూర్వకముగా, ప్రేమతో నన్నుతలచి పిలచిన అప్పుడే వారిచెంత నుండగలను. నాకు రైలుగాని బండిగాని ఓడగాని పనిలేదు. ఈ నమ్మకముతో మీరు సేవింపుడు. మీకెట్టి ఆపదయూ గలుగదు. ఎల్లపుడు మిమ్ము వెంటాడి తిరుగు చుందునని గ్రహింపుడు. మీరుగుర్తించిననేమి, గుర్తింపకున్ననేమి, నా భక్తుడైన వాని బాగోగులుచూచి పాలించుటయే నాపని అని మందహాసముచేసెను.

జోగ్ వ్రాసినజాబు, దేవ్ కు చేరినది. మహదానంద మొందెను. తనదైవము తన్ననుగ్రహించి, ప్రత్యక్షముగ తనఇంట విందారగించి నందులకు, ధన్యుడనని తలపోసెను. జన్మజన్మాంతరముల, అజ్ఞానము, అజ్ఞే గుట్టయై వెంటాడుకున్న, ఇట్టి జ్ఞానస్వరూపి సమక్షమున, ఇన్ని నాళ్లు సేవచేసియూ, నాకీమూఢత్వమేల వదలదని వాపోయెను. అట్టి పరమ మూఢులనుగూడ ప్రజ్ఞావంతుల చేయుటకు, అవతరించిన పరమ దయాళువు, బాబా, అనిగ్రహించెను. బాబా మందిరముచేరి, "తండ్రి ఎన్నటికింక నాకుజ్ఞానము అబ్బుట–ఇన్ని విధముల తెలియజెప్పిననూ, తెలియలేని మతిహీనుడను. ప్రభూ! నీ అనుగ్రహముగాక, నన్ను ఉద్ధరించుట కేమున్నది. బాబా నీపదసేవకన్న నాకు అన్యమేమియూ వలదు. ఎట్లుగాపాడెదవో అని పలుభంగుల ప్రార్థించి మేనుమరచెను. నాడుకాదు నేడుకూడ ఆ చిన్మయాకారుడు మనలపాలింపగలడు. ఆర్తి మీార బాబా అనిఎలుగెత్తిపిలచిన పరువిడి మనఅండనుండ గలడు. ఇందుకు సందియములేదు. నాసమాధినుండియే సమాధానమిచ్చెదను. పిలచిన పలికెదను, తలచిన దరిశన మిచ్చెదను, అని అభయమిచ్చిన ఆ తండ్రి మనలనున్నించియే తీరును. అట్టి శ్రీ సాయికి ప్రణమిల్లుదము.

"ఓం శ్రీసాయి నాధాయినమః"

# 14 వ అధ్యాయము

ప్రణవాకారమగు బాబా, సకలసాధువుల స్వరూపము. సర్వాంతర్యామి. సకల చరాచరగామి. భేదమనునదిలేక, ఏ పేరున ఎవ్వరే మూర్తిని స్తుతించి సేవించిననూ, తానే అన్నిటినీ, అందుకుని అనుగ్రహించెదనని అభయమిచ్చిన అవతారపురుషుడు, తానే సకలదేవతా స్వరూపము. బాబా అనుమతితో, బాబా ఆజ్ఞననుసరించి, బాబా లీలలరచించి మనకంద జేసినది, అన్నాసాహెబ్ ఈయనయే, హేమాద్పంతు.

అది 1917 వసంవత్సరము. బాబా పదసేవాసక్తుడగు హేమాద్పంతు (అన్నాసాహెబ్) బాబా భజన మొనరించి, బాబాపదధ్యానముతో, నిదురింప బోయెను. నాడు నిండు పున్నమ. పున్నమచంద్రుడు, తన వెండితెర విసరివైచి ఆనందింపుచుండెను. అప్పుడే ఆతనికి కునుకువచ్చినది. ఒడలుమరచి నిద్రమాత్రముకాదు. ఆ జాను బాహుడు విశాల వక్షుడు, మహత్తర తేజోమూర్తి సర్వసల్లక్షణ శోభితుడు, సన్యాసి ఒకడు దరిశనమిచ్చెను. హేమా! నేను రేపు నీఇంట విందారగింతును సుమా, నీకు తెలుపుటకువచ్చితిని, అని ఆతని సంబోధించి, లేపి, చెప్పి, అదృశ్యుడయ్యెను. అన్నాసాహెబ్ కన్నులు నులుముకొనుచూ బాబా బాబా అనిపిలుచుచూ లేచినాడు. కాని ఆ సన్యాసి లేడు బాబా ఎందుపోయితివయ్యా! అంతతొందరఏమి కల్గినది. నాతండ్రీ నన్ను మేలుకొలిపినవాడవు నాతోసంభాషింపకయె పరువిడితివా! నాతండ్రీ, సాయిశా, అని బాబా పటమునకెదుట సాష్టాంగ పడెను. బాబా, నీవుసత్యవాదివి. నీబిడ్డలయందు నీకు ఎంతదయ. నీకై నీవు నాఇంట ఆతిధ్యమంగీకరింతునని, అనుగ్రహించితివే, జగజ్జనకా లేమిడికుంది కృశించు నేను నీకేమి విందుచేసి, ఆరగింప పెట్టగలనయ్యా. ప్రభూ, అపహాస్యమునకు అట్లంటివా. భక్ష్యభోజ్యముల, నేను పెట్టలేను తండ్రీ అదినిజమే నాయింటనున్నదంతయూ, నీప్రసాదమేగా, నీవు ప్రేమతో నాకిచ్చినది, నేను భక్తితో నీకుఅర్పింతును. నాజన్మతరించినది. నాతండ్రి నాఇంట రేపు అతిధి అని కేకెసలుకొట్టుచుండెను. ఆసందడికి అతనిభార్య మేలుకున్నది. ఆమెను చూడగనే ఆతడు సాధ్వీ! రేపు ఆరీ పండుగకదూ, మనఇంటికొక సన్యాసి భోజనమునకు రాగలడు రోజువలెగాక మరికొంచము బియ్యమువేసి వండుము – పాకము రుచిగయుండవలె – ఆవచ్చు అతిథి సామాన్యుడు కాదు. పాకశాస్త్ర ప్రవీణుడు – కలవారెందరో ఆతని ఆశ్రయించియుందురు — ఆతడేది కోరిన ఆవంటకములవారిచ్చెదరు – అంతమాత్రమున ఆతడు పేదసాదల తృణీకరింపడు–పేదల ఇంటిప్రసాదమే భోగ్యము రుచికరము, అనిపలుమారులు ప్రశంశించును, మరిఅట్టి అధితిని ఎట్లు తృప్తిపరచెదవో, అనెను. ఆమెకేమియూ అర్థముకాలేదు. స్వామీ

అర్ధరాత్రమున ఈసంబరమేమిటి. ఆమహానుభావుడెవ్వడు, ఎచ్చట నుండిరాగలడు. ఇన్నిబిరుదులు గల ఆమహానుభావుడు నిద్రలోగాని కన బడడా అన్నది. హెమాద్పంతు తనుకలగన్న చందముచెప్పి, మరుసటి ఉదయము శ్రీసాయియే తమఇంట అధితియై భుజింపగలడని తెల్పెను అందుకా అమాయకురాలు ఏమంటిరి సాయి షిరిడీవిడచి, బంద్రాకు వచ్చుటయా, మన ఇంట భుజించుటయా, అనినది. తోడనే హేమా ద్పంతు, తన్వీ, నీవన్నది నిజమే కాని నీవెంతటివెర్రిదానవు. శ్రీసాయి ఆ షిర్డీయందు మాత్రమేగలడనియా నీయూహ, ఆతండ్రి ఇప్పుడిక్కడ మనతో లేడా, అధితియై మనఇంట ఆరగించెదనన్న సాయిరాకమా నడు, వచ్చియేతీరును. అది ఏరూపమున రాగలడో మనమెరుగము— కానిఎట్లయిననూ భోజనమువేళకు తప్పక రాగలడు. నీవు ఆ బాబా పదములపై చిత్తమునిలిపి, బాబా నామస్మరణతో వంటకముల చెయ్య వలసినది. అనిచెప్పెను.

తెల్లవారినది. శ్రీ సాయి తనఇంటికి చేరునన్న సంబరముతో, స్నానసంధ్యాధుల పూర్తిచేసి, బాబామందిర మలంకరించి, పూజా ద్రవ్యముల సేకరించినాడు. ఆ తల్లి తెల్లవారకమునుప, ముంగిట రంగు రంగుల ముగ్గుల అలంకరించినది. అర్ధముగాని, ఆతురత, చెప్పలేని ఆనందము. సుంగధద్రవ్యముల వెలిగించినారు. ఆ సాయీభక్తుని అదృష్టమే, అదృష్టము. అంతయూ సాయీమయముగ, తన్మయత్వ మనుభవింపు చుండెను. బాబాసంకీర్తనతో వంటకములైనవి. హేమా ద్పంతు పంచటరుగుపై చేరినాడు. సాయి ఏ రూపమున అనుగ్రహించి వచ్చునోయని చూచుచుండెను. మధ్యాహ్నమైనది. బాబాజాడ లేదు. పూజాదికములు, పూర్తిఅయినవి. నైవేద్యముకూడ అయినది. పీటలు పరచి రెండుపంక్తులుగ ఆకులువైచిరి. మధ్య ఉన్నతాసనముంచిరి, పరి శుభ్రమగు పెద్దఆకుయందు పదార్ధము లన్నింటిని వడ్డనచేసిరి. అభి కరణముగూడ అయినది. ఎటునుండి బాబావచ్చునోయని, హేమా ద్పంతు, భక్తితో బాబాను స్మరింపుచూ చూచుచుండెను. అంద రునూ, ఆపోశనలకు సిద్ధమగుచుండిరి. ఆ సమయమున, భోజనముల

చావడికి ప్రక్కగదిలో, అడుగులసందడి అయినది. ఆత్రముతో, అన్నాసాహెబ్, ఆవైపు పోయెను.

ఆలీమహమ్మద్, మౌలానా ఇస్మూముజావార్, అను ఇరువురు ముస్లీములు, అన్నాసాహెబ్ కు నమస్కరించిరి. అయ్యా! మీ బంధువులతో మీరు భోజనమునకు సిద్ధమగుచుండగా, మీకు అడ్డుతగిలితిమి, క్షమింపుడు, తాము విస్తరివద్దనుండి లేచివచ్చినట్లున్నది-ఇతరులు మీకై ఎదురుచూచుచున్నారు. ఆలసింపక, ఇదిగో, మీ వస్తువు, తీసికొనుడు, వెంటనేభోజనమునకు వెళ్లుడు, తరువాత,తీరికగా మీకీ వస్తువుకథ తెలిపెదము అనుచూ, ఆలీమహమ్మద్, వద్దనున్న వస్తువును, హేమాద్పంతునకందించి, చరచర ఇరువురు ముస్లిములు తరలిపోయిరి. ఆవస్తువేమియో బయటకగపడుటలేదు, రెండుపత్రికలలో, చుట్టబడి, బందోబస్తుగత్రాళ్లతో కట్టబడియుండెను. ఆత్రముతో, అన్నాసాహెబ్ అద్దానిని విప్పెను అందున్నదేమి, శ్రీ సాయీశుని చిత్రపటము-చక్కనిచట్టమున అమర్చబడియున్నది. అన్నాసాహెబ్ ఆనందమునకు మేరలేదు.ఒడలు పులకరించినది. కన్నులనీరు గ్రమ్మెను. బాబా, అని బిగ్గకౌగలించుకుని, హేమాద్పంతు, ఆ పటమును, కన్నులకద్దుకుని, పంక్తుల మధ్యఅమర్చిన ఉన్నతాసనమునఉంచెను. శిరమువంచి బాబా పదములనంటి నమస్కరించెను. ఎదుటవిస్తరియందు, సమస్తము వడ్డన అయినది-బాబాపటమున పుష్పమాల నుంచెను. ఆతడు ఆపటమునకే ఆపోశనమిడి, విసనకర్రగొని, ప్రక్కనకూరుచుండి విసరుచుండెను. ప్రత్యక్షముగా బాబాయే అచ్చటకూరుచుండి భుజింపుచుండెననియే, అన్నాసాహెబ్ తలంచెను. అంతియేగాని, అచ్చటనున్నది పటమన్న భావమే ఆతనికిలేదు. కరుణామయా, ఇంత ఆలస్యముచేసితి వేలనయ్యా తొందరపడి మేము భుజింతుమనుకుంటివా, అట్లెన్నడునూ జరుగదు. నీవింక ఒక్కక్షణము రాకయున్నచో, నేను ఈ నాటికి ఉపవసించియుందును. తండ్రీ నీవెరుగని దేమున్నది-నీవు నీబిడ్డల అక్కేల ఉపేక్షించెదవయ్యా కటాక్షించికానవలెనని, నాఇంటికిరాగలనని తెలిపిన నీవేల రాకుందువు; అని బాబాతో భాషింపుచూ, తొందరలేదు తండ్రీ,

వంటకము లెట్లున్నవి. ఏమో నీవు వత్తువన్న సంబరముతో చేసినవి.
రుచ్యములగునో కావో, ప్రభూ! నీకని ప్రత్యేకముగ చేయబడినవి. ఈ
ఫేణీలు, ఏలతీసుకొనవు, నీవు తినకున్న నాకుమాత్ర మేల, ఒకటి పుచ్చు
కొనవయ్యా! అని బుజ్జగింపుచూ, బ్రతిమాలుచూ, ప్రాధేయపడుచూ,
బాబాను తానుచూచుచున్నట్లే ప్రవర్తించెను. భోజనములైనవి.
శుభ్రమగు ఉత్తరీయముతో పటమున తడియొత్తెను. తమ్ములము
నిడెను. ప్రక్కగదియందు పానుపమరించి, బాబాను అందుసంకీర్తనతో
నిదురింప జేసెను. తరువాత ఆ దంపతులిద్దరూ, బాబాప్రసాదమని భోజ
నము ముగించిరి. చిత్రపటమందున్న శ్రీ సాయి ఆ రూపమున, అన్నా
సాహెబ్ ను అనుగ్రహించినాడు. ఆ పటమునకునూ, బాబాకునూ,
భేదమే లేదు. ఆనాటి విందును బాబా ఆరగించియే యుండును. అచేతన
మగు ఆ పటమునందుకూడ బాబాను ప్రత్యక్షముగ చూచి, ఆనందిం
చిన అన్నాసాహెబ్ ధన్యుడు. చేతనాచేతన బేధములేక, తన భగ
వంతుని, అంతటచూడగల ఆ భక్తిఅబ్బిన, హేమాద్పంతు పూజ్యుడు.
ఇదియే విగ్రహారాధనయందలి విశిష్టత, పటమను భ్రాంతిలేక, చైతన్య
మూర్తియగు బాబాను దర్శించుటకు వలయునదిభక్తి. మరియొక్క
విషయము గమనింపవలసి యున్నది. నాటికి బాబా ఇంకనూ శరీరము
త్యజింపలేదు. వలయునన్న, ఏరూపమున అతిథియై బాబా, ఆ విందార
గింపరాడు. దేవ్ ఉద్యాపనకట్లు జరిగించినది, క్రిందటి అధ్యాయమున
చూచితిమి. ఇప్పుడిట్లేల చిత్రపటముగ అచ్చటకేతెంచెను? ప్రత్యక్ష
మగుటకునూ, అభయమిచ్చి అదరించుటకునూ, ఆ ఆతిధ్య మంగీకరిం
చుటకునూ, శరీరమే ఆధారమని పొరబడకుడని, నిరూపించిచూపెనో
ఏమో, బాబాపటము నిర్జీవముగాదని, చిత్రమున్నచోటనెల్ల తానే
ఉండునని ప్రబోధించెనో ఏమో, 1918న నిర్యాణమైనది. అంత
మాత్రమున భయములేదు. శరీరము త్యజించిననూ మీయండ నేనుం
దును. నా పటముఉన్న నేనున్నట్లే, పటమని భ్రమయకుడు. భక్తికల్గిన
నాడు, నా పటమే భాషింపగలదని తెలియచెప్పెనో ఏమో, అదినాకేమి
ఎరుక. చైతన్యమూర్తియగు శ్రీసాయి చిత్రముగూడ, సాయియే

యని పూజించుటయే నాపని. అందగపడి ఆదరింపుమని ప్రార్థించుటయే నావిధి.

ఇక ఈపట మెక్కడిది. సరిగ ఆసమయమునకే ఆపటము అన్నాసాహెబ్‌కు అందుటేల. ఇదిసాయిలీల. తొమ్మిదిసంవత్సరము లైన తరువాత ఈ ఆలీమహ్మద్, హేమాద్పంతును కలిసుకలిగెను. అప్పుడీ పటమువిషయము ఇట్లుచెప్పెను. నాడుపటమిచ్చిన ఆతడు తొమ్మిదివత్సరములు కలియనేలేదు. ఈతడు బొంబాయి పరిసరప్రాంత ములనున్న బంద్రా నివాసి. ఒకనాడు బొంబాయి పట్టణమున తిరుగాడు నప్పుడు బాబా పటమునుకొని, దానికిచట్టముకట్టించి బంద్రాలో తన ఇంట గోడపైనుంచెను. బాబా యందుభక్తికలవాడగుటచే ప్రతి ఉదయము ఆపటమునకెదుట సాగిలపడి ప్రార్థించి ఇతరపనులకు వెడలెడివాడు. నాడుహేమాద్పంతుకు ఆపటమునిచ్చుటకు ముందుసరిగ మూడు మాసములనాడు, ఈఆలీమహమ్మదునకు పిక్కవాచి శస్త్రచికిత్స చేయకతప్పినదిగాదు. అందుచే ఆతడు తనబావయగు నూర్‌మహ్మదు పీర్‌భాయి అను నాతని ఇంటియందు బొంబాయిలో ఉండవలసివచ్చినది. ఈ నూరుమహ్మదు బాబాలబ్దుల్‌రహిమాన్‌యొక్క శిష్యుడు. ఆ గురువుగారి పటమును పెద్ద ఫొటోలు తయారు చేయించి, తన మిత్రులందరికి ఇచ్చుచూ బావమరిదియగు ఆలీమహ్మద్‌కు కూడనొక పటమునిచ్చెను. ఆలీమహమ్మదన్ననో సాధుసేవ, సత్‌చింతన కలవాడు. ఆ కారణమున బంద్రాయందు తన ఇంటనున్న బాబా తాజుద్దీన్ మౌలానాసాహెబ్, మహమ్మద్‌హుశ్శైన్, శ్రీసాయిబాబా చిత్రములతోబాటు, ఆ పటమునుగూడ గోడపైనుంచి, భక్తితో ఆరతులనెత్తి ఆరాధింపుచుండెను. ఈ నూర్‌మహ్మమ్మద్, తనగురువు పటమును గొని, భక్తితో గురువునుచేరి, ఆయన పాదములకడనుంచి, గురుదేవా, ఈ పటమునుచూచిన, ప్రత్యక్షముగ తాము నావద్దయున్నట్లే తలంచెదను. తాముస్పృశించి, ఆశీర్వదించి నాకీయుడు, అని వేడుకొనెను. కాని ఆ గురువునకు విగ్రహారాధనమన్న గిట్టదు. అన్యమతద్వేషి. ఆ కారణమున అనుగ్రహించి ఆనందించుటకుబదులు, ఆగ్రహముతో అట్లే

ఆ పటమును పల్లెవానికిచ్చి, సముద్రమున ముంచిరమ్మని పంపెను. సోదరభక్తుల సమక్షమున, తనగురువు అట్లుచేయుటచే, నూర్ మహమ్మద్ కించపడి, తాను తనమిత్రులకిచ్చిన పటముల నన్నింటినీ, తిరుగ తెచ్చి సముద్రమున ముంచెను. తాను శ్రమపడి తయారుచేయించి నందులకు ఫలము, తనగురుదేవునకు కోపము కలిగించుటయేనా, అని వ్యధపడెను.

అప్పటికింకనూ, మనఆలీమహమ్మద్, ఈ నూర్ ఇంటనేయుండి, చికిత్స పొందుచుండెను. నూర్ మహమ్మద్ తన బావమరదితో ఆలీ, నీ ఇంటనున్న మహాత్ముల పటములన్నియూ సముద్రమున ముంచిననే గాని, నీకీబాధతీరదు. ఇది నాగురుదేవునికోరిక. నీవు పటములన్నియూ సముద్రమున పారవేయవలసినదే అని పట్టుబట్టెను. నాటికాతడు, బంద్రాయందలి తన ఇల్లువిడచి, మూడుమాసములు అయినది. ఇంట నెవ్వరునూ కాపురములేరు. దీపమనునదిలేదు-హారతిలేదు, ఆరాధన లేదు. ఈ భక్తునితోబాటు, ఆ దైవస్వరూపులుకూడ దుర్దశనే అనుభవింపుచుండిరి. ఎంతటి జ్ఞానవంతులకైననూ, ఈ దురవస్థ కర్మానుసారము, అనుభవింపకతీరదో ఏమో, పాపము, ఆలీమనస్సు అందుకంగీకరింపలేదు. కాదని చేయగలిగినది ఏమియూలేదు. ఒక్కపరుగున బంద్రాచేరి, నూర్ మహమ్మదే ఆయింతపని చేయునట్లుండెను-మత్సరమెంతచేయదు. పాపము, అల్లీ తనదుబాసీని పిలిపించి బంద్రాయందు తన ఇంటియందున్న పటములన్నింటిని కట్టగట్టి సముద్రమున వేయమని పంపెను. తరువాత రెండుమాసములు అల్లీ, అట్లేతనబావయింటకాలము గడిపెను. తరువాత స్వస్థత చేకూరినంతనే, ఆత్రముగ బంద్రా చేరెను. బీగముతీసి లోనప్రవేశించినాడు. ఇల్లంతయూ చిందర వందరగ యున్నది. ఎటుచూచిననూ, బూజు వ్రేలాడుచున్నది. మోకాటిలోతున దుమ్ము, కారువాసన, ఎదుటనున్న పటములేమియూ గోడపై లేవు. మేకులుమాత్రమే యున్నవి. కాని శ్రీ సాయీశుని పటముమాత్రము చెక్కుచెదరక, అట్లేగోడపై వ్రేలాడుచున్నది. ఒక్కపరుగున అల్లీ బాబాయని కేకపెట్టి ఆ పటమును చేరినాడు. పదే, పదే, బాబాపాదముల కన్నులకద్దికొనెను. బాబా, నీవుమాత్రమెట్లు తప్పించుకుంటి

వయ్యా, నీవునూ సముద్రముచేరి యుందువని తలంచితిని. నీ లీల లద్భుత ములు, నిన్ను దుబాసీ చూడ నేలేదా, నూర్ మహమ్మద్ వచ్చిచూచి నచో, తిరుగ ఆ పటమునుగూడ సముద్రమున పార వేయునను భయ ముతో, వెంటనే ఆ బాబాచిత్రమునుతీసి, బీరువాయందు భద్రపర చెను. ఈ పటమును ఎట్లుకాపాడుటయూ, ఎవ్వరిపరముగనిచ్చిన, బాగుండునాఅని బాధపడుచుండెను. అందుకుగూడ బాబాయే త్రోవ జూపినాడు. మౌలానాఇస్మూముజావర్, అను సాధుపుంగవునికలసి ఆలో చించెను. ఉభయులూ ఈ చిత్రమును, హేమాద్పంతున కిచ్చినచో, భక్తిపూర్వకముగ కాపాడగలడని నిశ్చయించిరి. ఉభయులూకలసి నాడు భోజనవేళకు అతనికి అందచేసినారు. సర్వజ్ఞుడగు సాయి తన భక్తుని చేరుచుంటినని ముందుగనే నిద్రనుండిలేపి తెల్పినాడు. ఆపటము చిత్రముమాత్రమేనని తలంచుట మన చిత్తభ్రాంతి. బాబాను ప్రత్యక్ష ముగచూచి, సేవించుభాగ్యము మనకు కలుగలేదు. అందుకుమనము వెరగంద నగత్యములేదు. బాబాపటమును, భక్తితో పూజించిన, ఆ తండ్రి మనవెంట నుండగలడు.

సర్వవ్యాపియూ, సకల చరాచరగామియూనగు శ్రీ సాయీ శుని లీలలు అద్భుతములు, కించిదజ్ఞులగు మనకు, దుర్గ్రాహ్యములు. భక్తితో సేవించిన ఎల్లప్పుడూ మనల కాపాడియే తీరును. భక్తికలిగి బాబాను సేవింతుముగాక.

"ఓం శ్రీ సాయి నాథాయ నమః"

# 15 వ అధ్యాయము

శ్రీ సాయీశునిలీలలు అనంతములు. బాబామహిమలు వర్ణిం చుటకు నేనెంత, అది నాకెట్లు సాధ్యమగును. బాబా పదముల కన్నుల కద్దుకుని, పాదసేవ చేయుటకైన అర్హతప్రసాదించుమని ప్రార్థించు వాడనే, సాయి, పరమాత్మ స్వరూపమని, పలుభంగుల తనభక్తులకు తెలియజెప్పెను.

పదారువత్సరముల ప్రాయమువాడుగ నున్నప్పుడు, బాబా, షిర్డీ, చేరినది చూచితిమి. ఆ తరువాత ఎన్నడూ, ఆ గ్రామమువదలి వెళ్ళలేదనికూడ తెలిసికొంటిమి. ఆ తరువాత, బాబా, సమర్థ సద్గురుడై, అందర ఆదరించి రక్షించెనేగాని, ఒరులకడనేర్చిన దేమియూ లేదు. 'నానా', తాను సంస్కృతమున మహాపండితుడనని, బాబాకు పాండిత్యములేదని అహముతో నుండెడివాడు. నానా, నిత్యము భగవద్గీత పారాయణ మొనరించెడివాడు. అంతర్యామియగు శ్రీ సాయికి తెలియని దేమున్నది. నానాయందలి వాత్సల్యమున, శ్రీ సాయి అతని అహమును, అణచి, జ్ఞానము అబ్బునట్లు అనుగ్రహింప సంకల్పించెను. నాటిమధ్యాహ్న వేళ, నానా, భగవద్గీతను చదువుచుండెను. తాను వ్యాఖ్యలన్నిటితో, గీత, ఆమూలాగ్రముగ, వల్లెవేసితినని, తూ,చా, తప్పకుండ, ఆమూలాగ్రముగ, గీతయందలి శ్లోకములన్నింటినీ, చెప్పగలననీ, నానా అహంభావముతో యుండెను. అందొక శ్లోకమును గొణుగుకొనుచుండెను. బాబా, అది గ్రహించినాడు. అంతట 'నానా! ఏమది, ఆ గొణుగుకొనుటేల, పెద్దగ చదువరాదా! అన్నంతలో, ఇది గీతయందలి శ్లోకమురెండు, తాము చదువుమంటిరి గాన చదివెదనుఅని (గీత 4వ అధ్యాయమున 34వ శ్లోకము ఈవిధముగ చదివెను." తద్విద్ధి ప్రణిపాతేన, పరిప్రశ్నేనసేవయా। ఉపదేక్ష్యంతి తేజ్ఞానం, జ్ఞానిన స్తత్త్వ దర్శినః॥

అంతటబాబా, — తత్ విధిః — అందలి తత్ — అనగాఏమి, నానా! అని ప్రశ్నించెను — అందుకీ క్రిందవిధముగ సంభాషణ సాగినది.

నానా:— జ్ఞానము.

బాబా:— ఏజ్ఞానము — లేక ఎవ్వరిజ్ఞానము ? సరి, ప్రణి పాతమనగా ఏమి ?

నానా:— సాష్టాంగ నమస్కారము,

బాబా:— పాతమన్ననో,

నానా:— పాతమన్ననూ అంతే,

బాబా:— అట్లయినచో, మహర్షి వ్యాసుడు, అర్థము లేక, ప్రణిపాతమని వాడినాడని, నీఅభిప్రాయమా ?



శ్రీ నానాసాహేబు చందోర్కర్

నానా:- ప్రభూ! ఆరెంటికిని గల భేదము నాకు తెలియుటలేదు.

బాబా:- ప్రశ్న అనగా ఏమి?

నానా:- ఇతరులను అడుగుట.

బాబా:- మరి, పరిప్రశ్న అన్ననో!

నానా:- అందుకునూ, ప్రశ్నించుటఅనియే అర్థము.

బాబా:- అట్లయిన, వ్యాసుడు ఏల పరిప్రశ్న అని ప్రయోగించినాడు.

నానా:- నాకు అర్థమగుటలేదు.

బాబా:- సేవఅనగా నేమి?

నానా:- కాళ్ళుపట్టుట, ఉపచారము చేయుట.

బాబా:- అంతియేనా!

నానా:- బాబా! అంతకన్న నాకు ఏమియూ అర్థమగుటలేదు.

బాబా:- సరిగాని, నానా, శ్రీకృష్ణుడు, అర్జునునితో ఏమనినాడు. తత్వ దర్శి జ్ఞానులవద్ద, జ్ఞానమును పొందుమని చెప్పినాడు. మరి శ్రీకృష్ణుడు జ్ఞానికాడా, అటులైన శ్రీకృష్ణుడే, అర్జునునకు, జ్ఞానమేల ప్రసాదింపరాదు.

నానా:- స్వామీ నేను చెప్పలేను.

బాబా:- అర్జునుడు జీవుడుగాదా!

నానా:- అవును.

బాబా:- నానా, జ్ఞానమను పదమునకు, ముందు ఆకారము చేర్చిన పాఠము ఎట్లుండగలదు.

నానా:- ఉపదేశ్యంతి, తే 'అజ్ఞానం' అని, కాని బాబా ఈ పాఠము. శంకర భాష్యమునందు లేదే?

బాబా:- అయిన ప్రమాదమేమి? భావము అంతకన్న బాగున్నచో, పాఠము అట్లేల చదవరాదు?

అంతట బాబా పాదముల పైబడి, నా, తండ్రీ, నాకేమియూ అర్థమగుట లేదు, తామే, ఈ ప్రశ్నలకు అర్థము చెప్పసమర్థులు.

నా సందేహముల తీర్పుమని నానా ప్రతిమాలెను. బాబా దానికి ఇట్లు బదులు చెప్పెను.

'నానా, ఈ శ్లోకము, శిష్యుడు జ్ఞాన సముపార్జనకొరకు, సద్గురువు నెట్లుచేరవలెనో, ప్రబోధింపు చున్నది. వినుము:— ప్రణిపాతి మనగా, తను, మనోధనముల, అన్నింటినీ, సద్గురువునకర్పించి, తను, మను, ధనములు, నాకునీవే, అని సాష్టాంగ పడవలెనని భావము. ఇక పరిప్రశ్న, అనగా ప్రశ్నను పదేపదే, అనగా, జ్ఞానోదయమగు వరకు, అడుగవలెనని భావము. ప్రశ్నించుటలో, జ్ఞానసముపార్జనా సక్తితప్ప, గురువును, పరీక్షించుట, అనుమానము, మొదలగు, భావములు ఉండరాదని అర్థము. ఇక సేవఅనగా, ఒట్టిఉపచారము గాదు. నేను ఉపచారము చేసెదను, చేయుచున్నాను. అనుభావము నశించి, నీ శరీరము గురువున కర్పింప బడెనన్న భావముతో, శరీరము నీది అన్న తలంపు నశించి నీ శరీరము గురుసేవకు మాత్రమే ఉన్నదని, ఆ శరీరము, గురువు సొత్తని, ఆ శరీరముపై నీకేమియూ అధికారము లేదన్న భావనతో, గురుసేవ చేయవలయునని అర్థము. తెలిసినదా! అటులొనర్చిన, శిష్యుడు, గురుకృపకు పాత్రుడు కాగలడు.

ఇక గురువు, శిష్యునకు అజ్ఞానమిచ్చుటను గురించి, అర్థమేమో, తెలిపెదను:— నిత్య వస్తువు, పరబ్రహ్మము, ఒక్కటియేగదా — జ్ఞానము, సద్వస్తువు,— శేషించిన దంతయూ, అజ్ఞానమేగా, శాస్త్రము యతోవాచా, అని — వాక్కువల్లగాని, బ్రహ్మమును చేరుమని గదా తెల్పుచున్నది. కాబట్టి గురువుముఖతా, తెల్పునది, జ్ఞానము కాజాలదు. గావున, గురువు శిష్యునకు తెలుపునది, అజ్ఞానమేగాని, జ్ఞానము గాదు. అనగా, గురువుచూపెడి, అజ్ఞానముతో, శిష్యుని అజ్ఞానమును, తొలగింపుచున్నాడు — ఎట్లందువేమో, ముల్లుతో ముల్లును తీసినట్లు సహజముగ ప్రతిజీవియూ, జ్ఞానస్వరూపమే. ఆకార్ణముచేత కొత్తగా జ్ఞానము ఈయనవుసరము లేదు. అజ్ఞానము, అనుపొరను తొలగింప

వలసియున్నది. అంతియేకదా – కాని అదిత్రుటి మాత్రముతో జరుగదు – ఎందుచేతనందువేమో, పూర్వజన్మ కర్మఫలము ఆర్జించియుంచినది, ఉండకతప్పదు – ఆవరింపబడిన జ్ఞానికి ఆ అజ్ఞానమును క్రమేపి, తొలగింపవలసి యున్నది. అదిఎట్లు సంభవమందువా, నిర్మలమగు జలమున్నది. దానిపై నాచు చేరియున్నది. చూచుచున్నాము. జలమును శుభ్రపరచవలస్ని అవుసరములేదు – పైనాచును తీసివేసినచో, నిర్మలమగు జలమే మిగులును. గ్రహణసమయమున సూర్య, చంద్రులు పోవుటలేదు – రాహుకేతువులు అడ్డుతగులుచున్నారు – వారు తొలగినంతనే తిరుగ సహజమగు కాంతియే వెలువడుచున్నది. – మనకు ఈ కన్నులున్నవి, చక్కగ చూచుచున్నాము – కన్నులపై పొరలుక్రమ్మి నప్పుడు దృష్టిమందగించుచున్నది. ఆ పొరలను తొలగించినచో, తిరుగ మనము చక్కగ చూడగలము – అంతియేగా! జరుగునది, పొరలు తొలిగింప బడుచున్నవేగాని, క్రొత్తకన్నులుగాని, క్రొత్తదృష్టిగాని ఈయబడుచున్నదా!

నీవువేరు, భగవంతుడువేరు, అనుభావమే. ఈనీ అజ్ఞానమునకు మూలకారణము. అజ్ఞానముచేతనే, వాస్తవమునకు అజ్ఞానము తొలగుచున్నది. జ్ఞానమనునది, ఎవ్వరికివారు తెలసికొన వలసినదేగాని ఇంకొకరు ఉపదేశించునదికాదు. నమస్కారము, ప్రశ్న, సేవ, ఇవన్నియూ, గురుకటాక్షము పొందుటకు సాధనములు గురుకృపవలన, అజ్ఞానము. అను తెరతీయబడును. అంతియేగాని గురువు ప్రత్యేకించి. జ్ఞానము నీయడు. జ్ఞానము జీవునకు, సహజమైనస్థితి. సద్గురువువలె, శిష్యుడునూ జ్ఞానస్వరూపమే. కాని సద్గురువు, నిర్గుణుడు, సత్, చిత్, ఆనందము, ఇతరుల అజ్ఞానమును తొలగించి, ఉన్నతస్థితి చూపుటకు శరీరధారణ మొనరించును. అంతమాత్రమున సద్గురువుయొక్క నిర్గుణత్వము నశించుటలేదు. శిష్యుడు కూడవాస్తవమునకు అట్టిస్వరూపమే. కాని, జన్మజన్మాంతరమగు కర్మబంధముచే, ఆవరింపబడి, తాను శుద్ధచైతన్యవస్తువనునది, విస్మరింపుచున్నాడు.

"అజ్ఞానేనావృతం। జ్ఞానే, తేనముహ్యాంతి జంతవః తాను దేహ ధారినని, శరీరముతానని, పరమాత్మ వేరుగానున్నదని, కొరగానిజీవి, తానని భ్రమతో జన్మజన్మల పొరబడి సంపాదించిన అజ్ఞానమే, శిష్యుని అణచిపెట్టు చుండును. నాకీ భ్రాంతి ఎట్లు కల్గినది, నేనెందులకీ పెడతోవ బట్టితిని, నిజమునకు, నాకునూ, పరమాత్మకునూ. బేధమున్నదా! అన్నవిచారము కలుగవలసియున్నది. ఈ విషయముల భ్రాంతి తొలగించి, శిష్యుడుపడిన పొరబాటును, ఎత్తి చూపి, క్రమమార్గమును చూపుటయే గురూపదేశము. జ్ఞానమూర్తి యగు జీవునకు వేరుగ జ్ఞానమును బోధింపవలస్ని అవుసరమేమున్నది? ఉపదేశమనగా వేరేమియూకాదు. శిష్యునకు, నీవునూ జ్ఞానస్వరూప మవు, నీవుచేసెడి తప్పఇది. అందువలన నీకుకలిగిన భ్రమఇది – అజ్ఞాన మన్నది, ఇదియే, ఇదినిన్నావరించినది, అని తెలియచెప్పి, ఆభ్రమను తొలగించుటయే, ఉపదేశము. ఇంతకన్న వేరేమియూకాదు. నీ అజ్ఞానము ఇట్టిదిసుమా, అని అజ్ఞానమును పేర్కొని చూపుచున్నాడు. అంతతో నిజస్థితి తెలసి, ఆ అజ్ఞానమను పొరతొలగింపబడి నంతనే, శిష్యుడు జీవుని సహజస్థితిని గమనింపు చున్నాడు. కావుననే అజ్ఞానమిదియని తెలుపుటయే గురుకటాక్షము. ఆ అజ్ఞానమిదియని బోధించి, అజ్ఞానము తొలగించి సద్గురువు, జ్ఞానమును చూపుచున్నాడు.

ఇక శ్రీకృష్ణపరమాత్మ, ఇతరజ్ఞానుల కడకుపొమ్మని, ఏల తెలిపెను. శ్రీకృష్ణుడు అట్టిజ్ఞానిగాదా అన్నది పశ్న. కాదనిగాదు కాని, ప్రపంచమందలి జ్ఞానులందరూ, అట్టివారే, వారికిని, కృష్ణునకునూ, బేధమున్నదా, బేధమేమియూ లేదని తెలియజెప్పుటయే దీనిభావము. ఇదియేగా పరమాత్మ గీతయందు తెల్పినది. "నాభక్తుడు నాయందున్నాడు, నేను నా భక్తునియందున్నాను. నాభక్తుడేనేను నేనేనాభక్తుడుగా గమనింపవలస్నిది. ఇదియేపరమసత్యము." ఇంతియేకాదు, ప్రపంచమున పరమభక్తులునూ, మహాజ్ఞానులునూ, కలరని అట్టివారి దరిచేరిన సఫలమనోరథులు కాగలరని, అట్టివారిని ఆశ్రయించుట సామాన్యులకు అవుసరమని తెలియచెప్పినాడు. ఆకార్ణమున అట్టివారల చేరబొమ్మని, అర్జునునితో పలికెను. అట్లొనర్చిన, సద్గురువుల యొక్కయూ, సద్భక్తుల

యొక్కయూ, ఉనికినెరిగి, అర్జునుడు మాత్రమే గాక ఇతరులుకూడ తరింప సదవకాశము కలుగగలదని, (శ్రీ)కృష్ణుని కోరిక" అని బాబా, సహజమగు తీరున తెలియజెప్పెను.

బాబా, శుద్ధచైతన్యమూర్తి. ఆ పరమాత్మ స్వరూపునకు, శాస్త్రపరిశోధనగాని, అభ్యాసముగాని చేయవలసిన్న అవుసరమున్నదా! జ్ఞానస్వరూపముగల (శ్రీ) సాయికి, సంస్కృత పాండిత్యము లేదని భ్రమపడిన, నానా, సిగ్గుపడెను. తనకేమో, సంస్కృతమున పాండిత్యము కలదన్న అహంభావ మంతరించినది. నానా బాబా పాదములపై బడి అజ్ఞానుడను, నాకేమో తెలియునని గర్వించితిని, నన్ననుగ్రహింపుమని ప్రార్థించెను.

మశీదునందున్న బాబా పాదముల నొత్తుచూ భక్తుడొకడు పరమానందముతో నుండెను. ఉన్నట్లుండి, ఒకబల్లి కూయమొదలిడెను. ఆ భక్తుడు అదివిని, బాబా, ఆబల్లిపలుకు ఫలితమేమి, శుభమేనా అని ప్రశ్నించెను. బాబా ఇట్లు బదులుచెప్పెను. ఆబల్లి ఏవి. పలుకుచున్నదని నీఅభిప్రాయము. ఆపలుకువల్ల అశుభమేమి యుండగలదు. ఔరంగబాదునుండి తనచెల్లెలు వచ్చుచున్నదన్న సంబరముతో సందడి చేయుచున్నది. అంతకన్న మరేమియూ లేదు. ఆ భక్తునకు అదిఏమియూ అర్థముకాలేదు. బాబా, బల్లిభాషకూడ తెలిసినట్లు పలుకుచుంటిరే, ఎక్కడ ఔరంగబాదు ఎక్కడ షిర్డీ. ఈ బల్లికి ఒక చెల్లెలా, అది ఔరంగబాదునందున్నదా? అచ్చటినుండి వచ్చుచున్నదని సంతోషమా? ఏమిటిబాబా, ఆచెల్లిరాక, ఈ బల్లికెట్లు తెలిసినది, చిత్రముగా మాట్లాడుచుంటిరే అనుచుండగనే, ముస్లిముభక్తుడొకడు, బాబాను దర్శింప మశీదు చేరెను. ఆతడు తనగుర్రమును మశీదు ముంగిట కట్టివైచి, గుర్రముపైనున్న సామాను, సంచిని, లోనికి తెచ్చెను. ప్రయాణమున డస్సియున్న, ఆగుర్రమునకు దాణానిడుటకని సంచిమూతిని విప్పెను. అందుండి బల్లిపిల్ల చటుకున బయట దూకినది. కిచకిచమని గోడపైప్రాకినది, పైనుండిబల్లి, చరచర క్రిందికి ప్రాకినది. దూరమునుండి వచ్చిన తనచెల్లిని ఆదరించి, ఆహ్వానింపుచున్నట్లున్నది.

బాబా, ఆభక్తులనుద్దేశించి, చూచితిరా, ఆ అప్పచెల్లెండ్రు ఎట్లు సంతోషమున కలియుచున్నారో. అనెను. ఆ బల్లులు రెండునూ, కిచకిచలాడుచూ, తోకలాడించుచూ, పెనబడుచూ, ఆడుచూ, ఎంతయో సందడిచేయ మొదలిడెను. అదిచూచిన వారలందరికీ, ఆశ్చర్యమయ్యెను. ఎక్కడ ఔరంగబాదు, ఈ బల్లి వచ్చుచున్నదని, బాబాకెట్లు తెలిసినది. ఇచ్చట బల్లిపలికిన పలుకులు బాబా ఎట్లు గ్రహించినాడు ?

బాబా, సర్వాంతర్యామి. సకలవేది. బాబాకు తెలియని దేమియునూ లేదు. బాబా పరమాత్మ స్వరూపమని గ్రహించి, ప్రణమిల్లిరి. సత్ చిత్, ఆనందరూపముగు శ్రీసాయి, సద్గురురూపమున, భక్తులనుద్ధరించుటకు, మానవాకారమున, ఇచ్ఛామాత్ర శరీరుడు, అట్టి బాబా పదసేవ అబ్బుట మనఅదృష్టము. శ్రీసాయికి ప్రణమిల్లుదము.

"ఓం శ్రీ సాయినాథాయ నమః"

# 16 వ అధ్యాయము.

సచ్చిదానంద స్వరూపుడగు శ్రీ సాయి సర్వాంతర్యామి, జ్ఞానస్వరూపము. త్రికాలజ్ఞుడు గోసాయిరూపమున షిర్డియందున్ననూ, ఈ సృష్టియందు బాబాకు తెలియక జరుగునది ఏమియునూ లేదు. బాబాపదభక్తి అబ్బినచో ఈ జన్మముననేకాదు, ఎన్నిజన్మలనైననూ మనలవిడువక, మనమంచి చెడ్డలనరసి, రక్షించు ప్రేమమూర్తి. అట్టి దైవస్వరూపుని పదభక్తి అబ్బిన మనఅదృష్టమే అదృష్టము.

అదివేసవి. షిర్డికిప్రక్కన ప్రవహించు గోదావరి కాల్వకట్టపై ఒకనాటి సాయంసమయమున, బాబా పచారిచేయుచుండెను. బాటసారి ఒకడు బాబాను చూచి, నమస్కరించెను. ఇరువురు వంతెనపై కూర్చుండిరి. బాబా, చిలుము వెలిగించి పొగపీల్చెను. గొట్టము

లబాటసారి కందిరించినాడు. ఇంతలో, పామునోటబడినకప్ప ప్రాణము ఆర్తై పరితపించుచూ, కీచు, కీచుమను శబ్దము వినబడెను. ఆబాటసారి కశబ్దమువచ్చు దిక్కుకుపోయి తిరిగివచ్చి 'బాబా నల్లనిత్రాచు, పెద్ద ఆప్పనొకదానిని పట్టినది. సగముమ్రింగినది చావుశిద్ధమని తెలిసియూ, ఆకప్ప ఎట్లు ఏడ్చుచున్నదో చూడుడు అనియెను.

వెంటనే బాబా ఏమి? రక్షించుటకు, నేనిచ్చటనుండగ, ఆపాము ఆకప్పనెట్లు కబళింపగలదు! నన్నాశ్రయించినవానిని కాపాడక విడుతునా! ఆకప్పను, ఎట్లువిడుపింతునో నీవేచూచెదవుగాక, రమ్ము' అని ఆధ్వనివచ్చు ప్రదేశము చేరెను. ఆబాటసారియూ బాబాను వెంబడించెను. బాబా, కట్టదిగి ఆపామును చేరబోయెను. బాబా! ప్రమాదము, పామును సమీపించు చుంటిరే – అదికో దేత్రాచు, పైనపడగలదు, పసిపట్టి వెంటాడునో ఏమో, అని ఆత్రపడసాగెను. బాబా వెనుకాడలేదు. బాటసారి వినుచుండగనే, ఆపామునుద్దేశించి బిగ్గరగా, 'ఓరీ వీరభద్రప్పా' నీకింకనూ, క్రౌర్యము వదలనేలేదా, పామువై పుట్టితివి. ఓ చెన్న బసప్పా; కప్పవై పుట్టియూ, వీరభద్రప్పను మరువనేలేదా; హీనజన్మలు సిగ్గులేదా? ఏనాటికింకనూ మీకుబుద్ధి వచ్చుట ఇంకనూ ఎన్నిజన్మల యిట్లుమీరు ఒకరినొకరు ద్వేషింపుదురు. ఛీ, పోండావలకు, ఇంతటకైనా బుద్ధికల్గి బ్రతుకుడు అని చేయినెత్తి కసరెను.

అదేమిచిత్రము? ఈమాటలు వినినంతనే, ఆపాము, కప్పను వదలివేసినది. జరజరమనిప్రాకి కాల్వలోపడినది. కప్పయూ ప్రక్కనున్న పొదయందు దూరినది. బాటసారికి ఇదేమియూ అర్థముకాలేదు. బాబా! ఏమిచిత్రమది, పాము వీరభద్రప్పయూ, కప్ప చెన్నబసవప్పయునా; పేరుపెట్టిపిలచి కసరిపంపితిరే. ఇందలి వాస్తవమేమియో తెలుపుడని బ్రతిమాలెను. అందుకుబాబా ఇట్లు చెప్పెను. "బిడ్డా, వీరిద్దరి విరోధము ఇప్పటిదికాదు. జన్మలుమారినవేగాని, బుద్ధులు మారలేదు. ఎవ్వారుచేసినకర్మ ఫలితము వారు అనుభవింపక తీరదు. అదిమరచి, ఒడలుతెలియక, పాపపుణ్యాముల తారతమ్యాము లెరుగక

ప్రవర్తించెదను. వినుము, పూర్వము నా కుటీరముదాపున, శిథిలమైన శివాలయము ఒకటుండెను. గ్రామస్థులందరూ, ఆ దేవాలయమును బాగుచేయు సదుద్దేశ్యముతో, శక్తివంచనలేక పాటుపడి, సొమ్ము ప్రోగుచేసిరి. ఆశివునిదయయో ఏమో, యాబదివేలు వసూలయినది. నూతన నిర్మాణమునకు అవసరమగు సన్నాహములన్నియూ చేయబడెను. దేవాలయ పునర్నిర్మాణమునకు, గ్రామపెద్దలు ఒక సంఘముగా ఏర్పడిరి. ఈడబ్బు, దగ్గరనుంచి ఖర్చుపెట్టి, లెఖలు వ్రాయుటకు ఒక ధనికుని ఎన్నుకొనిరి. ఆయాబదివేలు, ఆయనచేత నుంచిరి. ఈ ధనికునకు గ్రామమున పలుకుబడి ఎక్కువ. అంతధనము, ఒక్కమారు తనచేత చిక్కినందులకు, ఆతడు బ్రహ్మానందపడెను. ఆ శివునిస్మరించి, నవ్వుకొనెను. మాసములు గడచినవి, ఆలయమున జరిగినపని మాత్ర మేమియూలేదు – గ్రామపెద్దలు ఈ ధనికుని తొందరించిరి. తియ్యని మాటలతో కాలముగడుపుచూ, తనయింటిబండ్లతో పనికిమాలిన సున్నము, విరిగిపోయిన ఇటుక, అచ్చటచ్చట గుట్టలు పోయించెను. అంతకుమించి ఏమియూ చేసినదిలేదు. సంవత్సరము గడచెను. శివరాత్రినాడు, శివాలయమున పెద్దలందరూ చేరి, ఆధనికుని ప్రశ్నించిరి. ఆతడతిసమర్థుడు. ఆయాబదివేలకు, ఆసున్నము ఇటుకముక్కలతో సరిపుచ్చి చెప్పినాడు. ఆగ్రామమున, ఆతని ఎదిరించికాదని మాటాడు వారెవ్వరునూలేరు – మోసమెరుగుని ఆనాటి గ్రామస్థులు, మారు మాటాడలేదు. తిరుగచందాలు పోగుచేసి ఆతనికిచ్చిరి. అయ్యా మాచేతనైనంత తెచ్చితిమి. మరిమీరో దైవభక్తికలవారు, ఆశివుని దయ మీపైపూర్ణముగ నున్నది. – ఆకారణముచేతనే, ఈ పేద కొంపలమధ్య కలవాడవై కళకళలాడు చున్నావు. తరుగు, మిగులుల తమరేసర్దుకుని, ఆయింత ఆలయము, బాగుచేయింపుడని బ్రతిమాలిరి. తిరుగ తనకిచ్చిన పదివేలను, చిరునగవులతో ఆతడందు కొనెను. ఇదిఏమూల, నేనుమాత్రమేమి చేయగలను, కానిండు, అంతయూ, ఆమహాదేవుని కరుణ, అనిమాత్రము అనెను.

ఈతడు పరమలోభి. చూచిచూచి కడుపునిండ అన్నముకూడ తినెడివాడుకాడు. ఈతనికి బిడ్డలులేరు. భార్యతప్ప నా అనువారులేరు,

పదిలక్షలకుపైబడి సొమ్మునూత్ర మున్నది. — దయాదాక్షిణ్యములు లేవు – మంచి చెడ్డలులేవు, పాపభీతిలేదు - కాఠిన్యముతప్ప జాలి అన్నది మందునకుకూడా లేదు. మోసముతప్ప మంచితనమాతడు ఎరుగడు. మహాదేవునే మోసగించగల మేధావి. ఆతనికి రెండవ మారిచ్చిన పదివేలలో, ఒక్కకానీ అయిననూ ఆలయమునకు ఆతడు వెచ్చించలేదు. అందరిని మెప్పించునట్లు, లెఖలుమాత్రము పూర్తి అయినవి. పాములబుసలతో, దోబూచులాడు ఆశివయ్యకుకూడ, ఈ మోసపుమూస విషయమునుచూచిన భయమో ఏమో, ఈ ధనికునకు ధైర్యమును కల్పించినాడేగాని వేరేమియూ చేయలేదు. ఇదియే భగవంతునిలీల – విచిత్రము. అంతటి పాపాత్మునికూడ, ఆపరమాత్మ నిందింపడు బాధింపడు. అందులకే భగవంతుడు పరమదయాళువు - శాంతమూర్తి - దుర్మార్గులుకూడ తనబిడ్డలేయని భావించును - వారలకూడ ప్రేమించును - వారివెర్రితనమునుచూచి నవ్వుకొనును. ఆతడొనరించిన, ఆకర్మలకు అనువగు తీరున, ఫలముప్రసాదించును. ఆతడది అనుభవింపకతీరదు - అప్పుడుకూడ ఆతని ఆదయామయుడు ద్వేషింపడు. పశ్చాత్తాపమున తనలోపమును గుర్తెరిగి, మంచి మార్గమున బుద్ధిని త్రిప్పినచో ఆతండ్రి ప్రేమతో సాయముచేయును.

మరి ఈమహాదేవుడు చేసినదేమి? ఒకనాటిరాత్రి ఈధనికుని భార్య కలగన్నది. పరమేశ్వరుడు ఆమెను అనుగ్రహించినాడు. బిడ్డా! నా ఆలయము శిథిలమైయున్నది. వర్షమునకు తడియుచూ ఎండకు ఎండుచూ యుంటిని. గర్భగుడిపైననూ బాగుచేయింపుము - నీవు వెచ్చించెడిదానికి నూరురెట్లు లాభించగలదు." అని చెప్పి అదృశ్యుడయ్యెను. పాపమామె భగవత్ భక్తికలది. తనకల అంతయూ భర్తకు తెల్పినది. ఆతడు నూరురెట్లు లాభించగలన్న మాటకు ఆశపడెను. ఆతని మోసబుద్ధికి మేరలేదు. పరమశివునికూడ పొరబెట్ట ప్రయత్నించెను. వెర్రిదానా ఇది కలగాదా, కలయందలి విషయములు ఎట్లు నిజము కాగలవు. ఆందోళనపడకుము, ఆశివుని అనుగ్రహము కాకున్న, మనకీ ఐశ్వర్యము ఎట్లు అబ్బినది. నేనుకూడ నీకుదాపుననే పరుంటినిగా, ఆతడు నాతో ఏల చెప్పరాదు. కలవరపడకుము, అని సమాధాన పర

చెను. ఒక్క వారము గడచినది. మరల ఆమెకు కలవచ్చినది. స్పష్టముగ ఆమె శివునిచూచుచుండెను. బిడ్డా! నీభర్తతో ఏమియని, నీవద్దనున్నది ఎంత స్వల్పమైననుచాలును, పెద్దమొత్తములు అవుసరములేదు— నీ సొమ్ములున్నవికదా, వెంటనే ఆలయము బాగుచేయింపుము, నీకు మేలుకలుగగలదు అనిచెప్పెను. ఆమెత్రుళ్లిపడిలేచినది. అది వేకువజాము—ఆసమయమునవచ్చెడి కలలు, నిజముకాక తప్పదని ఆమెనమ్మకము. ఆమె తనభర్తను లేపి, కలవిషయముచెప్పినది. ఆతడు వెంటనే, 'వెర్రిదానా! శివుడు తనంతటతాను నీదగ్గరకువచ్చి బ్రతిమాలినాడా! మతిమాలినదానవు, ఆమే కేమియో ముందుగచూపుమని, లాభము కలుగజేతుమని అడుగకపోతివా? ఇట్లు బిచ్చమెత్తుకొను దైవము, ఏమిమేలుచేయగలడు. నీకు మతిపోవుచున్నది.' అని విసిగికొనెను. ఆమెకు మాత్రము, ఆమూర్తికన్నుల కట్టినట్లుండెను—ఆమాటలింకనూ చెవులవినబడుచునేయున్నవి. 'స్వామీ, మీరేమియూ నాకుసొమ్మియ్యనక్కర లేదు—నా తండ్రిఇచ్చిన నగలున్నవి, అమ్మిస్వామికైంకర్యము చేసెదనని పట్టుబట్టినది. ఈలోభికి ఏమియూతోచలేదు. ఆ వస్తువులో వాస్తవమునకు పదివేలకుపైబడి విలువగలవి. కాని ఆలోభి నగలన్నిటిని పదివందలకిమ్మతుచేసి, ఆసొమ్ము తానేఇచ్చెదననెను. ఆ అమాయకురాలు అందుకూడ అంగీకరించినది. అయినమాత్రమేమి, వెయ్యిరూపాయలుకూడ వెచ్చించుటకు అతనికి ఇష్టములేదు. ఆతడాలోచించెను. దుబాకీ, అను పేదరాలు ఎన్నడో ఈతనివద్ద రెండువందలు అప్పుగొని, ఆమొత్తము చెల్లించుటకు శక్తిలేక, తనకుగల యకరమునేల, ఈతని పరముగావించినది. అదిఊసరక్షేత్రము. అందువచ్చు అయివేజు ఏమియూలేదు. భార్యనగలకిమ్మతు వెయ్యిరూపాయల క్రిందనూ, ఈభూమిని సమముచేసి, ఈఊసర క్షేత్రమును, శివునకువ్రాసి ఇచ్చెదనని భార్యను ఒప్పించెను. ఆమరునాడు, ఆతడు నగలన్నిటిని, తనపెట్టెయందు భద్రపరచి, ఆఊసరిక్షేత్రమువ్రాసి, భూమిని, అర్చకునకు ఒప్పగించిరి. తరువాతకొన్ని దినములట్లే గడచినవి. ప్రళయముగ గాలివానసాగినది. పిడుగుపడి ఈలుబ్ధుని సౌధము

కూలిపోయెను. దంపతులిద్దరూ ఒకేసమయమున, సమాధిఅయిరి. పేదరాలు దుబాకీగూడ మరణించినది.

మరుజన్మమున, మధుర అను పట్టణమున, ఈ లుబ్ధుడు బ్రాహ్మణ కుటుంబమున పుట్టెను. ఈతనికి వీరభద్రప్ప అని పేరు. కాని నిరుపేద. లుబ్ధుని భార్య, ఆ అర్చకునియింట ఆతని కుమార్తె గౌరిగా జన్మించెను. ఆ అర్చకుడునూ, కుమార్తె గౌరియూ, నాకు భక్తులు. ఎప్పుడూ నాచెంతనే యుండెడివారు. గౌరికి యుక్తవయస్సు వచ్చినది. తగిన వరుడులేడని తహతహ లాడుచుండెను. వెర్రివాడా, ఎందుకీ ఆరాటము వరుడు పుట్టియే యుండునుగాని, పుట్టబోడుగదా, సమయమునకు ఆతడే రాగలడు. ఓర్పులేక బాధపడెదవేల? అని సలహా నిచ్చితిని. ఈ వీరభద్రప్ప యాచనకై ఒకనాడు ఆ ఊరు చేరెను. వీరల చరిత్ర నేనెనురుదును. కావున గౌరిని ఈతనికిచ్చి వివాహము చేయ మంటిని. ఆ అర్చకుడట్లే చేసెను. వీరభద్రప్పకు జన్మమారిననూ, లోభితనము నశింపలేదు. ఆ పేదరాలు దుబాకీ, గుడియజమాని కుమారుడుగా జన్మించెను. ఆతనిపేరు చెన్నబసప్ప. వీరభద్రప్పకూడ నాయందు ప్రేమతో ప్రవర్తించెడివాడు. కాని రోజులు గడిచినకొలది ఆతనికి ఆర్జనపై ఆశ పెరిగినది. ఎట్లైన ధనము కూడుబడునట్లు అనుగ్రహింపుమని నన్ను బ్రతిమాలెడివాడు.

ఉన్నట్లుండి కాలముమారినది. కొరగాని ఆ యకరముభూమికి వెలగల్గినది. లక్షరూపాయలకు విక్రయింపబడినది. యాబదివేలు రొఖముగా ఇవ్వబడెను. శేషించిన యాబదివేలనూ, వాయిదాలపై తడవకు రెండువేలుచొప్పున ఇచ్చునట్లు ఒప్పుకునిరి. పత్రములు పూర్తి అయినవి. ఆసొమ్మునుగురించి తగాదాలు పెరగినవి అందరూ నన్ను సలహానడిగిరి. ఆభూమి దేవునకియ్యబడి అర్చకునకుచెందినదైనందున, ఆసొమ్ము అర్చకునకునూ, అతని కుమార్తె, గౌరికినీ చెందవలసి యున్నదని, వీరభద్రప్పకు సంబంధములేదని చెప్పితిని. ఇది వీరభద్రప్పకు రుచింపలేదు. ఆతడు, ఉగ్రుడై గౌరిని మోసగించి, నేను ఆసొమ్ము అపహరింప పయత్నింపుచుంటినని నన్నుదూషింప మొదలిడెను. నేను అందుకు మారాడలేదు. ఆరాత్రి గౌరికి నిద్రపట్టలేదు.

ఎట్టిలో కన్నుమూసినది. శ్రీ సదాశివుడే అగపడి, 'అమ్మా, ఈ సొమ్మంతయూ నీది. దేవాలయమునకు వెచ్చింపుము, ఇష్టమైనచో, కొంతసొమ్ము సత్కార్యములకై, శ్రీ చెన్నబసప్ప సలహానను సరించి ఖర్చు చేయుము. బాబాను అడుగక, బాబా సలహా సంప్రదింపునూ లేక, ఒక్క కాసైనను ఖర్చు పెట్టకు. నీభర్తకు ఇందేమియూ ప్రసక్తి లేదు, ఆతనికి ఒక్కరూకకూడ ఇవ్వకు'– అని తెలిపెను. ఆమెపరుగు పరుగున బాబానుచేరి కల విషయము తెలిపెను. 'అవునమ్మా, అదిఅంతయూ, వాస్తవము, ఆ భగవంతుని ఆజ్ఞకూడ అంతియేనమ్మా, అన్నంతలో 'తండ్రీ', నిన్న నాభర్త మిమ్ముల దూలనాడినాడు, మన్నింపుడు, ఎన్నడూ నన్నుమాత్రము మరువకుడు, నన్ను రక్షించు బాధ్యతమీది. నేను మీ ఆజ్ఞను, ఎట్లుగాపాడెదరో, అని ప్రార్థించెను. అందుకు బాబా, చిరునగవుతో 'బిడ్డా, భయము లేదు, సప్తసముద్రముల దాటియైనను, నీ వెచ్చటవున్ననూ, నిన్ను వెన్నంటి కాపాడెదను, భయమొందకుము, అని అభయమిచ్చెను. వీరభద్రప్పయూ, చెన్నబసప్పయూ కలహింపుచూ అచ్చటికిచేరిరి. నేను గౌరిని ఉద్దేశించి, అమ్మా, ఆసొమ్ము అసలు మొత్తము నీవు తీసికొనవలసినది, పెంపుదలయగు మొత్తము చెన్నబసప్ప పరముగా ఈయవలస్నిది, అంతయేగాని, ఈసొమ్ము ముట్టుటకుకూడ నీకు అర్హతలేదు, అని స్పష్టముగా వీరభద్రప్పకు చెప్పితిని, ఆదివిని, వీరభద్రప్పకోపము పట్టలేక, చెన్నబసప్పను ముక్కలుచేసి, చంపెదనని పయికిపోయెను. చెన్నబసప్ప భయముతో గజగజలాడుచూ, తండ్రీ రక్షింపుమని నాపాదములబడెను. ఈతడు నిన్నేమియూ చేయలేడు, భయపడకుము, నేను వెంటనుండి రక్షింతు నని అభయమిచ్చితిని, ఆవైరముతో అట్లేయుండి తరువాత కొంత కాలమునకు వారిద్దరునూ మరణించిరి. వీరభద్రప్ప ఈపెను పాముగా జన్మించినాడు, చెన్నబసప్ప కప్పయైపుట్టినాడు. ఆవీరభద్రప్ప నోటబడి భాధపడుచూ, బసప్పనన్నుతలచినాడు, నేనెట్లుచూచుచూ ఊరకుండగలను. అందులకే రక్షించితినని చెప్పెను.

సోదరులారా ! చూచితిరిగదా, దుర్మార్గ మెంతచేయదు. జన్మలు మారిననూ, వారి కార్పణ్యములు వదలలేదు. పరమదయానిధి

యగు బాబా, అన్నిజన్మల, అన్నివేళల, తన వాగ్దానము మరువక, వెంటాడి రక్షింపుచునే యున్నాడు. మహాసమాధియగుతరి, భయపడకుడు, నేను సమాధినుండియే, మిమ్ము రక్షింతును, ఈ శరీర త్యాగ మొనరించిన మాత్రమున, మరణించితినని భ్రమింపకుడు. నన్ను స్మరించిన, నేను మీ చెంత నుండగలనని మన తండ్రి అభయమిచ్చెను. బాబా సత్యవాది. భక్తితో బాబాను సేవించిన, ఎన్నడూ మనల మరువడు, మన వెంటనుండి కాపాడగలడు బాబా పదభక్తి అబ్బునట్లు అనుగ్రహింపమని ప్రార్థింతము.

"ఓం శ్రీ సాయినాధాయ నమః"

# 17 వ అధ్యాయము

పరమాత్మస్వరూపా, బాబా ! సకలసాధువుల స్వరూపమునూ, సకల దేవతల స్వరూపమునూ, నీవే. యోగి హృద్ధ్యానుగమ్యుడవు. నీ చరిత్ర చెప్పుటకు నాచేత నేమి కాగలదు ? తండ్రీ ! నీ పదముల నా మనసున నిలిపి, నీవు తెలిపినంతదనుక, వివరింప సాహసింతును. "నమోనమః శ్రీముని వందితాయ, నమోనమః శ్రీగురురూపకాయ, నమోనమః శ్రీభవహారకాయ, నమోనమః శ్రీమనుతల్పకాయ, "

బాబా, భగవదవతారము. సత్ చిత్ ఆనందస్వరూపము. మహత్తరయోగి. షట్‌యోగములు బాబాకు కరతలామలకములు. భక్తుడగు, నానాసాహేబ్ డిన్గిలీ, శ్రీసాయి పరుండుటకు, నాలుగు మూరలపొడవును, జానెడుమాత్రమే వెడల్పునూ గల చక్క నొకటి తెచ్చి ఇచ్చెను. భక్తితో ఆతడిచ్చిన ఆ పలకను, బాబా, పాతగుడ్డల పీలికలతో నాలుగువైపులా బిగించి, దూలమునకు వ్రేలాడతీసెను. వాస్తవమునకు, ఆ పలకబరువునుగూడా, ఆ పీలికలు మోయలేవు. దీనికితోడు ఆపలకపై నాలుగుమూలల, బాబా, ప్రమిదెలనిడి దీపములు వెలిగించెడివాడు . ఆ దీపములట్లే రాత్రిఅంతయూ వెలుగుచుండెడివి.

బాబా ఆ పలకపై నిద్రించెడివాడు. ఆ పలక బాబా బరువునకు ఎట్లు ఆగినది — ఆ పీలికలు ఎట్లు తెగక నిలచినవి — ఈ విషయములు, కించిజ్ఞుడ నగు, నేను ఎట్లు తెలుపగలను ! బాబాసంకల్పమున అవి అట్లే యున్నవి. కాకున్న, ఆ కట్టినపీలికలు మార్చుటకూడ లేదు. సంవత్సరముల తరబడి అట్లే, ఆ పీలికలు, బాబాను, పలకను గూడ భరించినవి. ఇంకొక చిత్రము. దూలమునకునూ, పలకకునూ మధ్య సంరెండు అంగుళములు మాత్రమే ఎడముండెడిది. స్థూలకాయుడగు బాబా, ఆ పలకపై ఎట్లు ఎక్కెడివాడు. ఎట్లుదూరి, ఆ పలకపై పరుండెడివాడు, ఆ దీపములు ఎట్లు ఆ పలకపై నిలచినవి. ఆ నాలుగంగుళముల పలకపై బాబా ఎట్లు నిద్రించెను. బాబా ఎప్పుడు ఎట్లు ఆ పలకనుండి దిగెడివాడు. భక్తులనేకులు బాబాప్రక్కనే యుండి, ఇది గమనించుటకు పలుమారులు ప్రయత్నించిరి. ఇదియూ ఒక లీల. పలకపై ఎక్కుటకుగాని, తిరుగ దిగుటకుగాని, ఎత్తుపీటగాని, నిచ్చెనలుగాని లేవు. భక్తులతో మాట్లాడుచున్న బాబా కనురెప్పపాటులో పలకపై యుండెడివాడు. మరల చూచుచుండగనే, క్షణములో, క్రింద భక్తులచేరి ముచ్చటించెడివాడు. బాబా ఎప్పుడు ఎట్లు పలకపై చేరినదిగాని, ఎట్లు దిగివచ్చినదిగాని ఎవ్వరికినీ గోచరించెడిదిగాదు. ఆలీలను చూచి ఆనంద మనుభవించిన ఆభక్తులు ధన్యులు.

ఇంకొక విచిత్రము. మశీదునకు 100 గజముల దూరములో, ఉత్తరపువైపున, పడమరదరిన పెద్ద మర్రిచెట్టుక్రింద ఒక పెద్దభావి యున్నది, ఈ భావి నేటికినీయున్నది. దీనికి ప్రక్కన ఒక పెద్దనేరేడు చెట్టుగలదు. శ్రీసాయి. మూడురోజుల కొకమారు, ఆ భావివద్దకు పోయి స్నానము చేయువాడు. ఆ రోజున ఉదరమున యుండు పెద్ద ప్రేవులను, వెడలగ్రక్కి, వానిని, బైట, లోపలగూడ శుభ్రపరచి, గుడ్డలను ఉసిమినట్లు ఉసిమి, ప్రక్కనేయున్న నేరేడు చెట్టుకొమ్మపై ఆరవైచి, తరువాత తిరుగ ఆ ప్రేవులను మ్రింగెడివాడు. సాధారణముగ. ధౌతి చేయుట మన మెరుగుదుము. అనగా $22\frac{1}{2}$ అంగుళములు పొడవునూ, మూడు అంగుళముల వెడల్పునూగల, శుభ్రమైనగుడ్డను తడిపి, దానిని, క్రమక్రమముగ లోనికి చొప్పించి, ప్రేవులయందలి మలిన

మును, తీసి శుభ్రపర చెదరు. అంతియేగాని, శ్రీసాయి చేసెడి ఖాతి విప రీతము, అసామాన్యము. ఇతరులెవ్వరూ, ఎన్నడూ, ఈ తీరున ఖాతి ఒనరించుట వినము. అట్టిది యోగస్వరూపుడగు, సాయికే తగినది. షిర్డీయందలి ప్రజలనేకులు, ఈ యోగమును చూచియుండిరి. అట్టివా రింకనూ కొందరు సజీవులై యున్నారు.

మహారాష్ట్ర ప్రదేశమునుండి, ఒక భక్తుడు బాబాదరిశనమున కని షిర్డీ చేరెను. ఆ మరుసటినాడు, తెల్లవారకమునుపే, ఆతడు బాబాను, దరిశించుటకు మశీదు చేరెను. అచ్చట బాబాలేడు సరిగదా, బాబాశిరస్సు ధునికి ప్రక్కన యున్నది — చేతులు గోడప్రక్కన యుండెను. కాళ్ళు మరియొకవైపున విసర్జివైచినట్లున్నవి — అంతియే కాదు, మొండెము మరియొక్కచోట యున్నది. ఆతని కేమింయూ దిక్కు తోచలేదు. దుష్టు లెవ్వరో, బాబాను ఖాతచేసిరి అని భయపడెను. భయభ్రాంతుడై, కెవ్వున కేకవైచి, చేతులతో కన్నులు మూసికొని, బైటికి పరువెత్తెను. బాబాను ఎవ్వరో దుర్మార్గులు, నరికి చంపిరని, గ్రామస్థులతో పరువునపోయి చెప్పుదమని. బయలుదేరినాడు. ఎవ్వరునూ లేనిసమయమున, ఆతడొక్కడే ఆ మశీదు ప్రవేశించి, ఆ విషయ మాతడు ఒక్కడే చూచినట్లు, తానే తెలిపినచో, తానే నేరస్థుడందు రేమోనన్న భయమొదవెను. ఆతనికి ఒడలు చెమ్మటలు క్రమ్మెను. నోట మాటవచ్చునట్లులేదు. కాళ్ళు తడబడుచుండెను. కన్నులు చీకట్లు క్రమ్మెను. ఎట్లో తన మకాము చేరికొనెను, భయముతో ఆతని శరీ రము కంపించిపోయినది. అట్లే అన్నపానీయములైననూ అడుగక, బయటను తొంగియైనను చూడక ఆ రోజంతయు మకామునందే, తలు పులు మూసికుని, ఆతడు గడపెను, ఏక్షణమున ఎవ్వరేవార్త తెత్తురో, ఏసమయమున తాను నోరుజారి, తాను చూచిన విషయము ఎవ్వరి తోనైన అనవచ్చునే, అట్లన్నచో ఆతనికి ఎంతప్రమాదము. ఈ భయ ముతో, ఆ రాత్రికూడ అట్లే గడచినది. కాని షిర్డీయందలి ప్రజలలో ఎట్టి అలజడియూ లేదు. బాబా లేడనిగాని, హత్య జరిగినదనిగాని, ఎవ్వ రునూ, అనుకొనిన సందడికూడ లేదు. ధైర్యము తెచ్చుకుని, ఆత డా మరుసటి ఉదయము మశీదు చేరెను, అప్పటికప్పుడే బాబా, దర్బారు

నందుండెను. ఆసనముపై నున్న బాబా చుట్టూనూ దివ్యకాంతి — తేజోమూర్తి యగు బాబాను ఆతడు చూచెను. తన కన్నులను తాను నమ్మలేదు. కన్నులు నులిమికొని, తిరుగ, తిరుగ చూచినాడు. ప్రత్యక్షముగ బాబా తన తోడి భక్తులతో భాషించుట వినుచుండెను. బాబా యని పరువెత్తి బాబాపాదములవ్రాలెను. చిరునగవుతో శ్రీసాయి, బిడ్డా, ఏల అంత భయపడితివి. నిన్న పగలు-రాత్రికూడా పానీయమైన లేక, బాధనొందితివే. చా పుచ్చుకుని రమ్మని పంపెను. ఆ తరువాత ఆతడు క్రిందటి ఉదయము మశీదునందు చూచిన వివరము లన్నియూ తెలిపెను. దీనిని పెద్దలు ఖండయోగమందురని, అది మహాయోగులకు గాని సాధ్యముగాదని వారందరూ తెలిసికొనిరి.

1856-వ సంవత్సరములో, మార్గశిర శుద్ధపూర్ణిమనాడు, శ్రీసాయి, తన ప్రియశిష్యుడగు మహల్సాపతిని పిలచి, "భాయీ, వచ్చేడివారందరూ, ధనమునిమ్మని, సంతానము నిమ్మని, ఐశ్వర్యమిమ్మని, కీర్తినిమ్మని, రోగముల మాన్పమని, బాధల తీర్పుమని, కోర్కెల కోరువారేగాని—తరుగని జ్ఞానధనము కుప్పలుగ పోసియుంచితిని, ఓపినంత తీసికొనిపొండని ఎంత చెప్పిననూ, ఆ చెంతకు పోవువారే లేరు. స్వార్థపరులై, వ్యర్థములగు వరములనే కోరుచున్నారు. ఒక్కమారు, మహాదేవుని దరిశించివత్తును, నేను తిరిగివచ్చువరకు, ఈ శరీరమును గాపాడుచుండుము, ఉచ్ఛ్వాసనిశ్వాసములు ఆగినవనిగాని, నాడీ చలనము లేదనిగాని, సందేహింపకుము. నేను మరణించితినని భయపడకుము. ఈ కళేబరమును మూడుదినములు కాపాడుము, నాల్గవ నాడు ఉదయము, తిరుగరాగలను. అట్లు నాల్గవనాటి ఉదయమున, శరీరము చలనము లేకున్నచో, నీవు ఈ కళేబరమును, ఆ ఎదుటనున్న ప్రదేశమున పూడ్చి, గుర్తుగ రెండు జండాల పాతవలసినది," అని చెప్పెను. సాయి, అన్న భగవానుడే, అను అచంచల విశ్వాసముగల, పరమభక్తుడైన కారణమున, మహల్సాపతి మారు మాటాడలేదు. ఆనాటి రాత్రి సరిగ 10 గంటలకు శ్రీసాయి, మశీదునందుండి ధ్యానముద్రయందుండెను. మరుక్షణమున శరీరము నలసివడిపోయినది. ఉచ్ఛ్వాస నిశ్వాసలు ఆగిపోయినవి. కన్నులు మూసినవి, మూసితళ్లె

యుండెను. నాడీచలనముకూడ ఆగినది. గ్రామస్థులందరు గుమిగూడిరి. పటేలుకూడ వచ్చి పరీక్షించినాడు, వైద్యులు పరీక్షించి బాబా ప్రాణములు వదలెనని, ధృవముగ తెల్పిరి. పంచాయితీచేసి. బాబా, శరీరమును. పూడ్చివేయుటకు అందరును సిద్ధపడిరి. మహల్సాపతి ఎంత చెప్పిననూ, ఇతరులు విశ్వసించుటలేదు. ఆ మహాభక్తుడు, ప్రమాదమును గుర్తించెను. వెంటనే శ్రీసాయినామస్మరణతో, బాబాశరీరముపై బోరగిలపడి, తన శరీరముతో కప్పెను. తనను సజీవముగా పూడ్చిననేగాని, బాబాశరీరము తాకుటకుగూడ వీలులేదని పట్టుబట్టెను. బాబాఅనుగ్రహమో ఏమో, అందుకు ఎవ్వరునూ సాహసించలేదు. మూడురోజులల్లే, మహల్సాపతి ఆ శరీరమును అంటిపెట్టుకుని యుండెను. మూడురోజులు గడచిననూ, బాబాభౌతికశరీరమునకు కాంతి తరుగలేదు. నాల్గవనాడు ఉదయమగుసరికి, బాబాకనురెప్పలు కదలినవి, కాళ్ళుచేతులు చలించినవి, ఊపిరికూడ పీల్చుచుండెను. ఉన్నట్లుండి, బాబా చివాలున లేచికూరుచుండెను. మహల్సాపతి, బాబాను బిగ్గ కౌగలించుకొనెను. పదేపదే ప్రణమిల్లెను. ఆతడెంతటి అదృష్టవంతుడు. ఆ చిన్మయశరీరమును, స్పృశించి, కౌగిలించి, ఆనందమనుభవించినాడు. పరమయోగులకుగూడ లభ్యముగాని, ఆ పదవి, మహల్సాపతి అందుకొనె ననుటకు సందియములేదు. సకల యోగసారమునూ, స్వరూపమునూ, అయిన శ్రీసాయి, మహాసమాధి అయినంతమాత్రమున, మనల వీడిపోయెనని, మనము భ్రమపడనేల? శ్రీసాయి చిన్మయాకారుడు. ఆయనకు మరణ మెక్కడిది ? సాయి నేటికిని సజీవుడే. తలచినంతనే దరిశన మీయగలడు. సాయివశించిన, షిర్డీ, పుణ్యభూమి. సాయి పెంచిన తోట చైతన్యమయము. సాయి ఆసీనుడైన ద్వారకమాయి చైతన్యమయము — సాయి వెలిగించిన ధుని చిన్మయము. సాయి సంచార మొనరించిన ప్రదేశమంతయూ చిన్మయమే. పవిత్రక్షేత్రమును దరిశించి, ఆ ద్వారకామాయిని సేవించి, ధన్యులమయ్యెదముగాక, శ్రీసాయి సశరీరుడుగ లేకపోయిననూ, ఆ ప్రదేశమున మనము తిరుగాడిననూ అదృష్టవంతులమే, ఆ పరిసరప్రాంతముల

అడుగిడి, ఆ చైతన్యమూర్తిని సేవించుటకైననూ, ఆ తండ్రి అనుగ్రహము న్న నేగాని లభింపదు. ఆ యోగస్వరూపుని, ఆ చిన్మయాకారుని మనసాస్మరించి, ప్రణమిల్లుదము.

"ఓం శ్రీ సాయినాథాయ నమః"

## 18 వ అధ్యాయము.

షిర్డీనిలయుడగు శ్రీసాయి, సర్వాంతర్యామి. సకల సాధువుల స్వరూపము. ప్రత్యేకించి, ఒకదేవుని, ఒకపేరుతో ఆరాధింపుమనిగాని, మరియొక దేవతను, ఆరాధింపవలదనిగాని, బాబా ఏభక్తునకూ ఎన్న డునూ చెప్పలేదు. "ఏకమేవ అద్వితీయం బ్రహ్మ; సర్వదేవ నమస్కారః, కేశవం ప్రతిగచ్ఛతి" నీవు ఏపేరుతో, ఆ పరమాత్ముని ధ్యానించిననూ, ఆరాధించిననూ, చాలుననియూ, ఆ పరమాత్మ నీ మొరలవిని, నీ భక్తికి తృప్తుడై, నిన్ను ఆదరించి రక్షింపగలడనియూ, బాబా ప్రబోధించినది. భక్తి అనునది ముఖ్యమనియూ, భక్తియున్నచో, ఇతర ఆడంబరములు లేకున్ననూ, బాధలేదనియూ, భక్తి లేనినాడు, పై నియమములు, ఇతర ఆడంబరములు, ఎన్నియున్ననూ, ఉపకరింప జాలవనియూ, కేవలము వ్యర్థములనియూ, పలుమారులు బాబాపలికి యుండెను. బాబా తానే పరబ్రహ్మస్వరూపమని, తానే రాముడననీ, తానే కృష్ణుడనని, తానే మహాలక్ష్మియని, తానే అనసూయాదేవినని, తాను ఇతర సాధువుల స్వరూపమని, నిదర్శనాపూర్వకముగా తెల్పి యుండెను.

హరిశ్చంద్రపటేలు, బొంబాయినగరవాస్తవ్యుడు. ఈతనితండ్రి చాల ధనికుడు. శ్రీఅక్కల్‌కోటమహారాజునకు శిష్యుడు. హరిశ్చంద్ర పటేలునకు పదిసంవత్సరములు, వయస్సున, వారి కుటుంబమంతయూ, అక్కల్‌కోటమహారాజును దరిశించి, గురుదేవుల ఆశీస్సులనంది, తిరుగ ఇల్లుచేరిరి. మహారాజు వీరిని ఆశీర్వదించి, వీరికి రెండు పాకలనిచ్చి,

ఆ రూకల పూజామందిరమునందుంచి, ప్రతిదినము పూజచేసికోవలసినదిగా ఆనతిచ్చెను. నాటినుండియూ ఆరూకలట్లే పూజామందిరమందు, ఇతర విగ్రహాములతో బాటు మందసముననుండెను. కొన్నిసంవత్సరములట్లే గడచినవి. హరిశ్చంద్రపటేలు తండ్రికాలధర్మము నొందెను. ఆ తరువాతకూడ కొన్ని సంవత్సరము లట్లే, పూజామందిరమున ఆరాధన జరిగెడిది. తరువాత తరువాత, పటేలు పనిబడి పట్టణముల వెంట తిరుగుటలో, పూజావిధానమున లోపము జరిగెను. 1911 సంవత్సరమున పటేలు కుటుంబసహితముగ, బాబాదరిశనమునకు, షిర్డీ చేరెను. ఇందుకు కారణము లేకపోలేదు, పటేలు కుమారునకు మూర్ఛవ్యాధి ఏర్పడినది. ఎన్నివిధముల ఎందరెందరో వైద్యులు చికిత్స చేసిరి. కాని ఆ వ్యాధిమాత్రము తగ్గలేదు. అంతకుముందు ఎన్నడును ఈతడు, బాబాను దరిశించి ఎరుగడు. వైద్యులవలన ఫలితము లేనందున, బాబామహిమల విని, ఆ సంపన్న గృహస్తు, శ్రీసాయిని ఆశ్రయించిన బాబా. అనుగ్రహింపగలడన్న ఆశతో, అదే తొలిసారి, షిర్డీ చేరెను. దయాసముద్రడగు సాయి ఈతని అనుగ్రహించినాడు. కుమారునకు వ్యాధికుదిరినది. ఆరోగ్య మబ్బినది. అ ధనికుడు. బాబాపదధ్యానముతో, అట్లే షిర్డీయందు మాసమురోజు లుండెను. ఆ తరువాత బాబావద్ద శలవుగొని స్వస్థానము చేరుదమని, దర్బారునందున్న బాబాను దరిశించిరి. బాబా వారల నాశీర్వదించి, ఉధి నొసగెను. పటేలు నుద్దేశించి బాబా ఇట్లనెను. ' బిడ్డా, నీకు పదివత్సరముల ప్రాయమునాడు, నీకు నేను రెండురూకల నిచ్చితిని. ఇదిగో ఇప్పుడు తిరుగ మూడురూకల ఇచ్చుచుంటిని. జాగ్రత్తగకొనిపోయి పూజామందిరమునను చి, పూజింపుము, మేలు కలుగగలదు. పూర్వమునుండి వంశానుగతముగ నున్న దైవపూజల నిరశించుట తగనిపని అని మందలించెను. పాపము, పటేలున కేమియూ అర్థము కాలేదు. అతడు షిర్డీకి నచ్చుటగాని, బాబాను దరిశించుటగాని, అదియే మొదటిసారి. తనకు అప్పటికప్పుడే, నలుబది అయిదు వత్సరములు దాటినవి. ఆతడు పదివత్సరములవయస్సున, షిర్డీకివచ్చుటగాని, బాబాను దరిశించుటగాని. బాబా ఆతనికి రెండురూకలిచ్చుటగాని, ఆత డెరిగినంతవరకు ఎన్న

డునూ జరుగలేదు. తనకు తెలిసినంతవరకు, తండ్రికూడ ఎన్నడునూ, బాబాను చూచుటగాని, షిర్డీకి వచ్చుటగాని, జరుగలేదు. ఏది ఎట్లున్ననూ, బాబాయందలి భక్తిచే ఆతడు మారాడలేదు. చిత్తమని రూకల నందుకొనెను. కన్నుల కద్దికొనెను. తిరుగ తమ పట్టణము చేరిరి. పరుగుపరుగున పటేలు తనతల్లిని చేరెను. జరిగిన ఉదంతమంతయూ తెలిపెను. ఆమెకుకూడ ఏమియూ అర్థముగా లేదు. మరునాడు గురువారము, బాబాకు ప్రీతికరము. పటేలు ఉదయ మగుసరికి స్నాన మొనరించి, పూజామందిరమందలి, మందసముతీసి, విగ్రహముల శుభ్రపరచెను. ఆ మందసమందు, గంధము, కుంకుమలు, అట్టలు గట్టిన నాణెములు రెండు దొరకినవి. ఇవ్వి ఎక్కడివని తల్లి నడిగెను. ఆమెయూ కొంతదవ్వు అట్లే ఆలోచించి, ఉన్నట్లుండి, 'నాయనా, నీవు పదివత్సరములవాడవై యుండగా, అందరమూ, మనగురు దేవులు, అక్కల్‌కోట మహారాజును సేవింపబోయితిమి. నాడు గురుదేవులు ఆశీర్వదించి, మీ తండ్రికి ప్రసాదించిన రూకలు ఇవి. నాటినుండియూ పూజామందిరమున అట్లే యుండెను. పూజలు సన్నగిల్లినవి. వాటి మాటయే మరచితిమి, మనము ధన్యులము. శ్రీసాయి అనగా మరెవ్వరో కాదు. మన గురుదేవులు, శ్రీఅక్కల్‌కోట మహారాజే. శ్రీసాయి మనల అనుగ్రహించినాడు. మనము మరచిన విషయము, మరల ఆ తండ్రి అనుగ్రహించి జ్ఞప్తికి తెచ్చినాడు. ఎంత తెలివిహీనులము. ఆ రెండురూకలు తానే ఇచ్చినట్లు తెల్పుట మన అదృష్టము. శ్రీ సాయి సామాన్యుడుగాడు, సాక్షాత్ భగవదవతార మనుటకు సందియము లేదు. తానే సకల సాధువుల స్వరూపమని తెలియజెప్పినట్లున్నది. బాబా ప్రసాదించిన మూడురూకలతోబాటు, ఈ రెండురూకల చేర్చి పూజామందిరమున ఉంచుము. బాబా ప్రత్యక్షభగవానుడు. బాబా దయకు పాత్రుడవైన నీవు అదృష్టవంతుడవు. నీ కిక భయములేదు, అన్నది. అంతట అందరూ జయజయ ధ్వానముల చేసిరి.

థానాజిల్లా యందలి, ధానామ్, నగరవాసి, హరిబాబా కార్నిక్. ఈతడు బాబాభక్తుడు. 1917 సంవత్సరములో, గురుపూర్ణిమనాడు, బాబాసేవకని, షిర్డీ చేరెను. శ్రీసాయిని సందర్శించి,

సేవించి, తిరుగ తన పట్టణమునకు పయనమై, బాబాఅనుజ్ఞకని మశీదు చేరెను. బాబా మందహాసముతో ఆతని ఆశీర్వదించి, ఊధినిచ్చి, పోయి రమ్మని ఆజ్ఞనిచ్చెను. కార్నిక్, బాబావద్ద శలవుగొని, మశీదుమెట్లను దిగుచూ, నా తండ్రికి ఒక్కరూపాయి దక్షిణ నిచ్చిన బాగుండుననని, యోచించి, తిరుగ బాబాను చేరుటకని. వెనుకకు తిరిగెను. అతని ప్రక్కనే, షామా, యుండెను. బాబా, షిర్డీనుండి వెళ్ళమని ఆజ్ఞ నిచ్చిన తరువాత, తిరుగ ఎవ్వరునూ, అచ్చట ఉండుటగాని, తిరుగ బాబాను దర్శించుటగాని, చేయరాదు. వలదని బాబాఅన్నచో, ఎవ్వ రునూ బాబాఆజ్ఞ అగువరకు, షిర్డీవదలి పోరాదు. దీనికి కార ణము ఉన్నది. బాబాఆజ్ఞకు భిన్నముగ ప్రవర్తించినచో, బాధల పాలయ్యెదరు. ఇది భక్తుల అనుభవము. ఈ కారణముచే, షామా ఆతనిచెయ్యిపట్టుకుని, బాబాఆజ్ఞఅయినది, నీవు వెడలిపోవలసినవాడవే గాని, తిరుగ బాబాను చేరకుము. ఇది ప్రమాదకరము, అని బలవంత ముగ ముందుకు గొంపోయెను. కార్నిక్ కాదనలేక, అనుకొనినట్లు, దక్షిణనీయక పయనము సాగించెను. కార్నిక్ నాసిక్ పట్టణము చేరి నాడు. ఆ పట్టణమున కళారాముని ఆలయమున్నది. ఆస్తికులందరూ, ప్రతిఉదయమూ శ్రీరామచంద్రుని సేవించుట ఆచారము. ఆ ఆలయము ముంగిట, పిచ్చివానివలె, తనలో తాను నవ్వుకొనుచూ, అర్ధనిమీ లితనేత్రుడై, బ్రహ్మానంద మనుభవింపుచూ, ఇతరులతో పనిలేక, పర మాత్మసందర్శనభాగ్యమున తాండవించు, పరమసాధువు ఒకడుండెను. ఆ పుణ్యాత్ముని పేరు, నరశింగ్ మహారాజ్. కార్నిక్ కూడ ఉదయ మగు సరికి, తానమాడి, పుష్పమాలల చేతగొని, కళారాముని సేవించుటకు ఆలయము చేరెను. ఆ ముంగిట ఆత డడుగిడెనో లేదో, ప్రక్క నున్న సాధువు తటాలున, ఆతనిచేయి పట్టుకుని, 'బిడ్డా, నా రూపాయ నా కిమ్ము, నా రూపాయి నా కివ్వకయే పో చూచుచుంటివా!" అని గద్దించెను. సుస్వభావు డగు కార్నిక్ చలించలేదు. తండ్రీ, నీ రూక నీ కిమ్మందువా, అట్లే ఇచ్చెదనని, అంగర్ ఖానుండి రూపాయితీసి, ఆ సాధువుచేత నుంచుచూ, ఆతనివైపు చూచెను. అచ్చట నున్నదెవ్వరు, ఆ సాధువుగాడు, సకల సాధువుల స్వరూపమగు శ్రీసాయి, ప్రత్యక్ష

ముగ చేయిచాచి, ఆ రూక నందుకొనుచుండెను. కార్నికునకు ఒడలు పులకరించినది. షిర్డీయందున్న సాయి, స్వయముగ తనను, అక్కడ అడిగి రూకను అందుకొనుచున్నాడు. తండ్రీ, నా యీ దక్షిణ నందుకొనుటకు ఇంతదూరము వచ్చితివా? నీ వెంతటి దయామయుడవయ్యా, అని కన్నీటితో ఆతని పాదములబడెను. ఆ సాధువు, ఆతని బిడ్డా లెమ్మని లేవనెత్తెను. కాని ఆ సాయి ఆకారమేదీ—శ్రీ నరసింగమహారాజునే ఆతడు చూచుచుండెను. బాబా, ఈ మూఢునిపై దయ తలచితివా, నా తండ్రీ, నీ బిడ్డలపై, నీ కింతటిప్రేమ. సకల సాధువులస్వరూపము నీవె. ఈ నాటివలె నాకు సదా దరిశన మొసగుచుండుమని, మరల ప్రణమిల్లెను. సృష్టిఅంతయూ సాయీమయము, సకల దేవతల స్వరూపము, సకలసాధువుల స్వరూపముకూడ శ్రీ సాయియే. ఇంకనూ అనుమానమేల ? అట్టి ఆ పరమాత్మస్వరూపుని పదభక్తి అబ్బుటయే మన అదృష్టము.

నైజాం, రాష్ట్రమున. నాందేడ్ అను పట్టణమున, మౌలీ సాహేబ్, అను సాధువు కలడు. ఈతడు నిరుపేద, కష్టజీవి. ఆ ప్రాంతములవారందరూ, కూలీసాధువని, ఈతని పిలచుట అలవాటు. పై ఆడంబరము లేమియూ లేకున్ననూ మహాజ్ఞాని. రుస్తుంజీ—షాపూర్జీ, వాడియా, వ్యాపారమున మిక్కిలిగ గడించిన ధనికుడు. అన్ని విధముల సౌఖ్యమనుభవించు అదృష్టవంతుడని పేరందెను. కాని ఈతనికి సంతానము లేదు. ఆ కొరత తీరుటకు, శ్రీదాస్‌గణుమహారాజును ఆశ్రయించెను. శ్రీదాస్‌గణు, ఈ ధనికుని, షిర్డీకి వెళ్ళి శ్రీసాయీనాథుని సేవించిన ఆ కొరత తీరగలదని తెలిపి ఆశీర్వదించి పంపెను. ఆతడు షిర్డీ చేరెను. ఈ వాడియా కథ మరియొకచో, విపులముగా తెలుపగలను. బాబా నాశ్రయించి, బాబాఅనుగ్రహమునకు పాత్రుడయ్యెను. ఈతని బాబా ఆశీర్వదించి, బిడ్డా అయిదురూకల, దక్షిణ నిమ్మనియెను. భక్తితో వాడీయా అయిదు రూకల తీసెను. కాని బాబా వెంటనే, వాడియా నీవు నాకు ఇదివరకే రు. 3-14-0 లు ఇచ్చితివి. కావున శేషించిన రు. 1-2-0 లు మాత్రమే ఈయవలసినది. అయిదు రూకలు అవుసరము లేదు, అని అనతిచ్చెను. ఈవాడియా దాస్‌గణుపనుపున షిర్డీ చేరినాడు. బాబాను

చూచుట అదియే తొలిసారి. అంతకుముందెన్నడునూ ఆతడు షిర్డీకి వచ్చియుండలేదు. అట్టితరి, తాను ఎప్పుడు, ఏవిధమున బాబాకు రు. 3-14-0 లు ఇచ్చితినా, అని చకితుడయ్యెను. ఏమైననేమి, ఆందోళనలేక, బాబాచెప్పిన తీరున రు. 1-2-0 లు మాత్రము దక్షిణ నిచ్చెను. బాబాశలవుగొని, నాందేడు చేరినాడు. వెంటనే, దాస్‌గణును దర్శించి. స్వామీ ఇదేటిమాట, మీ ఆజ్ఞప్రకారము నేను బాబాను దర్శించితిని. అయిదురూకల దక్షిణనిమ్మని, తిరుగవలదు, రు. 3-14-0 లు ఇదివరకే ఇచ్చితివి, శేషించిన రు. 1-2-0 మాత్రమే ఇమ్మని, అంతవరకే స్వీకరించినాడు. మున్నెన్నడూ నేను బాబాను చూడలేదు. షిర్డీకి పోలేదు. ఇదెట్లు సంభవము ? నాకేమియూ అర్థమగుటలేదు. కరుణించి ఇందలి భావమేమియో తెలుపుడని ప్రార్థించెను. దాస్‌గణునకుకూడ ఏమియూ తోచలేదు. మరునాడు ఉదయము, ‘ వాడియో ! నీవు ఇంతకుముందు, సాధువుల నెవ్వరినైన సత్కరించితివా, అట్లయిన ఎంతకాలమైనది ? ఏ విధమున సత్కరించితివి. అందుల కెంత వెచ్చించితివి ? జ్ఞప్తికి తెచ్చుకొమ్మని, హెచ్చరించెను. వాడియాగూడ కొంత తడవాలోచించి, ‘ స్వామీ, నేను సాధువుల నెవ్వరిని సత్కరించితినని చెప్పలేను. కాని షిర్డీకి బయలుదేరుటకు, సరిగ వారమురోజులుముందు, ఇచ్చటనే తిరుగాడు, మాలీసాహేబునకు విందుచేసితిని. ఆతడు కూలీసాధువని ప్రతీతి. ఇంతకు మించి, నేను ఏమియూ చేయలేదు. ’ అన్నంతలో, విందు కెంత ఖర్చుపెట్టితివి ? లెఖ లున్నవా ; ఉన్నచో తెమ్మని దాస్‌గణు తెల్పెను. ఆనాటి ఖర్చులచీటిని తెప్పించి చూచిరి. సరిగ రు. 3-14-0 లు నాడు, వాడియా విందునకు వెచ్చించినట్లు తేలినది. అంతట దాస్‌గణు ‘ వాడియో ! నీవు ధన్యుడవు, నీ వెరుంగకున్ననూ, శ్రీసాయి నిన్ను కృపజూచినాడు. ఇప్పుడైననూ అర్థమైనదా, శ్రీ సాయియే, సర్వాంతర్యామి. మానవాకారమున మనతో తిరుగుచున్నంతమాత్రమున, శ్రీసాయి సామాన్య సాధువనిగాని, భక్తుడనిగాని, జ్ఞానియనిగాని భ్రమింపకుడు. మన తండ్రి సకలచరాచరగామి, సకల దేవతలస్వరూపము, సర్వసాధూస్వరూపి, ఎచ్చట, ఎవ్వరు, ఏపేరున, ధ్యానించి.

సేవించిననూ, శ్రీసాయి అద్దానిని స్వీకరించును. అట్టి పరమాత్మస్వరూపుడగు శ్రీసాయి, దయాసముద్రుడు. ఆ తండ్రి పదధ్యానముతో తరించెదముగాక, అని జయజయ నినాదములతో బాబాకు ప్రణమిల్లిరి,

ఇన్ని విధముల తానే పరమాత్మనని, అజ్ఞానము తొలగి, జ్ఞాన జ్యోతి వెలుగునట్లు ఆ తండ్రి అనుగ్రహించిననూ, శ్రీసాయి సాధువని, భక్తుడని, బ్రాహ్మణుడని, ముస్లిమని, కుంచితబుద్ధితో తర్కించుట, సందేహించుట పరమమౌఢ్యము. అట్టివారలకూడ ఆ తండ్రి అనుగ్రహించుగాక అని ప్రార్థింతము.

నీ లీల లచింత్యములు. అవ్వి నా కెట్లు ఎరుకపడగలవు తండ్రీ ! ప్రపంచమందలి. ప్రతిఅణువునూ, నీ అధీనము. నీ ఆజ్ఞ లేనిది, ఆకుకూడ అలజడి చేయదు.

తండ్రీ ! నీ వెరుగక, నే చేయగలదేమున్నది ? నాకు జరుగునది మాత్రము ఏమున్నది ? కాని ప్రభూ ! నా మంచిచెడ్డలు, నీకు నివేదింపక తప్పదు. ఏలనందువేమో, నీకుగాక మరెవ్వరికి చెప్పుకోగలను ? ఎవ్వరు నా గొడవ విందురయ్యా !

వెంటాడి వేధించి, నా సొద చెప్పుకొనుటవదలలేదని, విసువు చెందకు. నీవు దయాసముద్రుడవని, కరుణాస్వరూపుడవని, నిన్నునమ్మి, నీదిక్కుచూచి ప్రార్థించిన, కాదనక ఆదరించి రక్షింతువన్న నమ్మకమే, నన్ను, నీ అండ జేర్చినది. ప్రభూ ! అదియని, ఇదియని నిన్ను వేధింపుచుంటినా ? అగపడిన ఇట్లే బాధింతునని, భ్రమపెట్ట రుగిడుచుంటివా అయినమాత్రమేమి ? నీవు అగపడకున్నమాత్రము ఏమి కొదువ ?

బాబా ! నీ దాగుడుమూతలు నన్ను మోసము చెయ్యలేవు. నీ వెందు పోగలవు ? తలచినంతనే దర్శన మిచ్చెదనన్న నా తండ్రి ఎచ్చటికోపోయెనని పారబడనులే. నీవుఅగపడకున్న గొంతెత్తి బిగ్గరగా చెప్పికొందును.

భక్తరక్షణపరతంత్రుడ వగు నీకే తగును తండ్రీ ! అందరి ఆర్తనాదముల, ఆలకించి, అనుగ్రహించుటకు ఎందరు ఎన్ని విధముల, మొరపెట్టిననూ, విసువు లేక, వినగలవాడవు, వినువాడవు నీవే, రారా

జని — హాలికుడని, పూజ్యుడని — పామరుడని, కలవాడని—కూలి వాడని, బాబా, నీ కేమియూ బేధము లేదు. నీ ఆశ్రితులందరూ నీ బిడ్డలు. నీ బిడ్డడు, ఎట్టిబాధయందున్ననూ, బాబా? అని ఎలుగెత్తి పిలచెనా, పరువెత్తి, బాధ్యత నీపై వైచుకుని, అప్రమత్తుడవై, అండయై నిలచెదవు. అసాధ్యమున్నదికూడ, సుసాధ్యము చేసి విడచెదవు. ఇది నీ సహజస్వభావము. ఇది గుర్తింపక నిన్ను నిందింతురు తండ్రీ!

ప్రభూ — సాయీశా!

నేను అజ్ఞానుడను, మూర్ఖుడను, అంధుడను, తండ్రీ! ఎరిగియూ, ఎరుగకయూ, ఎన్ని అసత్కార్యముల చేసితినో, ఎన్ని దురాలోచనలకు లోనైతినో, — ఏమైన నేమి, నీ పదముల నాశ్రయించితిని, నిన్ను నమ్మితిని. సర్వమూ నీ పరము గావించి, నీ పదసేవయే నా పనిగా యుంటిని. నా బాగోగులు నే నెరుగను. అది నీకే ఎరుక. వా డెట్టివాడైననూ, విశ్వాసముతో నిన్ను సేవించిన, కడజాతివానినైననూ, కాదనక గాపాడెదనన్న, గీతావాక్యముల రిత్తసేయకుము.

బాబా!

బిడ్డలు, అశుద్ధము, అలముకుని, అందేదో ఆనందము అనుభవింపుచుందురు తల్లి అసహ్యించుకుని. కాలతన్నినచో. వా డెట్లు పెరిగి పెద్ద కాగలడు. ఆ తల్లి వానిని ఎత్తిముద్దాడి, శుభ్రపరచి, తుడిచి, ఆనందింపుచున్నది. బురద పూసికొని, చిందులు వేయుచున్నవానిని, మందలించి ప్రేమింపుచున్నది. అట్టి తల్లికి మించిన ప్రేమస్వరూపుడవు. నా హృదయ మాలిన్యము తొలగించి, నా పాపపంకిలము తుడిచివైచి, శుభ్రపరచి, ఆనందించి, ఆనందింపచేయుట, తల్లివైన నీకే ఎరుక. ఆ మాలిన్యమే ఆనందమని భ్రమపడు నే నేమి చేయగలను ?

సంసారసాగరమున సుడిగుండముల పడకుండ, సురక్షితముగ చుక్కాని పట్టవలసినది, నీవు. నీ పదభజన, పదధ్యానమను, తెడ్లను మాత్రము నేను కదలింపగలను. ఈ నౌకాయానము నీ అధీనము.

స్వాతిచినుకులువినా, ఇతర నీటిబిందువులకు ఆసింపక, ప్రాణపరిత్యాగమునకైననూ, సిద్ధపడి, ఎదురుచూచు చాతకమువలె, నీకరుణా

రసమునే ఆశించుచున్నాను. ఆదరించి, అనుగ్రహించిననూ, కాదని కడకు త్రోసిననూ, నీ పాదసేవమాత్రము వదలను. నిన్ను వినా, నన్ను కాపాడగలవా రెవ్వరునూ లేరు. అనవరతము నిన్నారాధించుచూ, సంతత సాయీనామస్మరణతో, తరించెదనన్న నా విశ్వాసము సడలనీయకుము. అన్నిటికినీ ఆధారము నీవు, కన్ను మూసిననూ, కన్ను తెరచిననూ, నీ రూపమే అగపడవలె ప్రభూ ! ఎట్లు కాపాడెదవో !

"ఓం శ్రీ సాయినాథాయ నమః"

# 18 వ అధ్యాయము.

నీదు వాక్కులే, వినబడు నవిగో –
నీ సమాధికడ సాగిలపడగా –
మనసులోని, తమసులన్ని – తొలగిపోవగా –
నీదువాక్కులే –
పాదసేవ భాగ్యమబ్బె, ఈ పతితుని గాపాడగా,
వాదములను వదలి, నీదుపాదములను, పడితినిగా–
నీదు వాక్కులే–
సాధురూపా, కాదనకుము –
ఛీదరించి త్రోలిన, దిక్కు వేరే లేదుగా,
నీదు కరుణ లేకయున్న, వేదనయే, మిగులునుగా
నీదు వాక్కులే వినబడునవిగో.
ప్రభూ ! పరమాత్మస్వరూపా !

ప్రభూ ! పరమాత్మ స్వరూపా, నీ లీల లచింత్యములు. నీ కథల ఎన్నివిధముల విన్ననూ, చదివిననూ, తనివితీరదు తండ్రీ ! ఎల్లప్పుడూ నీ పదములు మరువక, నీ నామమే నా మది నుండున ట్లనుగ్రహింపుము తండ్రీ ! ఇదియే నా ప్రార్థన. నీ గోసాయీ రూపదరిశనమే నే నాశించునది, నీ లీలలు తెలుపుటకు నే నే మెరుంగుదును తండ్రీ ! జ్ఞాన

షూన్యుడ నగు నా కది సాధ్యమా ప్రభూ ! " బాలార్క ప్రభమింద్ర నీలజటిలం, భస్మాంగ రాగోజ్జ్వలం, శాంతం, నాదవిలీన చిత్త పవనం, శార్దూలచర్మాంబరం, బ్రహ్మాద్యైః, స్సనకాదిభిః, పరివృతం, సిద్ధైః సమారాధితం, ఆత్రేయంస ముపాస్మహే, హృది ముదాధ్యేయం, సదా యోగిభిః ॥ "

షిర్డీనిలయు డగు శ్రీ సాయి. తనభక్తుల కంటికి రెప్పవలె, వెన్నంటి కాపాడు పరమదయాళువు. బంద్రానివాసి, రామచంద్ర ఆత్మారామను నతడు, ఈతనికి బాబాసాహెబ్ తార్ఖాడ్, అని మరియొక పేరు. తార్ఖాడ్, ఆర్యసమాజమునకు చెందినవాడు. తరువాత బాబాకు కూర్చు భక్తుడయ్యెను. తార్ఖాడ్ యొక్క భార్యయూ, కుమారుడునూ, బాబాను సేవించు టకు షిర్డీకి పోవలయునని, ఆతుర పడసాగిరి. అందుకు ఆతడు అంగీకరించెను. ఆతనిఇంట, నిత్యము యథా విధిగ బాబాపూజాదికములు జరిగెడివి, ఆతడు ఆర్యసమాజమందున్ననూ. ఆతనిభార్యయూ, కుమారుడును బాబాభక్తులు, తరచు షిర్డీకి పోయెడివారు. ఎన్నడు వా రొనరించు పూజలను తార్ఖాడ్, అభ్యంతర పెట్టెడివాడు కాదు. అర్చన, ఆరాధనలయందు, ఎవ్వరికి వారు వ్యక్తిగతముగ వారి విశ్వాసముల ననుసరించి, ఒనరించుటయే ఉత్తమమన్న పద్ధతిగలవాడు. కుమారునకు పదునాలుగేండ్లు. చిరుత ప్రాయముననే బుడుతకు భక్తిఅబ్బినది. తెల్లవారకమునుపే, స్నాన మాడి, బాబాకు పూజ లొనరించి, నైవేద్య మిడిననేగాని, ఏమియూ భుజించెడివాడుకాదు. తిరుగపరుండునప్పుడు, బాబాధ్యాన మొనరించి, బాబాయందే మనసు లగ్నముచేసి, కన్ను మూసెడివాడు. ఆ తల్లి అంతయూ బాబాపరముగా భావించెడిది. వారు బాబాపదసేవ చేయుచూ, షిర్డీయందు నెలల తరబడి. అట్లే యుండెడివారు. పూజా మందిరమున ద్వారకామాయియం దాసీనుడైన, బాబా, పటముండెడిది. ఆ కుర్రడు అందు బాబానే చూచెడివాడో ఏమో, బాబాతో భాషించుచున్నట్లు, ఆ పటముతో మాటాడువాడు. ఆ తల్లి, కుమారులను, షిర్డీకి వెళ్ళవలసినదిగా, తార్ఖాడు, అనుమతించిననూ, కుమా

రునకు మాత్రము, బంద్రావదిలి వెళ్ళుటకు మనస్కరించలేదు. తండ్రి ప్రార్థనాసమాజమువాడు, తాను వెళ్ళినచో, బాబాకు ఆ ఇంటక్రమముగా పూజగాని, నైవేద్యముగాని, జరుగదని, ఆతని భయము. తన తండ్రి, అలక్ష్యముతో, బాబాసేవను మరచి, ఏమిలోపము చేయునో యని వెరపు. ఆ కారణముచేతనే, షిర్డీకి ప్రయాణమని ఉవ్విళ్ళూరు చుండిన ఆ బాలుడు, తిరుగ సంశయించెను. తండ్రి అది గ్రహించినాడు. ఏల నీకీ సంశయము ? నీవు నిత్యము ఎట్లుపూజలుచేసి, నైవేద్యమిచ్చెదవో, అట్లు నేను అక్షరముల జరిపెదను. ఇతర పను లెన్నియున్ననూ, బాబా, పూజల పూర్తి చేసిగాని, అడుగు బయటపెట్టను. నాయందు నమ్మకము ఉంచి నిశ్శంకగ, నీవు షిర్డీకి పోవలసినది. నీ దైవమగు సాయిని, ప్రత్యక్షముగ తనివితీర, సేవించుకొని, తిరిగి రావలసినది, అని వాగ్దానము చేసెను. అంతట శుక్రవారమునాటిరాత్రి పయనమై, ఆ తల్లికుమారులు షిర్డీచేరి, బాబాను దర్శించిరి.

శనివారము ఉదయ మగుసరికి, పెందలకడలేచి. తార్కాడు, స్నానము చేసినాడు. పుష్పములు, గంధ, చందన తాంబూలములు, ఇతర పూజాద్రవ్యములు సిద్ధము చేసినాడు. ఆరతి నెత్తుటకు కర్పూరము తెచ్చినాడు. పూజ ప్రారంభించుటకుముందు, అతడు, బాబాపటమున కెదుట సాష్టాంగపడి, 'బాబా, ఈ నీ పూజావిధానములు, నాకు తెలియవు. నా పుత్రుడు నిత్యము పూజచేసెడి వరుసను చూచుచుంటిని. ఆ క్రమముతప్పక, నేనుకూడ ఆత డొనరించిన విధముననే, నీకు పూజ చేసెదను. నేను ఏమిలోపము చేయుదునో అన్నసంశయమే అతని బాధించినది. నేను పీటనైననూ మార్చుటలేదు. అంతయూ వాడు చేసినట్లే చేసెదను. కాని ఈ పూజ, ఏదో వ్యాయామమువలె, క్రీడవలెగాక, నీయందు భక్తి కుదురునట్లు, నీవు తృప్తుడ వగునట్లు, అనుగ్రహింపుము. ఆ బాధ్యత నీది" అని వేడుకొనెను. అంతట, క్రమము తప్పకుండ, యధావిధిగ పూజముగించి, ఆరతినిచ్చెను. పటికెబెల్లము నైవేద్యమిడెను. ఆ ప్రసాదమును కన్నుల కద్దికొని ఆరగించెను. ఎట్టి లోపమునూ లేక ఆదివారముకూడ గడచినది. సోమవారము, తార్కాడునకు కచ్చేరియున్నది. ఐననూ, పెందలకడలేచి, బాబా

పూజ యథావిధిగ పూర్తిచేసి, నైవేద్యమిడి, తరువాతనే ఉద్యోగమునకు పోయెను. మూడురోజులట్లు బాబాపూజచేసినంతలో, పూజా విధాన మెరుగని తార్కాడునకు, ధైర్యము కల్గినది. తాను ఎట్టి లోపము చేయుటలేదని, కుమారునకు ఇచ్చినమాటప్రకారము, లోటు లేక బాబాపూజ తాను చేయుచుంటినని, అందుకు బాబాకూడ అంగీకరించెనని పొంగిపోయెను.

మరునాడు మంగళవారము, తార్కాడు స్నానముచేసి, పూజ ముగించి, తొందరపనులుండుటచే, త్వరత్వరగ దుస్తులు ధరించి, కచ్చేరికిపోయెను. తిరుగ వేళకు, భోజనమునకని ఇల్లుచేరెను. వడ్డనఅయినది, బాబా ప్రసాదమునకని ఎదురుచూచుచుండెను. వంటవాడు, నేతిపాత్రను తెచ్చినాడేగాని, ప్రసాదము తెచ్చి ఈయలేదు. 'ఏమయ్యా ప్రసాదము తెచ్చి ఈయలేదు. 'ఏమయ్యా ప్రసాదము నీయకయే, నేయి తెచ్చితివే ! మరచితివా ? బాబాప్రసాదము, మున్ముందు పుచ్చుకోవలదా ? అది లేకయే అన్నము తినమందువా ?' అని గద్దించెను. అందులకా వంటవాడు, సవినయముగ, ఇట్లు బదులు చెప్పెను. 'బాబూ ! తాము ఈ ఉదయము పూజఅంతయూ అయినపిదప, తొందరగా లేచిపోయి, దుస్తులు ధరించినారు. వెంటనే ఒయటికి పోయితిరి, తాము బాబాకు నైవేద్యము ఈయలేదు.' ఈ మాటలు వినిన, తార్కాడునకు, శరీరము కంపమెత్తినది, కన్నులు చీకట్లు క్రిమ్మినవి, నోట మాటరాలేదు. తడబడు అడుగులతో, ఆసనమునుండి లేచెను. మందిరముముందర బోర్లపడెను. కన్నులవెంట నీరు కారుచుండెను. అతనికంతయూ, అయోమయముగ తోచినది. ఉన్నట్లుండి, బాబా ! అని కేక పెట్టెను. తండ్రీ, ఇది ఏమి అన్యాయము, నేను ఎరుగనివాడనని ముందే తెల్పితినే, బాధ్యత నీదియని మొరపెట్టితినే, మూడురోజులు చక్కగ సాగిపోయినదని, సంతసించితినే, నీవు నా పూజకుకూడ తృప్తుడవైతివని, ఉప్పొంగితినే, బాబా పనితొందరఅని, నీ నైవేద్యము, మరచితినా, నీ వేల తెలుపవైతివయ్యా ! ఇదియేనా నీదయ. నే నెంత బుద్ధిహీనుడను. బిడ్డడి, భయమే నిజమైనదా, నీకు నైవేద్యములేక నాకు భోజనమా ? ఈ తిండి నాకుమాత్ర మేల ?

అన్నను, నేనేమో క్రమముగ పూజ లొనరించితినని, ఆహమున గర్వించితిని. నాకునూ. భోజనమునలదు. నా ఈ అపరాధమును, మన్నింపవా, బాబా,' అని భోరున ఏడ్చినాడు. వెంటనే తా నొనర్చిన పొరబాటును, అందుకు తాను పడ్డపరితాపమును, వివరములతో, బాబా సన్నిధిని, తన లోపమును మన్నింపవలసినదిగా ప్రార్థింపమని, తన కుమారునకు జాబు వ్రాసినాడు. మంగళవారము మధ్యాహ్న సమయమున జరిగిన సమాచారమిది.

అదే సమయమున, షిర్డీలో, జరిగిన విషయము చూతము. మధ్యాహ్నము హారతి వేళ అయినది. అంతయూ సిద్ధము చేయబడెను. బాబాకు కుడిప్రక్కన, తార్కాడుసతియూ, కుమారుడునూ. నమస్కార పురస్సరముగ నిలచియుండిరి. బాబా తార్కాడు సతిని పిలచి, అమ్మా! నాకేమైన తినుటకు ఇత్తురేమోనని, గంపెడాసతో, బంద్రాకు పోయి, మీ ఇల్లు చేరితిని. కాని తల్లీ, తలుపు లన్నియూ మూసియున్నవి. తాళములుకూడ వేయబడెను. ఎట్లో లోనికి పోయితిని, ఇల్లంతయూ వెతకికొంటిని, కాని నా కేమియూ తినుటకు ఉంచనేలేదు గదమ్మా ? ఏమితల్లీ, నేను నీబిడ్డనుగానా, ఎంత ఆకలితో తిరిగి పరుగిడి వచ్చితిని " అనెను. ఆమె కేమియూ, ఈ మాటలు అర్థముగాలేదు. కాని ప్రక్కనేయుండి, వినుచున్న కుమారునకు మాత్రము, ఆందోళన కలిగినది. అమ్మా మన ఇంట, బాబాపూజలో ఏదో లోపము జరిగినది, నేను ఇంటికి వెళ్ళెదను, బాబా నాకు పోవుటకు, అనుజ్ఞనిమ్మని వేడికొనెను. కాని బాబా అందుకు అనుమతింపలేదు. నీవు ఇంటికి పోనేల, అచ్చట నీవెట్లు పూజింతువో, ఆ విధమున ఇచ్చటనే ఆరాధింపుము. నీకు వెరపేల, అని మందలించెను. అత డదృష్టవంతుడు, బాబాను దైవమువలె, దర్శనస్పర్శనలతో, యథావిధిగ పూజించినాడు, అర్చన అయినపిదప హారతి నిచ్చినాడు. వెంటనే షిర్డీయందు జరిగిన విషయము లన్నియూ, తండ్రికి విశదముగ లేఖను వ్రాసినాడు. బాబాపూజచేయుటలో, అప్రమత్తుడుగాక, జాగ్రత్తగా యుండుమని, మనవిపూర్వకముగ తెలిపినాడు. తండ్రికుమారులు వ్రాసిన ఉత్తరములు, ఎదురుబడులుగ ప్రయాణము చేసినవి. మరుసటి ఉద

యము కుమారునిఉత్తరము తండ్రికినీ. తండ్రిఉత్తరము కుమారున కునూ చేరినవి. తండ్రివ్రాసిన ఉత్తరముతో కుమారుడు, బాబావద్దకు పోయెను. ఆతడింకనూ, ఉత్తరమును కవరునుండి బయటికి తీయనే లేదు. కాని బాబా ! ' బిడ్డా వెరపేల, నీ తండ్రివ్రాసినదేగా, నాకు నైవేద్య మిచ్చుట మరచినాడు. ఇంతియేగా, నేను ప్రత్యక్షముగ ఇచ్చట పుచ్చుకుంటినిగదా, భయములేదు. నీ తండ్రి ఇకనుండు ఎన్న డునూ నన్ను మరువడు, అని ఆశీర్వదించెను. ఎక్కడిబంద్రా, ఎక్కడి షిర్డీ, బాబా తన భక్తులచే ఆరాధింపబడుచూ, షిర్డీయందు, తన ఆస్థానమున, భక్తులతో సంభాషింపుచునే యుండెను. కాని బంద్రా యందు తార్కాడు ఇంటికి వెళ్ళినదియూ నిజమే. నైవేద్యమునకు వెతకినదియూ నిజమే. అచ్చట నైవేద్యము లేదన్నదియూ నిజమే. బాబా షిర్డీయందు మాత్రమే ఉండునని పొరబడకుడు. ఆ తండ్రి తన భక్తుడు ఎక్కడ, ఎంతదూరమందున్ననూ, అక్కడ తానుకూడ వెంటనేయుండును. ఎందరు భక్తులున్న, అందరితోడనూ అట్లే యుండును. శ్రీ సాయి సర్వాంతర్యామి, పరబ్రహ్మ స్వరూపము, స్మృతిమాత్ర ప్రసన్నుడు, ఆ తండ్రి మన వెంటనేయున్ననూ, అది మనకు తెలియుటలేదు. అది తెలియునట్లు జ్ఞానమును ప్రసాదింపమని ప్రార్థింతము.

"ఓం శ్రీ సాయినాథాయ నమః"

# 20 వ అధ్యాయము

బాబా !

లీలామానుష విగ్రహుడవగు, నీ చిత్ కళల, నే నేమని వర్ణింప గలను తండ్రీ! యోగములకును, వేదములకునూ, మూలాధారమగు నీ చరిత్ర చెప్పుటకు నా కెక్కడి అర్హత? నేను నీ పదసేవకులకు సేవ కుడను, వ్రాయుటకని కలముపట్టిన, అక్షరమైననూ సాగుటలేదే తండ్రీ, నీవు అనుగ్రహింపకున్న, నేను నిస్సహాయుడను, అశక్తుడను. ప్రేమ

మూర్తివగు నీ ఆదరణమే, నాకు ఆధారము. సత్యస్వరూపుడవగు నీవు ప్రసన్నుడవై, పాలింతువన్న ఆశయే. ఆ నమ్మకమే, నాకు అండ, పుండరీకాక్షా ! పవిత్రమగు నీ చరిత్ర వ్రాయించవలసినది నీవు. జ్ఞానశూన్యుడనగు నేను, నీ పదధ్యానముతో, నిన్ను, నుతింపయత్నింతును, అన్యవిధముల నేను వ్యర్థుడనయ్యా ?

షిర్డీనిలయుడగు శ్రీసాయి, భగవంతుడని చెప్పపనిలేదు. పరమాత్మ స్వరూపమగు బాబా, తానే, సకలదేవతాస్వరూపమని, సకల సాధువుల రూపమును తానేనని, తన భక్తులకు తెల్లమగునటుల తెలుపుచుండెను. ఈ లీలలు, చమత్కారములకు కారణమేమని, కొందరు విద్యావంతులకే సందియము, కలిగెడిది. అందుల కాతండ్రియే సమాధాన మిచ్చినాడు. దైవస్వరూపుడగు శ్రీసాయి, తానేమి, కీర్తి ప్రతిష్టలకై ప్రాకులాడెనా? కాక తనపై ఆధారపడు ఆప్తులనూ, బందుగులను పోషించు బాధ్యతయుండి, ధనసేకరణకై ఆశించెనా ? నింబ వృక్షమూలమే ఆయన నివాసము. సుందరమందిరములుగాని, విశాలమగు భవనములు, సౌధములుగాని వలయునని, బాబా, ఆశపడెనా ? ఎన్నడైన బాబా చీనాంబరముల ధరించెనా ? ఆ తండ్రి తన ఆనందమునకని, పానీయములుగాని, రుచికరము లగు పదార్థములుగాని కోరెనా ?

బాబా, తాను, అవతారమూర్తినని, అడుగడుగునకు, తన భక్తులగు బిడ్డలకు ఎట్లు అనుభవములతో చూపెనో, తెలసికొంటిమి. ఘటనాఘటన సమర్థుడును, నిగ్రహానుగ్రహ నియంతయు నగు శ్రీసాయి వాక్కు అమోఘము. బాబా అనుగ్రహించి పలికెనా, అది వరప్రసాదమే. నైజామురాష్ట్రమున, నాందేడు, వాస్తవ్యుడు, రుస్తుంజీవాడియా, చాల ధనవంతుడు. పేదలపై దయ, దైవకథలయందు ఆసక్తి, సాధువులన్న భక్తి, పెద్దలన్న, నయవినయములు, పిల్లలపై ప్రేమ, కలిగి, సద్వర్తనుడై, సుగుణములగనియై, అందరకు విశ్వాసపాత్రుడై, సత్పురుషుడని పేరందెను. తరుగనిధనము, తీరనిలాభము నిచ్చు వ్యాపారము, ఆహా! అదృష్టవంతుడు, అని తోడివారు పలుకుచుండిరి. వాస్తవము

నకు, సౌధములయందు. దాసదాసీజనములు, ఊడిగము సేయ, పట్టు పరుపులపైన, పవ్వళింపుచూ, పుట్టుభోగివలె యుండెడివాడు. పేదరికము, ఆత యెరుగడు, కష్టమన నెట్టిదో ఆతనికి తెలియదు. నిరంతరము, సంతోషమే, ఆతని ఇంటకాపుర ముండెడిది. దీనదశయందుండి ఆయన సాయమపేక్షించిన ఎన్నడూ ఆతడు కాదని ఎరుగడు. భగవత్ కైంకర్యమునకుగాని, ప్రజాసేవకుగాని, రుస్తుంజీ వెనుకాడెడివాడుగాడు. బాధయందున్న వారిని చూచిన, ఆతని గుండె ద్రవించెడిది. ఇంతటి వైభవముండియూ, పైకింత మహాభోగివలెయున్ననూ, నిజమునకు, రుస్తుంజీ, మనస్సునకు మాత్రము తృప్తిలేదు, శాంతిలేదు, సౌఖ్యము లేదు. ఇందుకు కారణము. ఆతనికి ఎట్టిసంతానమునూ లేకుండుటయే. ఎంతయుండిమాత్రమేమి, పాపలులేని ఆ ఇంటికి కళ ఎక్కడిది. 'అపుత్రస్య గతిర్నాస్తి' అన్నసూక్తి ఆతని బాధించెడిది. ఎందరవో వివాహములు చేయించెను. అన్నదానము అధికముగ చేసెను. సత్రముల కట్టించెను. ఆలయముల నిర్మించెను. కాని ఆ భగవంతు డనుగ్రహింపలేదు. కడకు ఒక్క ఆడశిశువైననూ కలుగలేదు. ధనాదాయము మాత్రము పెరుగుచునేయున్నది. నాటికి, నాటికి ఆ దంపతులకు వయసు మీరుచుండెను. పాప మాతడు, చూడని, జ్యోతిష్కుడు లేడు. ధనాపేక్షాపరులైన, శాస్త్రజ్ఞులు కొందరు, ఆతనికి జాతకముపై సంతాన యోగము లేదని, తెలిసియూ, రాహువును ముందుకు త్రోసియో, కేతువును వెనుకకు లాగియో, బుధుని నుతించియో, పనిమాలి శనిని, పదింటికి పంపియో, సుయోగముల కల్పించి. అనతికాలమున ఆతడు పుత్రవంతుడు కాగలడని చెప్పి అన్యాయముగ ఆర్జించెడివారు. పుత్రవంతుడవు, అన్నంతమాత్రమున, రుస్తుంజీ, పుత్రు డుదయించెనన్నంత సంతోషముతో, వేలకువేలు. వారలకు బహూకరించెడివాడు

ఆర్జనావిధాన మెరుగని, లోకజ్ఞానములేని, కొందరు పెద్దలు, జాతకమును చక్కగ పరిశీలించి, పెదవివిరచి, అయ్యో, ఐశ్వర్యవంతుడవు కాని అందని ప్రమాణపండు. సంతానయోగము లేదు. ఇంతకూ గ్రహస్థితి, కాదని మీకు అబద్ధమెట్లు చెప్పగలము. ఈ జన్మమున మీ కోర్కె తీరుట దుస్తరము అనియే చెప్పవలసియున్నది. అన్నవారునూ లేకపో

లేదు. అంతమాత్రమున, రుస్తుంజీవారిని ఆదరింపకపోలేదు. మీ రేమి చేయగలరు, విధిని తప్పింపగలరా, కానిండు, ఆ భగవాను డనుగ్రహింపడా', అని వారినికూడ, ఉచితరీతి సత్కరించి పంపెడివాడు.

నక్షత్రములుండి మాత్రమేమి, చంద్రుడులేని రేయి, లోకజ్ఞాన మెరుగని శాస్త్రపాండితి, సృతిలేని సంగీతము, భక్తిలేని భజన, ఎందులకీ బిడ్డలులేని భాగ్యమని, రుస్తుంజీ, లోలోన వాపోయెడివాడు. ఆ బాధ, అట్టివారలకే ఎరుక, పుత్రాలింగనానుభవము పుత్రవంతులకే ఎరుక. భాగ్యమున్నంతమాత్రమున, మానవుడు, సౌఖ్యముగ నుండజాలడు. ఆ దంపతులకు యాబది గడచినవి. అన్ని దేవతల నారాధించిరి. పుణ్యక్షేత్రములు దర్శించిరి. ఫలముమాత్రము లేదయ్యెను. సంతతి కలుగగలదన్న ఆశకూడ సన్నగిల్లినది. భాగ్యమన్న వెగటు తోచెను. నిద్రాహారములుకూడ తగ్గినవి. ఏదోదిగులున పొగలువానివలె. ముఖవికాసముకూడ తరుగ మొదలిడెను. కాని వారలకు భగవంతునియెడ భక్తివిశ్వాసములుమాత్రము, వెనుకాడలేదు. రుస్తుంజీ, దాస్‌గణునకు శిష్యుడు. ఒంటరిగ, తన దీనస్థితి, కన్నీటితో. తన గురువుకడ చెప్పికొనెను. దాస్‌గణు. అతని నోదార్చి, బిడ్డా, భయమేల, మనపాలి భగవంతుడు, అవతరించి. తనను చేరు భక్తుల, ఆర్తిదీర్చి, ఆదరించి, ఆశీర్వదించి. అనుగ్రహించి, పాలింపుచున్నాడు, గ్రహస్థితి నిన్నేమియూ చేయలేదు. సంకల్పమాత్రమున, నీకు సంతానము కలుగునట్లు వరమొసంగగల, పరమాత్మస్వరూపము మన అండనుండ, ఏల వగచెదవు, ఇంత కాలమేల ఉపేక్షించితివి. పెరటిన పెన్నిధియుండ, దేవురించి, పరులపంచల పరువెత్తితివే. జాతకమున పుత్రయోగము లేదని వగవకుము. శ్రీసాయి తలపెట్టిన, అసాధ్యమన్నది లేదు. శ్రీసాయి సకల చరాచరముల కధిపతి. ఆతని సంకల్పములేక, ఈ విశ్వమున ఆవంతయూ అలజడి యుండదు. కలియందు మనల కాపాడుటకు ఇచ్ఛామాత్రశరీరుడై అవతరించిన పరమాత్మస్వరూపి. నీవు భయమువదలి, బాబాను దరిశించి సేవింపుము. బాబా, దయామయుడు, కరుణామూర్తి, ప్రేమస్వరూపము. ఎవ్వరినీ కాదనడు. బాబా, అనుగ్రహించెనా, నీవు అదృష్ట

వంతుడవు. తప్పక నీ కోర్కె తీరగలదని, ధైర్యముచెప్పి, దీవించి. రుస్తుంజీని షిర్డీకి పంపెను.

ఆ దంపతులు షిర్డీ చేరిరి. కలవారు, ఏమికొదువ, తియ్యనిపండ్లు, కమ్మనివాసనలనీను, పుష్పమాలలు, నోరూరించు పిండివంటలు. అన్నియూ వెంటగొని, బాబాను దరిశించిరి. అప్పటికప్పుడే. బాబా మశీదునందుండెను. గోసాయిరూపమున యున్న శ్రీసాయి, రుస్తుంజీ, చూచుట అదియే మొదటిసారి. కాని ఆతనికి. ఎన్ని సంవత్సరముల నుండియో తా నెరింగియుండెనా, అన్నట్లనిపించినది. పరుగుపరుగున, రుస్తుంజీ. బాబాను, చేరెను. చూచుసరికి బాబాచుట్టునూ, దివ్య కాంతి, ఇంకనూ భయమేల, అంధకారము తొలగిపోయినది. నీ ఇంట వెలుగు కలుగగలదని తెలిపెనా, అన్నట్లున్నది. రుస్తుంజీ. ఒడలుపులక రించినది. మేను వణకుచుండెను. నోట మాటరాలేదు, అట్లే ఆనంద మనుభవింపుచూ, బాబాపాదముల ఒత్తమొదలిడెను. బాబాచిరునగ వుతో, బిడ్డా లెమ్మని లేవనెత్తెను. రుస్తుంజీ, ఆత్రముతో, పండ్లబుట్ట నందుకొని, బాబాముందుంచెను. బాబా, తాను స్వయముగ అందుండి, నాలుగుపండ్లుతీసి, అమ్మా, ఇవిగో ఫలములు, ఇవి నీవే భుజింపవలెను సుమా, నీవు పుత్రవతివి. నలుగురు కుమారులు, కలుగగలరని. రుస్తుంజీ సతికి అందించెను. రుస్తుంజీ, సంతోషమునకు మేరలేదు, ఆతడింక నూతనకథ, బాబాకు తెలుపనేలేదు. సంతానమునకని పరితపించి, బాబాను చేరవచ్చిన తనగాథ. తనకోర్కె, బాబాకు ఎట్లు తెలసినది? ఇదియే ఆశ్చర్యముగ తలపోయుచుండెను. ప్రక్క నేమి జరుగుచున్నది కూడ, రుస్తుంజీకి తెలియుటలేదు. అచేతనుడై. కన్నులు బాబాపై, కేంద్రీకరించి, అట్లే వెర్రివానివలె చూచుచుండెను. ఆ తల్లి భక్తి పూర్వకముగ, ఆ నాలుగుఫలముల నందికొనెను. ఆ పవిత్రహృదయ, సాష్టాంగపడినది. లేచి, ఆలయమున భగవంతునికివలె, బాబాకు ముమ్మారు ప్రదక్షిణ మొనరించినది. తిరుగప్రణమిల్లినది ఆ ఫలముల భర్త కందించినది. అప్పటికింకనూ, రుస్తుంజీకి తెలివి, రాలేదు. బాబా హస్తస్పర్శయందలి మాహాత్మ్యమేమో, అది నేనే మెరుంగుదును. ఆ తండ్రి ఇంకనూ నన్ననుగ్రహింపలేదు. అనుగ్రహించునో లేదో, అది

ఆయనకే ఎరుక. రుస్తుంజీ అచేతనుడై అమరసుఖ మనుభవింపుచూ, దివ్యస్థాయియం దుండెను.

బాబా, ఆతని పలుకరించెను. ఆతనికి తెలివి వచ్చినది. కన్నుల వెంట ప్రవాహముగ నీరు కారుచున్నది. నా తండ్రీ! అని పెద్దకేకనిడి, బాబాను బిగ్గరగా కౌగలించుకొనెను. సాయి, సాదరముగ ఆతని శిరము నిమురుచూ, బేటా నీకింకనూ వెరపేల, నీవు నన్ను ఎరుంగకున్ననూ, నేను సంవత్సరములతరబడి, నీ వెంట నేయుంటిని. నీవు పుణ్యక్షేత్రముల దర్శించిననూ, దేవాలయముల అర్చించిననూ, అంతయూ నామూర్తియే యని గ్రహింపుము. నాభక్తులను, నేనే ఎన్నుకొందును. ఎంతదూరమందున్ననూ. నా భక్తుడు నన్ను దరిశింపక తప్పదు. నేనే ఇచ్చటికి ఆకర్షించి, పిలపింతును. ఆశ్చర్యపడెదవేల ? జాతకము ప్రారబ్ధము, ఏమిచేయగలవు. ఇది నా యాజ్ఞ. అనుల్లంఘనీయము, నీగాధ, నీ బాధ, అంతయూ నేనెరుగుదును. ఒక్క కుమారుడే అననేల ? నలుగురు కుమారులు కలుగగలరు. ఈ సాయివాక్కులు సత్యదూరములు ఎన్నటికినీకావు. నిర్భీతిగ, నీవు నీ మకాముచేరి, ఆ ఫలముల నీ దేవికి ఆరగింపజేయుము. అని ఆశీర్వదించి, బాబా స్వయముగ రుస్తుంజీ నుదుట ఊధినిడి పంపెను.

సంవత్సరము గడచినది. వయసుమీరిన రుస్తుంజీ సతి గర్భవతి. చక్కని కుమారుడు కలిగెను. పసికూనతో వారు బాబాను దర్శించిరి. ఆ దంపతులు షిర్డీయందొక ప్రత్యేక భవనము నిర్మించుకుని, అందే యుండ మొదలిడిరి. రుస్తుంజీ వాడయని, నేటికినీ యున్నది. ఆ తల్లి నలుగురు కుమారులను కనెను. ఇతర సంతతికూడ కల్గినట్లు తెలుపబడినదిగాని, నిలచినదిమాత్రము ఈ నలుగురే. పరమ దయాళువగు బాబాకు దయకలిగెనా, అసాధ్యమన్నది లేదు. బాబా అనుగ్రహించినచో, దుష్టగ్రహములేకాదు, దుష్కర విధివ్రాతకూడ మారవలసినదే, ఆధ్యాత్మిక చింతనకు సౌఖ్యమునకు, ఈ కాలమున, సర్వసంగ పరిత్యాగముగాక, ప్రాపంచిక సౌఖ్యములుకూడ అంత అవుసరమనియే, బాబా తెల్పినది. బాబా, తనభక్తుల ఎన్నడూ బైరాగుల

చేయడు. తన భక్తునియింట లేమిడి ఉండదని, అన్నవస్త్రములకు లోపము కలుగదని, ఆతండ్రి ఆజ్ఞ. ఇది అనుభవసిద్ధము. బాబా పద సేవ అబ్బినచో, మన మెరుంగకయే మనయందు పరివర్తనకలిగి, భగవత్ చింతన తలఎత్తకలదు. ఇదియే బాబాయందలి ప్రత్యేకత. అట్టి భక్త సులభుడు మన అండనుండుటయే మన అదృష్టము. ఎల్లప్పుడూ మన మనస్సు శ్రీ సాయీపదముల నిలచియుండునట్లు అనుగ్రహింపమని ప్రార్థింతము.

"ఓం శ్రీ సాయినాథాయ నమః"

# 21 వ అధ్యాయము.

ప్రభూ! సాయీశా:

బహుయోనులజన్మించి, పాపమతినై సంయోగ, వియోగముల సుఖదుఃఖముల సుడివడి, సంసారమున మునిగితేలుచూ, తృప్తిలేక తృష్ణాసంగతుడనై, తడబడునన్ను దరిజేర్ప సమర్థుడవు నీవే, నీకన్న నాకు వేరు దిక్కెవ్వరున్నారు తండ్రీ.

అనేక జన్మసంపాదిత, పాపపంకిలము, నన్నాశ్రయించి అజ్ఞానాంధకారమున, అణచిపెట్టి అనవరతము నన్నంటిపెట్టుకుని, అనుక్షణము అవరోధమై, నిర్మలమగు నీపదసేవకు, నిరోధకమై నిలచుచున్నదయ్యా! నీ అనుగ్రహము, వినా ఇతరమేమియూ నాకు నిలకడ నీయలేవు. బాబా! కరుణాసాగరా, పతితుడనగు నాపాలిదైవమవై, పాలింపుమన్న నామొర పెడచెవిపెట్టకు. నిర్గుణపరబ్రహ్మమగు నీ అవతారచర్య అందలిప్రత్యేకత, నియమబద్ధముగ తెలుపు సామర్థ్యమొసగి, సంరక్షింపుము తండ్రీ, కాకయున్న అవ్వి వర్ణించుటకు నేను అశక్తుడను.

పరమాత్మస్వరూపుడగు బాబా, తన భక్తులయందు అవిశ్వాసమువదలి భక్తి, పెంపొందగలందులకు తానే భగవంతుడనని ప్రపంచమునగల సాధుపులందరుగూడ తానేనని, అనేక విధముల స్పష్టపరచి,

తనలీలల చూపెను. కొన్నివిధముల సాయి ప్రత్యక్షముగ తానే భగవంతుడనని చూపినను, అనుమానములతో సతమతమగువారు మాత్రము లేకపోలేదు. బాబాను, భగవంతుడనినమ్మి సేవించిన భక్తులను పాలించుటయందు ప్రత్యేకత లేదు. అవిశ్వాసముతో బాధపడుచూ పరీక్షింప సమకట్టిన వారినికూడ, కరుణాస్వరూపుడగు మనతండ్రి ఆదరించి అనుగ్రహించుటయందే బాబా ప్రత్యేకత. 'నా భక్తులను నేనే ఎన్నుకుందును. వారెంత దూరమందున్ననూ, నాదాపుకు చేర్చెదనని గదా, బాబా తెల్పినది. బాబాను, భక్తితో సేవింపువారిని, కంటికి రెప్పవలె కాపాడుననుటకు సందియము లేదు. దయాసముద్రుడును, ప్రేమస్వరూపుడునూ అగు ఆ తండ్రి, అందులకే అవతరించెను, కాని, ఎన్నడూ బాబా నామమైననూ తలపక బాబాయందుగాని, బాబా లీలలయందుగాని, పూర్ణమగు విశ్వాసము లేక, సందేహములతోనున్న వారికి, బాబా ప్రత్యక్షముగ దర్శనమిచ్చి అనుగ్రహించి, ఆదరించి, తనవద్దకుచేర్చుటయే, బాబా అవతారచర్యలయందలి ప్రాధాన్యత.

సంపన్నగృహస్తు, పురాకృత పుణ్యావశమున మేధావి, బొంబాయి నగరవాస్తవ్యుడు, హారికనోబా, అనగా ఆతడు కనోబాకుమారుడు, ఆతనిపేరు హరి–ఈతని మిత్రులెందరో బాబాభక్తులు. బాబా భజనలతో బాబా లీలల చింతనతో కాలము గడుపుచుండిరి. ఈ హారికి మాత్రము నమ్మకముకుదర లేదు సరికదా, బాబాను పరీక్షింతమనియే భ్రమకలిగినది. అట్టి అనుమానముకలుగుటకూడ, అదృష్టమేయనక తప్పదు. భక్తితో గాకున్నమానె, పరీక్షింతమన్న అహంభావముతోనైన, బాబాను దరిశనముచేయుట జరుగుచున్నది. భగవంతుని పరీక్షించుటకు మన శక్తి ఎంత? సామాన్యులగు మనమిచ్చెడి ఈ యోగ్యతా పత్రము లేకున్న, ఆయనకేమిలోటు, కాదుమన ఈ యోగ్యతా పత్రములతో ఆయనకు ఒరుగునది మాత్రమేమున్నది. అనుమానమైననూ కలిగినచో, భగవత్ చింతనకలిగినట్లే, అదియునూ లేని పాషండులకన్నా మేలుకాదా, భగవాను డనుగ్రహించిన ఈ అనుమానము లేమిచేయగలవు తృటిమాత్రమున తీరిపోవా?

ఈహరి, బాబాను దరిశించుటకని కాదుగాని, పరీక్షించవలెనన్న భావముతో తనమిత్రులతో షిర్డీకి పయనమయ్యెను. అందరూ షిర్డీ చేరిరి. హరికూడ తన మిత్రులతో మశీదు చేరెను. మిత్రులందరు భక్తులయిన కారణమున, పుష్పముల, పూజాద్రవ్యములగొని తెచ్చిరి. హరిమాత్రము ఒట్టిచేతులతో చేరెను, పైపెచ్చు, జరీ తలపాగధరించి, దువ్వలు వలతో పాదరక్షులతో, మశీదు చేరెను. అప్పటి కప్పుడే భక్తు లనేకులు, బాబాను, సేవింపు చుండిరి ప్రసన్నమగు బాబా వదనము చూడగనే, ఈహరికిగల అనుమానము, పరీక్షింతమన్న పట్టుదల, ఏమయ్యెనో మనమెరుగముగాని, తానుపరుగునపోయి బాబా పాదముల వ్రాలపలయునను ఆతురత హెచ్చెను. ఆత్మశాంతి చేకూరినది. ఒడలు పులకరించినది. ఈతడు అదృష్టవంతుడు. నిజమునకు ఈబాబా భగవంతుడుకాదని, ఫకీరని చాటినమాత్రమేమి. అంత మాత్రమున బాబాకు కలుగగల లోటేమిటి! మనతండ్రి దయాసముద్రుడగుటచేతనే, ఇట్టి వారినికూడ అనుగ్రహించుట, పాపము హరి తొడిగిన పాదరక్షులు విలువైనవి. బొంబాయి బయలుదేరునప్పుడే, పాతికరూకలకుకొని యుండెను.ఆకారణమున పదిలముగ మశీదు ముంగిట, ఆ పాదరక్షులువదలి, వాటిపైననే దృష్టియుంచి, తిరుగ, తిరుగ వానిని చూచుచూ, బాబానుచేరెను. అక్కడనుండికూడ ఎదర పాదరక్షులగపడునట్లు స్థలము చూచికూరుచుని పదేపదే వానిని గమనింపుచుండెను. నిమిషమాత్రము అతడు శిరమువంచి బాబాకు నమస్కరించి తలఎత్తిచూచుసరికి, పాదరక్షులగుపడలేదు. చిత్తము శివునిమీద, భక్తి చెప్పులమీద అన్నట్లయినది. ఆత్రముతో హరి బయలుదేరి, మశీదంతయూ వెతకెను. వచ్చిపోయెడివారి పాదములను పరీక్షింపుచుండెను. గంటలతరబడి అట్లా ముంగిటనిలబడి వానికై అతి శ్రద్ధతో చూచెను. కాని అవ్విమాత్రమగపడలేదు. బాధపడుచూ మిత్రులతో మకాముచేరెను—

ఆ హరి, షిర్డీకి వచ్చుట అదియే మొదటిసారి. తన తండ్రిపేరుగాని తనపేరుగాని తానుగాని తనమిత్రులుగాని, బాబాకు తెలుపలేదు. మిత్రులతోబాటు తానుకూడ, మకామునందు భుజింపుచుండెను,

ధ్యాస మాత్రము పోయిన పాదరక్షులపైనే యున్నది. త్వరితగతి భోజనము ముగించి, చేయికడుగుటకని బయటకు వచ్చెను. వచ్చుసరికి, వీధి వెంట మరాఠీబాలు డొకడు, ఒక కర్రకు చెప్పులజత తగిలించి,— హరీకాబేటా—జరీకాపేటా—అని కేకలు పెట్టుచుండెను. వెంటనే హరి, ఆ బాలునిపిలిచి ఏమిటి విషయమని ప్రశ్నించెను. అందులకాతడు ఇట్లు చెప్పెను. 'బాబా నన్ను పంపినాడు. హరికాబేటా! జరీకాపేటా, అని కేకలు పెట్టవలసినది. ఎవరైనపిలిచి చెప్పులిమ్మని అడిగిరా, ముందు ఆతనిపేరు హరియేనా, తండ్రిపేరు కనోబాయేనా, అని తెలుసుకుని, ఆతనికి సరిగె తలపాగా యున్నదా, అని అడిగి అవునన్నచో, ఆతనికీచెప్పు లీయవలసినది, అని చెప్పినాడు. ఆ మాటలు హరి విన్నంతనే, ఆతనికి ఆశ్చర్యమయ్యెను. తలపాగాయన్న బాబాచూచెను. తనపేరు హరియని, తండ్రి కనోబాయని, ఎట్లు తెలిసినవి. ఇదిగాక ఈ చెప్పులు తనవని బాబాకు తెలియుటెట్లు, వచ్చినదా బాబాను పరీక్షింతమని గాని, సేవించుటకు కాదు. బాబాను చూడగనే అనుమానము అంతరించినది. పరీక్ష అనునది మరచినాడు. హరికి ఆందోళన తీరినది. పనిబడి కష్టపడకయే పరీక్ష పూర్తిఅయినది. అహంభావము అణగిపోయినది. జ్ఞానోదయ మైనది. భక్తి కుదిరినది. ఆత డదృష్టవంతుడు. ఆతని ఆనందమునకు మేరలేదు. నాటినుండి ఆతడు బాబాకు కూర్చుభక్తుడు.

బాబా! నీయందు భక్తికలదని గాకున్నమానె, అజ్ఞానినై, అహంభావముతో మెలగుచుంటిననియైన, నాడు హరిని అనుగ్రహించినట్లు, నన్నుకూడ ఏల అనుగ్రహింపవయ్యా—నేనునూ అహంభావ పూరితుడనే, నీకీ పక్షపాత మేల ప్రభూ, నేనుకూడ నిన్ను పరీక్షించుటకే సంకల్పించితినయ్యా, ఏల అనుగ్రహింపవు తండ్రీ? సర్వసముడవు, దయాసముద్రుడవు. బాబా, నన్ను ఉపేక్ష చేయకుమనియె నామొర, ఇది నీకు వినబడుటలేదా, కరుణాసాగరా కటాక్షింపవా?

<u>శివదేవ్</u>, బాబా భక్తుడు. భక్తుడైనవానికి ఆధ్యాత్మిక ఉన్నతి మాత్రమేగాక, ఐహిక సౌఖ్యముగూడ అంత అవసరమనిగదా, బాబా తెల్పినది, కాకయున్న కష్టములతో కటకటలాడువాడు ఏమి ఆధ్యాత్మిక

చింతన సాగింపగలడు. శివదేవ్, పట్టభద్రుడు. 1903 సంవత్సరమున, లా, పరీక్షకు చదువుచుండెను. విద్యాధికుడయ్యానూ, భక్తి కలవాడు. పరీక్షలకుముందు ఆరోగ్యము చెడినది చదువు సాగుట లేదు. ఎట్లు పరీక్షయందు నెగ్గుదునా, అని భయపడుచుండెను. పరీక్షకు బొంబాయిపోవుటకు ముందు బాబాను దర్శించెను. 'బేటా! భయమేల, నన్ను స్మరించి పరీక్షయందు వ్రాయుము—నేను ఉంటినిగదా, తప్పక కృతార్థుడవు కాగలవుపొమ్ము' అని ఆశీర్వదించి, బాబా అభయమిచ్చి పంపెను. సంశయమనునదిలేక, సమర్థించుటకు సాయికలడని ఆతడు బాబాస్మరణతో, పరీక్షకు కూరుచుండెను. తోచినదెల్ల వ్రాసినాడు. తప్పొప్పులతో ఆతనికి పనిలేదు. బాబావాక్కులు, వృధకావనియే ఆతని ఆశ. పరీక్షలైనవి. మిత్రులందరు ఒక్కచోచేరిరి. అందు అక్కల్‌కోట వాస్తవ్యుడు సపత్నీకర్, కూడా యుండెను. శివదేవ్ వ్రాసినది ఒక్కటియూ, సరియైనదికాదు. ఆతడు పరీక్షయందు తప్పుట, తథ్యమని తీర్మానించిరి. శివదేవ్ మాత్రము ఒప్పుకొనుటలేదు. అందుకు కారణము ఆతనివాదము ఒక్కటియే. భగవంతుడగు బాబాపలుకులెట్లు వ్యర్థము కాగలవు— నేను వ్రాసిననూ వ్రాయకున్ననూ, నెగ్గుటమాత్రము నిజమని వాదింప మొదలిడెను. నీవు వ్రాయకున్న నీ సాయిమాత్రము ఏమి చేయగలడు, అని సపత్నీకరు, వెక్కిరించి వెకిలిగా నవ్వెను. తెలియని మూర్ఖులకు ఎంత చెప్పినమాత్రము ఏమి ప్రయోజనము. సత్పురుషులశక్తి నీకెట్లు తెలియగలదు. ఫలితములు వచ్చినప్పుడుగాని ఎరుగవులే, అని శివదేవ్ సమాధాన పరచెను. పరీక్షా ఫలితములు, ప్రకటింప బడినవి. శివదేవ్, పరీక్షలో నెగ్గినాడు. సపత్నీకరుకూడ ఉత్తీర్ణుడయ్యెను. సపత్నీకరు, అక్కల్‌కోటయందే న్యాయవాదిగ వృత్తి సాగించినాడు. అదృష్టవశమున పేరు ప్రఖ్యాతులు గడించినాడు. రాబడికి లోటులేదు. బాబా విషయమే మరచెను.

పదిసంవత్సరములు గడచెను, ఈలోపున ఈ మిత్రులిద్దరూ కల్లియుట జరుగలేదు. ఈతనికి ఒక్కడే కుమారుడు. రూపవంతుడు, బుద్ధిమంతుడు. పాపము చేతికెదిగిన ఆ ఒక్కబిడ్డ, కంఠవ్యాధిచే మరణించెను,

సపత్నే కరునకు గుండెచెదరినది. మతిచెడినది, తీరనిదిగులుతో ఆరోగ్యము సడలినది. మనశ్శాంతికని యాత్రలెన్నియో చేసినాడు—పండరీపురమున విఠలునిసేవ, గంగాపురమున దత్తునిభజన, ఎన్నివిధముల చూచిననూ, సౌఖ్యములేకపోయినది—ఉపనిషత్తుల వల్లించినాడు, గీతాపారాయణ మొనరించినాడు. తృప్తిలేదు, శాంతిలేదు. దినములట్లే గడుపుచుండెను. ఒకనాటిరాత్రి తన దౌర్భాగ్యమును తలపోయుచూ అట్లే కన్నులుమూసెను. శివదేవ్ 1903-పల్కినమాటలు, ఆతనికి బాబా యందలి భక్తి, దానికిఫలితము, అన్నియూ అగపడినవి. బాబా భగవంతుడని, శివదేవ్ వాదించుచున్నట్లు కలగనియెను. బాబా, బాబా అని కేకలిడుచూ లేచినాడు అవును బాబా భగవంతుడు నన్నుమాత్రమేల ఆదరింపడు బాబానే, నేనుకూడ ఆశ్రయించెదను. అని నిశ్చయించుకొనెను. తనతమ్ముడు పండితరావుతో పయనమై మరునాడే షిరిడీ చేరినాడు. ఫలములగొని భక్తితో, బాబాను చేరి ప్రణమిల్లెను గాని బాబా కోపముతో, పొమ్మావలకు అని గద్దించెను. వారమురోజులు గడిచినది. రోజురోజూ ఇట్లేజరిగినది. పాపము సపత్నే కరునకు ఏమియూ పాలుపోలేదు. బాబా షింపే, యను భక్తునిచేరి తనబాధ వెలిబుచ్చెను. మరుసటిరోజు బాబాపటములు రెంటిని అంగడియందుకొని ఆ రెంటినిచేతగొని బాబాను దర్శించిరి. షింపే ఆ రెండు పటములు బాబా కందించెను. సపత్నేకరు మాత్రము భయభక్తులతో, దూరముగ కూర్చుండెను. బాబా ఆపటముల చూడగనే, వీటిని, నే నెరుంగక పోలేదు. నాకు ఎరను తెచ్చితివా, అని పెద్ద పెట్టున నవ్వెను. మిగిలిన భక్తులుగూడ బాబాతో బాటునవ్విరి. ఇదియ సమయమని సపత్నేకరును రావలసినదిగా, షింపే సైగ చేసెను. సపత్నేకరు వినయమున, శ్రీసాయిని సమీపించి, సాష్టాంగపడెను. కాని బాబా మాత్రము, 'పొమ్మావలకని' గద్దించెనే గాని ప్రేమతో ఆతని పిలువలేదు పాపము సపత్నేకరు ఖిన్నుడై దీనవదనముతో తిరిగి మకాముచేరెను. ఆసాయంత్రముకూడ సపత్నేకరును చూడగనే బాబా తీవ్రముగ "నీవు ఇక్కడనుండి, వెంటనే వెడలిపొమ్మని" ఆజ్ఞాపించెను. పాపమాతడు తనదురదృష్టమును నిందించు

కొనుచూ, బాబా ఆజ్ఞను అతిక్రమించుటకు, అవకాశము లేనందున మరుసటి ఉదయమే షిరిడీ వదలి తనపట్టణము చేరినాడు.

ఒకసంవత్సరము గడిచినది పాపమాతనికి మనశ్శాంతి లేకపోయినది. తిరుగ గంగాపురమునకునూ మాఢేగామ్‌కునూ యాత్రలుచేసి ఎట్టిఫలితము లేకయే తిరుగ ఇల్లుచేరినాడు. సమర్థసద్గురుడగు శ్రీసాయి ఆపన్న రక్షకుడు. ఆర్తితీర్చి ఆదరింప గలడన్న ఆశతో, ఆశ్రయింప కాదని కసరినాడేగాని, కరుణగనలేదు. గతజన్మముల ఎన్ని పాపము లొనర్చితినో, కాకున్న, దయాస్వరూపుడగు శ్రీసాయికూడ ఏలనన్ను కాదనును అనిపలువిధముల బాధపడెను. కడకు నిస్పృహతో పత్నీ సమేతుడై కాశికిచేరి, జీవిత శేషము, అచ్చటనే గడపి, శ్రీ విశ్వనాథుని సాన్నిధ్యమున తనువుచాలింప తలపెట్టెను. ప్రయాణమునకు వలయు సన్నాహములన్నియూ పూర్తిఅయినవి. ఇంక రెండు రోజులకు ప్రయాణమని నిర్ణయింపబడెను. కాని బాబాకు దయగలిగినది. ఆనాటి రాత్రి సపత్నీకరుభార్య కలగన్నది. ఆమెబావినుండి నీరు తెచ్చుటకు బిందె భుజముననిడి పోయినది. ఆబావివద్ద ఫకీరొకడు, నెత్తికిగుడ్డకట్టుకుని అమ్మానీవేల ఇట్లు బాధపడెదవు. ఆ బిందెనాకిమ్ము నేను పవిత్రమగు ఉదకముతో, నీబిందెనింపి, నీఇంటనిచ్చెదను, అనిబ్రతిమాలినాడు. పాప మామెకు భయముతోచినది ఆమెఎన్నడూ బాబా ఆకారమును, పటమునకూడా చూచిఎరుగదు. ఆ ఫకీరు ఆమెనువెంటాడి వచ్చుచుండెను. ఆసమయమున ఆమెవణుకుచూ కళ్ళు తెరచినది. ప్రక్కనున్న భర్తను లేపినది. తానుచూచిన దృశ్యమును తెలిపినది. సపత్నీకరునకు మాత్రము వెంటనే బాబాజ్ఞప్తికివచ్చెను. బాబాఅని ప్రణమిల్లినాడు. కరుణగలిగినదా తండ్రీ అని కన్నీరుగార్చినాడు. మనకింకభయము లేదు, దీనుడనై నేనుదరిశించినప్పుడు బాబాకాదని పంపెను. నేడునీకుదరిశన మిచ్చినాడు. మనకష్టముల తీర్చెదనని తెల్పినాడు. మనకష్టములుతీరినవి కాశికిపోనేల మనవిశ్వనాథుడు షిరిడీ యందున్నాడు, అచ్చటికేపోవుదము, అనిపయనమై షిర్డీ చేరిరి.

వీరు మశీదు చేరుసరికి బాబా, అచ్చట లేడు. బాబారాకకై ఎదురుచూచుచూ, ఆ దంపతులు మశీదునందే యుండిరి. బాబాతిరిగి వచ్చుచుండెను. సపత్నీకరుభార్య బాబాను చూచినది. సందేహము లేదు. ఈ ఆకృతియే, ఏవిధముననూ భేధము లేదు. నాడు ఆమెకు కల యందగపడినది ఈ మహానుభావుడే. ఆమెకు ఆశ్చర్యమైనది, రెప్ప వాల్పక అట్లే బాబాను చూచుచుండెను. ఆ తండ్రి అదిగమనించెను. ప్రక్కనున్న మరియొక భక్తురాలితో 'బిడ్డా, సంవత్సరములనుండి నాకు కాలుసేతులు, పొత్తికడుపు, విపరీతముగానొప్పి, తీపు యున్నది. ప్రాణ ములు పోయిన బాగుండునన్నంత బాధపడుచుంటిని. ఎంతయో ధనము వెచ్చించి, ఔషధసేవ చేసితిని. బాధమాత్రము తగ్గలేదు. కాని ఏమి చిత్రమో ఉన్నట్లుండి బాధ అంతయూ, మాయగా నయమైనది. నాకేమియూ బాధ అనిపించుటలేదు, అనుచూ ఆమెవైపుచూచి మంద హాసము చేసెను. ఆమె పేరుమాత్రము బాబా చెప్పలేదుకాని ఆచెప్పిన కథఅంతయూ, ఆమెకు సంబంధించినదే. బాబా, నొప్పులు పోయినవి, అనెనో లేదో, చేతితో తీసినట్లు ఆమెకు నొప్పులన్నియూ పోయినవి. సౌఖ్యమబ్బినది. ఆమెకేమియూ అర్థము కాలేదు. బాబా, అని బాబా పాదముల పట్టుకున్నది. సపత్నీకరు ధైర్యముచేసి, బాబాను సమీపించి ప్రణమిల్లెను. పూర్వమువలెనే, 'పొమ్మావలకు అని బాబా గద్దించెను. కాని ఇతర భక్తులందరూ మశీదువదలి వెళ్ళువరకు, అట్లే వేచియుండి ఒంటరిపాటుగ బాబాయుండుటచూచి సపత్నీకరు, బాబా పాదములపై శిరముంచి, బాబాపాదములు గట్టిగ పట్టుకొనెను. కసరి ననూ ఆతడు తలఎత్తలేదు. పాదములు వదలలేదు. ఆ సమయమున, ఒక యాదవాంగన బాబానుచేరి, బాబాకాళ్ళ నొత్తమొదలిడెను. ఆమెనుఉద్దేశించి, బాబా ఇట్లుపలికెను. 'నేను ఒకవర్తకుడను, వ్యాపా రమున హెచ్చులాభము గడించితిని. వివిధ విధముల వృద్ధిగాంచితిని. కాని కాలము వ్యతిరేకించి దెబ్బతగిలినది. కడకు నాకుగల ఒక్క కుమారుడుకూడ గతించినాడు. నాటినుండి మనశ్శాంతిలేక, ఎన్ని యాత్రలుచేసిననూ, ఊరటకలుగుటలేదు. నిస్పృహతో కాశికి ప్రయాణ మగుచుండ, పుణ్యావశమున నాభార్యకు ఫకీరురూపమున, భగవంతుడు

ప్రసన్నుడయ్యెనుఅని ఒకకథగాచెప్పెను. వాస్తవమునకుఈకథఅంతయూ పాదముల పట్టియున్న సపత్నీకరునకు సంబంధించినదే. ఇది వినుచుండిన సపత్నీకరు, ఆశ్చర్యముతో. ఆహా ఈతండ్రి అంతర్యామి, గాకున్న పూసగ్రుచ్చినట్లు నాటినుండి నేటివరకు నాచరిత్రఅంతయూ చెప్పినాడే, అని భావించెను. ఆతడట్లుతలంచెనో లేదో, వెంటనే బాబా ఆతని వైపు చూపుచూ, ఈతడునన్ను నిందింపుచున్నాడు—నేను ఈతనిబిడ్డను చంపితినని రభసచేయుచున్నాడు. ఇదిన్యాయమా! నేను ఇతరులబిడ్డలను చంపెదనా. ఈతడు నామశీదునకు వచ్చికూడ ఏడ్వనేల. కానిమ్ము నేను ఇప్పుడేమి చేయుదునో చూడుము — ఏబిడ్డగతించెనని ఈతడు ఇంత వ్యధపడుచున్నాడో ఆబిడ్డనే తిరుగ ఈతని భార్యాగర్భమున ఉంచెదను! అనుచూ, తనహస్తము సపత్నీకరు మస్తకముననుంచి, నిమురుచూ, "బిడ్డా! లెమ్ము" భయమేల! <u>ఈ పాదములు ఆద్యంతము లెరుగనివి.</u> అతిపవిత్రములు. నీబాధలెల్ల తీరినవి, నిర్భీతిగ నుండుము. సుఖమందెదవు. అని బాబా ఆతని ఆశీర్వదించెను. ఆతడెంతటి అదృష్టవంతుడు. ఆతండ్రి అనుగ్రహమునకు పాత్రుడై హస్తమస్తకముతో పునీతుడయ్యెను. మశాముచేరి పూజాద్రవ్యములు నైవైద్యము తెచ్చి తిరుగ బాబానుపూజించి, బాబాప్రసాదమును భుజించెను. ఆతని కష్టములంతరించినవివారు తమ పట్టణముచేరిరి. ఒక సంవత్సరమైన తరువాత, పసికందువుతో, బాబాకడ కరుదెంచిరి. బాబా ఆ పిల్లవానికి "<u>మురలీధర్</u>" అని నామకరణ మొనర్చెను. బాబా అనుగ్రహమునకు పాత్రులమైతిమా, మనకింక కొదువ లేదు, ఆతండ్రి నేటికిని దయాసముద్రుడె, నేడు కూడ అట్లే తనభక్తుల పాలింపుచున్నాడు. నిశ్చలమగు భక్తితో సదామన మనస్సు శ్రీసాయీ పదములయందే లగ్నమై యుండునట్లు అనుగ్రహింపమని ప్రార్థింతము.

"ఓం శ్రీ సాయినాధాయ నమః"

# 22. వ అధ్యాయము

ప్రభూ పరమాత్మ స్వరూపా? నీపాదపద్మములకు వినమ్రుడను. నీలీలలనంతములు. సర్వవ్యాపివై, సకలజీవుల సంరక్షించు నీమాహాత్మ్యము, ఎరుంగుటకు, నిన్ను నుతించుటకు, సదసద్వివేకులు, సాధువులుకూడ అసాధ్యమనుచుండ, సంసార వాసనలతో సతమతమగు, నాకదియెట్లు సాధ్యమగునయ్యా! నీపదములమనసుననిలిపి, నీవనుగ్రహించినంత దనుక, నిన్ను స్తుతింపగలను తండ్రీ.

హరికనోబా, తాను బాబాయందు విశ్వాసములేక పరీక్షింతమని వెడలియూ, బాబాను చూచినంతనే ఎట్లు భక్తుడుగ మారెనో చూచితిమి. ఆశ్రమ స్వీకార మొనర్చిన శ్రీ సోమదేవస్వామి, సర్వసంగ పరిత్యాగ మొనర్చినట్లు, సాధువేషమున యున్ననూ, అజ్ఞానమున ఎట్టి ప్రమాదములకు లోనయ్యెనో, సచ్చిదానంద స్వరూపియగు శ్రీసాయీ కరుణా విశేషమున, ఆతనికి ఎట్లు జ్ఞానోదయ మయ్యెనో గమనింతము. శ్రీ కాకాసాహెబ్ దీక్షిత్, యొక్క సోదరుడు భాయిజీ, ఈతడు నాగపురమున ఉండెడివాడు. 1906 వ సంవతర్సములో భాయిజీ, హిమాచల ప్రాంతములకు యాత్ర పోయెను. గంగోత్రి లోయ సమీపమున, ఉత్తర కాశియందు, శ్రీసోమదేవస్వామి పరిచయము ఈతనికి లభించినది శ్రీ స్వామి, హరిద్వారమున నుండెడివాడు. ఆ పరిచయ ఫలితము, ఒకరిఅడ్రసును ఒకరు తమ డైరీలయందు వ్రాసుకునిరి. శ్రీ స్వామిజీ, తన వీలువెంట నాగపూరునకు వచ్చెదనని, భాయిజీకి వాగ్దానము చేసెను. అయిదు సంవత్సరములయినది. 1911 వ సంవత్సరమున శ్రీ స్వామి తానిచ్చినమాట మరువక, నాగపూరునకు వచ్చెను. భాయిజీ ఉచితరీతిని స్వామిజీకి, స్వాగతమిచ్చి సత్కరించినాడు. ఉభయులు భగవత్ చింతనతో సుఖముగా కాలము గడుపుచుండిరి. అచ్చట బాబా లీలలగూర్చియూ, బాబామహాత్మ్యమునూ స్వామిజీ వినెను. వెంటనే ఆ మహనీయుని దరిశింప వలెనన్న, ఆతురత కల్గినది. భాయిజీ

వల్ల ఒకపరిచయ పత్రముగొని, శ్రీ స్వామిజీ షిర్డీకి పయనమయ్యెను.
కోపర్గామునందుదిగి, టాంగానెక్కి ఎప్పుడు శ్రీసాయిని దర్శింతునా
అన్న ఆత్రముతో పోవుచుండెను. టాంగా షిర్డీ సమీపించినది. అనతి
దూరముననే పవిత్ర క్షేత్రమగు షిర్డీ కలదని, టాంగావాడు చెప్పెను.
స్వామిజీ, ముందుకువంగి ఆ ప్రాంతమంతయూ పారజూచుచుండెను.
సకల జగదధినాథుడగు శ్రీ సాయి, ఔన్నత్యమునూ, సర్వమత
సమత్వమునూ, ప్రకటింపుచూ మశీదునందలి జండాలు రెండునూ, ఉవ్వె
త్తున తటతటలాడుచూ, స్వామిజీకి స్వాగతమిచ్చి, ఆహ్వానింపుచూ
అగపడినవి.

స్వామిజీ, షట్శాస్త్రపండితుడు, వేదములన్నింటిని, సాంగో
పాంగముగా నేర్చినవాడు. ఆశ్రమస్వీకార మందినాడు. కాని ఈయ
నకు జ్ఞానదీప్తి కలుగలేదు సరికదా, బాహ్యాడంబరములపై మమత
విడువలేదు, సమత్వ మలవడలేదు, ఆనందస్వరూపమును గమనించు,
అర్హతలబ్బలేదు. ఆసేతుహిమాచల వ్యాప్తమగు, మనభారతభూమిని,
ప్రాంత భేదములబట్టి, ఆచార భేదము లుండునన్న, విషయమైన ఈత
డెరుగడు. సాధువులుఅన్న, సన్యాసియని, గోచిపాతరాయడు అనియే,
ఈతని అభిప్రాయము. అన్యమేమియూ ఈతనికి తెలియదు. ఆటెక్కె
ములు చూడగనే, ఈతనికి కన్నుచెదరినది. ప్రక్కబాటసారులతో
ఏమయ్యా, సాధువునకు ఈజండాలుఏల, బాబాకీర్తినికాంక్షించు,
వేషధారివలెనున్నాడు, కాకున్న శిథిలమగు మశీదునందున్న, ఈయనకు
ఈ జండాలతో ఏమిపనికల్గినది? నేనెంత బొరబడితిని, వ్యర్థముగ ఇంత
దూరము ప్రయాణము సాగించితిని–వెనుకకు తిరిగిపోయెదనని, టాంగా
వానిని బండిఆపుమనెను. ప్రక్కనున్న ఆబాటసారి, ఏమయ్యా, వెర్రి
వాడ, ఇంతదూరమువచ్చి, వెరగుపడి, వెనుకకు పోవుదునందువేల,
ఆ వింతచూచియే పోరాదా, ఈ భాగ్యమునకు ఇంతశ్రమపడి
ఏలవచ్చితివి. జండాలనుచూచియే, ఇంత విభ్రమ మొందుచుంటివే,
శ్రీ సాయికిగల ఇతర జంజాటము నీవెరుగవు. ఆమహానుభావుని
చెంత, గుర్రము, పల్లకీ, బాజాభజంత్రీలు, రథము, ఛత్రచామర
ములు, మహారాజలక్షణములన్నియూ నున్నవి అనెను. ఈ మాటల్లు

విన్నంతనే, సోమదేవస్వామికి, ఒడలంతయూ కంపమెత్తినది. సాధువునకు, రథము, పల్లకి, బాజాభజంత్రీలా, మహాదేవా? ఎందర సాధువుల చూచితిని. బాబా, సాధువుఅని ఎట్లనగలను. నేను ఇట్టి సాధువును చూడలేను, దయయుంచి వెనుకకు పోనిండని, టాంగా వానిని, బండి వెనుకకు త్రిప్పుమనెను. ఆ టాంగావాడు సైతము బాబా భక్తుడే, ఎన్నిమారులు యాత్రికుల, షిర్డీచేర్చెనో, ఎన్నిమారులు బాబాను; సేవించెనో చెప్పలేము. టాంగా వెంట టాంగా, దాని వెంట మరియొకటి, ఇట్లుఒకటి వెంట ఒకటిగ, బండ్లన్నియూ, బారున ఆగి పోయినవి. యాత్రికులందరూ దిగివచ్చిరి. విషయమంతయూ వినిరి. 'స్వామీ, మీవంటి విజ్ఞుడుకూడ, ఇట్లు పొరబడుటయా, బాబాకు, ఈ పల్లకీతోగాని, రథముతోగాని, జండాలతోగాని ఏమిపనియున్నది. కీర్తి ప్రతిష్టలకని ప్రాకులాడుచుండెనని భ్రమయకుడు. నిత్యము, భిక్షమెత్తి బాబాభుజించును. కాని బాబా, భక్త బాంధవుడు. తనభక్తులు ఉత్సాహముతో ఏది ఒనర్చిననూ కాదనడు. ఇవిఅన్నియూ, భక్తులు, తమ భక్తికొలది ఉత్సాహమును వెల్లడింప పెట్టుకొనిరిగాని, బాబాకు వీనితోఏమిపని. మీరు కేవలము పొరబడుచున్నారు.సత్పురుషుల సందర్శనము అంత సులభముకాదు. పూర్వజన్మార్జిత పుణ్యమునగాని, అబ్బనేరదుఏల మూర్ఖత్వమునకులోనయ్యెదరు. సాయీసందరిశనమున, మీ సందియములన్నియూ సమయగలవు, పోనిండని టాంగాను కదిపిరి. ఏమి చేయుటకునూతోచక స్వామిజీ, నిర్విణ్ణుండై అట్టేచతిలకిబడెను. టాంగాలు షిర్డీ చేరినవి. పరుగు పరుగున, యాత్రికులు సామానులు చేతబట్టుకుని, శ్రీ సాయీ సన్నిధికి జనుచుండిరి. స్వామిజీకూడ వారల వెంబడించెను.

అందరూమశీదుచేరిరి. శ్రీసాయి ధునియందలి, అగ్నికదల్చి ఆసనమున కూర్చుండెను. సోమదేవస్వామి, దవ్వునుండియే, సాయినిగ సందర్శించెను.ఆతని కన్నులు చెమ్మగిల్లినవి ఒడలు పులకరించినవి, కంపితగాత్రుడై, రుద్ధకంఠుడయ్యెను. విద్యుత్కాంతిని సైతము ధిక్కరించు దివ్యకాంతి బాబాను చుట్టియున్నది. స్వామీజీకి ఒడలు తెలియుట లేదు. ఒడలు మరచి, బాబా పాదతాడితమైన ఆ ధూళియందు పొర్లాడవలెనన్న బుద్ధిపొడమినది. అచేతనుడై అట్లే కూలబడెను.

మెల్లమెల్లగా ప్రాకుచూ, బాబాను సమీపించెను. వెంటనే బాబా, ఆగుమచ్చట, సాధువునకు జండాలేల, ఇచ్చట రథము పల్లకీ గుఱ్ఱములున్నవి. నేను వేషధారిని అని ఇవ్వి అన్నియూ తెలుపుటలేదా ఎందులకిట్టి కృత్రిమ సాధువును, సమీపించెదవు, జండాలుండుట సాధుత్వమునకు చిహ్నమా. జాగ్రత, సమీపింపకుము, అని గద్దించి పలికెను సోమదేవస్వామికి దిక్కుతోచలేదు. చకితుడయ్యెను. తన తెలివిహీనతను తెలిసికొనెను బాబా అంతర్యామి యనిగ్రహించెను. తనకొంచపుబుద్ధికి, కించెపడెను. తానెంతటియూషుడో గ్రహించెను. ప్రభూ, అని పెద్దపెట్టున కేకపెట్టి పసివానివలె వెక్కివెక్కి ఏడ్చినాడు. అదేదో తాను స్పష్టముగ చెప్పలేని ఆనందము కల్గినది. తనగురుదేవుడు జ్ఞప్తికి వచ్చెను. ఎచ్చట మనకు నిర్మలానందము, మనశ్శాంతి, తృప్తి లభించునో, అదియే మనస్థానము, అన్న గురుసూక్తులు వినబడినవి. బాబా పాదములకు ప్రణమిల్లినాడు. బాబా తనభక్తులతో భాషింపుచూ, నవ్వుచూ, తాకుచూ, ఆశీర్వదింపుచూ,ఆనందింపుచూ, ప్రసాదములనిచ్చుచూ, బిడ్డలతో ఆడుచుండుట తనివితీర చూచినాడు. నేడు గదా నాజన్మ సార్థకమైనది. వేషములయం దేమియున్నది. ఆతండ్రి అనుగ్రహముననే, నేను ఇచ్చటకు చేరితిని. ప్రభూ నీవు పరమాత్మ స్వరూపుడవు అంతర్యామివి. అజ్ఞానమున తెలియనైతిని. మాంపాలయ, అని ప్రార్థించినాడు నాటినుండియూ శ్రీ స్వామి సాయి భక్తుడని వేరుగా చెప్పనేల. ఆతడదృష్టవంతుడు, సాయీ కరుణకు పాత్రుడై సత్యమగు స్థితిని గ్రహించి సద్గతి నందుకొనెను.

పవిత్రగోదావరీతీరమందలిరాజమహేంద్రవరమున,శ్రీవాసుదేవానంద సరస్వతీస్వామివారు, కాలము గడపుచుండెను. శ్రీ తెంబేస్వామి, అని వీరల పిలచుట వాడుక. ఈయన జ్ఞాని, మహాయోగి, జగద్గురు శ్రీదత్తమూర్తిని, సేవించెడివాడు. నైజాము రాష్ట్రమున, నాందేడను పట్టణమున వసించు, పుండరీకరావు అను న్యాయవాది, ఈ స్వామి.జీ శిష్యుడు. పుండరీకరావు, తన మిత్రులతో కలసి, తన గురుదేవుని దర్శించుటకు. రాజమండ్రిచేరెను. గురుపూజ జరిగినతరువాత, ఇష్టాగోష్టి

సాగినది. సంభాషణతో. శ్రీషిర్డీశుని లీలలు, బాబాను గురించి ముచ్చ
టించిరి. శ్రీ సాయి అన్న పేరు విన్నంతనే, శ్రీ వాసుదేవానందసరస్వతి,
ముకుళితహస్తుడై కరము లెత్తి, ప్రభూయని ప్రణామ మొనర్చి, ప్రక్క
నున్న నారికేళమందికొని, 'బిడ్డా, పుండరీకా, ఈ ఫలమును నా
కానుకగా, నా సోదరుడగు సాయికి, అందజేయుము', ఇది నేను భక్తితో
పంపితినని తెలుపుము. ఆశ్రమస్వీకార మొనర్చిన సాధువులు, తోడి
సాధులకు ప్రణామము చేయరు. కాని శ్రీ సాయి విషయమున అట్లు
కాదు. బాబా, ప్రభువులకు ప్రభువు, పరమాత్మస్వరూపము, కారణ
జన్ముడు, నా కానుకతోబాటు, నా ప్రణామములకూడ అందచేయుము,
ఈ సోదరుని మరువవలదని మరీమరీ విన్నవించితినని తెలుపవలసినది,'
అని, అర్ధనిమీలితనేత్రుడై, శ్రీసాయీరామా, అనుచూ, ఆ కొబ్బరి
కాయను, పుండలీకరావు చేతికందించెను.

ఒక మాసము గడచినది. పుండలీకరావు ఆ ఫలమును, భద్ర
ముగ, కాపాడెను. తన మిత్రులతో కలసి, పుండలీకుడు. షిర్డీకి పయన
మయ్యెను. శ్రీ సాయికని, సరస్వతీస్వామి సమర్పించిన, ఆ కొబ్బరి
కాయను, పదిలముగ వెంటగొనిపోయెను. మన్మాడునందు దిగి,
వారందరూ షిర్డీకి సాగిరి. కాని మార్గమధ్యమున వారికి దాహమైనది.
నీరుత్రాగుటకని, ప్రక్కనయున్న, సెలఏటిబడ్డున చేరినారు. పరకడుపున
నీరుత్రాగకూడదని, తాము తమ వెంటగొని తెచ్చిన, (చివడా)
ఖారపుఅటుకులమూట విప్పినారు. గుప్పెటలతో తిన మొదలిడిరి. కాని
ఖారమెక్కువై, తినజాలకపోవుటచే, అందొకడు కొబ్బరిముక్కలు
కలుపుకొనుట మంచిదనెను. అగునని, అందరూ, మూటలు విప్పి
కొబ్బరికాయలకొట్టి, ముక్కలు కలిపి, అటుకులమూట ఖాళీచేసి, విద
లించి. నీటియందు ఉతికి, కడుపార నీరుత్రాగి, తిరుగబండిపై నెక్కిరి.
షిర్డీని సమీపించినారు. శ్రీ స్వామిజీ, పుండలీకరావు పరముగా
ఇచ్చిన, కొబ్బరికాయ విషయము స్మృహకు వచ్చినది, సంచిని సవరించి
నాడు. దురదృష్టము, ఆ ఏటిబడ్డున, ఈ కాయనుగూడ వారు కొట్టి
తినిరి. ఎంత ప్రమాదము. గురుదేవు డిచ్చిన ఫలమును. తాము భుజిం
చుటయా; పుండలీకునకు భయముతోచినది. శరీరము ఆపాదమస్తకము

గజగజ వణుకుచుండెను. అంతయూ అంధకారముగనున్నది. తానేమి చేయవలెనో తోచుటలేదు. తన స్నేహితుల ప్రశ్నించుటకైననూ మాటరాలేదు. అయోమయావస్థతో షిర్డీ చేరినాడు. బాబాను దరిశించినాడు. కాని ఆ కొబ్బరికాయ ఏదీ, వీరి కుక్షులయందున్నది. పరుగుపరుగునపోయి, పుండలీకరావు, బాబాపాదముల గట్టిగ పట్టుకుని, ఘోరునఏడ్చి, జరిగిన ప్రమాదము తెల్పి మన్నింపుమని ప్రార్థించినాడు. మరియొక ఫలము తెత్తునని సవినయముగ పలికెను. బాబా, అందుకు సమ్మతింపలేదు. బాబా కంఠధ్వని మెల్లనయ్యెను. ఎంత పని చేసితివయ్యా, నా సోదరుడు, నాకని ఇచ్చిన ఆఫలము, దాని విలువ నీవేమి తెలియగలవు. ఇతరకాయలు వెయ్యి అయిననూ, ఆ ఒక్క ఫలము నకు సమానమా, అబ్బా — సోదరా. అని కన్నులు మూసెను. భయభ్రాంతుడై పుండలీకరావు వణకిపోవుచుండెను. ఒక్కక్షణమాత్ర మట్లుండి, ' బిడ్డా, భయపడకుము, అట్లు ఒణికిపోయెదవేల. జరిగిన దానికై వగచిన లాభమేమి — ఒక్క విషయము నీ వెరుంగుము, ఇందు నీ తప్పేమియూ లేదు — నా సోదరుడు ఆ ఫలమును, నాకు పంపునట్లు సంకల్పించినది, నేను. తిరుగ మీకు దాహము కల్పించినదియూ, నేనే — మీరు భక్షింపునట్లు ఒనర్చినదికూడ నేనే. ఇందుకై నీవు చింతపడనేల, అంతయూ, నా సంకల్పమున జరిగినది. ఈ రహస్యమును తెలసికొనుము. ఏకార్యమునకునూ, నీవు కర్తవు గావు. కర్తృత్వము నీవు వహించెదవేల. అందుచేతనే ఈ బాధ. అంతయూ నా (సాయీ) పరముగా నెంచి, నీ కార్యముల నిర్వర్తింపుము. మంచియని, చెడుగుయని. అందులకు నీవు బాధ్యుడవని, నీప్రేరేపణ, ప్రజ్ఞకలదని, భ్రమియకుము. అన్నిటికీ ఆధారభూతుడను, కర్తనూ, భోక్తనుకూడ నేనే. ఈ జ్ఞానము నీకు ప్రసాదించితిని, భయముడుగుము, లెమ్ము అని లేవనెత్తెను, ఆతని అట్లు అనుగ్రహించుటకే, బాబా ఆ ప్రమాదమును కలిపించెనో, ఏమో మన కేమి ఎరుక. మనకు వ్యతిరేకములై, భీతికరములై, కష్టకారణములుగ అగపడు హాంశములుకూడ దైవసంకల్పములని, అహంభావము అనవసరమని, అజ్ఞానమున మన మిట్లు బాధపడుచుంటిమని, తెలియజెప్పినాడు,

ప్రభూ, అడుగడుగునా. ఆ అజ్ఞానమే నాకు అడ్డుతగులుచున్నది. అహం భావమే ఆవరింపుచున్నది, ఇందుండి రక్షింపవా అని బాబాకు ప్రణమిల్లుదము.

" తమ్మి నెలంతసామి యవతారము లెన్నియొ యుండుగాక ధర్మమ్మును నిల్పి, సాధుజనరక్షణ, దుర్జనశిక్షణచేసి భద్రమ్ములు గూర్చుగాక, నిరతంబును నీవలె, నార్తరక్షణాంకమ్ము వహించి ప్రాపయిరె, కంటికి రెప్పగ సాయి సత్ప్రభూ ॥

" ఓం నమో శ్రీ సాయి "

# 23 వ అధ్యాయము

ప్రేమ స్వరూపుడగు శ్రీ సాయి, తన భక్తులనెట్లు కాపాడినది, కాపాడుచున్నది గమనించితిమి. ఆ తండ్రి, ఆపదోద్ధారుకుడు. భక్త భారభృతుడు. ఈ అవతారమందలి ప్రత్యేకత యే ఇది. దుష్టశిక్షణ అనునది లేదు. అందులకు కారణము మనము ఆలోచింప పని లేదు. ఏమందురా ఈ కలికాలమున, కలికల్మషముతో కడగండ్లుపడు వీరియందు, ఎవ్వరు శిష్టులనగలము. అట్టితరి అందరునూ, దుష్టులేఅన్ననూ, ఈ అవతారధారి రక్షించున దెవ్వరిని. అందు శిక్షింపతగు వారెవ్వరు, అందుచేత నే దుష్టశిక్షణ అనునది లేక, అందరనూ ప్రేమతత్వముతో ఆదరించి, వారి మనోవృత్తుల వారెరుంగకయే మార్పుచేసి సద్వర్తనమున, ప్రవర్తింపునట్లు పరివర్తన కలిగించు ప్రేమమూర్తియే మనబాబా.

ఒకనాడు బాబా, మశీదునందు ఆసనముపై ఆశీనుడై పనిలేని వానివలె రాగినాణెముల, అటునిటుత్రిప్పుచూచూచినదాని నేచూచుచూ ఈ చేతిలోనుండి ఆ చేతికిని, ఆచేతినుండి ఈచేతికినీ, మార్చుచుండెను. ఎవ్వరితోడనూ ఏమియూమాట్లాడక తదేకదీక్షతో వానినేచూచుచూ పరీక్షింపుచూ కూరుచుండెను. బాబా దరిజేరిన భక్తులకు, ఈ మౌనమేలనో అర్థముగాలేదు. అట్లు పదేపదే ఆ పైసలనేల పరిశోధింపు

చుండెనో తెలియుటలేదు. ఏమిటిబాబా, పరీక్షింపుచుంటిరని సవినయముగ ప్రశ్నించిరి. వెంటనే బాబా, 'ఏమింపూలేదు, ఇన్ని నాణెములున్నవి. ఇందు ఒక్కటయిననూ సరియయినదున్నదా, అని చూచుచుంటిని. ఒక్కటైననూ సరియైనది లేదు. అక్షరములు లేనివి, బొమ్మ అగపడనివి, అరిగిపోయినవి, సొట్టపడినవి, విరిగిపోయినవిగా యున్నవి. ప్రతిదానికి ఏదియో వంకయున్నది. ఇందరు ప్రజలు వచ్చుచున్నారు. అందరునూ, అదికావలె ఇదిగావలెనని అడుగువారలేగాని, జ్ఞానము కావలెనని, తహతహలాడు వారెవ్వరునూ లేరు. నా భాండారమున వలయునంత సామాగ్రియున్నది. తలుపులు లేవు, తాళము వేయుటలేదు. వలయునంత స్వేచ్ఛగ కొనిపొమ్మని, బహిరంగముగా చెప్పిననూ, కొంచెపు బుద్ధులతో ధనము కావలె, బిడ్డలు కావలె, బాధలు పోవలెనను వారలేగాని, భాండారమువైపు కన్నెత్తి చూచువారైనలేరే, అని పరిశీలింపుచున్నాను "అనెను. అజ్ఞానాంధకారము, అంతరింపచేసి జ్ఞానభిక్ష నొసంగుటకుగాను, శిద్ధుడయ్యునూ, సాధకునివలె, సర్వసంగ పరిత్యాగియై సచ్చిదానంద స్వరూపుడయ్యునూ—సామాన్యునివలె; పరమాత్మ స్వరూపుడయ్యునూ—భక్తునికివలె; సర్వాసర్వం సహాచక్రవర్తి అయ్యునూ—భిక్షుకునివలె; ప్రవర్తింపుచూ, భక్తసముద్ధరణకొరకు ఆదర్శముల బోధించి, మార్గము చూపుకొఱకు, మానవాకారమున చరింప మొదలిడిన మహానుభావుడు, సాగరగంభీరుడగు, సాయి కరుణామయుడు. ఆతండ్రి అండజేరిన, ఆయన దయకుపాత్రుల మగునట్లు వర్తించిన మనకింక లోటులేదు.

దామూఅన్నా. ఒకనాడు బాబాపాదములు ఒత్తుచూ, అందరు ప్రజలు బాబాను దర్శింపుచున్నారు. ఈ వచ్చేది వారందరు, అదృష్టవంతులై అనుగ్రహమునకు పాత్రులై, ఉద్ధరింపబడి, మనోరధ శిద్ధి నొందుచుండిరా? అని తన మనమువ తలపోశెను. పాపమాతడు ఈ భావముగాని, సంశయముగాని బయటకు ఎవ్వరితోడనూ అనలేదు. అయిన మాత్రమేమి, అంతర్యామియగు బాబాకు తెలియకఎట్లుండ గలదు. బాబా, దామూ ఆఎదటనున్న మావిగున్నచూచితివా, ఎంత అందముగా నున్నదో కమ్మని వాసనలచిమ్ముచూ, గెలలుగెలలుగా

ఎట్లుపూచినది. ఆపూతఅంతయూ కాయలై పండ్లుగా పండిన, ఎంత
బాగుండును. అని మందహాసము చేసెను. ఏమి బాబా, నన్ను మరీ
పసివానిని చేయుచుంటివే, ఆపూతఅంతయూ కాయలేలయినచో,
ఆబరువును ఆచెట్టు మోయగలదా, మంచుకురాలిపోవునది పూతకొంత
పిందెలు రాలిపోయెడివికొన్ని, పెద్దవగుచుండ పిట్టలు, ఉడుతలు కొట్టి
వేసెడివికొన్ని, పోకిరిపిల్లల పాలపడునవి మరికొన్ని గాలికి
పోవునవికొన్ని, ఇన్ని ఇక్కట్లుగడచి మిగిలినవేగా పక్వఫలములు
గాగలవు. ఇంతపూతయూ పండ్లగుట ఎట్లు అనెను. ఉన్నట్లుండి బాబా,
దామూ, నాకుఅవుసరముగా పదిరూకలు కావలసియున్నవి. షామాకడ
కేగి నేనడిగితినని తెమ్ము అని తొందరించిపంపెను. దామూ షామాను
చేరి సొమ్ముఅడిగినాడు కాని షామా తనవద్ద పదికాదుగద ఒక్క
రూకయిననూ లేదని జవాబిచ్చినాడు. దామూ ఆవిషయము బాబాకు
వచ్చి చెప్పెను. అట్లయిన పటేలుకడకు పోయి నేనడిగితిని తెమ్ము అని
తిరుగ దామూను పంపెను. పటేలుకడకు పరుగెత్తుచూ తిరుగ దామూ
ఒట్టిచేతులతోడనే బాబాకడకు తిరిగివచ్చెను. ఆగ్రామ షావుకారునడిగి
తెమ్మని పంపెను. అచ్చటనూ లేదనియే జవాబు ఇట్లే మరిఇద్దరివద్దకు
కూడ పోయి, లేదన్నవిషయమే బాబాకు దామూ తెలిపినాడు. పాప
మాతనికి త్రిప్పటవలన కాళ్ళులాగుటతప్ప ఇతర ప్రయోజనమేమియూ
గలుగలేదు. ఉన్నట్లుండి బాబా ఇందరికడకేల పంపుచున్నాడు.
బాబాకు రూకలతో ఏమిపని కలిగినది. అందరునూ లేదనుచున్నారే,
అని తలపోయుచుండెను. బాబా, ఒక్కక్షణమాగి దామూ, పటేలు
కడకేగి నానా పదిరూకల తెమ్మన్నారని అడుగుముఅని మరలపంపెను.
పాపము దామూపరువెత్తి పటేలుతో నానా రూకలనడిగెనని తెల్పెను.
పటేలు వెంటనే పదిరూకల నిచ్చెను. ఆలసింపక ఆత్రముగ బాబాను
చేరి, రూకలుతెచ్చితి "ననెను. బాబా, వాటినిచూడనైన చూడ
లేదు. దామూ ఇంకనూ ఒగర్చుచూ నిలచియుండెనే గాని,
కూరుచొనను కూడలేదు. అప్పటికప్పుడే, బాబా, రూకలతో పని
లేదు, ఇచ్చిరమ్ముఅని చెప్పెను, దామూకు మతిపోయినది, పొమ్ము,
పొమ్ము, తెమ్ము తెమ్ము అని అంతతొందరించిన బాబా వాటితోపనిలేదు

ఇచ్చిరమ్మనుచున్నాడే, అని విశ్రాంతి నొందెను. బాబా, నీలీలలు నాకెట్లు అర్థము కాగలవు, ఇంత తొందరించి, తెమ్ము తెమ్ము అని రూకలు తెచ్చిన వెంటనే, వలదు ఇచ్చి రమ్మందువేల? మూఢుడను తండ్రీ, నాకేమియూ అర్థమగుటలేదు, అని బాబా పాదములపడెను. బాబా, ప్రేమతో, దామూ శిరము సవరించుచూ, బిడ్డా తెలియుటలేదా, పాత్రోచితమగురీతినే, ఫలములభించును. పూచిన పూతఅంతయూ పక్వఫలములుకావు, ఆత్రపడినంత మాత్రమున అర్హతలేనిది, అనుభవమూ కలుగదు. నాకనిఅడిగిన అందరూ రూకలు లేవనిరి. నేను ఇల్లువాకిలిలేని ఫకీరును. ఆస్తిపాస్తులు సున్న. అధికారము లేదు, ఆర్జనలేదు-నాకిచ్చిన ఆరూకలు తిరుగువచ్చునో, రావో, అన్న అనుమానము నాకనిఅడిగిన లేవన్నరూకలు, నానా, కు అన్నంత మాత్రమున ఎట్లు వచ్చినవి? నానా ఉన్నతోద్యోగి, అధికారము కలవాడు, ఆర్జనాపరుడు, తిరిగిఇవ్వగల తాహతయున్నది. దేనికైననూ అర్హత అవసరము. అర్హతలేనివాని అభీష్టములు శిద్ధింపవు. అర్హతను ఆర్జించుటకు క్రయత్నింపవలసి యున్నది. ఆర్హతకలిగెనా, మనము అడుగకయే ప్రయత్నములేకయే, ఫలితము తనంతతానుకోరి శిద్ధించగలదు. ఇన్నినాళ్ళు నన్ను సేవింపుచూ, నీకిది అర్థముకాలేదు. వ్యర్థుడవైతివి. ఈ రూకలునాకేల; ఇచ్చిరమ్మని పంపెను. దామూ తన మనస్సునందలి సంశయము బాబాకు తెలుపలేదు, కాని ఆతనివలె ఎందరు అట్టి అనుమానముతో సతమతమగుచున్నాము. మనతండ్రి ఎంతచక్కగా బోధపరచినాడు. అట్లయిన మనకు అర్హతకలదో లేదో, మనకు అట్టిఅర్హత లేదేమోనన్న భీతితో అధైర్యపడుటకన్న వేరేమియూ చేయలేమా? అట్టి అర్హతనుపొంద ప్రయత్నింపుమనియేగా బాబా తెల్పినది.

భగవంతుడు అనేక జీవరాసుల సృజించిననూ, అందొక్కటియూ, నిజతత్వమును తెలసికొనుటకు శక్తిలేక యున్నందున, మానవుల సృష్టించెనని చెప్పబడినది. భగవదంశ ప్రతిమానవునియందునూ ఉన్నది. యుక్తాయుక్తవిచక్షణజ్ఞానమును, భగవానుడు మానవునకు ప్రసాదించినాడు. మంచి చెడుగుల తెలసికొని, మంచినే అవలంభింం

చుట మన విధి. మనము తప్పుచేయునప్పుడు, ఇది తగదుసుమా, అని అంతరాత్మ, హెచ్చరింపుచునే యున్నది. ఆ అంతర్వాణి, హెచ్చరిక వల్లనే, అయ్యో ఇది తగనిపని ఎట్లు చేయుదుమా, అని తటపటాయించుట. విధివశమున అట్టి పనిచేసిననూ, అభిమానమున, బహిరంగముగ తెలుపకున్ననూ, మనము చేసిన చెడుగును, ఒంటరిగ నున్నప్పుడైన జ్ఞప్తికి తెచ్చుకుని, బాధపడుచున్నాము. ఒప్పుకున్ననూ లేకపోయిననూ మనకందరకు దైనందిన వ్యవహారమున ఇది అనుభవసిద్ధము. మానవునకు విచక్షణాజ్ఞానముతో బాటు, స్వేచ్ఛనుగూడ ప్రసాదించినాడు. ఆ స్వేచ్ఛను దుర్వినియోగము చేసితిమా, దురాలోచనలకు లోనై, సత్యమునకు దూరమై, మనము చేసినదాని ఫలితమే మన మనుభవించి, బాధల నొందెదము. అంతరాత్మ హెచ్చరికల గమనించి, ఆ స్వేచ్ఛను క్రమశిక్షణయందుంచి. క్రమమార్గమున, సద్వినియోగము చేసితిమా, సాత్వికమైన తత్వముతో, సత్యమును, సమీపింపగలము. మన వర్తన మన చేతిలో నున్నది. మనము చేయు పనులకు, తత్ఫలితములకు మనమే బాధ్యులము. ఇందుకు, ఇబ్బందులు కలిగి, ఇకట్లుపడునప్పుడు ఇతరుల నిందింపపనిలేదు. ఇంత స్వేచ్ఛ నొసగి, అడుగడుగున ప్రమాదము, ప్రమాదము అని, హెచ్చరింపుచూయున్న, ప్రేమమూర్తి యగు భగవానుని దూరనేల, కష్టములు, కష్టములని వాపోవనేల. సత్ సంకల్పముతో, సత్ చింతనతో, సత్ సాంగత్యముతో, సద్గోష్టితో, సాత్విక స్వభావము పెంపొంద జేసికొని, మద మాత్సర్యముల వెనుకకు త్రోసి, అహంభావమును అదుపులోనుంచి, ఆనందప్రదమగు, భగవత్ చింతన, భక్తి, ఆరాధన అలవరచుకొనుట మన విద్యుక్తధర్మము. భగవంతుడు వరప్రదాయియే అయిననూ, మానవప్రయత్నము లేక, సాయము సేయడు. భగవంతు డొసగిన. మేధస్సును బుద్ధిబలమును, కల్యాణప్రదముగ వినియోగించుకోవలసి యున్నది.

బొంబాయినందలి, ఒక శేట్, వ్యాపారమున మిక్కుటముగ గడించెను, అదృష్టవశమున, ఆతనికి అన్ని విధముల ఆర్జన పెరిగినది. శ్రీసాయీశుని మహిమల విని, ఆ వణిజుడు, తన మిత్రునితో, భాయీ,

నాకు ఏవిధమునన్నూ, ఎట్టిలోపమున్నూ లేదు, బ్రహ్మజ్ఞానముకూడ సంపాదించితినా, నా కింక సంపూర్ణముగ సౌఖ్యము ఉండగలదు. ఆ లోటుమాత్రము ఏల ఉండవలె. నేను, బాబా, కడకేగి, బ్రహ్మజ్ఞానమును గొని వచ్చెదని చెప్పను. ఆ మిత్రుడు బాబా. భక్తుడు. ఏదో అదృష్టమున ధనము నార్జించితివి. అంతమాత్రమున, అహమునకు లోనుగాకుము. వెర్రివాడా, బ్రహ్మజ్ఞానమన్నది. అంతసులభసాధ్యము గాదు. నీవు అడిగినంతమాత్రమున, అంగడినందు వస్తువవలె పొట్లము గట్టి, బాబా నీచేత నుంచుననియేనా నీ యూహ. నీవా ఇరువదినాల్గు గంటలు పైసాగడించుట, వేరుగాడవయే ఎరుగవు. ఆశబద్ధుడవై, తృప్తి లేక, ధనము పెరిగినకొలది, ఇంకనూ పెంచవలయునన్న, పేరాసయే గాని, అనుభవించి ఎరుగవు. నే నెరిగినంతవరకు, సత్కార్యమున కని, ఒక్కకాని అయిననూ, నీవు ఇచ్చియుండలేదు. ఇట్టి నీకు బ్రహ్మజ్ఞాన మెట్లు లభ్యమగును, అక్కరమాలిన ఆలోచనలేల అని మందలించెను. ఆత డా మాటలు పెడచెవిబెట్టి, రానుపోను, బాడుగకు టాంగాను కుదుర్చుకుని, షిర్డీచేరినాడు. వెంటనే, మశీదుయందున్న బాబాను దరిశించెను. బాబాచుట్టునూ భక్తులు కూర్చుండి ముచ్చటింపుచుండిరి. ఆ వణిజుడు ఇతర ఆలోచన ఏమియూ లేక, అటునిటు చూడక, సరాసరి, బాబాను సమీపించినాడు. ప్రక్కనే కూరుచుండెను. బాబాపాదముల కన్నుల కద్దికొని, వెంటనే ఒక్కక్షణమైన ఆలసింపక, బాబా నీ మహిమలు వింటిని. నాకు వలయునంత, ఐశ్వర్యమున్నది. స్వయముగా ఎంతయో ఆర్జించితిని. మీ కడ వచ్చువారలందరికి, ఆలస్యమనునది లేక, బ్రహ్మసాక్షాత్కార మొనరింతురని విని, మా పట్టణము వదలి, బ్రహ్మసాక్షాత్కార మొనరింప మిమ్ము కోరుటకు ఇంతదవ్వు వచ్చితిని ! నాకు బ్రహ్మసాక్షాత్కారము ప్రసాదింపవలసినది. క్షణము తీరికలేని వ్యాపారము, వెంటనే వెనుతిరిగి పోవలెను. ఆ కారణముచేతనే, టాంగాకూడ రానుపోను, బాడుగకు మాటాడుకొనియున్నాను. ఆలస్యములేక. బ్రహ్మమును చూపుడని కోరెను. వెంటనే బాబా. " ఓహో, ఎందరెందరో నన్ను చూచుటకు వచ్చు

చుండిరి. అందరును, ధనధాన్యము లిమ్మని, ఇతర కోర్కెల తీర్చుమని
కోరువారేగాని, నీవలె బ్రహ్మజ్ఞానమిమ్మని కోరినవారు లేరు. నేడు
చాలసుదినము. నాతో కూర్చినపని, రేపు అనుట లేదు. ఇప్పుడే నీకు
బ్రహ్మసాక్షాత్కారము చేయించెదను ఉండుమనెను. ప్రక్కనున్న
వారితో ముచ్చటింపుచూ, ఆవణిజుని సంభాషణలో దింపి కొంత
కాలముగడపి, ఆతని కోరికమరిపించి, ప్రక్కనేయున్న ఒకయువకుని
పిలచి, 'నాయనా, నీవు వెంటనేపోయి నందుడను మార్వాడీ, నడిగి,
నేను తెమ్మంటినని అయిదురూపాయల తెమ్ము వెంటనేపంపెదనని
చెప్పవలసినది' అని బాబా పంపెను. ఆయువకుడు తిరిగివచ్చి నందుని
ఇల్లు తాళము వేసియున్నదనెను. అట్లయిన మిఠాయిదుకాణదారుడు,
బాలాజీనడిగి తెమ్మనిపంపెను. కొద్దిక్షణములలో ఆతడు తిరిగివచ్చి
దుకాణముమూసి యున్నదనెను. ఇలాగే మరి ఇద్దరివద్దకు పంపినాడు,
వారును గ్రామమున లేరని ఆయువకుడు తిరిగివచ్చెను. ఆవణిజుడు,
ఇదంతయూ చూచుచుండెను. ఆతని జేబులో నోట్లకట్టయున్నది. బాబా
కావలెనని పంపినది అయిదురూపాయిలు, ఇచ్చినచో బాబా తప్పక
తిరిగి ఇచ్చునని, ఆతడెరుగక పోలేదు. అయినమాత్రమేమి ఇదంతయూ
చూచికూడా తాను, తనవద్దనుండి, ఆ అయిదురూపాయిలు ఇచ్చెద
నన్నమాట ఆతని నోటివెంట రాలేదు. సరిగదా, అందుకుమారు,
బాబా, ఆలసింపుచుంటివే అప్పుడే నేనువచ్చి గంటగడచినది, తొంద
రగ, బ్రహ్మమునుచూపుడు, నేను చాలదూరము పోవలసియున్న
దని తొందరింపజొచ్చెను. వెంటనే బాబా చిరునగవుతో, అవునయ్యా,
బ్రహ్మమును తెచ్చుటకే పంపితిని నే నూరకుంటినా, ఎన్నిమారులు
పంపిననూ, అతడింట లేదు, గ్రామమున లేడు, అవును అచ్చట ఆత
డెట్లుండగలడు, అన్నట్లు నీ జేబులో నున్నాడు, నే తేవలేననిన
బ్రహ్మమునకు యాబది రెట్లుగనున్నాడు, తీయుము అనెను, పాపమాతడు
సిగ్గుపడి, జేబునుండి, నోట్లకట్టనుతీసి లెఖపెట్టెను, సరిగ రెండువందల
యాబదిరూపాయిలున్నది. అంతట, బాబా వెర్రివాడా, బ్రహ్మ
జ్ఞానము; అంత సులభమనుకుంటివా, ధనము ఉన్నమాత్రమున, ఇక
అసాధ్యమన్నది లేదన్న, అహంభావమేల, నీపాలిటి బ్రహ్మము ఆసొమ్మే

అది లేకున్న నీకుమతిపోయి పిచ్చివాడవగుదువు, బ్రహ్మజ్ఞాన మాసించెడివాడు దానిని పాటింపడు, ఉన్నదని గర్వపడడు, పోయినదన్న ఖేదపడడు. ఇంతదనుక నే చేసినదెందులకో నీకు తెలియలేదా! నాకు అయిదురూపాయ లెందుకు పాపము నీవుఇంతగ వేగిరపాటుతో యున్నవాడవు, అయిదురూపాయల నీయజాలకపోయితివే. బ్రహ్మజ్ఞానమన్న సొమ్ము వెచ్చించికొానెడు, పదార్థముకాదుసుమా, అందుకు తగిన అర్హత సంపాదించవలసియున్నది. అది ధనముతో చేరెడిదికాదు. దానికి పంచేంద్రియముల అరికట్టవలసియున్నది. ఈ షణాత్రయముల నణచిపెట్టవలెను. అంతియేకాదు, అరిషడ్వర్గమునవలత్రోయవలెను. సర్వసమత్వమబ్బవలెను. అన్నిటికినిమించి, ఆపరమేశ్వరుని అనుగ్రహము అవసరము అంతమాత్రమున, గృహస్థ దరశిములవదలి, బైరాగులై మఠముల చేరవలెననిగాని, సన్యాసులయి అడవులు గృహాల నుండవలెననిగాదు. మనముచేయు ప్రతిపనికినీ, నేనుఅన్న, అహమును వదలి, కర్తయూ, భోక్తయూ భగవంతునిగా భావించి, సర్వము ఆ పరమేశ్వరుని ఫలితము అనుగ్రహమని, అహంభావము లేక, కష్ట సుఖముల, కలిమిలేముల, సమభావముతో అనుభవింపుచూ, ఈర్ష్యను వర్జించి, సర్వసమత్వమలవరచుకుని, పరమాత్మపదధ్యాన మాసించిన గాని, ఆ అర్హతఅబ్బదు. ఇది యసాధ్యముకాదు, ప్రయత్నించిన, అందుబాటులో నుండగలదు, అని ప్రబోధించెను. ఈ ప్రబోధ ఆ ఒక వణిజునకేగాదు, ప్రక్కనయున్న ప్రతిభక్తునకునూ గుణపాఠమే, బాబా యందలి ప్రత్యేకతయే అది, బాబా పదసేవఅబ్బిన, క్రమేపి, అవ్వరమగు హృదయపరివర్తనమున మెరుగకయే జరుగకలదు. అట్టిఅర్హత నొందుటకు అవసరమగు బలమునిమ్మని ప్రార్థింతము.

"ఓం శ్రీ సాయినాథాయ నమః"

కలినున్నది కలుషంబే,
మలినంబగు మానవులను మహిమదలర్పన్
తిలకించి మేలుసేయం
గలవనిగా నీదుబిరుదు కనగవ సాయీ!

# 24 వ అధ్యాయము.

మన భాగ్యవశమున, పరమాత్మ స్వరూపియగు బాబా, షిరిడీ నిలయుడై, భక్తుల నెట్లుపాలించినది చూచితిమి బాబా, సర్వాత్మకుడు, సర్వవ్యాపి, సర్వాంతర్యామి, అట్టి ఆ తండ్రిచరిత్ర, వ్రాయుటకుగాని, తెలుపుటకుగాని, అజ్ఞానముతో అంధుడనగు నాకుసాధ్యమా! ఆ ప్రేమ మూర్తిని స్మరించి, ఆయన దయసేయునంతవరకు స్తుతింతును.

శ్రీమతి లక్ష్మిభాయిషిండే, ధనవంతురాలు. బీదలయెడ ఆదరము, పెద్దలన్న గౌరవము, పిన్నలపై ప్రేమ. భగవంతునియందు భక్తి గల ఉత్తమురాలు. తరచు షిర్డీయందుండి 'బాబాను సేవింపుచుండెడిది. ధనవంతురాలైననూ, ప్రతిదినము ఈమె స్వయముగ మశీదంతయూ శుభ్రపరచెడిది. అందలి సామాగ్రిఅంతయూ, ఆయాస్థానముల అమర్చి ఉంచెడిది. ఒకనాటి సాయంసమయమున, శ్రీ సాయి, తాత్యాతో ముచ్చటింపుచూ కూర్చునియుండెను. లక్ష్మిభాయి, శ్రీ సాయిని దరిశించుటకు వచ్చెను. ఆమెనుచూడగనే బాబా, "అమ్మా ఆకలిగనున్నదమ్మా, "అనెను. ఇదిగో క్షణములోవచ్చెద నుండమని ఆమె పరుగున పోయి, బాబా ప్రత్యేకించిఅడుగుట తనభాగ్యమని, ఉత్సాహముతో బాబా, నామస్మరణతో, అతిరుచ్యముగ పదార్థముల ప్రత్యేకించిచేసి, ఆత్రముగ మశీదునకు తెచ్చినది. బాబాను చేరి బాబా, ఈ ముచ్చటల కేమి, ఎప్పుడు నున్న వేగా, ఎంత తొందరపడిననూ ఆలశ్యమైనదయ్యా; ముందు వీనిభుజింపుమని ఫలహారములు, బాబాముందుంచినది. బాబా, సాదరముగ వానినందుకుని, 'ఆకలి అనిపించినందున అడిగితినమ్మా— నేను నీబిడ్డనుగానా, మా అమ్మ తెచ్చిన వంటకములు ఎంతబాగున్నవి, అనుచూ పళ్లెమువంక చూచెను'. ఆ సమయమునకే, తోకనాడింపుచూ ఒకకుక్క మశీదుప్రవేశించెను. బాబా, దానినిదాపునకుపిలిచి మోముపై చేయినిడి నిమురుచూ, 'అల్లామాలిక్' అని పళ్లెమందలి పదార్థమంతయూ, ఆ శునకమున కందిచెను. తాను ఒక్కముక్క అయిననూ, నోటపెట్టలేదు. ఆ కుక్కయూ, అతిస్వతంత్రముగ తోకనాడింపుచూ

అంతయూభుజించి, పళ్లెమునుకూడ నాకివైచినది. బాబా, అంతట కడుపునిండిన వానివలె, గర్రున, త్రేణిచినాడు. 'అమ్మా కడుపునిండినది. ఎంత బాగున్నవమ్మా, ఎంత తొందరగ చేసి తెచ్చితివి. బిడ్డపై తల్లికి ఎంత ప్రేమ', అనెను.

ఆమెకేమియూ అర్థముకాలేదు. తాను ప్రత్యేకించి బాబాకని, భక్తితో చేసి తెచ్చిన వంటకములు, బాబా నాలుకపైనైన వేసుకున లేదు సరికదా మొత్తమును కుక్కకిడినాడు. పైన తానంతయూ భుజించితినను చున్నాడు. 'నావల్లదోష మేమున్నదమ్మా, ఆలసించితినా ఆగ్రహించితివా, నేనుచేసిన వంటకములు నీవు భుజింపతగవని చూచుచూ చూచుచూ, కుక్కకు పడవైచితివే, నాకళ్ళఎదుట నే ఇట్లొనర్చి నన్నవమానింతువా, బాబాఇంతటి నిర్దయుడయూ, నీవు నాదైవమని నమ్మితినే', అని కంటనీరు కార్చినది. వెంటనేబాబా, 'వెర్రితల్లీ నేను నీవిచ్చినవన్నియూ భుజించితినమ్మా, నన్ను దూషింతువేల, ఆకలిగాని గదా అడిగితిని. భుజింపక ఎట్లుండగలను, తనవితీర ఆప్యాయముగ ఆరగించితిని. నీకింకనూ అనుమానమా, అమ్మా. ఇటు నాపొట్టచూడు, అని కుఫ్నీపైకి తీసెను. గొంతులకానతినిన, భుక్తాయాసముతో బాబా బాధపడుట స్పష్టముగా కనపడుచుండెను. పొట్టనిండుగ ఉబ్బుతేలియుండెను. శ్రీమతి లక్ష్మీబాయి తృప్తిపడలేదు. బాబా, అంతయూ నా ఎదుటనే, కుక్కకు పారవైచితివి. ఆ కుక్కయేగదా అంతయూతిని పళ్లెముగూడ నాకివైచినది. నీపొట్టనుచూపి మాయచేసెదవా అనుచుండ, 'మాయయూ, ఎందులకమ్మా కోపగించెదవు నీకుఇంకనూ అర్థము కాలేదు, ఈ సాయియన్న ఈ శరీరమనియేనా నీయూహ. ఆ కుక్క తినినదంతయూ నాకేచెందినది, తెలియుము. కుక్కకుమాత్రము జీవములేదా, ఆకలిలేదా మానవులు తమఆకలినిగురించి చెప్పకోగలరు. ఇతరప్రాణులు విలపించుటతప్ప తెలియజెప్పలేవు. అంతమాత్రమున వానికిమాత్రము, ఆకలిలేదనియూ తల్లీ, ఒక్క ఈ కుక్కయేకాదు. ప్రపంచమునగల జీవరాసులయందన్నింటియందునూ, నేనున్నాను. ప్రాణికోటిఅంతయూ నేనుగా ఎరుంగుము. ఆకలిగొన్న ఏ ప్రాణికి అన్నమిడిననూ, అది ప్రత్యక్షముగ నాకేపెట్టినట్లని గ్రహింపుము. ఆ జీవులు

రము. ఈ పండితుడు నన్ను చూచుచున్ననూ, తన గురుదేవులు, రఘునాధమహారాజునే చూచుచుండెను, తన దైవమగు, ఆ గురుదేవుడను, భావముతో, తన ఆచారప్రకారము, అలంకరణాది, ఉపచారములతో, అర్చించినాడు, ఆ కార్యమున, నేను కాదనలేకపోతిని అనుచుండగనే, డాక్టరు అక్కడకు చేరినాడు. జయశ్రీ సద్గురురఘునాధమహారాజుకు జయ. అని కైవారమొనరించి, సాష్టాంగపడెను. బాబా, పాదములంటి కన్నులకద్దికొనెను.

తరువాత, దాదాభట్, ఇతర భక్తులు ఈ పండితుని, విషయమేమని ప్రశ్నించిరి. ఆతడు నిశ్శంకగా, తన గురుదేవుడు రఘునాధమహారాజే, ఆ ద్వారకామాయియందున్నట్లు తెల్పినాడు. భక్తులమని, భక్తితో బాబాను సేవింపుచుంటిమని విర్రవీగువారికి, ఎంతమృదువుగ, ఎట్టివిలువయగు విషయములు, ఎంతసులువుగ, ధృవముగ మనసున నిలచునట్లు, బాబా, బోధించినాడు. కామ్యములకై, బాబాను సేవించి, అనుగ్రహము పొందినంత మాత్రమున చాలదు. ఏమూర్తియందు మక్కువకలిగి, భక్తితో సేవింపుచుంటిమో ఆ మూర్తిగనె, బాబా, దరిశన మీయగలడు. రామునియందు భక్తి గలవారికి, శ్రీసాయి, రాముడు, కృష్ణభక్తులకు, శ్రీసాయి, కృష్ణుడు, శ్రీ విఠలుని సేవకులకు శ్రీ సాయి విఠలుడు, శ్రీ విద్యోపాసకులకు శ్రీసాయి మహాలక్ష్మి. ఇట్లే అన్ని మూర్తులునూ తానయై, అందరు సాధువులును తానుగా, దరిశన మిచ్చెడి, పరబ్రహ్మస్వరూపము శ్రీసాయి, శుద్ధచైతన్యమూర్తి, అభేదమగు చిన్మయాకారుడు. భక్తి అబ్బినందులకు, ఆతండ్రిని ఆశ్రయించినందులకు, మన ధ్యేయమూర్తియే శ్రీసాయిగా చూడగల నిశ్చలభక్తిని పెంపొందించుటయే మన కర్తవ్యము. లేదా శ్రీసాయిమూర్తినే ఇతర దైవములమూర్తులయందు చూడగల భాగ్యము మనకు కలుగవలసియున్నది. అదియే మనభక్తికి ఫలితము. అట్టి భాగ్యమబ్బిననాడు, మన భక్తి అచంచలము. ఆతడు మహాభక్తుడని మనము శిరమువంచి నమస్కరింపవలసినదే. అట్టి ఆ తండ్రిని, సగుణముగ, ఆరాధించిన, భక్తులు అదృష్టవంతులు. నాడు బాబాను దరిశించి, ప్రత్యక్షముగ భగవంతుడని, అర్చించెడు భాగ్యము

మనకు అబ్బలేదు. కాకున్నమాత్రమేమి. ఆ కరుణామూర్తి ప్రతిమార్చనకూడ, పవిత్రవంతము. భౌతికశరీరము త్యజించిననూ, మనము భక్తికలిగి ప్రార్థించిన, మనతండ్రి నేడుకూడ ఇష్టదైవమగు మూర్తిగ దరిశనమీయగలడు. ఇది నిశ్చయము, సంశయరహితము. అనుభవ శిద్ధము.

బాబా, మొదటినుండియూ, ఒక వేపచెట్టుక్రింద ఆసీనుడయ్యెడివాడని, ఆ చెట్టువదలి ఎచ్చటికినీ పోయెడివాడుకాడని, ముందు తెలిసికొంటిమి. ఆ వృక్ష మెచ్చటనున్నది ? ఇప్పటికినీ అట్లే యున్నదా? ఉన్నచో, అందలి ఆధిక్యతఏమి? అన్న హంశములు, తెలియుటకు భక్తులు సంభ్రమముతో యుండుట సహజము. 'సదానింబవృక్షస్య మూలాధివాసా, సుధాస్రావిణం, తిక్తమప్యప్రియంతం, తరుంకల్ప వృక్షాధికం సాధయంతం, నమామి ఈశ్వరం సద్గురుం సాయినాధం." శ్రీ సాయీపరమాత్మ, సాధురూపమున, ఆ వృక్షమూలమున కూర్చుండి తన మహిమలు చూపెను. ఆ వృక్షము కల్పవృక్షమునకు తుల్యము. బాబా ఏవైపున కొమ్మక్రింద కూరుచుండెనో, ఆ కొమ్మ ఆకులు, సహజముగ ఉండవలసిన చేదుకుబదులు, స్వాదుత్వము నందినవి. ఆ ఆకులు, అమృత మొలుకుచూ తియ్యదన మిచ్చును. ఆ వృక్ష మిప్పటికినీ అట్లేయున్నది. దక్షిణ పార్శ్వమునయున్న, కొమ్మలఆకు తీపి, ఉత్తరపార్శ్వమందలి ఆకులుచేదు. అచేతనమగు ఆ చెట్టుకూడ, తనకు సహజమగు చేదును విడనాడి, ఆ తండ్రిసాంగత్యమున అమృతము కురిసినదన్నచో, బాబాను సేవించిన, బాబాగాథల తెలిసికొనిన, మనకు ఎట్టి ఫలితము కలుగగలదో వేరుగ తెలుపవలెనా? బాబా, ప్రేమస్వరూపమగుట స్పష్టపడుటలేదా ! మానవులయందు చేదుచెడి. స్వాదుభావము కలుగునట్లు, ఆ ప్రేమమూర్తి అనుగ్రహించుననుటకు అనుమానమేమున్నది. అట్లయిన ఆ ఆకులు నేడుకూడ తియ్యగ నుండునా, అని కొందరు అడుగవచ్చును. అగునని నిర్భయముగ తెలుపుచున్నాను. ఉత్తరపార్శ్వమందలి ఆకులు కటికచేదు. దక్షిణపార్శ్వమందలి ఆకులో, ఇది చేదా, అన్నట్లుండును. బెల్లమువలె తియ్యదనము మాత్రముకాదు. బాబా, నిర్యాణానంతరము, ఎందరెందరు, భక్తితో

గాక, కుత్సితమతితో, అనుమానములతో, అహంభావముతో, ఆ ఆకుల తాకిరో, ఆ మాలిన్యము, ఆ చల్లనితల్లి భరింపుచున్న కారణముననో, ఏమో, వెనుకటి తీయదనము తగ్గినది.

ఈ ప్రదేశమునూ, ప్రక్కనయున్న స్థలమునూ, బాబాకు కూర్చు భక్తుడు, శ్రీసతే, విక్రయించుకుని, ఆ వేపచెట్టుకుచుట్టునూ, అరుగును కట్టించెను. దీనికితూర్పున యాత్రికులకు ఉపకరించుతీరున గదులకట్టించినాడు. ఇదియే సతేవాడ,అని పిలువబడుచున్నది. బాబాను దరిశించుటకుపోయెడి భక్తులకు, మొదట ఈ సతేవాడయే విడిదికి వసతిగా యుండెడిది. అంతకుమించి ఇతరవసతులు ఉండెడవికావు. తరువాత శ్రీసాయిసంస్థాన అధికారులు ఈ సతేవాడను పెంపుచేసి, మరమ్మతులు చేయించిరి. ఈ వేపచెట్టుకు చుట్టునూకట్టిన అరుగునకు మెట్లవరుసకూడ కట్టబడినది. అందు దక్షిణముగ రెండుగూడులు కలవు. గురువారము, శుక్రవారము సాయంత్రము, ఆ గూడులయందు దీపముల వెలిగించిన, శుభప్రదము, ఐశ్వర్యమబ్బగలదని, ఆరోగ్యవంతులు కాగలరనిప్రతీతి, ఇప్పుడచ్చట చక్కనికట్టడము, అందు పాదుకలు బాబాపటమునూ, ఉన్నవి. ఆ పాదపమూలమున ఆసీనుడై, ప్రదేశమంతయూ పునీత మొనరించి, భక్తాభీష్ట ఫలప్రదుడై, పాదుకలు అచ్చటవెలయింపజేసిన, బాబాలీలలు అనంతములు. ఆ పాదుకలగాధ తెలుపుమని ప్రార్థింపుచూ, ఆ పాదములకు ప్రణమిల్లుదము.

"ఓం శ్రీ సాయినాధాయ నమః"

## 25 వ అధ్యాయము.

బాబా! నీపదముల దరిచేరుటకుకూడ చేతగాక, నీ భక్తులకు భక్తుడనై, నీ పాదసేవ ప్రసాదింపుమని, ప్రార్థించి, పరితపించు, నాకు, నీపాదుకలగాధ తెలుప సమర్థత ఎక్కడిది. తండ్రీ, నీవు ప్రేమావతార

మవు, కరుణామయరూపుడవు, భక్తజనఉద్ధరణకై, అవతరించిన, భక్త
భారభృతుడవు. ఇట్టి నీ పదముల సేవించు భాగ్య మిమ్మనియే నా
మొర. ఇందర ఇన్నితీరుల ఉద్ధరించిన నీకు, నాపై నిర్దయయా, కఠిన
త్వము, నీకు కానిపని, ప్రభూ! నిన్ను ప్రత్యక్షముగ గని ఆనందించిన,
దాసుగణప్రభృతులు, అదృష్టవంతులు. దాసుగణును తృప్తిపరచుటకు,
సంకల్పమాత్రమున నీ పాదములనుండి, పవిత్ర గంగాతోయముల కురి
పించితివే ? ఆతని నందు స్నానమాడించితివే, సకల పుణ్యతీర్థముల
కాటపట్టగు, నీ పదముల స్పృశించి, కన్నుల కద్దికొనిన, ఆ షిర్డీప్రజల
అదృష్టమే అదృష్టము, పాపహరమునూ, పవిత్రవంతమునూ అగు
నీపాదుకల కథ నేనే మెరుంగుదును. నీపాదరజము దొరకిన తలదాల్తును,
తండ్రీ నీ పాద దరిశనమునకు నోచని అదృష్ట విహీనుడను. పూజనీయ
ములగు నీపాదుకల, పవిత్రగాథమైన తెలుపవయ్యా!

బొంబాయి రాష్ట్రమున, షోలాపూర్ జిల్లాయందలి, అక్కల్
కోట మహాక్షేత్రము. అక్కల్ కోట మహారాజ్ కు భక్తుడు, శ్రీబాయీ
కృష్ణజీ. ఈతడు నిత్యము తనగురుదేవుని పటమును పూజించెడివాడు.
ఆషాఢమాసము గడిచినది. శ్రావణము ప్రారంభమైనది. కృష్ణజీ
అక్కల్ కోటకేగి, పాదుకల దర్శించి, పూజించి, ధన్యత నొంద సంక
ల్పించెను. నాటిరాత్రి, ఈభక్తునకు, నిద్రావస్థయందు, మహారాజు దరి
శనమిచ్చి, బిడ్డా! ప్రస్తుతము నా ఉనికి షిర్డీయందుసుమా,అచట నన్ను
దరిశించ వలసినది. అని ఆనతిచ్చెను. అంతకుపూర్వము ఎన్నడూ,
ఈతడు, షిర్డీకి వెళ్ళిన వాడుకాడు. అది 1912వ సంవత్సరము. కృష్ణజీ
మిత్రుడు, కంపౌండరుగ, డాక్టరు రామారావు కొఠారేవద్ద పనిచేయు
చుండెను. ఆదేసమయమున, డాక్టర్ రామారావు, షిర్డీకి పయనమగు
చుండెను. డాక్టరుగారితో, కంపౌండరు, కృష్ణజీకూడ షిర్డీ చేరిరి.
బాబాను దరిశించిరి. బాబాను సమీపించి, కృష్ణజీ, బాబా నాకు
అక్కల్ కోటకు పోవలెనని యున్నది. అనుజ్ఞనిచ్చిన పోయివచ్చెదనని
అర్థించెను. మందహాసముతో బాబా అక్కల్ కోటనందేమున్నది.
అచ్చట మహారాజ్, ఇప్పుడు ఇచ్చటనేయున్నాడు. ఇది నీకు తెలిపెను

గదా, నీకు అర్థముకాలేదా. పరివాడా, నాటిరాత్రి నీకు చెప్పిన దెవ్వరు. ఇంతలో మరచితివా, నీ గురుదేవుని పాదుకల సేవించుటకు అక్కల్‌కోట పోవలెనా. ప్రత్యక్షముగ నీ గురుదేవుడు ఇచ్చటనే యుండగ భ్రమపడియెదవేల? అని, బాబా భక్తాభీష్ట ఫల ప్రదమగు తన హస్తముతో ఆతని తాకెను. పాపమాతడు, అక్కల్‌కోట మహారాజును ఎన్నడూ చూడలేదు. పటమును మాత్రము పూజింపు చుండెను. అయినమాత్రమేమి, ఆతని అదృష్టము పండినది. ఏనాడో మహాసమాధినందిన, అక్కల్‌కోట మహారాజు నాడు శ్రీ సాయి కరుణావలన తిరుగ సశరీరుడుగా, ప్రత్యక్షముగా, కృష్ణాజీకి దరిశన మిచ్చెను. అంతట కృష్ణజీకి, జ్ఞానోదయమైనది. నాటనుండి కృష్ణజీ బాబాభక్తుడు. శ్రీసాయియే ఆతనికి దైవము. షిర్డీయే అక్కల్‌కోట. అట్లు శ్రీసాయీశుని సేవింపుచూ, వారు కొన్నిదినములు గడిపిరి. తిరుగ తమపట్టణము చేరుటకు అనుజ్ఞనిమ్మని బాబాను కోరిరి. కృష్ణజీ, నింబ వృక్షమూలమున కూరుచుండి, శ్రీసాయీ నామస్మరణ చేయుచూ, ప్రత్యక్షముగ ఆ స్వరూపమును అచ్చటే చూచుచూ, మహదానంద మందెను. శ్రీసాయి ఆవృక్షముక్రిందనే మొదటకూర్చుని యున్నందున, అందుకు చిహ్నముగ, అచ్చట పాదుకలు ప్రతిష్టింప వలెనని, ఆతనికి తలంపుకలిగినది.

వెంటనే తన ఆలోచన, మిత్రుడగు కంపౌండరుకు తెలిపెను. కంపౌండరుకూడ అందు లకనుమతించెను. ఆతడొక సలహానిచ్చెను. డాక్టరు భక్తిప్రపత్తులు కలవాడు, ఈవిషయము వారికి తెల్పిన తప్పక చక్కని పాదుకల చేయించి ఈయగలడు, కావున రామారావుగారితో సలహా పడమనెను. వెంటనే ఉభయులూ డాక్టరునుచేరి, ఈవిషయము తెలిపిరి. మహదానందముతో డాక్టరు పాదుకల చేయించి ఇచ్చుటకు సమ్మతించెను. తరువాత పాదుకలకు నమూనా నొకటి సిద్ధముచేసి, కంపౌండరుద్వారా షిర్డీకి పంపినాడు. ఖండోబా దేవాలయమందున్న శ్రీ ఉపాసనీ మహారాజునకు ఆ నమూనా చూపిరి. ఉపాసనీ బాబా అవసరముగు సవరణలచేయుటయేగాక, శంఖ, చక్రములు, పద్మములు

వ్రాసి, పవిత్రమగు ఆవృక్షముయొక్క అధిక్యత తెలుపుటకొరకు, శ్లోకమునుకూడ చెక్కించమని సలహానిచ్చి,

"సదానింబవృక్షస్యమూలాధివాసా
సుధాస్రావిణం తిక్తమప్య ప్రియంతం,
తరుం కల్పవృక్షాధి కంసాధయంతం,
నమామి ఈశ్వరం, సద్గురుం సాయినాధం"

అన్న శ్లోకమును వ్రాసిఇచ్చెను. డాక్టరు సంతోషముతో, సవరణల ఆమోదించి, ఆ నమూనా ప్రకారము పాదుకలునూ, ప్రత్యేకించి ఒక చలువ రాతిపై ఆశ్లోకమునూ చెక్కించి, 1912 సంవత్సరము శ్రావణ శుద్ధ దశమినాటికి కంపౌండరుద్వారా షిర్డీకి పంపెను. ఇందుకు బాబా అనుమతి పడయుట అవుసరమని భక్తులందరు ఆలోచించి, బాబానుచేరి, పాదుకల ప్రతిష్ఠకు అనుజ్ఞనిమ్మని వేడికొనిరి. చిరునగవుతో, బాబా అందులకామోదించినాడు. ఆపాదుకల శ్రావణ శుద్ధ పౌర్ణమినాడు, సరిగ పగలు పదకొండుగంటలకు ప్రతిష్టింప వలస్నిదిగా తెలిపెను. నాటివరకు, ఆపాదుకలతో బాటు శ్లోకము వ్రాస్నిపలకను, శ్రీ ఉపాసనీ సన్నిధానమున, ఖండోబా ఆలయమున ఉంచిరి. ఆ శుద్ధ పౌర్ణమినాడు, సరిగ నిర్ణీత సమయమునకు, శ్రీ ఖండోబా దేవాలయమునుండి, ఆ పాదుకలను, శ్రీ గోవిందల్ మక్కార్ దీక్షిత్ తనశిరముపై నుంచుకొని, శ్రీ రామచంద్రుని పాదుకల తెచ్చు, భరతునివలె, బ్రహ్మానంద మనుభవింపుచూ, శ్రీసాయీ నామసంకీర్తనతో, జయజయధ్వానములతో ద్వారకమాయికి, కొని తెచ్చెను. సగుణమే రూనాయక్, కంపౌడరు, కృష్ణజీ, ఇతరభక్తులు, వెంటనడచిరి. జయ శ్రీ సమర్థ సద్గురు శ్రీసాయినాధునకు జయ, అన్న జయ జయలతో శ్రీ బాబా పాదములకడ నుంచిరి. ద్వారకామాయి యందాసీనుడై యున్న ఆ తండ్రి, దివ్యకాంతిని, వెద జల్లుచుండెను. నాడు అచ్చటనున్న, ఆ ప్రజ పూర్వ జన్మ పుణ్యా మెట్టిదని వర్ణింపగలము. జన్మ జన్మాంతరముల చేసిన పుణ్యాఫలముగాకున్న, అట్టి దివ్యకాంతి దరిశించు భాగ్యముఎట్లు కలుగ గలదు. మహాయోగులు, తపోనిష్టా

గరిష్ఠులు, ఏ దివ్యతేజమును దరిశింప తహతహలాడెదరో, అట్టి దివ్య కాంతి, శ్రీ సాయికరుణామృతమున, వారలకు అబ్బినది. శ్రీసాయి దృష్టిసారించి, ఆ పాదుకలవైపు అట్లేచూచెను. తరువాత, బాబా ఆ పాదుకలను స్పృశించి, బిడ్డలారా, ఈపాదుకలు పరమాత్ముని పాదుకలు, పరమపవిత్రములు, సకలాభీష్ట ఫల ప్రదములు, శుభంకరములు, వీటిని అర్చించువారికి శుభములు కలుగ గలదు. భక్తితో, ఆ నింబ వృక్షమూలమున, ప్రతిష్ఠింపుడు" అని ఆశీర్వదించిపంపెను. మేళతాళములతో, నామసంకీర్తనతో తన్మయత్వముతో, శ్రీ దీక్షిత్ ఆపాదుకలను, నింబపాదపము కడకు తెచ్చెను. బాబా ఆనతిచొప్పున పగలు సరిగ పదకొండు గంటలకు పాదుకలు అచ్చట ప్రతిష్ఠింప బడెను. వాటితో బాటు శ్లోకము వ్రాయబడిన ఆచలువరాతి పలకకూడ ప్రతిష్ఠింప బడినది.

ఈ పాదుకల ప్రతిష్ఠకు సరిగ రు 100/ నూరు రూపాయలైనవి. సరిగ ఆరోజుకు క్రిందటదినమున పాస్తాసేట్ అను పార్శీభక్తుడు, బాబాకు రు 25/ యిరువదిఅయిదు రూకల పంపినాడు, ఆ మొత్తము, బాబా ఈ ఉత్సవమునకు వినియోగించుటకు ప్రసాదించెను. శేషించిన 75/ రూపాయిలు అచ్చటచేరిన, భక్తులు సంతోషముగ నిచ్చినవే. నాటి నుండి 1917 వ సంవత్సరమువరకు, నిత్యము దీక్షిత్, ఈ పాదుకుల పూజచేసెడివాడు. ఆ తరువాత, లక్ష్మణ్, కచేశ్వరజఖాడి, అనునతడు, ఆ అర్చనచేయుచుండెను. అయిదుసంవత్సరముల వరకు, ప్రతినెల, రెండురూపాయిల వంతున, శ్రీ డాక్టరు రామారావు, ఆ పాదుకల వద్ద దీపముల వెలిగించుటకు, పంపుచుండెను. అంతియేకాదు, ఆ పాదుకల చుట్టును, కటకటాల నిర్మించుటకు, తగుఏర్పాటుచేసి, అందు కవుసరమగు ఇనుపకమ్మీలుకూడ పంపెను. ఆ పాదుకలపై ఆచ్ఛాదన నిర్మించుటకు అవుసరమగు సామ్మును, సగుణమే రూనాయక్ వెచ్చించెను. ఆ విధముగా ఇనుపకమ్మీల కటకటాలతోడనే మొన్న మొన్నటి వరకు ఉండెడివి. ఇటీవల శ్రీ సాయిసంస్థానమువారు, ఆకటకటాల తీసివేసి, సిమెంటుతో చక్కగకట్టించినారు. ప్రదక్షిణములు చేయ

టకు, లోపలకూర్చుని ధ్యాన మొనర్చుకొనుటకు వసతిగా చేసియుండిరి. మొన్న మొన్న నే, ఆ చెట్టుకొమ్మలనుకూడ కొట్టరాదని, కట్టడిచేసి నారు, ఇప్పటికినీ శ్రీ జఖాడీ, పూజలుజరుపుచున్నాడు, సగుణ మేరు నాయక్ దీపములు వెలిగించి, నై వేద్యమిచ్చుచున్నాడు.

నాటి ఉత్సవముల చూచుటకుగాని, తనివిదీర ఆ దివ్య తేజస్సును దరిశించుటకుగాని, మనము నోచుకొనలేదు. కాని ఆనాడు శ్రీసాయి, స్పృశించి, పరమాత్ముని పాదుకలుసుమా. అని ఆశీర్వదించి ప్రతిష్టింప చేస్ని ఆపాదుకలు, నేటికిని, భక్తాభీష్ట ప్రదములు, పవిత్రములై, అమృత మొలుకు, ఆ నింబపాదపమూలమున ఉన్నవి. ఆ పాదుకల స్మరించి, మనసాప్రదక్షిణ మొనర్చి, సాష్టాంగపడి ధన్యులమయ్యెదము గాక, షిర్డీయాత్రకుపోయెడి, భాగ్యమబ్బిన ప్రతిభక్తుడునూ, ఆ పాదప మూలమున ఆ పాదుకల నర్చించి, ప్రదక్షిణమాచరించి, భక్తితో ప్రణమిల్లుట, అవసరము. ప్రత్యేకించి, దక్షిణపు దిశయున్న గూడుల యందు, గురువారము, శుక్రవారము, దీపముల వెలిగించుట శ్రేయ స్కరము,

ఏమంచునిన్ను పొగడెద,
నీమంబింతేని లేదు నిజముగ నాకున్
కామంబు తరుగ లేదే
శ్రీ మంతాదయను చూడు శ్రీ సాయీశా॥
దూదిబడు నిప్పుదహించి బూదియగును
కుటిలులంజేరు, నీనామ మటులగాక
కలుషములడంచి, పుణ్యమున్నిలుపుగాదె,
సత్యసంధాయి, శ్రీ సాయి, సాధుసాయి॥

"ఓం శ్రీ సా యి నా థా య న మః"

# 26 వ అధ్యాయము.

బాబా !

పరమాత్మస్వరూపా, నీ పాదపద్మములకు వినమ్రుడను. ప్రభూ నీ పాదుకల దివ్యగాధ తెలిపితివి. ధన్యుడను. ముస్లిమువను భ్రాంతి గొలుపునట్లు, ఫకీరు వేషముతో చేతచిలుము, శతకాలతో వేంచేసి శిధిలమగు మశీదునందు చేరితివికదయ్యా! ఆ మశీదునకు నామకరణము కూడ నీవేగాచేసితివి. ఆ మశీదును, ద్వారకామాయి అంటివే, అదెట్లు ప్రభూ. ఆ కమనీయమగు కధకూడ తెలుపవయ్యా. ద్వారకా మాయి దివ్యచరిత్ర తెలుపుట నీదయవల్లగాక, మరొక విధమున సాధ్యమా తండ్రీ. సంసారతాపత్రయముతో, అదియని, ఇదియని, ప్రాకులాడు పామరుడను, బాబా నీ పదాశ్రయుడను. భక్తాభీష్టఫల ప్రదాయి, పున్నెములతాయి, పాపసందోహసంక్షుబిత, పామరుల హృదయ భారముక్తి ప్రదాయి, శ్రీ ద్వారకామాయి మత విబేధ ములకు తావులేక, మానవత్వము, సోదరభావము పెంపొంద, దేవత్వ మునకు త్రోవచూపు, తల్లి ద్వారకామాయి, రామురహీములు ఒక్కచోచూపు, పవిత్రస్థాయి, శ్రీద్వారకామాయి, ఆ చరిత్ర తెలుపవయ్యా !

1858 వ సంవత్సరములో, నాడు ధాంద్ భాయీపటేలు, పెండ్లివారితో కలసి, గోసాయీ రూపముతో, పదారువత్సరముల ప్రాయమువలెనున్న, బాబా షిర్డీ చేరెనుగదా. ఆనాడు ఖండాబాదేవా లయము ప్రక్కన, బండినుండి బయటకుదిగిన, ఆగోసాయిని, శ్రీ మహాల్సాపతి 'ఆయ్యేసాయీ' అని ఆహ్వానించెనుగదా. నాటి నుండియేగా, ఈగోసాయి రూపధారి. ఫకీరు వేషమందున్న, బాబా ముస్లిమను భ్రమతో, ఖండోబా దేవాలయమందుండుటకు హిందు వులు అనుమతింపలేదు. ఆ కార్ణమున శ్రీసాయిని అచ్చటికి, అనతి దూరముననున్న, శిధిలావస్థయందున్న మశీదునందు మకాముచేయ



ద్వారకమాయి

మని మహాల్సాపతి, వేడికొనెను. వల్లెయని బాబా అందుకియ్యకొని, ఆ మశీదునందు చేరెను. ఆనాటి మశీదే ద్వారకామాయి.

మహాల్సాపతి, ఖండోబాదేవాలయమున పూజారి, మహా భక్తుడు. ఆతడు మాత్రము బాబాను, ప్రతిదినమునూ, ఆ మశీదునకు పోయి సేవించెడివాడు, ఇందుకు ఇతర హిందువులు, ఏవగించుకొనుటయూ, ఆతని నిందించుటయూగూడ జర్గినది. కాని అన్నిటినీ మహాల్సాపతి సహించె నేగాని, కారణము మనము చెప్పలేము, బాబాను సేవించుట మాత్రము మానుట మహాల్సాపతికి వశముకాలేదు. భగవదంశసంభూతుడగు శ్రీ సాయి తాను, హిందువునని తెలుపలేక పోయెనందమా, లేక ఏదియో, ఒకచమత్కారముచేసి వారల సమాధానముచెప్పుట ఆయనకు అసాధ్యమా? మిగిలినవారికి బాబా, ఫకీరని అనుమానము కలిగినప్పుడు, మహాల్సాపతికి మాత్రము అట్టిఅనుమానమేలరాలేదు. ప్రత్యేకించి మహాల్సాపతి బాబాను మశీదునందు వశింపమని కోరనేల? అందుకు బాబా, అంగీకరింపనేల? ఇందులకు కారణము నేనూహింపలేను, అది ఆతండ్రికే ఎరుక, కాని ఒక్క విషయము స్పష్టపడుచున్నది. మహాల్సాపతి భక్తుడు మాత్రమేగాదు, జ్ఞానికూడయని ధృవపడుచున్నది. భగవదవతారమే మనతోబాటు తిరుగుచున్ననూ, మనముగుర్తింప జాలమని, నిశ్చయమగుచున్నది. ప్రత్యక్షముగ, బాహ్యముగ చరింపుచూ, భగవదవతారము, మన మధ్యనున్నప్పుడే, ఆ విషయము గుర్తించుట, దుర్లభమైనప్పుడు, అంత ర్యామియైయున్న, ఆమూర్తిని, కనుగొనుట ఎంతకష్టమో, తెలియవలసియున్నది. ఇంతియేకాదు. తనను గుర్తించిన భక్తుడు, తనను ఏమిచేయమని కోరినఅదిచేయుటకు భగవంతుడు శిద్ధమని స్థిరపడినది. ఇంకొక విషయము, తనబిడ్డలు తనను తెలియజాలక, అజ్ఞానమున దూషించిననూ, కడకుకాదని పొమ్మనిననూకూడ, హసోన్ముఖుడై, వారలచూచి, జాలిపడి, వారికి వివేకము ప్రసాదించునేగాని, కినుక వహింపడనికూడ రూఢియైనది. చాంద్ పటేల్కు చమత్కారముచేసి కన్నులువిప్పిన, బాబా, షిర్డీయందలి, ఈనుమతాపూరితులకు, తన

మహిమలచూపలేక పోయెననియేనా, అటులైన, ఆ తరువాత, ఎన్ని విధములతానే భగవంతుడనని, బాబా ఆ ప్రజలకే బోధింపలేదు.

దేవళమున ఉండవలదని, వెడలనడిపిన వారలకు, ఆనాడు బాబా లీలల చూపవలస్ని కారణము, చూపిన కలుగుప్రయోజనము ఆలోచింపుడు. శ్రీ సాయి తాను ముస్లిమునుకావని స్పష్టపరచుట కాజాలదు, సరిగదా ఈతడేదో మహిమలు గలవాడు. చమత్కారము చేయగలడు, అన్నభీతితో వారూరకున్న ఊరకుందురేమో, అంతమాత్రమున ఒరుగున దేమున్నది. బాబా హిందువని వారుభావింతురా! బాబాపై వారికి ద్వేషము పెరుగుటకుకూడ అవకాశములేదా, కాదు వారూరకుందురను కుందుము. అంతలో బాబాకు ఆలయమున స్థావరము కుదిరెడిది, బాబా ఒక మాంత్రికుడని, ఆయన జోలికిపోయిన హానికరమని భావించి, భయముతో యుండెడివారు. వ్యక్తిగతముగ బాబాకు స్థాయి చిక్కెడిది. బాబా మహిమాన్వితుడని పేరువచ్చెడిది. ఆడంబరము హెచ్చెడిది. స్వార్థముగ శ్రీ సాయికి వసతికలిగెడిది. సాధుస్వరూపమున స్వయంసంభవుడైన, ఆ సచ్చిదానంద స్వరూపునకు, వాటితో ఏమిపని పైపెచ్చు వలదని వారినివారించి, ఎదిరించిన బాబా తాను ముస్లీమునుగానని చెప్పవలెనన్న తన పుట్టుపూర్వోత్తరముల తెలుపుటయే ముఖ్యమయ్యెడిది. మతవైషమ్యముల నరికట్టి, బేదభావముల నశింపజేసి, సహజమానవ సౌభ్రాత్రుత్వమును, విశ్వమానవప్రేమను, ప్రబోధించి అవిశ్వాసమును పోద్రోలుటకు, అజ్ఞానము తొలగించుటకు, భక్తసముద్ధరణకై సంకల్పించి, అవతరించిన శ్రీ సాయి అట్లేల చేయును. రామ్ రహీములొక్కటే, భగవంతునకు నామబేధములేగాని, రూపబేధములు లేవని, మతమనునది, సత్యమును గ్రహించుటకు ఉపాధిగా, ఉపకరింప వలసినదేగాని, ఆ మతము పేరిట, సత్యమునకు దూరమై సహజ సౌజన్యమును వదలి, సద్భావముల త్యజించి, స్వేచ్ఛయను పేరుతో, సంకుచిత భావములకులోనై మమతతో, మదమాత్సర్యములపడి అల్లాడకుడని, ఉద్బోధించుటకు, ఆ తండ్రి మశీదునందే మకాము పెట్టినాడు. శ్రీ సాయియే సంకల్పించి వారలచే, అట్టులనిపించెనో ఏమో ఎరికెరుక?

శిధిలావస్థయందున్న ఆ మశీదునందే బాబా నిదురించెడివాడు. కూరుచుండుటకు ఒక అంగవస్త్రము మడిచివేసుకొనెడివాడు. అదియే ఆయన ఆసనము. పడిపోయిన గోడలు, బూజు వ్రేలాడు చుండెను. ముంగిట ఒక వేపచెట్టు ఉండెడిది. ముస్లీమసిగదా వారు భ్రమపడిరి. బాబా అచ్చటచేరిన తోడనే, తులసిమాతను ప్రతిష్ఠించెను. అంతియే గాదు. 'ధుని' వ్రేల్చ మొదలిడెను. ఆఅగ్ని అహోరాత్రముల్లో వెలుగు చుండెడిది. అనుక్షణము అల్లామాలిక్, అనుచుండెడివాడు. వేషమున ముస్లీము, భాషలయందు ముస్లిము, కాని చేయునది పరిశుద్ధమగు బ్రాహ్మణుని విధులు. నిత్యాగ్నిహోత్రము, తులసిపూజ, ఇదియే ఈ అవతారమందలి చిత్రము. మశీదునందు హిందూ సాంప్రదాయములు. ముస్లీములు బాబాను దరిశించి ప్రార్థించి పోయెడివారు. హిందువులుకూడ ఆ మశీదునందే బాబాకు అర్ఘ్యపాదములనిచ్చి, వైదికపద్ధతి నారాధించెడి వారు. ద్వారకమాయి యందాసీనుడై శ్రీ సాయి, జాతిమత వివక్షతలులేక, అన్ని మతములవారికిని, అన్నిజాతులవారికిని, దరిశనమిచ్చి, భక్తితో వారలొనర్చెడి పూజాదికముల స్వీకరించి, అందరనొకే విధమున ఆదరించి, అనుగ్రహించెడివాడు. శ్రీ సాయి సందరశన భాగ్యమబ్బుటయే అదృష్టము.

నాటిద్వారకమాయి నేటికినీ యున్నది. ఆ మ శీ దు న కు, బాబాయే, ద్వారకమాయి, అనిపేరిడెను. ద్వారకమాయి అనుటలో అర్థమేమిటో గమనింతము. "చతుర్ణమపి, వర్ణానాం, యత్రద్వారాని సర్వతః, అతోద్వారావతీత్యుక్తా, విద్యాభి స్తత్వవోదిభిః "(స్కాంద పురాణము) ఎప్పట్టున, బ్రహ్మక్షత్రియ వైశ్య శూద్రులకు, అనగా చతుర్వర్ణములకు, బేదరహితముగా, ధర్మార్థకామ మోక్షములనెడు, నాలుగుపురుషార్థములకు తావుకల అది, ద్వారకఅని తత్వజ్ఞులు తెలిపిరి. బాబా మశీదునందు చాతుర్వర్ణములకేగాదు, అన్యులకుకూడ, భేధములేక తావుకలదు. అట్టి ఆ పవిత్రప్రదేశమును ద్వారక అనుటయందు, ఎంతఅర్థమున్నది.

ఆనాడు, ఆపాడుబడిన మశీదునకుముందు, ఆవరణ ఉండెడిది కాదు. భక్తులుకూర్చొనుటకు తగు వసతికికూడ లేదు. ఆ పడిపోయిన మశీదునందైననూ, ఒక పక్కన ధుని, మరియొక ప్రక్కన, మంచినీటి కుండ, మిగిలిన ప్రదేశమందు పెద్దతిరుగలి. అదియే నాటి ద్వారక. ఇట్లుండుటచూచి, భక్తుడగు, శ్రీగోపాల్రావుగుండు, ఈమశీదునకు తగు మరమ్మతులు చేయించి, వసతులుకల్పించుటకు 1910 సంవత్సరములో సంకల్పించెను. బాబాయందింకొక విచిత్రమున్నది. ఏభక్తుడైన, ఏపనిగాని చేయదలచెనా, అది చేయతగున దెవ్వరో, నిర్మొగమాటముగ తెల్పెడివాడు. అంతియేగాని, నేను ధనికుడను, నాకువసతియున్నది, ఇది నేను చేసెదను, అనుటకు ఎవ్వరికినీ అధికారము లేదు. తన భక్తులయందు ఎవ్వరెవ్వరు ఏమిచేయవలయునో, బాబాయే నిర్ణయించెడివాడు. ఈవిషయమునకూడ అట్లేజరిగినది. పాపము భక్తితో గోపాల్రావు మశీదునకు మరమ్మతులకు అవుసరమగు రాయి, సున్నము, ఇతరములు సమకూర్చెను. కాని బాబా ఇదినీవంతుకాదు, అనెను. ఈమశీదును మరమ్మత్ చేయించుపని, శ్రీనానాసాహెబ్ భండోర్కర్ కు ప్రత్యేకింపబడినది. అంతియేకాదు, ధూశిదూసరితమగు ఆమశీదునందు, చక్కని ఎత్తగు అరుగు కట్టుట, కాకాసాహెబ్ దీక్షిత్ కు నిర్ణయింపబడెను. అందుకు మొదట యత్నించినపుడు, ఈ అడంబరమేల, ఈ ఫకీరునకు ఈమశీదు చాలదా అని అభ్యంతరపరచెను. కాని మహాభక్తుడగు మహల్సాపతి వేడికోలుపై బాబా అందులకంగీకరించెను. మశీదునందు దుమ్ము దులిపి, తెల్లవారుసరికి, ఆ భాగమంతయూ ఎత్తు లేపి కట్టుటముగించిరి. మరుసటి ఉదయము ధుని, ఆఎత్తగు ప్రదేశముపై అమర్చబడినది. ఆనాడే, బాబా నాటి వరకు తాను కూరుచుండెడి, అంగవస్త్రపు ఆసనము వదలి గద్దెపై ఆశీనుడయ్యెను. ఇక ఆ మశీదునకు ముంగిటగల ప్రదేశమునకు ఆవరణను ఏర్పరచి, సభామంటపముగా యుండుటకు, కప్పుకూడ వేయుటకు ఆ వత్సరమున కాకాసాహెబ్ దీక్షిత్ తలపెట్టెను. అందుకు అవుసరమగు ఇనుపస్తభములు, ఖిడ్డీలు, రేకులూ, తెప్పించెను. పాపమా

షిర్డీయందలి ప్రజలు అందరునూ కలసి, కష్టపడి, స్తంభముల పాతి కప్పునుకూడా అమర్చిరి. ఇంక రేకులెక్కించుటయే తరువాయి, కాని తెల్లవారినంతనే బాబా, చావడివద్దనుండి మశీదునకు వచ్చెను. ఈ విషయమంతయూ చూచినాడు. సాగరగంభీరుడగు శ్రీ సాయి, క్షణములో, ఉన్మత్తునివలె నయ్యెను. ఆ పాతిన స్తంభములన్నియూ పీకి వడవైచెను. ఇంద రిన్నివిధముల కష్టించి పాతిన, ఆ ఇనుప స్తంభములన్నిటినీ, బాబా, ఇట్టె కర్రపుల్లలవలె తీసి కుప్పబెట్టినాడు. పాపము తాత్యాపటేల్ ప్రక్కనే యుండెను. ఉన్నట్లుండి తాత్యాను, మెడపట్టి నెట్టుటయేగాక పైనున్న ఉత్తరీయమును బలవంతముగాతీసి బాబా, చుట్టచుట్టి నిప్పంటించెను. అంతటితో తాత్యాను వదలలేదు. మెడపట్టి అటునిటు ఝుళిపించుచుండెను. బాబాకన్నులు నిప్పు కణములవలె యుండెను. ఎవ్వరునూ శ్రీ సాయిని తేరిచూడలేకుండిరి. ఏమిచేయుటకునూ, ఎవ్వరికినీ, ఏమియూతోచలేదు. అందరూ అట్లే భీతచిత్తులై చూచుచుండిరి. తామొనర్చిన అపరాధమూ, ఏమియూ లేదు. బాబాకు కూర్చుభక్తుడు, కుష్టురోగి, భాగోజీ, ధైర్యముచేసి, ముందునకు అడుగిడెను. కాని తీవ్రముగచూచి, బాబా, ఆతనిత్రోసి వేసినాడు. మాధవరావు అనుమరియొక భక్తుడు, ముందుకుసాగెను. శ్రీ సాయి, వెర్రివానివలె, రాళ్లుతీసి మాధవరావు పైరువ్వ మొదలిడెను, భయభ్రాంతులై అందరు అట్లేనిలచిచూచుచుండిరి. నాడు తాత్యాగతి ఏమగునోయని భయపడుచుండిరి. ఒక్కక్షణము గడచినది. శ్రీ సాయి, తాత్యాను వదలివేసెను. అంగరఖానుండి ఒక రూపాయితీసినాడు, స్తంభమును పెరికిన ,గుంటయందు ఆ రూకనుంచి, పైన మట్టిత్రోసెను. ఇది శుభసమయము, ఇక కానిండు, అన్నట్లు, శ్రీసాయి సాదరముగ, అందరనూ పిలచి ఆదరించినాడు, అంతియే కాదు, దుకాణమునకు పంపి, క్రొత్తఉత్తరీయమును తెప్పించి, తాత్యాతలకు బాబా స్వయముగ, చుట్టినాడు. అంతటి ఆగ్రహము క్షణములో మాయమైనది. నిప్పులుగ్రక్కు ఆకన్నులు, తిరుగకరుణామూర్తి దయార్ద్రుక్కులైనవి. శ్రీ సాయిదయాస్వరూపుడయ్యెను. ఆమహానుభావునకు అట్టిఆగ్రహమేల కలిగెనో, అదియూ రెప్పపాటు

కాలమే, అందుకు కారణమేమొ మనమేమి తెలియగలము. అందుకు ప్రయత్నించవలసిన అవుసరముగాని, ప్రయత్నించిన మనకు కలుగుఫలితము మాత్రము ఏమున్నది. మహామహుల ఆగ్రహము క్షణికము సుమా! ఆ ఆగ్రహమైననూ, అనుగ్రహమునకు దోవతీయునుగాని, అపకారము కాజాలదుసుమా యని, హెచ్చరికయో ఏమో ఆతరువాత ఎట్టి అంతరాయమునూ లేక, బాబా ఆశీర్వాదముతో, ముంగిట సభామంటపము తాయారైనది. నాటినుండి నేటివరకు అట్లాయున్నది. నేడుచూచెడివారు, ఆ మంటపముకూడ ద్వారకామాయి యందలి భాగమని తలచెదరు, కాని మశీదు ప్రదేశమునకు ప్రత్యేకించి కటకటాలున్నవి. ఆప్రదేశము మూడుఅడుగులకు పైగా ఎత్తుగా కట్టబడియున్నది. ఎక్కుటకు ఈ మంటపములో మెట్లున్నవి. మశీదుతోబాటు మంటపముకూడ కలిపి, కప్పువేయబడినది. బాబా దరిశనము నర్థించి, భక్తులెందరో, తాముఇంట మహదైశ్వర్యమను భవించువారలైననూ, శ్రీ సాయి ఆస్థానమునవారు, చక్కనిసౌధములు కట్టించిననూ, కాదని ప్రత్యేకించి, ఈ మంటపమున, రాత్రులందు నేటికినీ నిద్రింపుచున్నారు. ఆర్తితో బాబాయని పిలచి, ఆద్వారకామాయి ముంగిట, మంటపమున నిదురించిన, భక్తిగలవారలకు శ్రీసాయి దరిశనమీయగలడని ప్రతీతి. అదియే భక్తుల అనుభవముకూడ. ఈ ద్వారకమాయి యందు కాలిడినవారు అదృష్టవంతులు, నాడు శ్రీసాయి ఒక ప్రతిజ్ఞ చేసెను. ఎవ్వరైననూసరి, భక్తితో ద్వారకమాయి ప్రవేశించి అందు కాలిడెనా, నాటినుండి యూ వారికష్టములు తీరినట్లే భావింపుడు" అనెను. ఇది ముమ్మాటికి సత్యము, అంతమాత్రమున, తిరణాలకు, జాతరలకు వెళ్లినట్లు, జనసమర్దముచూచి ఆనందించుటకు, షిర్డీయాత్ర సాగించి, అచ్చటకూడ, మనము ఐశ్వర్యవంతులమని, దేహసౌఖ్యములకే వెతకికొని, ఆడంబరముల వదలలేక పోయితిమా, షిర్డీకియాత్ర చేసితిననుటలో అర్థములేదు. జగదధినాధుడై, అందరపాలింప అధికారియై, సకల ఐశ్వర్యప్రదుడై. సచ్చిదానంద స్వరూపుడగు శ్రీ సాయి ముందర, మన స్థాయి ఎంత? మన ఐశ్వర్యమునకు ఆడంబరమునకు తావెక్కడిది. బాబా నిర్యాణానంతరము, బాబా ఆసీనుడై

యుండెడి ప్రదేశమున మూర్తివంతమునూ, చైతన్యవంతమును, అగు పెద్దతైలచిత్రమును గద్దెపై ఉంచినారు. భక్తితో, ఆర్తితో ఆరాధించి అర్థించి, అచ్చటనున్నది పటమేగదా యని భ్రమపడక బాబా నీపద సేవకుడనని ప్రణమిల్లిన నాడుకాదు, నేడుకూడ. తప్పక బాబా అనుగ్రహించుటయేగాదు, దరిశనముగూడ ఈయగలడు. ఇది నిస్సందేహము అదృష్టవంతులకు అనుభవసిద్ధము. నాడు బాబాచే ప్రేల్చబడిన అగ్నిహోత్రము (ధుని) నేటికిని అట్లే అహోరాత్రులు వెలుగుచునే యున్నది. అందలి ఉధియే బాబా ప్రసాదము. ఆ ఉధి సర్వార్థ సాధకము. ఎందరెందరు భక్తులు ఈ ద్వారకామాయి యందు, బాబాదరిశన మందుకొని ఈ నిర్యాణానంతరముకూడ అందుకొను చున్నారో చెప్పలేము. బాబా స్మృతిమాత్ర ప్రసన్నుడు. అట్టి ప్రేమస్వరూపునకు ప్రణమిల్లుదము.

"ఓం శ్రీ సాయినాథాయనమః"

సాయిశా!

నీలీలలచింత్యములు. అన్నీ నేనెట్లు తెలియగలను. పరిపరివిధముల నీభక్తుల భారమంతయు నీపైనుంచుకుని, వారల కాపాడితివని నీకథలు చెప్పుచున్నవి. ఎన్నడోకాదు, ఈనాడుకూడ నీవట్లకాపాడుచుంటివని ఎందరో తెలుపుచున్నారు. అదికాదని ఎట్లనగలను.

మహాజ్ఞానులు సైతము, మాయాతీతులుగాక, మమతతో సతమతమగుచుండ, అంధకార పరివృతుడనై, వెలుగుకొరకు వెతకికొనుచూ, వెతలచిక్కి వెలితితోయున్న, నాగతి వేరుగ చెప్పకో వలెనా? నాతండ్రీ త్రోవచూపి, తరింపచేతువనియేగా నీ పాదములాశ్రయించిని, వెరపున గడగడలాడు నన్ను, భ్రమియజేసి, మెరపుచందమున, మాయమైతివే, ఇది ఏటిన్యాయము బాబా ?

తండ్రీ! నీదయయే నన్నింతదనుక నిలువనిచ్చినది. కాకయున్న ఏనాడో, నాజీవితము, నవ్వుల పాలయ్యెడిది. కాని బాబా, ఆశ యనునది నన్నావరించి వదలుటలేదు. అది దురాశమాత్రముకాదుసుమా.

తండ్రీ నా ఆశను అడియాశ చేయకు. నిరాశాహతుని చేసితివా, నిస్పృహతో, నీనామస్మరణ మొనరింపుచూ, నింద నీపై త్రోసి నేనేమైన చేయరాని కార్యమును చేయుదునో ఏమో, అప్పుడు నేనందులకు బాధ్యుడను కాజాలను. కారణము నీ కఠినత్వమే కాగలదు. సర్వము నీ పరము గావించి, నా బాగోగు లెరుంగ నేనెవడ తండ్రీ, అంటిని; నయమగునో కాదో, ఏది ఎటులయిన నిన్నే నమ్మినాడ, హితమో అహితమో, నీ దయవచ్చినట్లొనర్పుమని మొరలిడితిని. ఇంక నేనేమి చేయ గలను. మొన్న మొన్నటిదాక, నిన్ను స్మరించి నా కార్యములకు గడంగితిని. సాయము చేయవయ్యా అని సాగిల పడితిని. నీవు నిరసించిన సమయములు లేకపోలేదు. ఒక్క విషయము మాత్రము నిజము. జయ మబ్బిననాడు, నేను గర్వించలేదు. నా ప్రజ్ఞవల్ల సాధించితినని గర్వ పడలేదు. అంతయూ నీ అనుగ్రహమేనని ఆనందించితిని. వ్యతిరేకించి నప్పుడు నిన్ను నిదించితినికూడ, కాని బాబా వెంటనే నా ప్రారబ్ధము నకు నిన్ను దూరనేల అని ఏడ్చితిని. ఏమైననేమి. నిన్ను స్మరించి సాయ పడు మనుటలో, అర్థము లేదు. నీ ఇచ్చవచ్చినట్లు చేయింపుమని చెప్పు కొను చున్నాను. నేనిక నిమిత్తమాత్రముగ కార్యముల నిర్వర్తింతును. ఇంతకుమించి నాకు వ్యక్తిత్వము లేదు. ఏది జరిగిననూ నీ కృతమే. నాకింక మంచి చెడుగులతో పనిలేదు. అంతయూ శ్రీ సాయీ ప్రసాద మని, అనుభవించుటయే, అట్టి మనోబలమును ప్రసాదించి, అది సడల కుండ కాపాడుము తండ్రీ! ఇదియే నేను నిన్ను అర్థించునది.

మరియొక విషయము, బాబా!

వలదు వలదని నా అంతరాత్మ, వేవిధముల వారింపుచున్ననూ, కూడనిపని అని ఎరిగియుండియూ, కొన్ని కార్యములు చేయుచునే యున్నాను. ఐశ్వర్యమునాశించి మాత్రముకాదు. బాధనివృత్తి కాగల దను భ్రమయే నన్నాపనులకు ప్రేరేపించినది. దయాసముద్రుడవగు నీవు నన్ను వెన్నంటి కాపాడుచునే యుంటివి. కాకయున్న ఆ దుష్కార్యముల ఫలితములు ప్రబలములై నన్ను బాధింపక, ఎట్లు సన్నగిల్లు చున్నది. తండ్రీ ఇంతవేల, నిశ్చింతగ నీపద ధ్యాన మొనరించు కొనుటకు తగిన

స్థాయి కల్పింపుము. ఇతర విధముల జాడనే పోయినచో, నన్ను కఠినముగ శిక్షింపుము.

సాయీశా! ఆశ—నాకు ఒక్కటిఆశ, నా తండ్రీ నన్నువిడువ డన్న ఆశ, నా ప్రభువు నన్ను కరుణించియే తీరునన్న ఆశ. ఇతరులు నన్నేవిధముననూ పీడింపకుండ, ఇతరులకు నేను మేలు సేయకున్న మానె, వారలకు ఎట్టి అపకారమునూ చేయకుండ, బాబాపద ధ్యానముతో, జీవితశేషము గడుపుటకు తగినస్థితియే చేకూర్చెదవన్న ఆశ, చెడు విషయముల నా మనసు చేరకుండ, తగురీతి సాయమొనరింతువన్న ఆశ. ఆశ్రితుడవగు నన్ను ఆదరింతువేగాని నన్ననాథుని చేయవన్న ఆశ, అనుక్షణము నన్ను అనుసరించి, నీ లీలల తెలుపుచూ, నీ జీవిత చరిత్ర, రచియింపజేసి, బ్రహ్మానందము గూర్తువన్నఆశ, స్మృతిమాత్ర ప్రసన్నులై నీదివ్య రూపమునుచూపి తరింప జేతువన్న ఆశ.

బాబా, నాఆశ నిరాశ జేయకు. పాశముల సడలించి, పార్శ్వ వర్తివై భక్త భారభృతుడవన్న, సత్యమునునిల్పి, సాక్షాత్కరించి, సద్గతి కల్పింపుమయ్యా!

"ఓం శ్రీ సాయినాథాయ నమః"

# 27 వ అధ్యాయము

బాబా! సాయిరామా, నమోవాకములు తండ్రీ, ద్వారకామాయి యందలి, నీ భక్తులపాదరజము, నాతలదాల్తునయ్యా! అందర నన్నివిధముల, ఆదరించి ద్వారకామాయియందు, దరిశనమిచ్చి ఆదరించితివి. నేనెంతటి అభాగ్యుడను, నాకు అట్టి భాగ్యమబ్బలేదు నీవు దయాసముద్రుడవు, నన్ను ఉపేక్షింపకుతండ్రీ నీలీల లతివిచిత్రములు, బాబా, నీవక్కడచేరిన కారణమున, కుగ్రామమగు షిర్డీ, యాత్రాస్థలమైనదయ్యా, ద్వారకామాయియందు అడుగిడినంతనే, ఆతల్లి, బిడ్డల, తనబడిలోచేర్చి, ప్రేమించి రక్షింపునంటివిగా, అట్టి ద్వారకా

మాాయిగాథ, తనివితీర వింటివి తండ్రీ! మురళీధరునకని, ఏర్పరచిన మందిరమా, నేటి నీసమాధి మందిరము. ప్రభూ, సాయీకృష్ణుడవై, నీవందుచేరితివా, అదెట్లు జరిగినది బాబా!

బొంబాయి వాస్తవ్యుడు, కాకాసాహెబ్ దీక్షిత్, విద్యాధికుడు, ధనికుడు, ఈతడు పనిబడి, ఇంగ్లాండునకుపోయెను. కర్మవశమున, కాలుజారిపడుటయూ, కాలికిదెబ్బతగిలి, నొప్పిపోక, పాత నొప్పిగా నిలచుటయూ జరిగినది. ఎన్నివిధముల, ఎంత వెచ్చించి, చికిత్సచేయించిననూ, అదికుదరలేదు, పాపమాతనికి నాటికి, నాటికి, బాధపెరిగిపోయినది. తనస్నేహితుడగు నానా చందోర్కర్ సలహాపై, ఆతడు సాయీసందర్శన మొనరించెను. అది 1909 వ సంవత్సరము. నాటికి, యాత్రికులు ఉండుటకు, షిర్డీయందు, వసతి అంతగాలేదు. దీక్షిత్ సకుటుంబముగా, షిర్డీ చేరినాడు. బాబాను, ద్వారకామాయి యందు దరిశించినాడు, పూర్వపుణ్యావశమున, ప్రధమ దరిశనముతోనే, బాబా పరబ్రహ్మ స్వరూపమని, ఆతనికి గోచరించినది. పులకిత గాత్రుడై, రుద్ధకంఠముతో, బాబాను, కీర్తించి ప్రణమిల్లెను. నాటి నుండి, సాయీపదసేవతో, తనజీవిత శేషమును, షిర్డీయందే గడుప వలెననికోర్కె జనించినది. ధనికుడగు ఆతనికి అసాధ్యమేమున్నది. పాదుకల మందిరమునకెదుట ఉత్తరమున దీక్షిత్ తానుఉండుటకు, ఒక భవనము నిర్మించుకొనెను. అదియే దీక్షిత్ వాడ. మొన్న మొన్నటి వరకు, షిర్డీసంస్థానము, కార్యాలయము అందేయుండెడిది. నేటికినీ, ఆకట్టడ మట్లేయున్నది. యాత్రికులకు భోజనాదికములు, ఉదయము మధ్యాహ్నము, తేనీరు, కాఫీలున్నూ, అందే అందజేయ బడుచున్నవి. ఇటీవల ఈ వాడకు ఉత్తరభాగమున పెంచి, విశాలమగు ప్రాకారము నిర్మించుటయేగాక, వందలాది యాత్రికులు, ఒక్క పరి వంక్తులుతీరి భుజించుటకు, వసతికల్పింపబడినది. ముందు మరొకచో ఈ విషయము, విస్తరించి తెలుపగలను. బాబా ఆశీర్వాదముతో, 10–12–1910 న, ఈ వాడకు, శంఖుస్థాపన జరిగినది. 1911 సంవత్సర ములో, శ్రీ రామనవమినాడు, ఇందు గృహప్రవేశము జరిగినది.



శ్రీ కాకాసాహెబ్ దీక్షిత్.

నాటినుండి ధనికులగు యాత్రికులు, విశేషముగా ఈ వాడయందే బస చేయుచుండిరి.

బాపూసాహెబ్, బూటీ, కోటీశ్వరుడు. బాబాకు కూర్చు భక్తుడు. ఈతడు నాగపూర్ వాస్తవ్యుడు. సకుటుంబముగా, బాబా పాదసేవ చేయుచూ, ఈతడు నెలలతరబడి. తరుచు, షిర్డీయందే యుండెడివాడు. కలవాడగుటచే, తాను అక్కడనుండుటకు ప్రత్యేకించి సౌధమొకటి నిర్మించుకొనుట, మేలుఅని తోచినది. బాబా తన భక్తులచే నిరాడంబరముగ, మహత్కార్యములు చేయించెడివాడు. ఈ భక్తుని, శ్రీ సాయి ఎట్లను గ్రహించెనో చూడుడు. నిజముగ బూటీ తలచుకొన్నచో, తనకు మందిరము నిర్మించుట, ఎంతపని, కాని అట్లే జరుగలేదు. ఒకనాటిరాత్రి బూటీ, షామా మొదలుగాగల భక్తులు, దీక్షిత్ వాడయందు నిద్రింపుచుండిరి. రెండు యామములు గడచినవి. వారలకప్పుడే నిదురపట్టినది. నిద్రావస్థయందున్న, బూటీకు ఎదుట, బాబా ప్రత్యక్షమయ్యెను. "బూటీ, ఆలోచనతో, కాలము వ్యర్థపుచ్చెదవేల, చక్కని సౌధము నిర్మింపవలెననిగదా తలపోయుచుంటివి. సౌధమేగాదు, దేవాలయముకూడ నిర్మింపుము. ఇందుకునీవే తగుదువుసుమా! అని హెచ్చరించెను. ఆనిద్రయందే, బూటీ, బాబా, నీ ఆనతి తలదాల్తును. అట్లే చేసెదను. నీ ఆజ్ఞకు, అన్యథా ఎట్లు జరుగగలదయ్యా? అని ప్రణమిల్లెను. వెంటనే బూటీకు మెలకువ వచ్చినది. లేచి చూచుసరికి ప్రక్కనే పరుండియున్న <u>షామా</u>, 'బాబా బాబా' అని, వెక్కివెక్కి ఏడ్చుచుండెను. ఆతడింకనూ, అరకంటినిద్ర యందుండెను. బూటీ ఆతని తట్టిలేపి ఏమది ఏడ్చుచుంటివే, అని ప్రశ్నించెను. అందుకాతడిట్లు తెల్పినాడు. 'భాయీ' ఏమని చెప్పగలను. మన తండ్రి దరిశన మిచ్చినాడు. షామా, నిదురింపుచుంటివా, మందిరమును ఆలయమును నిర్మింపుడు. అందరను ఆదరించి అనుగ్రహించెదను. వెనకాడెదరేల, అని స్ఫుటముగ తెలిపినాడు, చూచుచుండగనే వెడలిపోయినాడు. వచ్చిన నాప్రభువు, అట్లేల వెడలవలె, ఆతండ్రిని చూచినంతనే నా ఒడలు పులకరించినది. మహదానందమున కన్నులు చెమ్మగిల్లినవి. ఉండక వెడలిపోయినందున ఏడ్చుచుంటిని "అనెను. ఉభయులకు ఒకే

సమయమున ఒకేతీరున దరిశనమిచ్చి, ఒకే విధమున ఆదేశ మిచ్చినం
దులకు వారు విస్మితులైరి. వెంటనే బూటీ, బాబాఆనతి ప్రకారము
ఓడను నిర్మించుటకు తీర్మానించెను. తెల్లవారినది. స్నాన సంధ్యానుష్ఠా
నముల ముగించి బూటీ, తాను కట్టదలచిన ఓడకు నమోనా తయారు
చేసినాడు. షామా అందుకు సాయపడెను. కాకాసాహెబ్ దీక్షిత్
అది బాగున్నదని, ఆమోదించెను. ముయ్వరునూ దానిని బాబాకడకు
గొంపోయిరి. సరియని శ్రీ సాయికూడ సమ్మతించెను. ఓడ నిర్మాణము
నకు పని ప్రారంభ మయినది. షామా ప్రత్యేకించి, ఆ నిర్మాణ కార్య
క్రమము అజమాయిషి యందుండెను. క్రింది గదులు బావి తయారై
నవి. బాబాకూడ, లిండేతోటకు పోవునప్పుడు వచ్చునప్పుడుచూచుచూ
సలహాల నిచ్చుచుండెను. పై అంతస్తు నిర్మించుపని, బాపూసాహెబ్
జోగ్‌కు ఇవ్వబడినది. చురుకుగా పని సాగుచున్నది. ఉన్నట్లుండి శ్రీ
బూటీకు, ఒక ఆలోచన కల్గినది. క్రింది భాగమున, విశాలమగు హాలు
ఒకటికట్టి అందు మధ్యభాగమున, శ్రీ మురళీధరుని విగ్రహము ప్రతిష్టిం
చిన బాగుండు ననిపించినది. ఈ విషయము బాబాకు తెలుపవలసినదిగా
షామాను కోరెను. ఆనాడు ప్రక్కగా అప్పుడె బాబా, తోటకు పోవు
చుండెను. విషయము బాబాకు నివేదింప బడెను. చిరునగవుతో శ్రీ
సాయి, 'అచ్ఛా' అశ్లేయగుగాక, మురళీధరునకని కట్టండి. ఆ కట్టడము
పూర్తిఅయిన వెంటనే నేనే అందు వసించుటకు రాగలను. సరి ఓడ
పూర్తి కానిండు. మనమే దానిని ఆక్రమించి ఉపయోగిం
తము. మనమందరము అందే యుందము. ఆడుచూ, పాడుచూ, అందే
వసించెదముగాక' అనెను. వెంటనే అందుకు పనిప్రారంబింప సంకల్పించి
ఆ ముహూర్తము మంచిదేనా అన్నంతలో, 'శుభస్య శీఘ్రం' కానిండని
బాబా తెల్పినాడు. వెంటనే కొబ్బరికాయ నొకటి తెచ్చి కొట్టిరి. పని
ప్రారంభమైనది. మందిరనిర్మాణము హెచ్చుభాగము పూర్తిఅయినది.
మురళీధరుని విగ్రహము పురుషప్రమాణమున, చలువరాతితో తయారు
చేయుటకు శిల్పినికూడ పిలిపించినారు. విగ్రహము తయారగుచుండెను.
కాని బాబాలీలలు ఎవ్వారికెరుక, అదేలనో చెప్పలేము. కోటీశ్వరుడగు
బూటీకూడ ఆ మందిరనిర్మాణము మొదలిడి సంవత్సరము దాటిననూ

పూర్తికాలేదు. తగినట్లు విగ్రహము, తయారగుటకుకూడ కాలము గడుపుచుండెనేగాని, పూర్తికాలేదు. ఉన్నట్లుండి బాబాకు స్వస్థత చెడినది. విజయదశమి సమీపించుచుండెను. బాబాపరిస్థితి నాటికి నాటికి విషమింపుచుండెను. శరీర త్యాగము చేయునేమో అన్న భీతి పొడమెను. బూటీకు దిగులు కల్గినది. ఇంతచేసి, లక్షలకుపైగా వెచ్చించి, బాబా ఆజ్ఞానుసారము నిర్మించిన ఈ మందిరమున, శ్రీ మురళీధరుని ప్రతిష్ఠించుటకునుక, బాబా, ఉండరో ఏమో, ఆ మందిరమున శ్రీసాయి తిరుగులాడుట జరుగకా, అట్లయిన, ఆ ప్రదేశమింక ఎట్లు పవిత్రము కాగలదు. బాబా,మెట్టని, ఆమందిరమునకింక విశిష్టత ఏమున్నది. ఇట్టిఆలోచన వేధింపుచుండెను. బాబా తనవు చాలించు సమయము సమీపించెను. బూటీ. కన్నీటితో, దృష్టిమందగించి, నిట్టూర్పుచు కూరుచుండెను. బాబా, బూటీను దగ్గరకు పిలచినాడు. 'బిడ్డా! ఆమందిరమున నన్ను ప్రతిష్ఠింపుము. నేనే మురళీధరుడను, నాడే నేతెల్పియుంటెసి, మందిరము పూర్తియైనపిదప, నేనే, వచ్చి అందుండెదనని తెల్పియుంటినిగదా, దిగులొందెదవేల, అని బుజ్జగించి తెల్పి, తనఅభయహస్తమునెత్తి ఆశీర్వదించెను. మురళీధరుని ప్రతిష్ఠించుటకని నిర్దేశింపబడినది, ఆ ప్రదేశమున, శ్రీ సాయినాథుని, పవిత్ర శరీరమును, సమాధిచేసినారు. శ్రీ సాయీ కృష్ణుడు (మురళీధరుడు) నాటినుండి, ఆబూటీ మందిరమునందున్నాడు. అదియే నేటి సమాధి మందిరము. శ్రీ సాయీ కృష్ణుడు, అచ్చటనుండి ప్రసన్నుడై, భక్తజనోద్ధరణయేపనిగా, ఎందరెందరనో ఆకర్షించి, అనుగ్రహింపుచున్నాడు. మురళీధరుని దరిశనమబ్బుట కష్టతరము. కాని, ఈ కలికాలమున, పిలచిన పలుకుచూ, తలచిన దర్శనమిచ్చు శ్రీ సాయీ కృష్ణుడు భక్తసులభుడు. ఇంకొక విశేషమున్నది. ఈ సమాధి మందిర ప్రదేశమందే, శ్రీ సాయీ తాము స్వంతమున, బుంగలతో నీరుపోసి, పెంచినతోట ఉండెడిది. ఆప్రదేశము అత్యంత పవిత్రవంతము. ఆకారణముచేతనో ఏమో, మురళీధరునకు అని మందిరనిర్మాణమునూ, అందు శ్రీ సాయీకృష్ణుని ఉనికియూ జరిగినది. శ్రీ సాయీ సామాధి చైతన్యమయము, భక్తాభీష్టఫల ప్రదము,

ఉపద్రవ వినాశకరము, ఆసమాధినిచుట్టి సాయికి ప్రణమిల్లిన, కోర్కెలీడెరును, ఇంతియేకాదు, భవబంధములే సడలగలవు. స్మృతిమాత్ర ప్రసన్నుడగు శ్రీ సాయీ సమాధినుండియే, సమాధానమునిచ్చుచున్నాడు. శ్రీసాయీ సమాధి చలువరాతితో కట్టబడినది. ఆసమాధికి దక్షిణవుదరిన పాదుకలున్నవి. సమాధిపై పడమరథరిన, గోడవైపున, శింహాసనమును, దానికిరువైపుల దీపమును ఆ శింహాసనముపై బాబా పటమును ఉండెడివి. పైన ఛత్రమున్నది. ఆ పటమునకే అన్ని అలంకారములునూచేసి, ప్రత్యక్షముగ నాడు బాబాను అర్చించిన విధమున, నేటికినీ అర్చనచేయుచున్నారు. మొన్న మొన్ననే చలువరాతితో పురుష ప్రమాణమున, బాబా విగ్రహము చేయించి, ప్రతిష్టించిరి. ఆ శిలావిగ్రహ ప్రతిష్ట అయిన తరువాత, ఛత్రమమర్చి, అచ్చటనుండెడి పటముతీసి, ఉత్సవముల యందూరేంగిచుటకు ఉపయోగింపుచున్నారు. ఆ చలువరాతితోయున్న బాబా విగ్రహమును, చూచువారికి, బాబాయేఅట ఆ సీనుడైయున్న ట్లనిపింపుచున్నది. బాబా ప్రత్యక్షముగ ఆసనముపై అధిష్టించియుండె నన్నట్లున్నది. ఆ తండ్రిని దర్శించి, సమాధికడసాగిలపడి, బాబా ప్రసన్నుడవు కమ్మని ప్రార్థింతము.

"ఓం శ్రీ సాయి నాథాయ నమః"

# 28 అధ్యాయము

ప్రభూ సాయిరామా!

నిన్నెవరసి నిర్ణయించేది రారామా, అన్న త్యాగయ్యవాక్కులు ఎంతనిజము తండ్రీ, నిన్ను కనుగొనుటకు, గుర్తించుటకు అట్టి మహాజ్ఞానులే, అశక్తులమనుచుండ, ఇక నేనా నీలీలల నెరుగుంట? బాబా నిరంతరము నీనామస్మరణ మొనరించుటయే నాపని. తండ్రీ, నీవు వశించునది, మశీదుకాని అది ద్వారక, ధరించునది కఫ్నీ, చరించునది పరమనైష్టిక బ్రాహ్మణమార్గము. నిత్యాగ్నిహోత్రము, స్మరించునది

అల్లామాలిక్, విధించునది గీతాపారాయణ మశీదునందు జెండా, దానికి తోడు తులసి; నిన్నాశ్రయించునది, హిందువులు, ముస్లీములు, మతాంతరులు. నిన్నెవరని నిర్ణయించేదిరా ప్రభూ, ఏమని నుతింతును బాబా! ఎవ్వరన్న ప్రశ్న నాకేల? సర్వము తానయై, సర్వము నకాధారమై, సర్వకారణ కారణమై, సర్వసర్వం సహాచక్రవర్తిత్వముతో వర్తించు ఆ తేజమే, ఆ మూర్తియే నీవనినమ్మి సేవించెదను. సదా నీపదాశ్రితుడను సాయీ!

శ్రీరామనవమికి జరిగెడి ఈ ఉత్సవముల కోలాహలమేమిప్రభూ! ముస్లీములకుకూడ శ్రీరామనవమియేనా, ఏమివిచిత్రమగు అవతారమయ్యా నీది. శ్రీ గోపాల్రావుగుండు, సంపన్నగృహస్తు, కోపార్గామునందు, సర్కిల్ ఇన్స్పెక్టరుగ పనిచేయుచుండెను. కోపార్గాము, షిర్డీకి తొమ్మిదిమైళ్ళు మాత్రమే దూరమున్నది. అధికారమునన్నున్న ఈయనకు, ఆర్థికముగ కొరత ఏమియూలేదు. సంసారము అన్నివిధముల సౌఖ్యముగ సాగిపోవుచుండెను. పాప మీయనకు ఒక్కటియే కొరత. సంతతిలేదు. ఈ సంపాదన ఎవ్వరికొరకు, ఎంతయున్నమాత్ర మేమి ఫలితము. సద్గతి కలుగుటకు, నాకు అవకాశము లేదుగదా? అపుత్రస్య గతిర్నాస్తి అని పెద్దలు చెప్పుదురు. చిన్నిపాపలులేని, ఈకొంప చీకటిమయము, అన్న చింతతో యుండెడివాడు. ఇది నా పాపఫలితమేమో, తల్లి అదృష్టవంతురాలైన, సంతానము కలుగగలదన్న ఆశతో, ముగ్గురపెండ్లి యాడెను. అయిననూ ఆతనికి ఆ కొరత తీరలేదు. బాబా, మహిమలవిని, ముగ్గురభార్యల వెంటగొని, షిర్డీ చేరినాడు. బాబాను సేవించినాడు. దయాసముద్రుడగు బాబా, నత్సాపుత్రంవతుడ వగుదువు, లెమ్ము అని ఆశీర్వదించెను. ఆ అమృతవాక్కులు, ఆశీర్వాదము, గోపాల్రావు చెవిసోకినంతనే, ఆతనికి ఆశ, ఆశతో ఆనందము, ఆనందముతో తన్మయత్వము, ఒడలుమరచి బాబా బాబాయని, భజనచేయ మొదలిడెను. అదృష్టము పండినది. బాబా, అనుగ్రహించినందున అమోఘముగు బాబా ఆశీర్వాద ఫలితముగ, గోపాల్రావు పుత్రవంతుడయ్యెను. అది 1897 సంవత్సరమున వసంతకాలము. గోపాల్రావు సకుటుంబముగ శ్రీ సాయిని సందర్శించెను. బాబా వరప్రసాదులగు

తన బిడ్డలను బాబా పదములకడ నుంచెను. నాడు అతివైభవముగ ఉత్సవములుచేయించి బీదసాదలకు, అన్నదానము చేసెను, ఆతని ఆనందమునకు అంతులేదు. తనభక్తికి, చిహ్నముగ గోపాలావు షిర్డీయందు ఉరుసు, ఉత్సవము. ఏటేటా జరుగునట్లు ఏర్పరుచుటకు సంకల్పించెను. ఆ విషయము తాత్యాపటేల్, దాదాకోటిపటేల్, మాధవరావ్ దేశపాండ్యే, ప్రభుతులకు తెలిపెను. వారునూ అందుకు ఆమోదించిరి, అందరూకలసి, విషయము బాబాకు తెలిపిరి. బాబాకూడ మందహాసముతో, అట్లేయగుగాక అని ఆశీర్వదించినాడు. ఆ ఉత్సవమునకు, అవుసరమగు అనుమతి పత్రమునకై, జిల్లాకలెక్టరునకు అర్జీనిచ్చిరి. కాని కరణము (కులకర్ణి) అందులకభ్యంతరము తెలిపెను. అందుపై ఆజ్ఞాపత్రము అందుటలో ఆలస్యమైనది. బాబా ప్రత్యేకించి ఆశీర్వదించి, అనుమతించి సాగింపుడని ఆజ్ఞాపించిన, ఆ ఉత్సవముల ఆపుటకు అన్యులకు అధికారముగాని, శక్తిగాని ఎట్లుండగలదు. సర్వాంతర్యామియై, సర్వమునూ శాసించుటకు, సమర్థుడైన శ్రీసాయి సంకల్పమునకు అన్యథా ఎట్లుజరుగ గలదు. తిరుగ కలెక్టరుకు పత్రము పంపబడినది. కులకర్ణి, కుంటి అభ్యంతరములు, త్రోసివేయబడెను. షిర్డీయందు ఉరుసు, సాగించుటకు, అనుమతిపత్రము, అందినది. ఈ ఉరుసు, ఉత్సవమును, శ్రీరామనవమినాడు, జరుపవలసినదిగా శ్రీ సాయి ఆజ్ఞఇడెను. కారణము లేకయే, ఆ తండ్రి అట్లు నిర్ణయించెనా, సర్వజ్ఞుడగు సాయి, సర్వమత సామరస్యము. సహజమానవ సౌభ్రాతృత్వము, షిర్డీయందు ప్రత్యేకించి, ప్రబోధింప గలందులకే అట్లుసంకల్పించెను. ఇదియే షిర్డీయందలి ప్రత్యేకత.

అధికారుల, అనుమతి పత్రము, అందినంతమాత్రమున, కాగలదేమి, షిర్డీ నాటికింకనూ కుగ్రామమే. అచ్చట నీటిఎద్దడి హెచ్చుగా. యుండెను. గ్రామమంతటికినీ, రెండుభావులు మాత్రమే యుండెను. అందుఒక బావియందు, నీరు గంటగంటకునూ ఇంకిపోయెడిది. రెండవ భావియందలి నీరు ఉప్పులు. త్రాగుటకు తగినవికావు. ఆ ఉప్పునీటియందు బాబా, పుష్పములవైచెను. అంతతో అందలినీరు ఉప్పదనము



శ్రీ బాబా ఉత్సవము, ఊరేగింపు

వదలి తియ్యనైనవి. అయినమాత్రమేమి. భారిఎత్తున, ఉత్సవముజరుపు నప్పుడు, ఆ వచ్చెడిజనులకు ఆ రెంటినీరు సరిపోగలదా! ఆ కారణముచే మోటలతో దూరమునుండి, బండీలపై నీరు తెప్పించుటకు, తాత్యా పశేలు, వసతిచేయించెను. ఇక అచ్చట దుకాణములకు, ఆ వచ్చెడి జనము, ఆనందముగ కాలముగడపుటకు, గరిడీలు, కుస్తీలు, ప్రదర్శన ములు ఏర్పరచిరి.అహమ్మద్ నగర్ వాస్తవ్యుడు, దామూఅన్నా కాస్గార్ గోపాల్రావుమిత్రుడు. ఈ తనికికూడ, ఇద్దరు భార్యలుండియూ, సంతతి కలుగలేదు. బాబాను దరిశించి, బాబాను సేవించిన తరువాతనే, ఈత నికికూడ, సంతతికలిగినది. బాబా, ఆనతిచొప్పున, షిర్డీయందు ఉరుసు, జరుగగలదని, తెలుపుటయేగాక, ఆ ఉత్సవమున, ఊరేగింపుకు, ఒక జండాచేయించి తెమ్మనికోరుచూ, గోపాల్రావు అతనికివ్రాసినాడు. ఎంతయో, సంతసముతో, కాసర్, జండానుచేయించి, ఆతడు షిర్డీ చేరినాడు. నానాసాహెబ్ ని మోల్కార్, జరీఅంచులతో, అలంక రింపబడిన, మరియొక, జండాచేయించి తెచ్చెను. శ్రీరామనవమినాటి ఉదయము, శుభముహూర్తమున, మంగళవాయిద్యములతో, ఉత్సాహముతో, ఉత్సవము ప్రారంభమయినది. శ్రీ రామరూప సాయినాధునకు జయ జయ శ్రీ సాయీ రామునకు జయ అని జయ జయ ధ్వానములు మిన్నుముట్టినవి. జండాలరెంటిని, భక్తులందరూ, భజనలొనరింపుచూ, ఊరువెంట, ఊరేగించి, తెచ్చి మశీదునకు ఇరువైపులా నిలిపిరి. ఈ జండాల ఉత్సవము, నాటినుండి నేటివరకు ఇట్లే జరుగుచున్నది.

కోర్హాల్లానివాసి ముస్లిము, బాబా భక్తుడు, అమీర్ షక్కర్ దలాల్, నాటిజండా ఉత్సవములయందు పాల్గొనెను. మహమ్మదీయుల మతాచారము ననుసరించి, చందన, ఉత్సవము చేయవలెనని ఈతనికి తలంపు కల్గినది. మహమ్మదీయులు, తమపెద్దల, వల్లి ప్రభృతులకు, గౌరవార్థము, పెద్దపళ్లెరములయందు, చందనమునుంచి, వాటికిఎదర, సుగంధద్రవ్యముల వ్రేల్చుచూ, ఊరేగించి, కడకు మశీదునందు, నింబారుపైననూ, గోడలపైననూ, ఆచందనమును ఉంచెరు. అదే

విధమున, నాడు, తనఆచారము ననుసరించి, తాను చందన ఉత్సవము చేయవలెనని, అమీర్, ఆలోచించెను. వెంటనే, బాబాను దర్శించి, అనుజ్ఞనిమ్మని వేడికొనెను. బాబా, తనభక్తుల, ఉత్సాహమునూ, ఎన్నడూ భగ్నపరచెడివాడుకాదు. బాబా, అనుమతి అయినది. ఆసాయంకాలము, మేళతాళములతో, పళ్లెరమునందు గంధము ఉంచబడినది. ముందు అగరు అత్తరువుల, గమగమలు సాగినవి. మశీదునుండి మహదానందముతో ఊరేగింపు బయలుదేరెను. గంటలతరబడి భక్తితో ప్రజలు, ఆ ఊరేగింపువెంట నడచిరి. ఉదయం జండాల ఊరేగింపునందు మహ్మదీయులు, సాయంత్రము చందనఊరేగింపునందు హిందువులు, భక్తితో పాల్గొనిరి. ఉభయులూ చేరినది ఒక్క మశీదునందే, హిందువులకు అది ద్వారకా, ముస్లీములకు అది మక్కా-మశీదు—ఆరాధించునది ఉభయులూ ఒక్కమూర్తినే, హిందువులకు సాయీ రాముడు. ముస్లిములకు ఖుదారూపము. ఇదియే ఈ అవతారమందలి ప్రత్యేకత. ఎందరెందరు ప్రవక్తలు, ఎన్నివిధముల బోధించిననూ, ఎరుగరాని పరమసత్యము, బాబా ప్రత్యేకముగ తెలియ చూపినాడు. ఏకమేన అద్వితీయంబ్రహ్మ-అల్లామాలీక్, ఖుదా ఏక్ హై, అన్న అంశములు సమన్వయపరచి, సాయీరాముడే, అల్లాయని, నిరూపించినాడు. ఆరాధించుతీరులు వేరైననూ, అందరునూ కొలిచెడిమూర్తి ఒక్కడేనని, అందరనూ, అనుగ్రహించునది పూజాదికముల అందుకొనునదికూడ ఒక్కడేనని, ఈ బేధములవల్ల ఆ మూర్తియందు బేధము కలుగుటలేదని, సగుణముగ రుజువు చూపినాడు. బాబా భజనలయందేమి, ఉత్సవములయందేమి, హిందువులు, ముస్లీములు, యితరులుకూడ సోదరులై, ప్రేమతో చరింపుచుండిరేగాని, వేరనుభావమే కలుగుటలేదు. ప్రక్క-ప్రక్కన నిలచి, ఎట్టిపొరుపునూలేక, భక్తితో, బాబాను సేవింపుచున్నారు. నాడుకాదు నేడుకూడ అట్లేజరుగుచున్నది.

1897 లో ప్రారంభింపబడిన ఈ ఉరుసు, అట్లే 1912 వ సంవత్సరము వరకు సాగినది. మొదటమొదట హెచ్చుగాజనము రాకున్ననూ, సంవత్సరములు గడచినకొలది ఉత్సవములకువచ్చెడి జనులసంఖ్య పెరిగి

నది. కాని 1912 వ సంవత్సరమున ముఖ్యమగుమార్పు జరిగినది. అమరావతి నివాసియగు దాదాసాహెబ్ కపర్దేతో కూడ, కృష్ణారావు జోగేశ్వర్ భీష్మ, అనునతడు, ఉరుసు ఉత్సవములకు, షిర్డీకి వచ్చెను. మరునాడు రామనవమి. దీక్షిత్ వాడయందు, వీరుఉభయులు బసచేసిరి. భీష్మ, ఆ పంచలోపవ్వాలించి యుండెను. లక్ష్మణరావు వరఫ్ కాకాజని, నాటి మధ్యాహ్నము పూజాద్రవ్యముల మశీదుకు గొనిపోవుచుండెను. భీష్మునకు, ఉన్నట్లుండి ఒకఊహకలిగినది. రేపురామనవమిగదా, హిందువులకు, ప్రత్యేకించి పండుగదినము. ధర్మసంస్థాపనార్థము శ్రీరామచంద్రుడు అవతరించిన, పుణ్యదినము. హిందువులందరూ, వాడవాడల ఇంటింట ఉత్సవములు, జరుపుకుందురు. ఈ రామనవమినాడే, ఇచ్చట ఈ ఉరుసుకూడ జరుగుచున్నదే, ఇట్లు జరుగుటకు ప్రబలకారణము ఉండకమానదు. ఈ ఉరుసుకుబదులు రామనవమి ఉత్సవమేల చేయరాదు. ఇందుతప్పేమి గలదు. బాబా దీనికియ్యకొనడా, ప్రార్థించిచూతమని తలచెను. పోయెడి కాకాజననిపిలిచి తన ఆలోచన తెలిపెను. చక్కని ఊహ, బాబాను అడుగుదమని అందరూ నిశ్చయించుకొనిరి. కాని నాడు శ్రీరాముని గుణగణముల, దివ్యచరిత్రను, సంకీర్తనచేయుటకు దాసు లభించుటెట్లు? ప్రక్కవాయిద్యముల మాటవమి, అంతలో ఆ చిక్కకూడ తీరినది. భీష్మ, తానురచించిన శ్రీరామజననగాథ, "రామాఖ్యానము" పూర్తియై, శిద్ధముగ యున్నందున తానే ఆ దివ్యచారిత్రమును స్వయముగ కీర్తనచేయుటకు సిద్ధపడెను. శ్రీకాకామహాజనీ హార్మోనియము వేసెదననెను. సరిసంకీర్తన ప్రక్కవాయిద్యములూ, అమరినవి. వెంటనే శ్రీమతి రాధాకృష్ణామాయి, సంతవాడ (అల్లము చక్కెర కలిపినది) ప్రసాదము సిద్ధము చేసెదననెను. అందరూ కలసి, బాబా అనుమతి అర్థించుటకు, మశీదుచేరిరి. అంతర్యామియగు బాబా ఎరుగనిదేమున్నది. వీరలచూడగనే శ్రీసాయి, మహాజనీ, ఏమిటా వాడయందలి సందడి ఏదో ఆత్రముగ ఆలోచింపుచున్నారే అనెను. పాపమాతనికి అర్థముకాలేదు. మారుపలుకక ఊరకుండెను. వెంటనే భీష్మా, ఏమిటిసంగతి నీవుచెప్పమని, బాబా ప్రశ్నించెను. అచ్చట తాము చర్చించిన విషయములు, చేసినఏర్పాట్లు పూసగ్రుచ్చి

విధమున, నాడు, తనఆచారము ననుసరించి, తాను చందన ఉత్స వము చేయవలెనని, అమీర్, ఆలోచించెను. వెంటనే, బాబాను దర్శించి, అనుజ్ఞనిమ్మని వేడికొనెను. బాబా, తనభక్తుల, ఉత్సాహమునూ, ఎన్నడూ భగ్నపరచెడివాడుకాదు. బాబా, అనుమతి అయినది. ఆసాయంకాలము, మేళతాళములతో, పళ్లెరమునందు గంధము ఉంచబడినది. ముందు అగరు అత్తరువుల, గమగమలు సాగినవి. మశీదునుండి మహదానందముతో ఊరేగింపు బయలుదేరెను. గంటలతరబడి భక్తితో ప్రజలు, ఆ ఊరేగింపువెంట నడచిరి. ఉదయం జండాల ఊరేగింపునందు మహ్మదీయులు, సాయంత్రము చందనఊరేగింపునందు హిందువులు, భక్తితో పాల్గొనిరి. ఉభయులూ చేరినది ఒక్క మశీదునందే, హిందువులకు అది ద్వారకా, ముస్లీములకు అది మక్కామశీదు—ఆరాధించునది ఉభయులూ ఒక్కమూర్తినే, హిందువులకు సాయీ రాముడు. ముస్లిములకు ఖుదారూపము. ఇదియే ఈ అవతారమందలి ప్రత్యేకత. ఎందరెందరు ప్రవక్తలు, ఎన్నివిధముల బోధించిననూ, ఎరుగరాని పరమసత్యము, బాబా ప్రత్యేకముగ తెలియ చూపినాడు. ఏకమేవ అద్వితీయంబ్రహ్మ—అల్లామాలీక్, ఖుదా ఏక్ హై, అన్న అంశములు సమన్వయపరచి, సాయీరాముడే, అల్లాయని, నిరూపించినాడు. ఆరాధించుతీరులు వేరైననూ, అందరునూ కొలిచెడిమూర్తి ఒక్కడేనని, అందరనూ, అనుగ్రహించునది పూజాదికముల అందుకొనునదికూడ ఒక్కడేనని, ఈ బేధములవల్ల ఆ మూర్తియందు బేధము కలుగుటలేదని, సగుణముగ రుజువు చూపినాడు. బాబా భజనలయందేమి, ఉత్సవములయందేమి, హిందువులు, ముస్లీములు, యితరులుకూడ సోదరులై, ప్రేమతో చరింపుచుండిరేగాని, వేరనుభావమే కలుగుటలేదు. ప్రక్కప్రక్కన నిలచి, ఎట్టిపొరపునూలేక, భక్తితో, బాబాను సేవింపుచున్నారు. నాడుకాదు నేడుకూడ అట్లేజరుగుచున్నది.

1897 లో ప్రారంభింపబడిన ఈ ఉరుసు, అట్లే 1912 వ సంవత్సరము వరకు సాగినది. మొదటమొదట హెచ్చుగాజనము రాకున్ననూ, సంవత్సరములు గడచినకొలది ఉత్సవములకువచ్చెడి జనులసంఖ్యపెరిగి

నది. కాని 1912 వ సంవత్సరమున ముఖ్యమగుమార్పు జరిగినది. అమరావతి నివాసియగు దాదాసాహెబ్ కపర్దేతో కూడ, కృష్ణారావు జోగేశ్వర్ భీష్మ, అనునతడు, ఉరుసు ఉత్సవములకు, షిర్డీకి వచ్చెను. మరునాడు రామనవమి. దీక్షిత్ వాడయందు, వీరుఉభయులు బసచేసిరి. భీష్మ, ఆ పంచలో పవ్వళించి యుండెను. లక్ష్మణరావు వరఫ్ కాకాజని, నాటి మధ్యాహ్నము పూజాద్రవ్యముల మశీదుకు గొనిపోవుచుండెను. భీష్మనకు, ఉన్నట్లుండి ఒకఊహకలిగినది. రేపు రామనవమిగదా, హిందువులకు, ప్రత్యేకించి పండుగదినము. ధర్మసంస్థాపనార్థము శ్రీరామచంద్రుడు అవతరించిన, పుణ్యదినము. హిందువులందరూ, వాడవాడల ఇంటింట ఉత్సవములు, జరుపుకుందురు. ఈ రామనవమినాడే, ఇచ్చట ఈ ఉరుసుకూడ జరుగుచున్నదే, ఇట్లు జరుగుటకు ప్రబలకారణము ఉండకమానదు. ఈ ఉరుసుకుబదులు రామనవమి ఉత్సవమేల చేయరాదు. ఇందుతప్పేమి గలదు. బాబా దీనికియ్యకొనడా, ప్రార్థించిచూతమని తలచెను. పోయెడి కాకాజననిపిలిచి తన ఆలోచన తెలిపెను. చక్కని ఊహ, బాబాను అడుగుదమని అందరూ నిశ్చయించు కొనిరి. కాని నాడు శ్రీరాముని గుణగణముల, దివ్యచరిత్రను, సంకీర్తనచేయుటకు దాసు లభించుటెట్లు? ప్రక్కవాయిద్యముల మాటఏమి, అంతలో ఆ చిక్కుకూడ తీరినది. భీష్మ, తానురచించిన శ్రీరామజననగాథ, "రామాఖ్యానము" పూర్తియై, శిద్ధముగ యున్నందున తానే ఆ దివ్య చారిత్రమును స్వయముగ కీర్తనచేయుటకు సిద్ధపడెను. శ్రీకాకామహాజనీ హార్మోనియము వేసెదననెను. సరిసంకీర్తన ప్రక్కవాయిద్యములూ, అమరినవి. వెంటనే శ్రీమతి రాధాకృష్ణామాయి, సంతవాడ (అల్లము చక్కెర కలిపినది) ప్రసాదము సిద్ధము చేసెదననెను. అందరూ కలసి, బాబా అనుమతి అర్థించుటకు, మశీదుచేరిరి. అంతర్యామియగు బాబా ఎరుగనిదేమున్నది. వీరలచూడగనే శ్రీసాయి, మహాజనీ, ఏమిటా వాడయందలి సందడి ఏదో ఆత్రముగ ఆలోచింపుచున్నారే అనెను. పాపమాతనికి అర్థముకాలేదు. మారుపలుకక ఊరకుండెను. వెంటనే భీష్మా, ఏమిటిసంగతి నీవుచెప్పుమని, బాబా ప్రశ్నించెను. అచ్చట తాము చర్చించిన విషయములు, చేసినఏర్పాట్లు పూసగ్రుచ్చి

నట్లు తెల్పి, బాబా రేపు సాయీరాముని జన్మదినోత్సవము, జరుపుటకు మమ్మాశీర్వదింపుడని ప్రార్థించిరి. దీనికింత ఆలోచనఏల? మీ ఉత్సాహము ఎట్లున్నదో అట్లేకానిండు, కాదననేల, రేపటినుండి ఇచ్చటకూడ శ్రీరామనవమికి ఉత్సవములు జరుగునుగాక, ఆ రామచంద్రుడే, మీ అభీష్టము నెరవేర్పగలడు, అని బాబా ఆశీర్వదించెను.

మరుసటి ఉదయము మశీదు, రంగురంగుల రంగవల్లులతో, పచ్చనితోరణములతో, వివిధ విధముల అలకరింప బడినది. శ్రీమతి రాధాకృష్ణమాయి, బాబా ఆసనమునకు ఎదుట ఊయల వ్రేలగట్టినది. పుణ్యాహ వచనములతో, ఉత్సవము ప్రారంభమైనది. జయ జయ, శీతారామా–షిర్ధీన నిలచిన సాయీరామా, 'అన్నసంకీర్తన మూడవస్థాయినందినది. ఒడలుమరచి భక్తులు, జయ జయ రామ్–శ్రీసాయీరామ్ —సాయీరామ్ జై, శీతారామ్, అని నృత్యము చేయుచుండిరి. అప్పటి ఆ భక్తిభావము, తన్మయతచూచి ఆనందించి, అనుభవింప వలసినదేగాని దానిని వర్ణించుటెట్లు—గోసాయి రూపమునను న్న. శ్రీ సాయి, నాడు నీలమేఘశ్యాముడై చిరుత ప్రాయపు చిన్నిరాముడై, సకలభూషణ భూషితుడై, చిరునగవుతో చేతులు చాచుచుండెను. వారెంతటి ధన్యులు. ఎట్టి పుణ్యాత్ములు. కుఫ్నీధారి, రామచంద్రుడై దరిశన మిచ్చెను. తవినిదీర వారు భజన లొనరించి కన్నులు కలిగినందులకు ఆ అవతారధారిని, దరిశించి, తరించి రనుటకు సందియమేమి. భీష్మ, పులకితగాత్రుడై, నడుమువిగించి, గురువందనమాచరించి, "సమర్థ సద్గురు సాయినాథా జయ, షిర్డీని నిలచిన శ్రీరామచంద్రా జయ, అని నమస్కరించి, కథాకీర్తనమునకు దిగెను. వెంటనే బాబా, నింబారునందున్న పుష్పమాల నందుకుని, స్వయముగ భీష్మని మెడయందుంచెను. బాబాచే అలంకరింపబడిన, భీష్మ, నాడు శ్రీకృష్ణుని కరుణనందిన, భీష్మాచార్యునికన్న మిన్నయై, శ్రీరామచంద్రుని, ఆకారమందే మనము హత్తించి, తాదాత్మ్య సుఖమనుభవింపుచూ, ఒడలుమరచి సంకీర్తన గావించెను. సాయిరాముని సన్నిధానమున జరిగిన, ఆ సంకీర్తనయందు, ముగ్ధుడై ఒడలుమరచి

రామనామామృతపాన పరవశుడై, పవనతనయుడు, అందందు పరువిడు చుండెననుట అతిశయోక్తి కానేరదు. సంకీర్తన సమాప్తమైనది. జయ రామచంద్రా! జయ, జయ రఘుపతిరామా, రాఘవరామా, దశరథ రామా, శ్రీ సీతారామా. షిర్డీని నిలచిన సాయీరామా! అని అందరూ ఒక్కుమ్మడి జయజయ ధ్వానముల చేసిరి. ఆ మసీదునందలి ప్రతి అణు వునూ, రామా, రామా, అని ప్రతిధ్వనించి, రామనామ సంకీర్తనమే గావించెను. అంతయూ రామమయమయ్యెను. మేళములన్నియూ, ఆ రామనామముతో మేళవించి ఒక్కపరి మ్రోగినవి. భక్తులందరూ పారవశ్యముతో పళ్లెరమందలి గులామును, వెదజల్లిరి.

ఉన్నట్లుండి బాబా, అబ్బా! యని కేకలిడెను. హొండు హొండని వారల కసరెను. పశువులు వీరారని విసిగికొనెను అంతటి ఆనందమున ఉన్న వారందరు, అట్లే భయభ్రాంతులై పరువిడ మొదలిడిరి. తత్వ మెరిగిన, తాత్యా ప్రభృతులు, ముకుళితహస్తులై బాబా పాదముల తాకిరి. మానవులయందలి రాక్షసత్వమును హరించి, సత్వగుణమును ప్రకాశింప జేయుటకు, సత్య ధర్మముల సంరక్షించుటకు, సాకారుడై, శ్యాముడే రాముడై, అవతరించిన, ఆ సమయమున స్వార్థము, తామ సమును, అణుచుటకు సాయీరాముడు, సంరంభము చేయుట సహజ మేగా? సాయీరాం, సాయీరాం, అని సంకీర్తన సాగించిరి. నాడు శ్రీకృష్ణ పరమాత్మ, తానే దైవమని, తల్లి యశోదకు, చిరునోట విశ్వ రూప దర్శనమిచ్చియూ, ఆ తల్లికి తిరుగ భ్రాంతి కలుగునట్లు కొంటె క్రీష్టమ్మ కాలేదా! నేడు శ్రీసాయి తానే రాముడై, భక్తులకు బాలుడగు రాముడై దర్శన మిచ్చెనుగదా! బ్రహ్మానందమున తేలియాడు ఆ భక్తులను తిరుగ ప్రాపంచిక ధర్మముగ భ్రాంతి యుతులచేయుట, భావ్యమని శ్రీసాయి, సంకల్పించెనో ఏమో! కాకయున్న గులాముకంటికి అంటినంత మాత్రమున నిర్గుణస్వరూపుడగు శ్రీ సాయికి బాధ అనగలమా! బ్రహ్మానంద పరవశుడైన భక్తుడు కూడ కించిత్ వికారము కలిగిననూ, విజ్ఞానము కోలుపోయి అజ్ఞానా వృతుడు కాగలడుసుమా, అని హెచ్చరించుటయో ఏమో! కాక

యున్న బాబా రాముడై దర్శనమిచ్చిన భగవత్ స్వరూపుడని, ఆనందముగ సంకీర్తన చేయువారల కిట్టి భయమేల దాపురించినది? భయభ్రాంతు లుడిగిననాడే భావరహితుడై, భక్తుడు, భగవంతుని తెలియగలడని తెలియజెప్పెనో ఏమో, కాకయున్న ఇతరులవలె పరువిడక, తాత్యా ప్రభృతులు, బాబా పాదముల వ్రాలిరేల? నిజతత్త్వమిదియని నిరూపించినట్లుచూ, తిరుగ నిజమును మరుగుపరచి, ఇట్లే మాయామోహితుల చేయుచూ, మనతో ఆడుటయే భగవంతుని లీల. కాకయున్న ఆయనకు లీల లనునవి ఎట్లుండగలవు. అందరమూ, మాయాతీతులమై, ఆయనను గ్రహించితిమా, ఇంక అతడొనరించుటకు ఏమున్నది. త్రోవచూపి త్రోవ సమకట్టియూ, కానరానివలె కానరాక కానిమార్గముల కాలిడుటకు కానరాని అవకాశములు కల్పించుచు త్రోవతప్పినవాని దరిజేరి, దుర్భావముల రేకెత్తించి, నా ప్రభావము చూపెదనంచు, వెలుగు చీకటులమధ్య, జిలుగుచూపుటయే ఆ చిన్మయాత్ముని చిద్విలాసము. కాకయున్న సదసద్వివేకుల చాయపోయి ఈయన చేయుట కేమున్నది. తండ్రీ! ఇట్లంటినని కోపింపకుము. నీ దాగుడుమూతలు అర్థముగుట లేదయ్యా! నిజమగు నీ రూపు చూపమని, మరుగుపరచి మర్మములతో బాధింపకుమనియే నా ప్రార్థన.

శ్రీమతి రాధాకృష్ణమాయి, బాబా తన ఊయలనుకూడ విరుగగొట్టునన్న భయముతో, మహాజనని ఊయలవిప్పి తెమ్మని, బ్రతిమాలెను. అతడు సరియని, ఊయలను సమీపించెను. వెంటనే, అతని చెయ్యిపట్టుకుని బాబా వలదని వారించెను. కొద్దిక్షణములలో తిరుగ అందరనూ, ఆదరముగ రండని పిలచెను. పూజ, ఆరతి మామూలుగ జరిగిపోయినవి. ఆ తరువాత మహాజని ఊయలను విప్పనిండని బాబాను బ్రతిమాలెను. బాబా అందుకు అనుమతించలేదు. ఉత్సవములింకనూ పూర్తికాలేదు, తొందరపడెదవేల; అని వారించెను. ఆ మరునాడు సంకీర్తన జరిగినది. నాడు గోపాలకళాకీర్తనము జరిపి, చలిదికలిపి, కుండలోనుంచి, ఆ కుండను పైన వ్రేలాడకట్టిరి. గోకుల బృందావనమున శ్రీకృష్ణుడు తోడి గోపబాలురతో ఆడి ఆనందము అనుభవించిన చలిది ఆరగింపుల ఘట్టమే, నాటి సంకీర్తన. సంకీర్తన

సమాప్తి అయినది. ఆ కుండను కర్రతో కొట్టి, అందలి పెరుగు అన్నమును, ప్రసాదముగ భక్తులకు పంచిపెట్టిరి. ఆ తరువాత ఊయలను బాబా అనుజ్ఞతో రాధాకృష్ణమాయి, విప్పుకొనెను. రామనవమి ఉత్సవములు ఇట్లు కోలాహలముగ జరుగుచుండ, నాటి ఉదయము జండాలు, సాయంత్రము చందన ఉత్సవమూ ఊరేగింపు అతివైభవముగ జరుపబడెను. నాటినుండి, బాబా ఉరుసు, రామనవమి ఉత్సవముగ మారినది. నేటికికూడ అదేవిధమున మహావైభవముతో జరుపబడుచున్నది.

మరుసటి సంవత్సరము 1913 నుండి ఉత్సవములలో, క్రొత్తదన మేర్పడినది. శ్రీమతి రాధకృష్ణమాయి, చైత్రశుద్ధ పాడ్యమి మొదలు, నామసప్తాహ మొనర్చెడిది. అహోరాత్రములు వారమురోజులు నామ సంకీర్తన సాగెడిది. అందు వంతులు వంతులుగ, భక్తులుకుమిగూడి భగవన్నామ మొనర్చెడివారు. వాడవాడల రామనవమికి ఉత్సవములే. ఈ ఉత్సవమునకు, కథాకాలక్షేపము చేయుటకు, హరిదాసు ఎట్లులభించునా అని బాధపడిరి. కాని ఆ సంవత్సరము రామనవమికి ఆరురోజులు ముందుగనే అభినవ తుకారాముని, బిరుదునందిన మహాభక్తుడు. నాయకుడు, బాలబువామాలీ, మహాజని కలియుట తటస్థించెను. మాలి ఆ సంవత్సరము బ్రహ్మానందముగ సంకీర్తన జరిపినారు. 1914 వ సంవత్సరములో సతారా వాస్తవ్యుడు బాలాబువా, అను కీర్తనకారుడు, సంకీర్తన జరిగించెను. 1915 సంవత్సరమునుండి ఈ హరిదాసులులేరన్న కొరత తీరిపోయినది. బాబాయే అందుకు తగినఏర్పాటు గావించినాడు. దాస్‌గణు మహారాజునకు, సంకీర్తన భాగమీయబడినది. దాస్‌గణు, బాబాకు కూర్చుభక్తుడు. ఆ లగాయితూ 1915 సంవత్సరమునుండి ఈ భక్తుడే, రామనవమికి ప్రతి సంవత్సరము సంకీర్తన మొనరించెడివాడు. ఈయన నేటికిని సజీవుడే. 76 వత్సరములు పైబడిన వృద్ధుడు. నేటికిని ఉత్సవములయందు, పాల్గొనుచున్నాడు. గత 10 సంవత్సరములనుండి శరీర దౌర్బల్యమువల్లను, వయసుమీరిన కారణముచేతను సంకీర్తన సలుపుట లేదు.

1912 నుండి క్రమముగ ఉత్సవము పెరిగిపోయినది. చైత్ర శుద్ధ సప్తమి మొదలు, షిర్డీ ఒకపట్టణమువలె యుండును. దుకాణములు పెరగినవి. వచ్చెడి భక్తులసంఖ్య హెచ్చినది. భజనలు, హరికథలు, పురాణ కాలక్షేపములు, అన్నదానము, కుస్తీపట్లు, గరడీసాములు, ఇంకనూ ఇతరక్రీడలు సాగినవి. షిర్డీ సంస్థానమైనది. బాబా ఊరేగింపునకు పల్లకి, గుఱ్ఱము, రథము, అమరినవి. ఏనుగులుకూడ వచ్చినవి. ఇంత కల్గిననూ, బాబామాత్రము నిరాడంబర మూర్తియే. మొదట మొదట 5000 నుండి 7000 వరకు జనులు చేరెడివారు. ఆ సంఖ్య 75000, కు పెరిగినది. నేడు లక్షలు దాటుచున్నది. ఈ నాటికిని హిందువులు, మహ్మదీయులు, ప్రక్క-ప్రక్కననిలచి, తమ దైవమగు శ్రీ సాయిని సేవింపుచున్నారు. ఇంత జనసమ్మర్దమున్ననూ, నేటివరకు ఉత్సవసమయముల ఎన్నడూ ఎట్టివ్యాధులు కలుగుటగాని, ఇతరబాధలు కలుగుటగాని, వచ్చెడియాత్రికుల సామానులు అపహరింప బడుటగాని, జరుగలేదు. అది బాబా, అనుగ్రహము. నాడు బాబా సశరీరుడై యుండ, జరిగిన ఉత్సవములు మనము చూడలేదు. అట్టిఅదృష్టము మనకుకలుగలేదు. ఈ నాడుజరుగు ఉత్సవముల యందైననూపాల్గొని, శ్రీ సాయి సమాధికడ సాగిలపడి, ధన్యుల మయ్యెదముగాక.

"ఓం శ్రీ సాయి నాధాయ నమః"

అల్లాయన్న దికూడా,
ఉల్లాసముమీర రాము; నుతియించుటయే,
కల్లయె భేదంబన్నది
అల్లాడకుడంచు మీరు ఆనతిఈరే॥

—•—

# 29 అధ్యాయము

ప్రభూ ! పరమాత్మ స్వరూపా!

బాలోన్మత్తపిశాచాభః, క్వచిన్ముక్తంపరీక్షితం
త్యాగీ, మహాయోగీ, నిత్యానందో నిరంజనః॥
సర్వరూపీ, సర్వదాతా, సర్వగః, సర్వకారకః,
భస్మోద్ధూళితసర్వాంగో, మహాపాతక నాశనః।
భక్తిప్రదో, భుక్తిదాతా, జీవన్ముక్తి ప్రదాయకః॥
ఏవం ధ్యాత్వాఽనన్యచిత్తో, బాబా ధ్యానంకరోమ్యహమ్।

పాపపంకిలహృదయుడనగు, నాభావములు, ప్రాపంచిక విషయముల పరువిడుచున్న వేగాని, నిర్మలమగు నీపదధ్యానమున నిలుచుట లేదు తండ్రీ! సర్వకారణ కారణుడవగు నీ సాయము లేక, నిర్మలమగు భక్తి, నాకెట్లులభ్యము కాగలదయ్యా!

సత్యస్వరూపా; సంకల్పమాత్రమున, నాడు కాశీనాథుని, సత్పురుషునిగ జేసితివే! ఆక్రందన మొనరించు మీనతాయికి, అయాచితముగ, సాయపడి, ఆదరించితివే! భక్తపాలకా! ఎందరెందరిని ఎన్ని విధముల, తోడుపడి ఉద్ధరింపలేదు. ఇందరికి, ఇన్నివిధముల, అభయమిచ్చిన నీకు నాపై నిర్దయయా! దయాస్వరూపా! భక్తరక్షణ పరతంత్రుడవగు, నీ పాదములవదలలేను, తండ్రీ! నేను మహాపాపిని, కాకయున్న కరుణామూర్తివగు, నీకు కూడ, కాఠిన్యత ఎట్లుండగలదు? హృదయ విదారకమగు నా ఏడ్పులేల నీకు వినబడవు! బాబా! ఇది నా పాపఫలము. అందరఒక్క తీరున, ఆదరించి రక్షించు, అనాథనాథుడవే, ఆర్తిహరా! అన్యాయముసేయకు, పాపపరిహారమగునట్లు, నీపావననామము, నాపెదవులపై నాట్యమాడునట్లు, ప్రసన్నుడవై, ప్రసాదింపుము తండ్రీ!

పదారు వత్సరముల బాలయోగివలె, షిర్డీగ్రామమునకు వెలుపల, నింబపాదపమూలమున, నివాసమేర్పరచుకుని, శ్రీసాయి 1854న, దర్శనమిచ్చెనుగదా, తిరుగ రెండు సంవత్సరములకు, చాన్దుభాయీ పటేలు, పెళ్లివారిపరివారముతో, పయనమై, షిర్డీయందలి, ఖండోబా ఆలయప్రాంగణమున. వేంచేసిన, ఈ కఫ్నీధారి, మహాభక్తుడగు, మహల్సాపతిచే, ఆయి, సాయీ దే! అని, ఆహ్వానింపబడి, నాటినుండి, సాయీబాబా, అన్ననామముధరించి, షిర్డీయందు చరించెనుగదా, ఆ తండ్రీ అందుండుటచే, షిర్డీ, యాత్రాస్థలమును, పుణ్యక్షేత్రమునూ, అయ్యెగదా, షిర్డీనివదలి, బాబా, ఎన్నడునూ, ఎక్కడకునూ, పయనము సాగింపకయే, సర్వాంతర్యామి అయిన కారణమున, దూరప్రాంతముల యందుకూడ, తన్నారాధించెడి, భక్తులకు, సాక్షాత్కరించుటయేగాక, భాషించుటగూడ జరిపెనుగదా, బాబా, కరుణామూర్తియైన కతన, ప్రేమస్వరూపమై, మతవిద్వేషముల పోనడచి, సహజమానవ సౌభ్రాతృత్వమును, పెంపొందించి, మశీదునందుండియూ, శ్రీ రామ, కృష్ణ, శివ మరుత్యాది రూపముల దర్శనమిచ్చి, అజ్ఞానముపోద్రోలి, విజ్ఞానవంతులచేసెనే, కంటికిరెప్పవలె, కన్నతల్లికివలె, తన, ఆశ్రితుల నందరనూ, సర్వజ్ఞుడై, అంతర్యామియై, అభయప్రదుడై, వివిధప్రదేశముల, వెంటనుండి, కాపాడిన, ఆ దయామూర్తి, ఆ ప్రేమ స్వరూపుడు, కరుణాసముద్రుడు, ఈనాడు, మనము స్థూల నేత్రములతో, చూచి, ఆనందించి, ఆరాధించుటకు, అందరానివాడయ్యెనే! నిరాకార నిరంజనుడవు, నిర్గుణపరబ్రహ్మ స్వరూపమగు, నీవు, నాతండ్రీ, సగుణుడవై, సాకారుడవై, సమవర్తివై, సహచరుడవై, సంరక్షకుడవై, సద్గురుడవై, సమర్థసద్గురుడవై, సంచరించి, భక్తసముద్ధరణచేసెడి నీవు, మురళీధరునకు అను, ప్రేరణతో, బూటీచే, మందిర నిర్మాణమొనరింపజేసి, మురళీధరుని, ఆస్థానము నాక్రమించి, మమ్ముమాయచేసి, అందు ప్రవేశించి, ఇట్టిమాయమైతివే, ప్రభూ, ఇది ఏటిన్యాయముతండ్రీ; నీ దివ్యమంగళ విగ్రహము చూచుటకునైననోచని, నా ఈ జన్మ వ్యర్థముకదయ్యా! అగునగు, 1918 వ సంవత్సరము, ఆశ్వియుజ శుద్ధ, దశమి, అది పవిత్రమగు

దినమే - కాని అది పాపిష్టి కాలముకూడ నేమో అన్నివత్సరము ల ట్లిచ్చట గడిపి, ఎందరెందరనో, నీవంకకీడ్చి, ఆదరించి రక్షించు నీకు అంతలో, అంతతొందరవేలకల్గినది తండ్రీ! ఎందరెందరు, నీభక్తులు, నిన్నుదర్శించి, నీపదసేవతో, తరింపతలపనపడుచుండిరో, నీవేలగమనింప నైతివి? తండ్రీ - ఇది మాదౌర్భాగ్యము. కాకయున్న కలికాలమున, భక్తసముద్ధరణకొరకు, అవతరించిన నీకు, అంత ఆత్రమేల కలిగెనది.

1918 వ సంవత్సరము సెప్టెంబరు 28 తేదీన, బాబాకు తీవ్రముగ జ్వరమువచ్చినది. మూడు నాళ్ళలో జ్వరతీవ్రతతగ్గినది. కాని బాబా ఆహారముతీసికొనుట మానినారు. దానితో వయసుమీరిన శ్రీ సాయి నీరసించెను. అట్లే 17 దినములు గడచినవి. నాడు 15 వ అక్టోబరు ఆశ్వయుజ మాసము-విజయదశమి, సాయంత్రము గం. 2½ లకు, శ్రీ సాయి శరీరముత్యజించెను. కాని బాబా నిర్యాణసమయమునకు, దశమిగడియలుగడచి, ఏకాదశిప్రవేశించినది ఆ అవతారధారి, ఇచ్ఛామాత్రమున, అవతారము చాలించినారు. శరీరత్యాగమొనరించెనేగాని, సకలచరాచరగామి, సర్వవిత్ సర్వతోముఖుడు, సర్వాంతర్వహిస్థితుడు. ఆతండ్రికి అంతమేమిటి? నేటికిని శ్రీ సాయి సజీవుడే. ఒక ఆకారముకోరి, ధరించినప్పుడు, సహజరీతిని, ఆ శరీరమునకు కలుగు, అవస్థలనన్నింటిని, తాముగూడ అనుభవించినట్లు, అగపడి, అనుభవించుట, ఆదర్శపురుషుల లక్షణము. అందులకే శ్రీ రామ, కృష్ణులు సైతము, సామాన్యులవలె, సుఖదుఃఖములకులోనై, తల్లి తండ్రులని, అన్నదమ్ములని, బంధువులని, సంసార బంధములతో సంచరింపుచూ, ఇతరులకు మార్గదర్శకులుగా ప్రవర్తించిరి. నిర్వికారులగు, వారు సామాన్యులవలెనే, సంచరించిరి. కాని తాము భగవత్ స్వరూపులమని, నిస్సష్టముగ, నిరూపించిచూపుచునే యుండిరి. అట్లే శ్రీ సాయిసైతము, తానే భగవంతుడనని, తెలియజెప్పెను. శరీరధారణ మొనరించిన కారణమున, శరీరయాతనల నన్నింటెని, సహజముగుతీరున, అనుభవించియుండెను. అంతియేగాని, శ్రీ సాయికి, నిర్యాణ మెక్కడిది. నాడు స్థూలనేత్రములతో, ఎవ్వరికైననూ,

కఫ్నీధారియై, పకీరు వేషమున చూచుటకు అవకాశముండెడిది. కాని నేడుభక్తిమార్గమునగాని ఆమహామహునికనలేమేమో, కాదుఅట్లనుట కూడ సరికాదు. ఆర్తితో బాబా! నీకన్న నాకింక దిక్కెవ్వరు గల రయ్యా, అని కేకలిడిన, పరువిడివచ్చి, శ్రీసాయి, ఆదరింపగలడు. ఆదరింపుచున్నాడు. తానుంటినని, వివిధవిధముల, నిదర్శనా పూర్వక ముగ, ఋజువుపరచుచున్నాడు. భక్తి, అనుదానిని, ఇట్టిదని నిర్ణ యించు టెట్లు, భక్తి ఉన్నదా, లేదా, ఎవ్వరు నిర్ణయింపగలరు, ఆ తండ్రి, అనుగ్రహమున్నచో. దర్శన మీయగలడు, అనుటయే, యథార్థమగునేమో? అట్టి అనుగ్రహమునకు పాత్రుడై, ఫలితమబ్బిన, వాడే, భక్తుడు. తదితరులు, సాధకులే అగుదురోఏమో; భక్తి మార్గమునకాలిడి, పయనించు, యాత్రికులే అగుదురేమో! మార్గ మందలి ఒడుదుడుకులకు భయపడక, తనగమ్యమెరిగి, బాబా పద ధ్యానముతో, పెడమార్గమున పొరబడి, జొరబడక, పయనము సాగించెడివానికే, ఆ మహద్భాగ్యము, అబ్బునోఏమో! ఓరిమి లేక ప్రయాసపాలై, మధ్యేమార్గమున, మరణము చూరగొన్న, మహ నీయులు, తిరుగ, తమతరుణోపాయ మెరిగి, వదలి పెట్టినమెట్టుపైకాలిడి, సునాయాసముగ సాగిపోయి, గమ్య మందుకుందురో, ఏమో! కాక యున్న, వత్సరములల్లే, బాబా పదధ్యానముతో, కాలముబుచ్చు వారలకు, ఆ తండ్రి అనుగ్రహము, అబ్బలేదని, బాధలే మిగులుచున్న వని, వాపోయెదరేల. ఇట్టె సాయి చిత్రసందర్శన మాత్రమున, శ్రీ సాయి తనఇంట అగపడెనని, అదిచేసెను, ఇదిచేసెను, అని ధృవపరచెదరేల? తండ్రీ నీలీలలు నీకేఎరుక, నీ వెంతటి దయామయు డవో నిరూపించుటకు, ఇట్టిస్మృతిమాత్ర ప్రసన్నుడవగుదువు, దబ్బర ములగుపలుకులతో, ప్రగల్భములు, పగ్గెలు పల్కు భక్తులు అదిచూచి అయిన, గమనింపగలరని నీసంకల్పమా ప్రభూ! ఏమైననేమి, నీ అను గ్రహములేక, ఆ నిగ్రహము మాత్రముఎట్లు అబ్బగలదయ్యా! ఆట వస్తువులుగ, నీ విలాసముకొఱకు, నీ వినోదముకొరకు, నీకు నీబిడ్డ లతో చెలగాటమా! తండ్రీ, ఇట్లంటినని, కినుకబూనకు, బిడ్డలమన్నించి ప్రేమచూపుప్రేమమూర్తివి. ఏలకరుణింపవయ్యా!

శ్రీ సాయి సజీవుడే. త్యజించినది భౌతిక శరీరమును మాత్రమే.

ఆ తండ్రి నిర్యాణమయ్యెనని వాపోవుట ఒట్టిభ్రమ. 15–10–1918 న శ్రీ సాయి శరీరత్యాగ మొనరించెనుగదా, కాని ఆనాటిరాత్రి మన తండ్రి శ్రీ లక్ష్మన్‌మామజోషీకి, అగపడి నిదురించు ఆతని చేయిపట్టి లాగి "ఇంకనూ నిద్రయేనా లెమ్ము తెల్లవారుచున్నది. త్వరపడుము. శ్రీ బాపూసాహెబ్, నేను మరణించితిననియే తలంచుచున్నాడు. ఆతడు ఉదయమున పూజ గావింపడు, కాకడ ఆరతి నియ్యడు. నీవు వేగిరపడిరమ్ము, నాకు మరణమెక్కడిది— నేను మరణించలేదు— నేను సజీవుడనే. నాకడ హారతినిచ్చి, యథారీతి పూజగావింప వలసినది" అని స్పష్టమగు వాక్కులతో చెప్పెను. లక్ష్మన్‌మామ, శ్రోత్రియబ్రాహ్మణుడు. బాబా భగవదవతారమన్న దృఢవిశ్వాసముగల భక్తుడు. దీనికితోడు పేరుపడిన జ్యోతిష్కుడుకూడ. ఈతడు శామాకు మేనమామ. ప్రతిదినము బాబా పాదములపూజించి, పిదప ఆ గ్రామమందలి అన్ని దేవళముల యందలి దేవతలను, యథావిధి అర్చించెడివాడు. ఆరాత్రి బాబాదరిశన మైనంతనే, ఉదయమగుసరికి యథావిధి పూజాద్రవ్యములనుగొని మశీదు చేరినాడు. బాబాశరీరము తాకవలదని, అచ్చటి మౌల్వీలు అడ్డుపెట్టు చున్ననూ, లక్ష్యపెట్టక సోదరులారా! మనసాయి మరణించెనని భ్రమ పడియెదరేల, శ్రీసాయి సజీవుడే, నన్నాపకు డని బాబా పాదముల పూజించినాడు. కాకడ ఆరతిని, శాస్త్రోక్తముగ జరిపినాడు. జయ, శ్రీ సమర్థసద్గురు సాయినాధ మహరాజుకు జయ అని జయజయ ధ్వానములు చెలరేగినవి. నాటి మధ్యాహ్నము బాపూసాహెబ్, పూజగావించి, ఆరతి నిచ్చినాడు. అంతతో అదికళేబరమన్న భ్రాంతి వదలినది. ప్రత్యక్షముగ శ్రీసాయి, తమ సమీపమందే యున్నట్లు విశ్వాస మలవడినది. పూజాదికములు, పూర్వమువలెనే సక్రమముగ సాగినవి. శ్రీ సాయి శరీర త్యాగ మొనరించిననూ, సజీవుడే ననుటకు సందియము లేదు. శుష్క కాష్టము మొదలు సృష్టిఅంతయూ, తానయై వెలసిన, శ్రీ సాయికి మరణ మెక్కడిది.

బాబా తన నిర్యాణమునుగురించి, రెండు సంవత్సరములు ముందుగనే సూచించెను. 1916 సంవత్సరమున షిర్డీయందలి ప్రజలు, 'సీమోల్లంఘన', జరిపి తిరిగి వచ్చుచుండిరి. సీమోల్లంఘనమనగా, గ్రామమందలి ప్రజలు, గ్రామసరిహద్దుల చేరి ఉత్సవములు జరిపి, సరిహద్దులుదాటి వచ్చెదరు. పారువేట, ఉత్సవమని, మన ప్రాంతములందుగూడ అట్లే జరుగుచున్నది. ఆనాడు ప్రజలరాకడచూచి, బాబా ఉన్నట్లుండి, ఉన్మత్తుడై, సీమోల్లంఘన, అవును. ఇదియే ఈ దినమే సీమోల్లంఘన, నేనునూ ఈ రోజున నే, పొలిమేర దాటెదనని గద్దించి, కఫ్నిని కౌపీనమును పెరకి ఎదుటనున్న ధునియందు వైచెను. ధునియందలి జ్వాల మహత్తర కాంతితో పైకిలేచినది. శ్రీ సాయి వేయిమడుంగు లెక్కువకాంతి, వెదజల్లుచూ, వెలుంగుచుండెను. బాబా అంతతో ఆగలేదు. ఉచ్ఛస్వరముతో, మూర్ఖులారా, రండు ఈ సాయి ముస్లిమో, హిందువో, ఇప్పుడు గమనింపుడు. ఆ సందియము మీకేల? సాయిఎవ్వరో చూడుడని మొండిమొలతో, పిచ్చివానివలె నిలబడెను. కన్నులు ఎర్రనయ్యెను. బాబాను సమీపించుటకుగాని, పలుకరించుటకుగాని, ఎవ్వరికినీ ధైర్యము లేదు. బాబా ప్రవర్తన, వారల నందరినీ భయభ్రాంతుల చేసెను. కడకు కుష్టురోగ పీడితుడగు, భాగోజీషిన్డే, సాహసించి బాబాను సమీపించి, మొలకు అంగవస్త్రము చుట్టినాడు. తండ్రీ ఏమిటీ రభస, ఎందులకీ తీవ్రత, అని బ్రతిమాలినాడు. బాబా శాంతింపలేదు. అవును నేడే, ఈ రోజున నే, సీమోల్లంఘన, నా సీమోల్లంఘన, అని పలుమారులు పలికెను. గంటగడిచిననూ బాబా శాంతింపలేదు. నాడు చావడి ఊరేగింపు, సాగించుటకు సావకాశము ఉండదని భక్తులు భయపడిరి. కాని రాత్రి 11 గంటలగుసరికి, బాబా యథాప్రకారము, మందహాసము చేసెను. చావడి ఊరేగింపులు ఉత్సవము, యథాప్రకారము జరిగినవి. ఉన్నట్లుండి శ్రీ సాయి అట్లేలచేసెనో, ఆ తండ్రికే ఎరుక. అది మనము ఊహింప పనిలేదు. అందుకు ప్రయత్నించుటలో అర్థము లేదు. కాని శ్రీ సాయి, తన అవతార నిర్యాణము, విజయదశమినాడు సుమా యని హెచ్చరించె నేమో యనిమాత్రము గ్రహింపగలము.

ఆ తరువాత కొలది దినములకే శ్రీరామచంద్రపాటిల్, అను భక్తునకు తీవ్రముగ జబ్బుచేసినది. ఎంత వెచ్చించి ఔషధసేవచేసినను నిరుపయోగమైనది. నాటికి నాటికి వ్యాధిపెరిగి, పాటిల్ క్షీణించుచుండెను. జీవించుట దుర్లభమని, అధైర్యము తోచినది. బాధ భరింపలేకుండెను. ఆతడు ఆశలువదలి, విమోచన మెప్పుడా యని అంతిమఘడియలకై వేచియుండెను. ఒకనాటి అర్ధరాత్రి సమయమున మరణమునకై ఎదురుచూచెడి ఈ భక్తునకు ఉన్నట్లుండి బాబా, తలగడప్రక్కన నిలచి దర్శనమిచ్చెను. పాటిల్, బాబా పాదముల గట్టిగ పట్టుకొని తండ్రీ! నాకింక జీవింతునన్న ఆశ లేదు. ఇంకనూ నాకీ వ్యథ ఏల? ఆ తుదిఘడియ ఎప్పుడో తెలుపుమని వేడుకొనెను. దయా సముద్రుడగు బాబా, చిరునగవుతో, బిడ్డా! భయము విడువుము. చిత్రగుప్తుని చిఠాయందు నీపై హుకుము నిలుపబడినది. శీఘ్రముగ ఆరోగ్యము కలుగగలదు. నీ విషయమున భయములేదు. కాని మన తాత్యావిషయమే భయముగానున్నది. 1918 విజయదశమినాడు, ఆతనికి మరణముతప్పదు. ఈ విషయము తాత్యాకు తెలుపకుము. ఆతడు, అధైర్యముతో, అంతమొందగలడు, జాగ్రతసుమా! అని హెచ్చరించెను. రామచంద్రపాటిల్ కు, వ్యాధి నెనుకాడినది. కొలది రోజులలో స్వస్థతచిక్కినది. బాబావాక్కులు అమోఘములు. రెండు సంవత్సరములలో తాత్యాగతింపగలడన్న భయము హెచ్చినది. ఈవిషయముపాటిల్, బాలాషింపే, అను దర్జీకిమాత్రము వెల్లడించెను. ఈ ఇరువురకుతప్ప బగులెవ్వరికినీ ఈ రహస్యము తెలియదు. దినములు గడుచుచుండెను. 1918 వ సంవత్సరమున, భాద్రపదము ముగియుచుండెను. తాత్యా జీవితమును గురించి, రామచంద్రపాటిల్ కు, భయము హెచ్చినది. తలవని తలంపుగా తాత్యాకు జబ్బుచేసినది. మంచము పట్టినాడు. ఆ కారణముచే, బాబా దర్శనమునకు, మశీదునకుకూడ వచ్చుటలేదు. సాయినాథునియందు, తాత్యాకు సంపూర్ణమగు విశ్వాసము. సాయివినా, ఆతనికి వేరుదైవములేదు. శ్రీసాయీనామ సంస్మరణతో, కాలము పుచ్చుచుండెను. బాబాకుకూడ

ఆరోగ్యము చెడినది. బయటతిరుగుట లేదు. నానాటికి తాత్యాకు క్షీణదశ కలుగుచుండెను. రామచంద్రపాటిల్, షింపే, తాత్యా మరణించుట ధృవమని, భయమొందుచుండిరి. తాత్యాకు నోటిమాటకూడ పోయి నది. తెల్లవారిన విజయదశమి. ఉన్నట్లుండి, విచిత్రము జరిగినది. తెల్లవారుసరికి, బాబాస్థితి మారినది. తాత్యాకు, వ్యాధి వెను కాడినది. బాబాకుకదలలేని స్థితికలిగినది. తాత్యా మెల్లమెల్లగ తేరుకొనుచుండెను. పోయినమాట వచ్చినది. బాబా! నా తండ్రీ! అని చేయెత్తి మ్రొక్కినాడు. మధ్యాహ్నమగుచుండెను. తాత్యా తనంతటతాను లేచికూర్చుండెను. బాబా, తనభక్తులతో మాట్లా డుట మానినాడు. మధ్యాహ్నము 2½ గంటలకు, బాబా, అస్త మించెను. తాత్యాకు ఆ మరుసటి దినమునుండియూ కొంచెము, కొంచెముగ స్వస్థత చేకూరసాగినది. భక్తపరాధీనుడు, భక్తభార భృతుడు, భక్తపాలనా పరతంత్రుడు, శ్రీ సాయి, తన భక్తుడగు తాత్యాను, కాపాడుటకు, తనప్రాణములనే బలిఇచ్చెనో ఏమో! పరమ కరుణానిధి, బాబా, తన నిర్యాణమని తెలుపుచూ, తాత్యా పేరును చెప్పెనో ఏమో, అది ఎవ్వరెరుంగగలరు. దయాస్వరూపుడగు సాయి తాత్యాను రక్షించుటకు తనమేను, వదలెనని భక్తులు తలచిరి.

బాబా, అతినీరసముగనున్ననూ, తుదిక్షణమువరకు, మంచి వ్యక్తతతో నుండెను. ప్రక్కనున్న భక్తుల సాదరముగ పిలుచుచుండెను. భయపడవలదని, ధైర్యము చెప్పుచుండెను. సర్వజ్ఞుడయ్యునూ, తన నిర్యాణ సమయమును, మాత్రము, కూర్చుభక్తునికికూడ తెలుప లేదు. అష్టమినాడుకూడ బాబా, అయిదు ఇండ్లకడకేగి భిక్షాటన మొనర్చివచ్చెను. నవమిరోజున మాత్రము, కాకా, తెచ్చియిచ్చెను. అప్పటనుండి, శ్రీ కాకాసాహెబ్ దీక్షిత్, శ్రీమాన్ బూటీ, బాబాను వదలక అహర్నిశలు మశీదునందేయుండిరి. తమకు ఆహారముకూడ అచ్చటికే తెప్పించుకుని, భుజింపుచుండిరి. విజయదశమినాడు, ఆరతి అయిన పిదప, తమ తమ మకాములకుపోయి భుజించి రావలసినదిగా, బాబా అందరనూ పంపెను. కాని శ్రీమతి లక్ష్మీబాయి షిండే, జోషీ షింపే, బాయాజీ! లక్ష్మన్, బాలాషింపే, నానా సాహెబ్

నిమోల్కరు, మశీదును వదలి వెళ్ళలేదు. షామా! బాబా, సమీపమున, మెట్లపై కూర్చుండియుండెను. నీరసస్థితియందున్న బాబా, ఆరోగ్యవంతునివలె, లేచికూర్చుండి, తన తలగడక్రిందనున్న సొమ్మును తీసి, అందుండి తొమ్మిదిరూకలు శ్రీమతి లక్ష్మీబాయికిచ్చెను. వాస్తవమునకు ఈమె ధనవంతురాలు. ఆమెకు డబ్బుకొరతలేదు. బాబా ఇచ్చిన, ఆ రూకలను ఆమె వలదనలేదు. ప్రేమతో తనదైవమిచ్చిన ఆరూకలు ఆమెభక్తితో అందుకున్నది, కన్నులకద్దుకున్నది. శ్రద్ధతో పూజామందిరమందుంచి ఆ రూకలను, ఆ తరువాతకూడ ఆమె బాబా స్వరూపముగ పూజించెడిది.

తనకు మశీదునందు బాగుగాలేదని, బాబా, తనను, బూటీ వాడకు తీసుకుపొమ్మనెను. అచ్చట, తనకు ఆనందముగా ఉండుననెను. ఈ మాటలు చెప్పుచూ శ్రీసాయి, భాయాజీ, ఒడిలో, శిరముంచి అసువుల వీడెను. ప్రక్కనేయున్న భాగోజీ, బాబాకు శ్వాసనిలచిపోయినట్లు గమనించినాడు. నిమోల్కరుకు తెలిపినాడు, నానా కొంత జలమును తెచ్చి, బాబా నోటియందుంచెను. ఆ జలమట్లే వెలికి, వచ్చినది. ఓ దేవా, అని నానా, పెద్దపెట్టున కేకపెట్టెను. అప్పుడు బాబా, కన్నులు తెరచి 'ఆ' అన్నట్లనిపించినది. కాని వెంటనే బాబా, భౌతిక శరీరము త్యజించినట్లు తెలిసినది. క్షణములో, ఈ విషయము, షిర్డీయందు మూలమూలల తెలిసినది. ఆబాలగోపాలమట్లే, బాబా, బాబా, అని ఆక్రందన మొనరింపుచూ, మశీదుకు పరువిడిరి. కొందరు పెద్దపెట్టున భోరునఏడ్చిరి, మరికొందరు స్పృహతప్పి అచేతనులై పడిపోయిరి. ఇంకనూ కొందరు, రోదన మొనర్చుచూ, రోడ్డుపై దుమ్ములో దొర్లాడిరి. ఏ మొగముచూచిననూ, దైన్యమే మూర్తీభవించినది. కంటనీరుపెట్టని జీవిలేదు. బాబా పరిస్థితిని గమనించి, మశీదును వదలి పోలేక, బాధపడెడు, శ్రీమాన్ బూటీ, కాకాసాహెబ్ దీక్షిత్, బాబాఆజ్ఞను కాదనలేక, భోజనమునకై, అప్పుడే ఆకులముందు కూరుచుండిరి. మొదటిముద్ద అయిననూ, మ్రింగలేదు, పిడుగువలె, నిర్యాణవార్త తెలిసినది. ఆ చేతులు కడుగలేదు. మూతితుడువలేదు, పైన గుడ్డలేదు, తామేమిచేయుచున్నదీ తమకు తెలియుట

సమాధిఅనంతరకథ వ్రాయుటలో తెలుపగలను. శ్రీ సాయి షిర్డీ ఆగ మనమాది మహాసమాధి పర్యంతము ఈ ప్రథమభాగమున, శ్రీ సాయి నామస్మరణతో తెలుపబడినది. శ్రీ సాయి సమాధినుండి సమాధాన మిచ్చుటయేగాక, వివిధ ప్రదేశముల వివిధరూపముల భక్తుని, అర్హత ననుసరించి అనుగ్రహించి దర్శనమిచ్చుచున్నాడు. శ్రీ సాయీ సమాధి సందర్శనము మహద్భాగ్యము. శ్రీ సాయీనామస్మరణ సర్వపాప హరము. సర్వసంపత్కరము. సర్వాభీష్ట ఫలప్రదము. బాబా భక్త పరాధీనుడు. భక్తపాలనా పరతంత్రుడు. భక్తభారభృతుడు. యోగ క్షేమం, వహామ్యహం, అని అభయమిచ్చిన ఆ తండ్రి అవతారమూర్తి. దయాసముద్రుడు. ఆతండ్రి పదభక్తిని ప్రసాదింపుమని ప్రణమిల్లుదము.

"ఓం శ్రీ సాయినాథాయ నమః"

ప్రభూ! సాయీశా!

తండ్రీ, నీ పాదపద్మములకు, వినమ్రుడను. నీ భక్తి బాధలకు త్రోవతీయునా, బాబా? ఇదిఏమి చిత్రమయ్యా! నీవు ప్రేమావతార మంటివిగా, దుష్టశిక్షణ అనునది లేదనిగా తెల్పితివి. క్రమమార్గమున గాక, పెడత్రోవపోవు వారినికూడ, ఆదరించి అనుగ్రహింతునంటివే, మరి ఇదెట్లు సంభవము తండ్రీ!

బాబా, అన్నిట నీరూపమే అగపడవలెనని, అనుక్షణము, నిన్నుధ్యానించి, స్మరించి, తపించువానికి దర్శనమీయవు. ఎన్నడూ నీ నామమైన పలుకక, ధ్యానమనునది ఎరుగనివారికి, ప్రత్యక్షముగ అగపడి, వారికెరుక పరచెదవు, ఇదేమి విచిత్రము ప్రభూ!

పూర్వజన్మమునచేసిన, పుణ్యాము కారణముగా, నీ అను గ్రహమే ఆధారముగా, నీ పాదసేవచేయు భాగ్యము, మాకు అబ్బు చున్నది, అంతేగా! అంతలో కష్టముల తరించి, అభివృద్ధిని చూపు చుంటివి. ఆ అభివృద్ధికి కారణమెవ్వరయ్యా! అది మరచి, ఆ ఇంత వృద్ధియూ, స్వయంకృషియని అహంభావము తలఎత్తుచున్నది. ఆ అహంభావముతో, నిన్ను మరచి, తామేమో చేయగలమని,

విర్రవీగి, ముందడుగు వేయుట, అంతేయేకాదు బాబా, కాని పనులకు కూడ గడంగుట జరుగుచున్నది. వలదు సుమా, చేయరాని పనులకు ప్రారంభించితివా అని నీవు హెచ్చరించుచునే యుందువు తండ్రీ! అనర్థ మాపాదింప గలదు. వలదు వలదని అంతరాత్మ, వారించుచున్ననూ, అదికూడదని క్షణక్షణము తన కెరుకయగుచున్ననూ, ఆశకొలది తాను చేయుపనుల మానుట లేదు. మంచి చెడుగుల యోచించుకొనుటకు, జ్ఞానము ప్రసాదించితివి. సన్మార్గముననుసరించి సత్కార్యముల చేయుటకు స్వేచ్ఛనొసంగితివి. విడువక వెంటనుండి వలదు వలదని మందలించుచుంటివి. ఇంత చేసిననూ తృప్తిపడలేక తృష్ణావృతుడై తప్పుత్రోవనే పడుచున్న నీవేమి చేయగలవు?

ప్రభూ! ఏమనుచున్నావు? నన్ను నిందించెద రేల. మీచేయు కార్యములకు ఫలితము మీరుగాక ఎవ్వరనుభవింతురనియా! బాబా తియ్యగానున్నదని మితిమీరి భుజించిన కడుపునొప్పి కలుగక మానునా! ఏపని చేయునప్పుడైన ఇతరులకుదాచి మోసవిధమున చరించిననూ, నీకు తెలియక ఏమిచేయగలము. నీవు సర్వదా అంతర్యామివై, మమ్ము వెన్నంటి చూచుచుంటివన్న జాగ్రత్త, ఏల కలుగనీయవు! ఏమనుచున్నావు! మానవజన్మకు ఫలితము, అది తెలియుటయేననియా! అందుకు అవసరమగు బుద్ధిబలమును ప్రసాదించితివా, భగవత్ ప్రసాదితమైన ఆ బలమును ఎట్లు వినియోగించిన అట్టి ఫలితములు పొందుదుమను చుంటివా! బాగున్నది. బాబా నేనడిగినదానికి ఇదియా జవాబు! తియ్యదనముచూపి, తినకు తినకు అన్నచో ఆ తియ్యదనమేల? తినిన బాధపడెదనన్న, అర్థమేమున్నది. ఓహో! తియ్యదనమైననూ మితిమీరిన వెగటుదోచి రుచి నీయదనుచున్నావా, అది కాదన్న దెవ్వరు. అంతమాత్రమున మతివిహీనులమగు చుంటిమనియేనా నీయూహ?

అదికాదు బాబా, నేనడుగుచున్నది, నీభక్తి బాధలకు త్రోవ తీయునా! ఇది నిజమేనా అన్నదానికి జవాబేదీ? ఎన్నటికీ కాదనుచున్నావా? అదెట్లు, ఇందరు నిన్ను సేవించుచుంటిమని నీ భక్తులమని, నిర్భయముగ వెల్లడించుచూ వారే నీభక్తి బాధలకు త్రోవతీయుచున్నదను చున్నారే! దీనిఅర్థ మేమిటని నన్నడుగుచున్నావా! బాబా, బాగు

న్నదయ్యా, ఈ పరిహాస మెందులకు ప్రభూ! నీవు నాకు అట్టి జ్ఞానమును ప్రసాదింపలేదే, అది నాకెట్లు లెరుకపడును. బాబా భక్తులతో, పరిహాసమా! అయ్యో, పెడమోము పెట్టెదవేల? బొమముడియా! బాబా ఏమి అపచార మొనరించితిని? నీవు చిడిముడిపాటుతోయున్న నేను చేయగల దేమున్నది ప్రభూ! ఇంతమాత్ర మెరుగనివాడు ఎట్లు భక్తుడు? వానికిభక్తి ఎక్కడిది అనుచుంటివా? ఇది కలికాలము తండ్రీ, కన్నులార నిన్నుచూచుచున్ననూ, అగునా కాదాఅన్న అనుమానము తోచు సమయము భ్రమయేమో అని భ్రాంతిపడు సమయము. జ్ఞానము శూన్యమైనదని నేను అనను. కాని కాలవశమున క్రిందమీదగుచున్నది. అంతలో తెలివి, తిరుగ తిమిరము. ఈ కాలమహిమకుగూడ మేమెట్లు బాధ్యుల మగుదుమయ్యా, ఇందులకేగా నీ అవతారము దాచక తెలుపుము తండ్రీ!

ప్రభూ! అట్లు వెకిలిగా నవ్వెదవేల? ఇంతఏల బాబా, నేను నీ పదాశ్రితుడనుమాత్రమే. అన్యమేమియూ నేనెరుగను. నీలీలల నేనెట్లు తెలియగలను. నీవు తెలుపకయున్న నాకుఅంతయూ గాఢాంధకారము సుమా! ఏమది ప్రభూ, బాధలు బాధలని వాపోయెడివారిని నిజము చెప్పుమంటివా! అభిమానమువదలి, ఆత్మవంచనలేక, వారిమనో వృత్తులెట్లున్నవో, వారుచేసెడి పనులేమియో, నీదిక్కుచూచి, నిక్కచ్చిగ తెలుపుమనుచున్నావా! ఆపదలు తొలగినప్పుడు, వృద్ధికలిగినప్పుడు సంభ్రమముతో బాబా బాబా అనుటతప్ప తిరుగ తాముచేయు చెడ్డచెయిదములకు వెనుతీయుటలేదా! వలదు, వలదని, వెంటాడి తెలుపుచుంటివా, తెలిసియూ చేయరాని కార్యముచేయుట మానలేదా! అందుకు ఫలితమా ఈకష్టములు? కాలమునననుసరించి, ఇహలోక సుఖములనిచ్చితివా! అంతమాత్రమునవారికి, విశ్వాసముకుదుటబడుటలేదా! ఆవృద్ధియే, అసత్కార్యములకు త్రోవతీయుచున్నాదా! అందుకు ఫలితమా ఈ బాధలు! వృద్ధినిచ్చినది, విజ్ఞానమబ్బుటకు, విశ్వాసము కుదురుటకుగాని, దాని ఆదటచూచుకుని, అసంబద్ధపు పనులకు దిగుచున్నారా! బాబా నీయందలిభక్తి, పరిశుద్ధతకు దోవ తీయవలెనేకాని, వర్తమానమందలి విషయవాంఛ తీరుటకు మాత్రమే

కాదనియా? నీవుఇహ సుఖములనిచ్చినది. ఈ హెతరుగుటకుగాని, తృప్తిలేక, తృష్ణపెరుగుటకు కాదనుచున్నావా! అట్లని వూరకున్న గతియేమి ప్రభూ, నేనువ్యర్థుడననుచుంటివా? అగునయ్యా, అగును, అర్థముకాక నేగా, నిన్ను, అర్థింపుచుంటిని. పెడమార్గమున పడు చున్ననూ, నీవునీభక్తుల నదలుటలేదా! నీవు వారల వెంటాడుచునే యుంటివా! అట్లయిన నీవు వెంటనుండగనే కలుగుచున్నవా ఈ బాధలు నీవట్లు వెంటనుండుట వారెరుగుదురా? ఏమంటివి, ఎరిగియుండికూడ, మమతతో మరచుచున్నారా! ఇంక అట్లయిన వీరిగతియేమి ప్రభూ! ఇన్ని చెట్టచెయిదముల చేయుచున్ననూ, వారల మన్నించి కాపాడు చుంటివా, అదెట్లు?

నీభక్తులకు నెత్తిపై కెత్తి వచ్చినట్లు ముప్పవాటిల్లునట్లు, భయము కలిగిననూ తుదకువారు ఇక్కట్ల పాలుగాకుండ నీవే కాపాడుచుంటివా? ఎంతయో ప్రమాదమన్న విషయము, తుదకు ఇట్టె చేతితో తీసివేయు చుంటివా? ఈ విషయము వారు తెలుపరేలనయ్యా! పాపము వారికి, అది తెలియుట లేదేమో! బాబా, సరిగాని అట్లు ముంచుకువచ్చునట్లు ఏలచేసెదవో! వారు వారితప్పులు తెలిసికొని సరిదిద్దు కొనుటకా! అట్టి జ్ఞానమైననూ, నీవు దయసేయ వలసినదేగా! నీవన్నది నిజమేప్రభూ, కష్టము కష్టములని వాపోయెదరేగాని ఆ కష్టము ఇట్టె తీరినప్పుడు బాబాఅనుగ్రహమున జరిగినదని వెల్లడింపరు. వారెట్లుభావించిన ఏమి గాని, బాబా నీవు లేకున్న వారిగతి ఏమయ్యెడిదో? ఈ విషయము తెలసి జ్ఞానముతో, భక్తికలిగి యుందురనియా ఇట్టె బాధలుచూపి వారలమందలించుట అదిగమనింపక తిరుగ తమ స్వయంకృషియే అను చున్నారా! అవునుబాబా, ఎన్నివిధముల తిరుగ తిరుగ తెలియనిది, జ్ఞానోదయ మెట్లుకాగలదయ్యా! నీవుమాత్రము అట్లని విసుగుతో వదలివేయకు, ఇదియే నే ప్రార్థింపునది.

నిజముగ భక్తికలవానికి బాధలుకూడ అవుసరమనుచున్నావా? అదేమిటిప్రభూ! ఎందుకయ్యా? అప్పుడుగాని వారు మంచిచెడ్డలరయ లేరనుచుంటివా? బాగున్నదిబాబా, భక్తికలుగుట బాధలకొరకా ఏమిటి? ఆ బాధలయందు ఆనందమున్నదా? ఆ ఆనందముకూడ గుర్తిం

వలయునా? అదిగమనించి అనుభవించినవాడా, నిజమైన భక్తుడు. వానికి ఆనందమేమిగిలి బాధలు అగపడవనియూ చెప్పుచుంటివి. బాబా ఇదంతయూ నాకెందులకు, భక్తినేప్రసాదించి నీ పాదములయందు భక్తి సడలకుండ కాపాడుముతండ్రీ! అన్నిటికీ ఆధారము నీవేఅన్న నమ్మకముతో నిమిత్తమాత్రముగనుండి కార్యములనిర్వర్తింప మనుచుంటివా? అంతయూ నీపరముగచూచి చరింపుమనుచుంటివా? భారమంతయూ నీవే వహించెదవా? ధన్యుడను ప్రభూ ధన్యుడను. అట్టి విశ్వాసము అచంచలముగ ఉండునట్లు అనుగ్రహింపుము తండ్రీ!

సాయీశా, రెండవహంశమును తెలుపవైతివే? ఆ మందహాసమెందులకు? అదినాకై నేనే, తెలియవలెనా? ఇదెక్కడిమాట. నాకంతటి జ్ఞానమెక్కడిది బాబా! ప్రయత్నింపుము. తెలియకున్న తెలిపెదనులే అనుచూ, అట్లు పరువెత్తెదవేల తండ్రీ! బాబా బాబా! పరువెత్తకు— నేను వెంటాడి వేధింపనులే? అయ్యో ఎంతలో ఎంతదవ్వేగితివయ్యా! నన్ను మోసగింపకుప్రభూ! నీవగపడకున్న కన్నీరు మున్నీరుగా ఏడ్చెదను. నన్ను ఏడ్పించుటయే నీకు ఆనందమైనచో, అట్లేకానిమ్ముతండ్రీ! నేను నీబిడ్డనుగానా? నా మొరల పెడచెవిపెట్టకు, నా తండ్రీ! దయామయా! ఆదరింతువన్న ఆశయే నన్నింతదనుక నిలువనిచ్చినది.

"ఓం శ్రీ సా యి నా థా య న మః"

# 30 అధ్యాయము

భక్తపాలనా పరతంత్రుడగు బాబా, ఎట్లు కుగ్రామమగు షిర్డీయందు వేంచేసి, 1854 మొదలు 1918 వరకు, తన భక్తుల, ఎచ్చెచ్చటి నుండియో ఆకర్షించి, ఆదరించి, అనుగ్రహించుట చూచితిమి. అనంతరముకూడ అంతర్యామియై, అందర ఆదరింపుచున్నాడని కూడ ఎరిగితిమి. ఎందరెందరో, కామ్యములకై, బాబానుచేరి, కోర్కెలీడేరుటయేగాక, భక్తిప్రపత్తులుగలిగి ధన్యతనొందుట వింటిమి. ఇంతియేకాదు శ్రీ సాయి, సంకల్పమాత్రమున, సామాన్యగృహస్తును, ఎట్లుసత్పురుషునిచేసెనో వినరింతము,

శ్రీశ్రీశ్రీ, ఉపాసనీ మహారాజను నామముతో, ఎందరనో, ఉద్ధరించి, షిర్డీకి సమీపమందున్న, సకోరీయను గ్రామమున, స్థాన మేర్పరచుకుని, బాబా, అనుగ్రమునకు పాత్రుడైనందున, ఆత్మసాక్షాత్కారమందుటయేగాక, శ్రీసాయియే తానుగా తెలిపిన ఆ మహనీయునిగాధ విందుముగాక, నాసిక్ జిల్లా యందలి, సతానా, అను గ్రామమున, భాగవతోత్తముడును, సకలశాస్త్ర ప్రవీణుడును, సదాచార సంపన్నుడునూ, అగు, శ్రీగోపాలశాస్త్రి ఉపాసని, అనుసంపన్న గృహస్తుకలడు. వీరి కుమారులలో, శ్రీ గోవిందశాస్త్రి తిరుగ భక్తిప్రవత్తులయందేమి, పాండిత్యమందేమి, తండ్రిని మించిన పేరుగడించెను. ఈ మధ్యతరగతి కుటుంబమువారికి, రాబడితక్కువ. అంతమాత్రమున వారు సన్మార్గము విడువలేదు. వీరికి అయిదుగురు కుమారులు అందు రెండవవానిపేరు, కాశీనాధ్ఉపాసని. అందరికివలె కాశీనాధునకు కూడ అయిదవఏట అక్షరాభ్యాసమైనది. అంతట ఎనిమిదవఏటనే, ఉపనయనమయ్యెను. పండ్రెండవఏట వివాహముకూడ జర్గినది. ఈ మహాత్ముని జననము 15-5-1870 న పురాకృత సుకృతమున పసితనము నుండియూ, కాశీనాధునకు, దైవచింతనయందు ఆసక్తిఎక్కువ. ఇతర బాలులతోబాటు, బడికిపోయి చదువుటకు బదులు, ఇంటనొకమూల చేరి, కన్నులుమూసి కూర్చుండెడివాడు. వివాహమైన తరువాత, కుటుంబపరిస్థితులు చూచుచుండిన, ఆర్జనయన్నది చేతగాక, కుటుంబమునకు ఈడికగా తానున్నది చాలక, తోడుమరియొక వ్యక్తివచ్చి భారము హెచ్చినదని తలంచెను. కాని ఏమిచేయగలడు. చదువన్నది లేనివ్యక్తి ఉన్నట్లుండి ఎవ్వరికిని తెలుపకయే పాదచారియై నాసిక్ చేరి, శ్రీ ఏకనాధ్ శాస్త్రిగారివద్ద అధ్యయనము సాగించెను. మూడుమాసములు గడిచినదో లేదో, కాశీనాధుని జాడ తెలుసుకొని తల్లిదండ్రులు ఆతనితిరుగ ఇల్లుచేర్చిరి. కర్మవశమున ఆ తరువాత కొలదిదినములకే ఆతనిభార్య మరణించినది. తిరుగ వివాహముచేసిన ఊరటకలుగ గలదని తల్లితండ్రులాయనకు ద్వితీయ వివాహము చేసిరి. కానితిరుగ కాశీనాధుడు ఎవరికి తెలియకుండ ఇల్లు వెడలిపోయెను. కొన్నిమాసము

బాధ భరింపజాలక చికిత్సకని, నాగపూరు చేరెను. వైద్యులవల్ల బాధ నివృత్తిగానందున యోగాభ్యాస మొనరించెను. దానివల్లకూడ ఉపయోగము లేకపోయినది. పేరందిన సాధువుల ఎందరనో దరిశించెను. శ్రీ నారాయణ మహారాజ్‌ను, సందర్శించెను. వారు కాశీనాథుని చూడగనే అదృష్టవంతుడు, సంపూర్ణస్థితి శిద్ధింపనున్నది అని ఆశీర్వదించిరి. కాశీనాథునకు ఏమియూ అర్థముకాలేదు. ఆధ్యాత్మికముగ ఉన్నతస్థాయి అబ్బినదన్న జ్ఞానమే ఆయనకు లేదు. పూర్వజన్మ సంస్కారమే ఆతనికి బాసటయై ఆ స్థితుల కల్పించుచుండెను. ఆతడెరుంగకున్నమాత్రమేమి, ఆతనిచూచిన సాధువులందరు ఆదేవిధమున తెలుపమొదలిడిరి. రాహురీ అనుగ్రామమున బ్రహ్మచారి, మహాయోగి కలడు. కాశీనాథుడు ఊపిరితిత్తులవ్యాధి నివారణకై మాత్రమే తిరుగుచుండెను. ఆ యోగి ఈతనిచూడగనే వత్సా! నీవదృష్టవంతుడవు. ఆధ్యాత్మికముగ ఇతరులకు అందరాని స్థితియందున్నావు. పరిపూర్ణుడై, పరమాత్మస్వరూపుడగు శ్రీ సాయిని ఆశ్రయింపుము అని పంపెను.

అది 1911 వ సంవత్సరము. ఈ భిషక్ తనవ్యాధి నిర్మూలమున కని, శ్రీ సాయిని దర్శించినాడు. ముందు ముస్లీమని వెనుకాడినాడు. అయినమాత్రమేమి? శ్రీ సాయీ కరుణావిశేషమున సత్పురుషస్థితి నంద వలసిన, ఈతడెట్లు తప్పుకొనగలడు. బాబా పదముల నాశ్రయించెను. షిర్డీకి చేరుటకు ముందు కాశీనాథుడు తనభార్యను మేనమామ ఇంటికి పంపెను. ఈ ఆయుర్వేదవైద్యుని కదలక ఖండోబా దేవాలయమున ఉండవలసినదిగా నియమించెను. పాపమాతడు పదేపదే ఇంటికి పోవలెనన్నభ్రమతో పరితపించుచూ, బాబాను అనుజ్ఞ నడిగెడివాడు. బాబాకాదని తెలుపుటతప్ప వేరేమియూ జరిగెడిదికాదు. ఈతడు నాలుగు సంవత్సరములిట్లే ఉండవలసి యున్నది. ఆ తరువాత ఆతడే నేను. నేనే ఆతడు. సర్వజ్ఞత్వ మందగలడని తెలిపెను. ఆ ఆలయమున వేరుపనిలేక, నిశ్చలముగ కూరుచుండుటయే ఆయనకు విధింపబడినది. మొదటి సంవత్సరమున రోజు ఉదయము సాయంత్రము శ్రీ సాయిని సందర్శించుటకుమాత్రము వెలికివచ్చెడివాడు. ఆ తరువాత ఆలయము నందు అల్లకదలక మెదలక కూరుచుండెను. ఆ ఆలయము ధూళితో




విశ్వమానవ ప్రేమ, సర్వమానవ సౌభ్రాతృత్వము

నిండి యుండెడిది. బూజు వ్రేలాడెడిది. దీపము లేదు. పాములు, తేళ్ళు ఆయన శరీరముపై ప్రాకెడివి. చివరకు వీపుపైల చర్మలపుట్టలుకూడ సాగినవి. ఆ నాల్గు సంవత్సరములలో ఆతడెట్టి అనుభూతులనంది ఆనంద మనుభవించెనో మన మెరుగము. అప్పుడే ఆయన మూడవభార్య మరణించినది.

నాలుగవ సంవత్సరమున కాశీనాథుని ఆలయమువదలి బయటకు రాసాగెను. అప్పటికాతడు నీరసముగా యుండెను. ఆహారము వలయు నన్న ఆలోచన లేదు. పైపెచ్చు బజారులు ఊడ్చెడివాడు. పాయఖానాల ఊడ్చెడివాడు. మురుగుకాల్వల తుడిచెడివాడు. ఆ మురుగుకాల్వల యందలినీరు త్రావెడివాడు. కుష్టురోగుల గుడ్డలుఉతికిన ఆ నీరు త్రాగెడి వాడు. అంతియేకాదు, తుదకు పేడనే, బెల్లమువలె తినెను. ఉన్మత్తుని వలె రాల రువ్వెను. సమర్థసద్గురుడగు (శ్రీ) సాయీ సంకల్పమున ఆ ఆయుర్వేదవైద్యునకు, ద్వంద్వాభావము నశించినది. అభేదస్థితి లభించి నది. సృష్టిఅంతయూ పరమాత్మస్వరూపముగ గోచరించినది. పరి పూర్ణత్వ మబ్బినది. 1914 వ సంవత్సరములో గురుపూర్ణిమనాడు, కాశీ నాథుని పిలిపించి (శ్రీ) సాయి తనప్రక్కన ఆసనమిడి ఆసీనునిచేసెను. భక్తులచే గురుపూజ చేయించెను. ఆ నాటినుండి సంపూర్ణమగు సత్పు రుషస్థితి ప్రసాదింప బడినది. ఆ తరువాత 1915 న సంవత్సరమున ఈ మహనీయుడు సకోరి, చేరినాడు. నాటినుండి బ్రహ్మమేతానై, ఉపాసనీబాబా, అనుపేరున అచ్చటి ప్రజల అభిమతముతీర్చ, అచ్చట రుద్రభూమియందు పర్ణశాల నిర్మించుకొని అందుండెను. తరువాత భక్తులు, విశాలమగు కట్టడములు కట్టిరి. షిర్డీపోయెడి యాత్రికులు సామాన్యముగ సకోరికిపోయి, (శ్రీ) ఉపాసనీ బాబాను దర్శింపమొద లిడిరి. (శ్రీ) ఉపాసనీ బాబా, తనలీలల ప్రదర్శింపుచూ, 1942 సంవత్స రములో మహాసమాధిఅయ్యెను. ఈమహాత్ముని గురించి విస్తరించి వ్రాయు

టకు ఇచ్చుట అలవిగాని కారణమున సాష్టాంగపడి శ్రీ సాయిని స్మరించి ఇంతతో విరమింతును. ఉపాసనీ మహారాజుకు శిష్యురాలు, పూజ్య శ్రీ గోదావరిమాత, ఇప్పుడు, సకోరీ సంస్థానము గద్దెపైనుండి, భక్తులపాలింపుచున్నది. ఆతల్లి శ్రీ సాయి పరంపరలోనుండిన మహాలక్ష్మీ స్వరూపము. మాతాజీకి మనసా స్మరించి నమస్కరింపుచున్నాను.

సామాన్య గృహస్థు, ఆయుర్వేద భిషక్, శ్రీకాశీనాథుడు, తానెరుగకయే, శ్రీసాయీ కరుణావిశేషమున, సత్పురుషస్థితినందిన పుణ్యగాథవింటిమి. సాధుసేవ ఎంతసేయదు. సత్పురుషుడు కరుణించెనా, అందరానిదేమున్నది. ఈ సాయినాథుని చరిత్ర, చదివినను, విన్నను కూడ, భక్తిభావము పెంపొంది, శ్రీ సాయీ కరుణకు పాత్రులము కాగలము. అట్టిదయాస్వరూపుని సచ్చరిత చదివి శాంతినొందెదముగాక. శ్రీ సాయి సదా, ప్రజలందరను, భక్తిప్రపత్తులు కలుగునట్లు కరుణించి సాకుగాక, మనమెందున్నను, ఏమిచేయుచున్నను, బాబా స్మరణతో, సౌఖ్యముగనుండునట్లు శ్రీ సాయి అనుగ్రహించుగాక. ఈ రచనను సాయిసాదరముగ, అందుకుని, నన్ను పాలించుగాక. సర్వేజనాః సుఖినోభవంతు.

"ఓం శ్రీ సా యి నా థా య న మః"



ముద్రణ : ఆంధ్రరత్న పవర్ ప్రెస్, తెనాలి.

## —: తప్పొప్పుల పట్టిక :—

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 12 | 4 | అజ్ఞానముసు | అజ్ఞానమును |
| 16 | 1 | కనపడునే | కనపడెనే |
| ,, | 20 | నానా | నానాను |
| 23 | 13 | బాబాఅయిన | బాబాఅనిన |
| 26 | 12 | సంతసించెదరసి | సంతసించెదరని |
| 27 | 2 | గలమే | గలమా |
| ,, | 3 | వానిని | వానిన్ |
| 28 | 11 | సామిని | సామివి |
| ,, | 14 | దహించు | దహాగయించు |
| 30 | 8 | యోగమంచని | యోగమంచన |
| 47 | 13 | మబ్బుటకు | మబ్బుటు |
| 54 | 11 | మాకీప్రూరీ | మాల్ ప్రూరీ |
| 56 | 8 | చూని | చూచి |
| 58 | 6 | సామూవారి | సామూ |
| 62 | 15 | | అగుటకుబదులు |
| 64 | 22 | బ్రాహ్మణులకు | బ్రాహ్మణులకు |
| 66 | 21 | హాజరయ్యెను | హోజరయ్యెను |
| 68 | 7 | తండ్రి | తండ్రీ |
| 69 | 22 | ఆరీపండుగ | హోలీపండుగ |
| 72 | 26 | భ్రమయకుడు | భ్రమియకుడు |
| 76 | 12 | ఆమూలగ్ర | ఆమూలాగ్ర |
| 80 | 20 | పశ్న | ప్రశ్న |
| 81 | 5 | అవుసరమున్నది | అవుసరమేమున్నది |

| | | | |
|---|---|---|---|
| 81 | 6 | జ్ఞానస్వరూపముగల | జ్ఞానస్వరూపమగు |
| 83 | 18 | ఇంతటకైనా | ఇంతటనైనా |
| 85 | 8 | విష యమును | విషమును |
| ,, | 24 | లాభించగలన్న | లాభించగలదన్న |
| 86 | 9 | ఆమే కేమియో | ఆమే లేమియో |
| ,, | 10 | కలుగ జేతుమని | కలుగ జేయుమని |
| ,, | 18 | అందుకూడ | అందుకుకూడ |
| 92 | 19 | ఉచ్ఛ్వాస | ఉచ్ఛ్వాస |
| ,, | 28 | నలసి | ఒరిగి |
| 94 | 24 | ఇట్లు | ఇల్లు |
| 103 | 9 | తార్కాడీ | తార్కాడ్ |
| 109 | 21 | అనతిగాలమున | అనతికాలమున |
| ,, | 22 | గాగలడని | కాగలడని |
| 117 | 2 | డయ్యాన్నూ | డయ్యున్నూ |
| 119 | 5 | సమర్ధ | సమర్థ |
| 123 | 21 | బారబడితిని | పారబడితిని |
| 125 | 8 | యూషుడో | మూఢుడో |
| 133 | 9 | ఆశబద్ధుడై | ఆశాబద్ధుడై |
| ,, | 11 | సత్కార్యము | సత్కార్యము |
| 135 | 11 | దరిశిముల | ధర్మముల |
| 136 | 11 | తాత్యానతో | తాత్యాతో |
| 137 | 14 | తనవి | తనివి |
| 146 | 19 | లక్ష్మీణీ | లక్ష్మణ్ |
| 149 | 28 | ఈసుమతా | ఈమమతా |
| 150 | 5 | కావని | కానని |
| 151 | 12 | పాదములనిచ్చి | పాద్యములనిచ్చి |

| | | | |
|---|---|---|---|
| 151 | 25 | తావుకలఅది | తావుకలదోఅది |
| 152 | 16 | ధూశి | ధూళి |
| ,, | 28 | స్తభములు | స్తంభములు |
| 154 | 7 | అట్లా | అట్లే |
| 155 | 6 | ప్రేల్చబడి | వ్రేల్చబడి |
| ,, | 10 | ఈ నిర్యాణానంతరము | నిర్యాణానంతరము |
| 155 | 11 | అట్లే | అట్లు |
| 160 | 3,4,5 | ఓడ | వాడ |
| 161 | 29 | సామాధి | సమాధి |
| 165 | 12 | కాసరి | కాస్కార్ |
| 174 | 14 | సాతృత్వము | సాభ్రాతృత్వము |



